చిలకమర్తి లక్ష్మీనృసింహాకవి

# సంపూర్ణగ్రంథావళి



## షష్టిపూర్తి ముద్రణము

౭-వ సంపుటము—నాటకములు

స్వప్నవాసవదత్త - అవిమారకము - బాలచరితము - మధ్యమవ్యాయోగము - దూతవాక్యము - దూతఘటోత్కచము - ఊరుభంగము - పంచరాత్రము - ప్రతిమా - చారుదత్త - ప్రతిజ్ఞాయౌగంధరాయణము - పార్వతీపరిణయము.

షష్టిపూర్తి సంఘకార్యదర్శి:
పాలకోడేటి గురుమూర్తిగారిచేఁ
బ్రకటితము.

1928

 (Price Rs. 3

రాజమహేంద్రవరము

శ్రీ సుజనరంజనీముద్రాక్షరశాలయందు

పోతాప్రగడ శేషగిరిరావుగారిచే

ముద్రింపఁబడెను.

1928.

# స్వప్నవాసవదత్తనాటకము

## పీఠిక

మహాకవినిర్మితము లయిన ప్రాచీనసంస్కృతగ్రంథము లనేకములు ఖిలములగుచున్నవని చింతించి చెదపుట్టలపాలుకాకుండ నట్టి గ్రంథముల సంరక్షింపఁ దలంచి గీర్వాణభాషాభిమానులును దయార్ద్రహృదయులును నగు ఘనతవహించిన శ్రీతిరువనంతపురమహారాజుగారు తమ యాస్థానపండితుఁడును మహాకవియు నగుగణపతిశాస్త్రిల వారిని ప్రాచీనసంస్కృతగ్రంథసంపాదన నిమిత్తమై నియోగించిరి. ఈపండితుఁడు రాజప్రేరణముచేతను, భాషాభిమానముచేతను బహుప్రదేశముల కఱిఁగి గ్రంథాన్వేషణము సేయుచుండఁగా నొకచోటఁ బదుమూఁడు సంస్కృతరూపకములు కల తాటియాకుల పుస్తకముల కట్ట యాయన కంటఁ బడియెను. ఆపదుమూఁడురూపకము లివి:— 1. స్వప్నవాసవదత్తము, 2. ప్రతిజ్ఞాయౌగంధరాయణము, 3. అవిమారకము, 4. పంచరాత్రము, 5. దూతఘటోత్కచము, 6. మధ్యమావ్యాయోగము, 7. కర్ణభారము, 8. దరిద్రచారుదత్తము, 9. ప్రతిమానాటకము, 10. అభిషేకనాటకము, 11. ఊరుభంగము, 12. బాలచరితము. 13. అనామకనాటకము ఈరూపములందుఁ దక్కిన సంస్కృతనాటకములందు బలెఁ బ్రస్తావనలు లేవు. ప్రస్తావనకు బదులుగా నిందు స్థాపన యున్నది. ఈపదమూఁడు రూపకములలోఁ గూడ నాందీశ్లోకము లేదు. నాంద్యంతమందు సూత్రధారుఁడు ప్రవేశించు

చున్నాఁడని ప్రతిరూపకమునందున్నది. గ్రంథకర్తపేరు స్థాపనలోఁ గాని, యంకాంతమందుఁ గాని, లేదు. ఈరూపకములలోఁ గొన్నిటి యందుఁ గొట్టకొనను భరతవాక్య మిటు లున్నది శ్లో॥ "ఇమాం సాగరపర్యంతాం హిమవద్వింధ్యకుండలాం। మహీ మేకాతపత్రాంకాం రాజసింహః ప్రశాస్తు నః॥" ఈరూపకములలో మరికొన్నిటియందు భరతవాక్య మీక్రిందివిధముగా నున్నది. "భవం త్వరజసో గావః పరచక్రం ప్రశామ్యతు। ఇమా మపి మహీం కృత్స్నాం రాజసింహః ప్రశాస్తునః॥" ఈభూమి సంతను మారాజసింహుఁ డేలుఁ గాక యని యాశ్లోకముల ముఖ్యాభిప్రాయము. ఈరాజసింహుండార్యావర్తము నేలిన యొకమహారాజైయుండవచ్చును. అతఁ డేదేశమును బాలించెనో, యేనగర మతనిరాజధానియో, యతఁ డేకాలమున జీవించి యుండునో నిర్ణయించుటకుఁ దగినయాధారములు ప్రస్తుతములుకాన రావు. ఇది ప్రాచీనతామ్రశిలాశాసనములు శోధించి పండితులనిర్ణయింపఁ దగిన విషయము. రాజసింహుఁ డనునది యారాజునకుస్వీయ నామమో, బిరుదమో చెప్పజాలము. ఈరూపకములు రచించిన కవిగాని, కవులుగాని, యారాజసింహుని యాస్థానమునందుండవచ్చును, అట్లు కానిపక్షమున నారాజును బ్రశంసించుట యసంభవము కాదా! ఈరూపకములలో నొకట రెంటఁ దప్పఁ దక్కినయన్నిటిలో సూత్రధారుఁ డొక్కఁడే రంగస్థలముమీఁదికివచ్చి యొక యాశీర్వచనశ్లోకము జదివి పాత్రసూచనము జేసి వెళ్ళిపోవును. తక్కిన సంస్కృతరూపకములలోబలె నటిగాని, పారిపార్శ్వకుఁడుగాని ప్రవేశించి సూత్రధారునితో సంభాషించుటలేదు. ఈస్థాపనలయందు సూత్రధారుఁ డొక్కఁడు మాత్రము కనఁబడుచుండును. మరియు సూత్రధారుని వచనములు రూపకములన్నిటియందు సమానముగానే యుండును. ఒకరూపకమునందున్న పద్యములు మరియొకరూపకమందు

తెలుచుఁగా గనుపడుచుండును. కల్పనలలోఁగూడ నచ్చటచ్చట సామ్యము కలదు. కవిత్వశైలి మిక్కిలి మనోహరమై యేకవిధమై యతిప్రాచీనమైయున్నది. పాణినీయవ్యాకరణ విరుద్ధప్రయోగము లచ్చటచ్చటఁ గలవు. ఇందు కొక చిన్ననిదర్శనముం జూపగలము. "శిర" శ్శబ్దము సకారాంతమై యుండ నీకవి దానినకారాంతముగా బ్రయోగించియున్నాఁడు. సూత్రధారుఁడు చదువుమంగళశ్లోకమున సామాన్యముగా నీపదమూఁడురూపకములలోఁ గావ్యార్థసూచకముగా నారూపకమున వచ్చు ముఖ్యపాత్రములపే ళ్ళుదహరింపబడుచుండును. ఈవిషయ మీక్రింది యుదహారణమునుబట్టి తెలిసికొనవచ్చును.

"ఉదయనవేందుసవర్ణా వాసవదత్తాబలౌ బలస్య త్వాం
పద్మావతీర్ణపూర్ణౌ వసన్తకమ్రౌ భుజౌ పాతామ్॥"

ఉదయచంద్రునివలె దెల్లనయి మద్యపానముచే విజృంభించి వసంతఋతువుచేత మనోజ్ఞమై పద్మాసంపర్కముచేత సంపూర్ణమయిన బలరామునిభుజద్వయము మిమ్ము రక్షించుఁగాక! యని యీశ్లోకాభిప్రాయము. ఇది యీనాటకములోని మంగళశ్లోకము. ఇందులోఁ గథానాయకుఁ డగునుదయనుఁడు, వాని వేఁడుకచెలికాఁ డగువసంతకుఁడు, నుదయునిని ప్రథమభార్య యగువాసవదత్తయు, నీరూపకములలో కథానాయిక యగుపద్మావతి, యనునలుగురపేళ్ళు సప్రస్తుతముగా సూచించి కవి కావ్యార్థసూచనం జేసియున్నాఁడు. అన్నిరూపకములలో నీవిధముగానె కావ్యార్థసూచన సేయఁబడి యున్నది. సంస్కృతనాటకములలోఁగూడ మొదటఁ గావ్యార్థసూచన సేయఁబడియున్నది. కాని నీవిధముగా నెచ్చటను లేదు. ఏవంవిధలక్షణలక్షితము లయిననీరూపకములు రచియించినవా రెవరో తెలిసికొనుట ప్రధానవిషయము. రచించినవా రొకరా పలువురా యనువిషయము

ముందు విచారింపలయును. ఈపదుమూఁడు రూపకములలోఁ గూడ బ్రస్తావనకు మాఱుగ స్థాపనయుండుటచేతను, మంగళశ్లోకకావ్యార్థ సూచన • లేకవిధముగా నుండుటచేతను దాదాపుగా నన్నింటిలో సూత్రధారుఁడే పాత్రసూచనము సేయుచుండుటచేతను, సూత్రధారుని నోటనుండి వచ్చిన వచనముల న్నిటిలోను నొక్కటిగా నుండుటచేతను భరతవాక్యము గూడ జెక్కింటిలో నేకవిధముగా నుండుటచేతను, నొకరూపకములోని భావములు, శ్లోకములు తక్కినవాటిలోఁ దఱచుగాఁ గనఁబడుచుండుటచేతను శైలి యేకవిధముగా నుండుటచేతను నీత్రయోదశరూపక ప్రణీతయు నొక్కఁడే యని నిర్ణయింపవలసి యున్నది. ఆకవి యెవ్వఁడని యనంతరజిజ్ఞాస. ఈరూపకములలో నొకటియగు స్వప్నవాసవదత్తనాటకము భాసుఁడు రచియించె నని రాజశేఖరమహాకవి తన కవి విమర్శనములో నీక్రింది శ్లోకమునఁ జెప్పియున్నాఁడు.

"భాసనాటకచక్రేऽపి చ్ఛేకైః క్షిప్తే పరీక్షితుం
స్వప్నవాసవదత్తస్య దాహకోऽభూన్న పావకః

ఈశ్లోకమునుబట్టి స్వప్నవాసవదత్తనాటకము భాసరచితమని స్పష్టపడుచున్నది. మహాకవి యగుబాణుఁడు తనహర్షచరిత్రపీఠికలో భాస ప్రశంసకముగా నీక్రిందిశ్లోకమును జెప్పియున్నాఁడు.

"సూత్రధారకృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ"

సూత్రధారునిచేతఁ జేయంబడిన యారంభములు కల బహునాటకములచేత భాసుఁడు కీర్తిసంపాదించెనని దీనిభావము. దీనింబట్టి భాసుఁ డనేకనాటకములు రచియించి యశస్సంపాదనము చేసె ననియు నివి యెల్ల సూత్రధారునిచేతఁ జేయఁడిన యారంభములు కలవనియుఁ దేలుచున్నది. మనకు దొరకినరూపకములన్నియు దాదాపుగా సూత్ర

ధారకృతారంభములే. కావున నివి యన్నియు భావనాటకము లని చెప్పుట కాక్షేపణ ముండఁగూడదు. ఇదియునుగాక ప్రథితయశస్కు లయినభాస సౌమిల్లకవిపుత్రాదుల నాటకము లుండఁగా వర్తమాన కాలీనుఁ డగు కాళీదాసునాటక మేల ప్రయోగింపవలెననిమాళవికాగ్నిమిత్రనాటకప్రస్తావనలో నటి సూత్రధారు నడిగిన ట్లున్నది. దీనిం బట్టి భాసుఁడు నాటకప్రణేత యనియు నందుఁ గాళిదాసాదులకుఁబూర్వమే లబ్ధప్రతిష్ఠుఁ డనియు విశద మగుచున్నది పూర్వోదాహృత కారణములంబట్టి భాసుఁ డీనాటకము లన్నిటిని దప్పక రచియించి యుండు నని నిర్ణయము సేయవచ్చును ప్రస్తావనలలో నతనిపేరెందునకు లేదందు రేమో కవిపేరు నాటకమున నుదహరించుట యిటీవలియాచారము గాని, ప్రాచీనాచారము కాదు ప్రాచీను లెనరయిన భాసుని గ్రంథము లెఱుఁగుదు రాయని కొందఱు శంకింపవచ్చును. అలంకార శాస్త్రప్రణేతలకెల్ల మూలపురుషుఁ డని చెప్పఁ దగిన భామహుఁడు తనకావ్యాలంకారమున జతుర్థపరిచ్ఛేదమందు భాసునిప్రతిజ్ఞాయౌగంధరాయణములోని గొంతభాగము విమర్శించెను. అభినవగుప్తపాదులు నాట్యవేదవివృతి యను భారతీయవ్యాఖ్యానమున భాసమహాకవి విరచితము లయిననాటకములలోని శ్లోకములఁ గొన్నిటినుదహరించెను. అలంకారసూత్రకారుఁ డగువామనుఁడును భాసునిం బ్రామాణికకవిగాఁ గ్రహించి యాతనిశ్లోకములఁ గొన్నిటినుదహరించెను. చాణక్యుఁడు రచియించినయర్థశాస్త్రములో నొకానొకచోట భాసునిప్రతిజ్ఞానాటికలోని చతుర్థాంకమందలి యీక్రిందిశ్లోకము గానఁబడుచున్నది. "నవంశరావంసలిలైస్సుపూర్ణం। సుసంస్కృతం దర్భకృతోత్తరీయం తత్తస్యమాభూన్నరకంస గచ్ఛే। ద్యోభర్తృపిండస్యకృతేనయుధ్యేత్", మమ్మటుఁడు మొదలగు నవీనాలంకారికులు భాసగ్రంథములనుండి శ్లోకముల నుదహరింపకపోవుటకుఁ గారణము కలదు. నాటకరచన

మునందు నిరుపమానకౌశలముగల కాళిదాసభవభూతి ప్రముఖమహాకవులు తల లెత్తినతరువాత వారినాటకములతో రసపుష్టియందు కథాకల్పనమందును, భాసనాటకములు సమానములు గాకపోవుటచే నీతఁడు క్రమక్రమముగా జనులచేత మఱచిపోఁబడుటయు, నీతనిగ్రంథములు కాలక్రమమున విరళప్రచారము లగుటయు సంభవించియుండును. భాసటనాటకములుకూడ మనోహరము లయినను, వాని శైలిమృదుమధురమయ్యును ప్రౌఢిమయందు నర్థగాంభీర్యమందు నుత్తరరామచరిత్ర శాకుంతలములకుఁ దీసిపోవును. అయినను జదువుకొనుటకు విసువులేక యెంతో మనోహరముగా నుండును. ఈనాటకములు సంస్కృతనాటకములయొక్క బాల్యావస్థను దెలియఁ జేయు నని నా యభిప్రాయము. భాసుని కాలము నిర్ణయించుటకుఁ గూడ నిప్పటికిఁ దగిన యేయాధారములు లేవు. కాళిదాసు మాళవికాగ్నిమిత్రమందీతని బేర్కొనుటచేత నతనికంటెఁ బూర్వుం డనుట నిర్వివాదముఁ కావునసీతఁడు క్రీస్తుశకమునకు బూర్వమున్నవాఁడేమోయని తోచుచున్నది. ఇదియు ముందుముందు విచార్యము. అపూర్వకథాగర్భితమైనస్వప్నవాసవదత్తనాటకమును జదివినతర్వాత దానిం దెనిఁగింపవలెనని నాకుఁ గుతూహలము గలిగినది.

భాషాంతరీకరణమందలి గుణదోషవిచారణము రసజ్ఞులగు చదువరులకే విడుచుచున్నాఁడను.

ఆంధ్రగీర్వాణభాషాకోవిదులును, వీరేశలింగపాఠశాలయందాంధ్రోపాధ్యాయులు నగు శ్రీవేదమూర్తులయినబ్రహ్మశ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులవారు భాషాంతరీకరణమునందు నాకు మిక్కిలి సహాయము చేసినందున వారియెడఁ గృతజ్ఞుఁడ నయి వారి కనేకవందనములు సమర్పించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు బుధజనవిధేయుఁడు,

రాజమహేంద్రవరము — చిలకమర్తి లక్ష్మీనరసింహము.

# కథాసంగ్రహము.

ఈనాటకమునందలి కథ సమగ్రముగాఁ దెలియుటకై కథానాయకుఁ డగువత్సరాజుయొక్క పూర్వవృత్తాంత మించుక తెలియుట యవశ్యకము కాన దానిని సంక్షేపముగాఁ జెప్పెదను. ఉదయనుఁ డనుపేరుగల చంద్రవంశపురాజు కౌశాంబీనగర రాజధానిగఁ జేసికొని వత్సదేశ మేలుచుండెను. అతఁడు మిక్కిలిచక్కని వాఁడు; సుగుణసంపన్నుఁడు; గానవిద్యావిశారదుఁడు. ఆకాలమునందు మిక్కిలి బలాఢ్యుఁ డగు ప్రద్యోతుఁ డనురాజుజ్జయినీనగరము రాజధానిగఁ జేసికొని యవంతిదేశమును బాలించుచుండెను. అతనికి మహాసేనుఁడనియు, చండమహాసేనుఁడనియు బిరుదనామములుకలవు. ఈతనియొద్ద గొప్పసేన లుండుటచేత నితని కీబిరుదనామముకలిగెను. అతనికి వాసవదత్తయనుకూతురు కలదు. ఆమె సౌందర్యము వర్ణనాతీతము. ఆమెను వత్సరా జగునుదయనున కొసఁగి వివాహము సేయవలయుననిసంకల్పించుకొని ప్రద్యోతుఁడు వత్సరాజును మాయోపాయముచేఁ దనభటులచేత బట్టించి తనకోటకుఁ దెప్పించి తనకూఁతురగువాసవదత్తకు సంగీతము సెప్పుమని యాతని కొప్పగించెను. వత్సరాజమంత్రి యగుయౌగంధరాయనుఁడు, సేనాపతి యగురుమణ్వంతుఁడు, విదూషకుఁ డగువసంతకుఁడు దమరాజున కేమియాపద కలుగునోయని భయపడి మారువేషములు వేసికొని యుజ్జయినికిం బోయి కోటలోఁ బ్రవేశించి రాజును సంరక్షించుచుండిరి. వత్సరాజునకు వాసవదత్తకు మనస్సులలోఁబరస్పరానురాగము నెలకొనెను. ప్రద్యోతుఁడు వారి కిద్దఱకు వివాహము చేయవలెనని మనస్సులోసంకల్పించుకొనెను గాని యాతనియుద్దేశ మెవరికిఁ దెలియనందున వత్సరాజు దనయాప్తులసహాయముచేత వాసవదత్తను లేవదీసికొనిరహస్యముగా

నుజ్జయినుండి పారిపోయి కౌశాంబీనగరమున కఱిగి యచ్చట నా మెను వివాహముం జేసికొనెను. చండమహాసేనుఁడు తనకూఁతురు వత్సరాజుతో వెళ్ళిపోవుట విని విచారించి వారిద్దఱచిత్తరువులు వ్రాయించి యాప్రతికృతులకు వైభవముతో వివాహము చేసెను. అనంతరము కొంతగాలమునకు వత్సరాజు రాజ్యభ్రష్టుఁడై నావాణక మనుగ్రామమున వసియించుచుండెను. మగధరాజు చెల్లెలైన పద్మా వతిని వివాహమాడినపక్షమున వత్సరాజునకు మరల రాజ్యము ప్రాప్తించుననసి సిద్ధులాదేశించినందున స్వామి భక్తితత్పరుఁడగుయౌ గంధరాయణుఁడు తనప్రభువున కామెను వివాహము సేయసంకల్పిం చెను. కాని వాసవదత్తయుండఁగా వత్సరాజుమఱొకకాంతనువివాహ మాడఁడు. అందుచే నొకనాఁడు వత్సరాజు వేఁట కఱిగినప్పుడు లావణకగ్రామము కాలిపోఁగా వాసవదత్త యందులోఁ బడి కాలి చచ్చిపోయెననియు నామె నీవలకుం దీయుటకై నిష్ఫలం జొఱఁబడి యౌగంధరాయనుఁడుకూడ మృతినొందెననియు లోకములో వాడుక బుట్టించి యౌగంధరాయణుఁడు వాసవదత్తను వెంటబెట్టుకొని మఱి యొక చోటికిఁ బోయెను. ఇది పూర్వవృత్తాంతము.

## ఈనాటకములోని కథాసంగ్రహము.

ఆవంతిక యనుపేరుఁ బెట్టి వాసవదత్తకు మారువేసము వేసి యౌగంధరాయణుఁడు తాను సన్న్యాసివేశము ధరించి యొకయరణ్య మునందున్న తపోవనము నొద్దకు వచ్చి యుండఁగా మగధరాజుచెల్లె లగుపద్మావతీదేవి తపస్సు చేసికొనుచున్న తనతల్లిం జూడఁదలఁచి యక్కడకువచ్చి యాశ్రమములో నున్నవారలకుఁ గోరనదానములు సేయఁదలంచి యెవరి కేమి కావలయునో యడుగు మని ప్రార్థించెను అప్పుడు యౌగంధరాయణుఁడు "నేను యాచకుఁడ" నని యామె

కడకుఁ బోయి తనకు ధనవస్త్రాదు లయినదానము లక్కఱలేదనియు, దనవెంటనున్న యావంతిక యనుపేరుగల తనచెల్లెలను గొంతకాలము పద్మావతియొద్ద నుంచఁ దలంచుకొంటి ననియు, నందున కంగీకరించినపక్షమున నన్నిదానము లిచ్చినట్లు సంతోషింతుననియుఁ జెప్పి యట్లు సేయు మని వేఁడుకొనెను. పద్మావతి యందున కంగీకరించి వాసవదత్తను తనయొద్ద నుంచుకొనెను. ఆవల వత్సరాజు మఱియొక కార్యముమీఁద మగధరాజునొద్దకు రాఁగా నతఁడు పద్మావతిని వత్సరాజున కిచ్చి వివాహము జేసెను. పెండ్లికొడుకుమెడలో వేయవలసినపుష్పమాల మారువేషముతో నున్న వాసవదత్తయే గ్రుచ్చవలసివచ్చెను. తనచేతులార సవతిం దెచ్చుకొనుచున్నందునకు విచారించియు వాసవదత్త యౌగంధరాయణుని పన్నుఁగడ చెడిపోకుండ తనగుట్టును గాపాడుకొని తాను వాసవదత్త కానట్లే నటించెను. వివాహ మయినతర్వాత నొకనాఁడు పద్మావతివాసవదత్తలు ద్యానవనవిహారము సేయుచుండఁగా విదూషకుఁడగు వసంతునితోడ వత్సరాజచటి కఱిగి పద్మావతిని వాసవదత్తను జూడకయే వాసవదత్తను గుఱించి విచారించును. ఆమె చనిపోయినదనియే యాయన నమ్మికము. వాసవదత్తయు భర్తకంటి కెప్పు డగుపడ లేదు. అనంతరమొకనాఁడు పద్మావతి తలనొప్పిచేత బాధపడుచుండుటచే సముద్రసమీపమం దున్నయొకగృహమం దామెకుఁ బక్కవేసి, యక్కడ బండుకొను మనిచెప్పి యామెకు మనోజ్ఞము లయిన కథలు చెప్పి బాధానివారణము సేయ వాసవదత్త నచటికి వెళ్ళు మని చెలికత్తెలు చెప్పిరి. భార్య నోదార్చుటకయి వత్సరాజునుగూడ నచటికి రమ్మని వారే వర్తమానమంపిరి. కాని యెందుచేతనో పద్మావతి సముద్రగృహమునకు వెళ్ళనేలేదు. వత్సరాజు మాత్ర మచటికి వెళ్ళి ప్రియురాలు రాలేదని తెలిసికొని యామె వచ్చువఱకు నక్కడనుండఁ దలఁచి యంతలో నిద్రవచ్చుటచే ముసుఁగుఁ బెట్టు

కొని పండుకొని పద్మావతికి వేసినశయ్యమీఁదనే నిదురపోయెను. పద్మావతి యాగదిలోఁ బండుకొనిన దనుకొని వాసవదత్త యక్కడకుఁ బోయి ముసుఁగు పెట్టుకొని నిద్రించుచున్న రాజుంజూచి పద్మావతియని భ్రమించి పక్కలో బండుకొనియెను. పద్మావతిని బెండ్లియాడినను రాజునకు వాసవదత్త మీఁదిప్రేమ క్షీణించకపోవుటచే నాతఁ డెప్పుడామెమీఁదనే ధ్యానముపెట్టుకొని యాసమయమందు హా! వాసవదత్తా యని కలువరించెను. వాసవదత్త యది విని తుళ్ళిపడి లేచి యతఁడు రాజని తెలిసికొని యాతఁడు నిజముగాఁ దన్నుఁ జూడలేదనియు నేదోకలఁ గనుచున్నాఁడనియు నెఱిఁగి వెళ్ళిపోయెను. రాజు మేల్కొని వాసవదత్తకై పరితపించి తనవిదూషకుఁ డోదార్పఁగాఁ గొంత శమించెను తరువాత సేనాపతి యగురుమణ్వాంతుఁడు గొప్పసేనలందీసికొని పోయి వత్సరాజుశత్రు వగుయారుణిని దేశము స్వాధీనముచేసుకొని తనరాజునకు . మఱలఁ బట్టముఁ గట్టెను. వత్సరాజు మరల తనరాజధానికి వచ్చినతరువాతఁ బూర్వము వాసవదత్త వాయించు ఘోషావతి యనువీణ నెవరో తెచ్చి రాజునకిచ్చిరి. దానిం జూచి రాజు విచారించుచుండఁగా నుజ్జయినీపురమునుండి చండమహాసేనునియొద్దనుండి యొక కంచుకియు, చండమహాసేనుని భార్యయగునంగారవతీ దేవియొద్దనుండి వాసవదత్తను బెంచిన దాదియు వచ్చి రాజుంజూచి పూర్వపు మామగారు నత్తగారు చెప్పుమన్నమాటలు చెప్పి వారు పూర్వము వ్రాయించిన వత్సరాజు వాసవదత్తల చిత్తరువుల బహుమానముగా నిచ్చిరి పద్మావతి యాచిత్తరువులలోనున్న వాసవదత్త వంటిస్త్రీ యావంతిక యనుపేరుదో దనయింట నున్నదని భర్తతోఁ జెప్పెను. ఆమెను దీసికొని రమ్మని భర్త యాజ్ఞాపించెను. అంతలో యౌగంధరాయణుఁడు వచ్చి తన చెల్లెలిని దనకిమ్మని యడిగెను. రాజు యౌగంధరాయణుని వాసవదత్తను నానవాలుపట్టి సంతోషించి యౌగంధరాయణుని మెచ్చుకొనెను. వత్సరాజు స్వప్నమందు వాసవదత్తను జూచుటచేత స్వప్నవాసవదత్త మని యీనాటకమున కీనామము కలిగెను.

# స్వప్నవాసవదత్తనాటకము

ఇందు వచ్చుపాత్రములు.

## పురుషులు.

ఉదయనుఁడు—వత్సరాజు, కథానాయకుఁడు

యౌగంధరాయణుఁడు—వత్సరాజు మంత్రి

వసంతకుఁడు—వత్సరాజు విదూషకుఁడు.

బ్రహ్మచారి—లావాణకమున వేదముజదువుకొనుచున్న బ్రాహ్మణుఁడు మగధరాజు కాంచుకీయుఁ డొకఁడు

చండమహాసేనుని కాంచుకీయుఁ డొకఁడు

భటులిద్దఱు

## స్త్రీలు.

వాసవదత్త—వత్సరాజు పెద్దభార్య,ఆవంతికయను పేరుతోనుండును.

పద్మావతి—కథానాయిక,వత్సరాజు రెండవభార్య,మగధరాజుచెల్లెలు.

తాపసి—

చేటి—పద్మావతీదేవి పరిచారిక

మధుకరిక & పద్మినిక— పద్మావతీదేవి సఖులు

ధాత్రి—పద్మావతి దాది

విజయ—వత్సరాజు మందిరమండలి ప్రతీహారి

ధాత్రి—వాసవదత్త దాది

# స్వప్నవాసవదత్తనాటకము

## ప్రథమాంకము.

(అంతట నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్ర— తే॥ గీ॥ ఉదయనశ్యేందువర్ణత నొఱపు మిగిలి
యభినవాసవదత్తబలాఢ్య మగుచు
నావసంతకమ్రమయి పద్మావతీర్ణ
పూర్ణ మగుసీరిదోర్ద్వయి ప్రోచు మిమ్ము.

ఆర్యమిశ్రులతో నేనీలాగున విజ్ఞాపనము చేసికొనుచున్నాఁడను.

ఏమిది! నేను విజ్ఞాపనవ్యగ్రుఁడ నయి యుండఁగా నేదోశబ్దము వినఁబడుచున్నట్లున్నది. కాని చూచెదను.

(తెరలో)

ఆర్యులారా! తొలఁగిపొండు। తొలఁగిపొండు!

సూత్ర—ఆహా! తెలిసినది.

తే॥ గీ॥ కన్యవెంట నేతెంచినకార్యచణులు
మగధభూపాలభృత్యులు మత్సరమున
వెడలనడచుచున్నారు వెనుక కిప్పు
డాతపోవనమునఁ జేరు నఖిలజనుల.

(నిష్క్రమించు చున్నాఁడు.)

ఇది స్థాపన.

(అంతట నిద్దఱుభటులు ప్రవేశించు చున్నారు.)

భటులు—ఆర్యులారా! తొలఁగిపొండి! తొలఁగిపొండి!

(అప్పుడు పరివ్రాజక వేషుఁ డయినయౌగంధరాయణుఁడు, ఆవంతికావేషధారిణి యగువాసవదత్తయుఁ బ్రవేశించు చున్నారు.)

యౌగం—(చెవి యొగ్గి) ఏమిది ! ఇక్కడ సైతము తొలఁగిపోవలయునా ? ఎందుచేతనో కాని—

మ॥ ఫలభుక్తిన్ దనివొంది యాశ్రమములన్ వాసంబు గావించి వల్కలముల్ దాలిచి మార్యులౌ జనులకేకగ్లెం భయం బీగతిన్ బలియుం జంచలభాగ్యగర్వి వినయభ్రష్టుండు వీఁ డెవ్వఁడో ఖలుఁడై నిశ్చలమౌతపోవని, నిజాజ్ఞన్ గ్రామముం జేసెడిన్.

వాస—అయ్యా! ఈతొలఁగించు చున్నవాఁ డెవ్వఁడు?

యౌగం—ఎవఁడో నీచుఁ డెలుగెత్తి పిలుచుచుఁ దొలఁగిపొం డను చున్నాఁడు.

వాస—ఆర్య! వాఁ డెవఁ డయిన నేమి ? నేను గూడఁ దొలఁగి పోవలసినదాన నయితినిగదా యని విచారించు చున్నదానను.

యౌగం—పూజ్యురాలా! మాఱువేసములతోనుండి తెలిసికొనుటకు వీలు లేనప్పుడు దేవతలు సైతము తిరస్కరింపఁబడుచుందురు.

వాస—అయ్యా ! ఈపరాభవమువలనఁ గలిగినంతఖేదము మార్గాయాసమువల్లఁగూడఁ గలుగలేదు.

యౌగం—అమ్మా! ఇందు విచారించుట కార్యము గాదు. ఏమన? నీవిషయము పూజ్యురాలవై ననీ వనుభవించి విడిచిపెట్టినదే. ఎట్లనిన—

తే॥ గీ॥ తొల్లినీచిత్త మెటు లల్లె చెల్లిపోమె

భర్త జయ మొందఁ గడుసుఖంపడుదు మఱల

మహికాలగతులచేత మాఱు జనుల
భాగ్యపఙ్క్తియుఁ జక్రికారపఙ్క్తి వోలె.

భటులు.—తొలఁగిపొండి! తొలఁగిపొండి!

(అప్పుడు కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కాంచు.—సంభ్రమక! వలదు. వలదు. తొలఁగి పొమ్మనఁ గూడదు. చూడు.—

తే॥ గీ॥ క్షోణిపతి నిందఁ బడకుండఁ జూడవలయుఁ
దగదు పురుషప్రయోగంబు తపసులయెడ
పురములందరిపరిభవంబులకు నోడి
యీమహాత్ములు వసియింతు రీవనముల.

భటులు.—అయ్యా! చిత్తము.

(నిష్క్రమింతురు.)

యౌగం.—ఆహా! ఈతనిబుద్ధి విజ్ఞానవంతము. బిడ్డా! కావున నీతనిదగ్గఱకుఁ బోవుదము రమ్మా.

వాస.—అయ్యా! అలాగే.

యౌగం.—(సమీపించి) ఓయీ! ఈయుత్సారణ మేల చేయఁబడుచున్నది?

కాంచు.—ఓతపస్వీ.

యౌగం.—(తనలో) తపస్వీ యనుపిలుపు నాకిష్టమయినదియె కాని యలవాటు లేమి నది నామనసునకుఁ గ్రొత్తగ నున్నది.

కాంచు.—ఓయీ! వినుము. గురువులచేత నభిహితనామధేయుఁడయినమాదర్శకమహారాజుగారి చెల్లెలుపద్మావతీదేవి పుణ్యాశ్రమములయందు వసియించుచున్నతనతల్లియగు మహాదేవిని సందర్శింపవచ్చి, మాతృసేవఁ జేసి, యామెయొద్ద సెలవుగై

కొని మఱల రాజగృహంబునకుఁ బోవుచున్నది. నేఁడామె యీ యాశ్రమపదమునం దుండ నభిలషించు చున్నది కావున—

మ. సమిధల్ తీర్థజలంబులుం గుశలు పుష్పంబుల్ యథేచ్ఛంబుగా
సమకూర్పం దగు నీతపోధనులకున్ సద్భక్తి మీరందఱుర్వి
బ్రిమదారత్నము మాన్యపాలసుత ధర్మప్రీతి యెన్నండు సం
యములం దోర్వదు ధర్మపీడ యిది వంశాచార మాయింతికిన్.

యౌగం—(తనలో) మగధరాజపుత్రి యగునాపద్మావతియీ యామెయా? ఈమెయే కదా! యీమహారాజునకు దేవి యగు ననిపుష్పకభద్రాదు లయినయాదేశకులు చెప్పియుండిరి.

తే॥ గీ॥ గౌరవద్వేషభావముల్ కలుగుచుండు
లోన సంకల్పమున నుండి మానవులకు
క్షోణిభర్తకు దేవిగాఁ గోరుకతన
నీమెపై నాకు నది స్వత్వత మెంతో కలిగె.

వాస—(తనలో) రాజపుత్రి యని వినుటచేత నా కామెయందు సోదరీస్నేహము పొడము చున్నది.

(అప్పుడు సపరివార యగుపద్మావతియుఁ నామెచేటియుఁ బ్రవేశించు చున్నారు.)

చేటి—రాజపుత్రీ! రమ్మ! రమ్మ! ఈయాశ్రమపదముఁ బ్రవేశింపుము.

(అప్పుడు కూర్చుండి యొకతాపసి ప్రవేశించు చున్నది.)

తాపసి—రాజపుత్రికకు స్వాగతము.

వాస—(తనలో) ఆరాజపుత్రిక యీ యామెయా! ఈమెరూపము కులమునకుఁ దగియే యున్నది.

పద్మా—భగవతీ! నమస్కారము.

తాపసి—చిరంజీవినివి గమ్మ. బిడ్డా! రమ్మ! రమ్మ! తపోవనము లధిజనుల స్వగృహములు కదా!

పద్మా—అమ్మా! ధన్యనైతిని! ఈబహుమానవచనముల చేత నీవు నన్ను
నిజముగా ననుగ్రహించితివి.

వాస—(తనలో) ఈమె రూపముమాత్రమే కాదు. మాటయు మధురమె.

తాప—(చేటితో) కళ్యాణీ! ఈమెయా! భద్రముఖుఁడను మగధ రాజు
సోదరి. ఈమె నే రాజు వరింపలేదా?

చేటి—లేకేమి! ఉజ్జయినీ నగరమందుఁ గలఁడుకదా ప్రద్యోతుఁ
డను మహారాజు ఆయన తనకుమారుని కీమె నడుగు మని
దూత నంపినాఁడు.

వాస—(తనలో) మేలు! మేలు! ఈమెనా కిప్పుడాప్తురా లయినది.

తాప—ఏమి! యీమెయాకార సౌందర్యము ఈ సౌభాగ్యవతికతమున
రెండు రాజకులములు శోభావంతము లగును.

పద్మా—(కంచుకితో) అయ్యా! నేనిచ్చుదానములు గ్రహించి న
న్ననుగ్రహించుట కిం దెవరయిన మునిజనులు కనుపడిరా?

కాంచు—అమ్మా! నీకిష్టమయినట్లు చేయుము. ఓహో! ఆశ్రమవా
సులగుతపస్వులారా! మీరెల్ల వినుఁడు. వినుండు. పూజ్యు
రాలయినమగధ రాజపుత్రి విస్రంభము గలదై ధర్మార్థము దాన
ము సేయ సంకల్పించి పిలుచు చున్నది.

మ. కలశం బెవ్వఁడు గోరు వస్త్రమెవఁ డాకాంక్షించు నెవ్వాఁడు దీ
క్షులఁ జొచ్చెన్ గురుదక్షిణల్ సలుప సంకల్పించె నెవ్వాఁడు ని
ర్మలధర్మప్రియమాన్యపాలసుత యాత్మానుగ్రహార్థం బిడం
దలఁచెం గోర్కుల, నేరి కేదిహితమో దానిన్ వెసం జెప్ప రే.

యౌగం—(తనలో) ఆహా! ఉపాయము కనుపడినది. (ప్రకాశముగా
ఓహో! నేను యాచకుఁడను.

పద్మా—అదృష్టవశమున నాతపోవనాభిగమనము సఫల మయినది.

తాపసి—ఈయాశ్రమపదము సంతుష్టతపస్విజనము ఈయాచకుఁ

డెవఁడో యాగంతుకుఁడై యుండవచ్చును.

కాంచు — ఓయీ! యేమి కోరెదవు?

యౌగం — ఈమె నాసోదరి ప్రోషితభర్తృక. కొంతకాల మీ మెను బూజ్యురా లయినయీ రాజపుత్రికయొద్ద నుంచఁదల చుకొన్నాఁడను ఆమెను సగౌరవముగఁ బరిపాలింప వలయున నికోరు చున్నాఁడను. ఏమన —

మ. అడుగను సల్వాలు, కోర భోగములు, దవ్యం బే నపేక్షింప, నా
కడుపుం గూఁటికిఁ దాల్పలేదుసుమి యీకాషాయచేలంబులం
గడుధర్మప్రియ మైనరాజసుతయే కాపాడఁగా జాలు నీ
మెడ నాచెల్లెలిశీలమున్, వరము లింతే చాలు వే రేటికిన్.

వాస — (తనలో) ఆహా! ఆర్యయౌగంధరాయణుఁడు నన్నిక్కడ దాఁపఁ దలంచుకొన్నాఁడు అయినను సరిగా విచారింప కీతఁ డేపనియుం జేయువాఁడు కాఁడు గదా!

కాంచు — అమ్మా! యీతనికోరిక మిక్కిలి కష్టసాధ్య మయినది. ఎట్లంగీకరించెదవు? ఏమన,

తే॥ గీ॥ ధనము నిచ్చుట సుకరంబు, తపమునైన
నీయవచ్చును బ్రాణంబు లీయవచ్చు,
నన్య మేదైన నీవచ్చు నంతెకాక
న్యాసరక్షణ సేయుట యతిభరంబు

పద్మా — అమ్మో! ఎవ్వఁ డేమి కోరునో దానినిచ్చెద మని మొట్టమొదటఁ జాటించి యిప్పుడు విచారించు టయుక్తము. కావున నతఁడు చెప్పునట్లు చేయుము.

కాంచు — అమ్మా! నీవు చక్కఁగాఁ జెప్పితివి.

చేటి — సత్యవాదిని యగుమా రాజపుత్రి చిరంజీవిని యగుఁగాక!

తాపసి — కల్యాణీ! చిరంజీవినివి కమ్ము.

కాంచు—అమ్మా! అట్లుచేయుదును. (సమీపించి) అయ్యా! మీ సోదరీపరిపాలనము సేయుటకుఁ బూజ్యురా లయినమారాజ పుత్రి యంగీకరించినది.

యౌగం—ఈపూజ్యురాలిచేత ననుగ్రహింపఁబడితిని. వత్సా! రాజ పుత్రియొద్ద కలుగుము.

వాస—(తనలో) వేరుగతి లేదు కావున మందభాగ్యురాల నగునే నిప్పుడే వెళ్ళెదను.

పద్మా—మేలు! మేలు! అమ్మా నీవిప్పుడు నాదాన వైతివి.

తాపసి--ఇంతయాకారసౌందర్యముగలయీమె యేరాజమహిషి యో యయి యుండవచ్చును.

చేటి—అమ్మా మీరు చక్కగాఁ జెప్పితిరి. ఈమె సుఖపడినది యని నాకుఁ దోఁచు చున్నది.

యౌగం—(తనలో) అమ్మయ్య! ఇప్పటికిసగముభారము దిగిపోయినది కార్యము మంత్రులచేత నెట్లుసమర్థింపఁబడినదో యట్లు పరిణ మించినది మారాజును రాజ్యప్రతిష్ఠితునిఁ జేసినపిదప సన్ని ధానవర్తి నగునాకీరాజపుత్రి విశ్వాసపాత్రము కాఁ గలదు. ఎందుచేత ననఁగా,

మ. వలదన్నఁగ నరసాలపత్ని యగునీపద్మావతీదేవి మున్
గలుగుం గీడట భద్రమౌ ననుచు నాకార్తాంతికుల్ సెప్ప నం
దలి విశ్వాసముచేతఁ జేసితి నిటుల్ దైవంబున్ దాఁటి పోఁ
డలఁతిన్ గాఢపరీక్షితంబు లగుసిద్ధాగిష్ట వాక్యంబులన్

(అంతట బ్రహ్మచారి ప్రవేశించుచున్నాఁడు)

బ్రహ్మ—(పైకిచూచి) మధ్యాహ్న మయినది. నేను మిక్కిలి పరి శ్రాంతుఁడ నైతిని. నే నేప్రదేశమందు విశ్రమింతును? (తిరిగి) సమీపమునఁ దపోవన ముండవచ్చును. ఔను,—

మ. స్థలవిశ్వాసముచేత భీతిలక స్వేచ్ఛం గ్రుమ్మరున్ లేళ్ళు, స
త్ఫలపుష్పాదిసమృద్ధముల్ కుజతతుల్, దాక్షిణ్యసంరక్షితం
బులెయా నన్నియు, గోవు లెల్ల కపిలంబుల్, క్షేత్రము ల్లేవు ప్ర
క్కలఁ గ్రమ్మెంబొగ, యాశ్రమంబెయదియింకన్ సందియంబేటికిన్

ఇందుఁ బ్రవేశించెదను. (ప్రవేశించి కంచుకినిఁ జూచి) అహో?
ఇతఁ డాశ్రమవిరుద్ధజనుఁడుగా నున్నాఁడు (మఱియొకవంకఁ
జూచి) ఇదిగో! నిక్కడ తపస్విజన మున్నదే! నిర్దోషముగాఁ
బోవచ్చును అరే! స్త్రీజనముకూడ నున్నదే యిక్కడ.

కాంచు—స్వేచ్ఛగా రావచ్చునయ్యా! ఆశ్రమపదము సర్వజనసాధా
రణముగదా?

వాస—అయ్యో! అయ్యో! పరపురుషుఁడు

పద్మా—ఈమె పరపురుషదర్శనము నొల్లదు కాఁబోలును. ఔఁగాక!
ఈవ్యాసమును సరిగాఁ బరిపాలింప వలయునుగదా?

కాంచు—ఓయీ! ఈయాశ్రమమునందు మేము ముందు ప్రవేశించి
తిమి కావున మావలన నీ వతిథిసత్కారముఁ గ్రహింపుము.

బ్రహ్మ—(ఆచమించి) బాగు, బాగు! మార్గాయాసము తీరినది.

యౌగం—ఆర్య! మీ రెక్కడనుండి వచ్చుచున్నారు? గమ్యస్థాన
మేది? మీనివాస మెచట?

బ్రహ్మ—అయ్యా! వినుము రాజగృహమునుండి వచ్చు చుంటిని.
వత్సదేశమునందు లావాణక మనుగ్రామము కలదు. వేదా
ధ్యయనము నిమిత్త మక్కడ నుంటిని.

వాస—(తనలో) హా! నావాణకమా! లావాణకసంకీర్తనముచేత నా
సంతాపము తిరిగి క్రొత్తదగుచున్నది.

యౌగం—విద్య పరిసమాప్త మయినదా?

బ్రహ్మ—కాలేదు.

యౌగం—విద్య సమాప్తము కాకుండ వచ్చినందువలనఁ బ్రయోజన మేమి?

బ్రహ్మ—అక్కడ నతిదారుణ మయినవ్యసనము సంప్రాప్త మయినది

యౌగం—ఏమి వ్యసనము?

బ్రహ్మ—అచ్చట నుదయనుఁ డనురాజు వసించుచుండును.

యౌగం—పూజ్యుఁడయినయుదయనుఁడక్కడనున్నాఁడని వింటిమి. ఆయన కేమి?

బ్రహ్మ—ఆయన కవంతిరాజపుత్త్రి యగు వాసవదత్తయను గాఢానురాగ యయినభార్య కలదుగదా!

యౌగం—ఉండవచ్చును తర్వాత, తర్వాత

బ్రహ్మ—తరువాత మహారాజా నొకనాఁడు వేఁట కరిగి యుండఁగా గ్రామము కాలిపోయెను. వాసవదత్తయు నందు దగ్ధయయ్యెను

వాస—(తనలో) ఇది యబద్ధ మబద్ధము. మందభాగ్యురాలను నేను జీవించియే యున్నదానను.

యౌగం—తరువాత, తరువాత?

బ్రహ్మ—తరువాత వాసవదత్తాదేవిని సంరక్షింపఁ దలఁచి యౌగంధరాయణుఁ డనుమంత్రియు నాయగ్నియందే చొరఁబడి కాలిపోయెను.

యౌగం—అమాట నిజమే తరువాత, తరువాత?

బ్రహ్మ—తరువాత రాజు వేఁటనుండి మరలి వచ్చి 'యావృత్తాంతము విని కళత్రామాత్యవియోగసంజనితసంతాపమున నయ్యగ్నిహోత్రమునందే పడి ప్రాణముల విడువ సంకల్పించెను. కాని యమాత్యు లతిప్రయత్నంబున నతని వారించిరి.

వాస—(తనలో) ఎఱుఁగుదు. ఆర్యపుత్రునకు నాయందలిదయ నెఱుఁగుదును.

యౌగం—తర్వాత, తర్వాత?

బ్రహ్మ—తర్వాత రాజు పూర్వ మామెమేన ధరియించునగలలో దగ్ధముకాఁగా మిగిలినవానినిఁ గౌగిలించుకొని మూర్ఛపోయె.

అందఱు—హా! హా! ఎంతకష్టము.

వాస—(తనలో) ఆర్యయౌగంధరాయణుఁ డిపుడు సఫలమనోరథుఁ డౌఁగాక! (కన్నీరు విడుచును)

చేటి—రాజపుత్రీ! ఈమె యేడ్చుచున్నది.

పద్మా—జాలిచేత దుఃఖము వచ్చియుండును.

యౌగం—ఔను. నాచెల్లెలు స్వభావముచేతనే మిక్కిలి జాలిగుండె కలది. తరువాత, తరువాత?

బ్రహ్మ—తరువాత రాజు మెల్లమెల్లఁగా మూర్ఛనుండి తెలిసెను.

పద్మా—ఆదృష్టవశమున బ్రతికెను. మూర్ఛ వడెనని విని నాహృదయము శూన్య మయిన ట్లున్నది.

యౌగం—తరువాత, తరువాత?

బ్రహ్మ—తరువాత నారాజు నేలంబొరలుటంజేసి పాంసుపాటలశరీరుఁడయి చివాలున లేచి "హా! వాసవదత్త! హా! యవంతిరాజపుత్రి! హా! ప్రియురాల! హా! ప్రియశిష్యురాల!" యని యేమేమో బహువిధముల విలపించెను ఇన్నిమాట లెందులకు,—

చ. అరయఁగఁ జక్రవాకముల యార్తియొకానొకయార్తిగాదు, స్త్రీ
విరహము లొందు నన్యజనవేదన వేదనగాదు, పత్సభూ
వరువగఁ జూడ, భర్త కటువంటిప్రియంబును గూర్చునట్టి సుం
దరి యతిధన్య యానెలఁత దగ్ధత నొందియు దగ్ధ గాదుసూ.

యౌగం—అయ్యా! అటు లున్నమహారాజు నోదార్చుటకు మంత్రి యొకఁ డయినఁ బ్రియత్నముఁ జేయలేదా?

బ్రహ్మ—చేయ కేమి? రుమణ్వంతుఁ డనుమంత్రి యామహారాజు

నోదార్చుటకు సర్వప్రయత్నములు సేయుచున్నాఁడు ఆ మంత్రిస్థితి యిట్లున్నది.—

సీ. అతిదుఃఖవశమున నవనీతలేంద్రుఁ డా
హారంబు మానిన నతఁడు మాను
నెడలేక నృపునితో నేప్రొద్దు వగచుట
వదనంబు పసివాళ్ళ వాఁటి యుండె
ప్రభునితో సమదుఃఖభాజనం బై యుంట
మేన సంస్కారంబుఁ బూన డెపుడు
పవ లంచు రే యంచుఁ బాటింప కొకరీతి
కడు యత్నమున రాజుఁ గాచి యుండు

ఆ. వె. శోకభారమునను క్షోణీశుఁ డొకవేళ
గాలధర్మ మొందఁ గలుగునేని
నవనివిభునితోడ నారుమణ్వంతుండు
తనువుఁ దొఱఁగిపోవు దప్ప డింత.

వాస—(తనలో) అదృష్టవశమున నార్యపుత్రుఁ డిప్పుడు సురక్షితుఁ డుగా నున్నాఁడు.

యౌగం—(తనలో) పాపము రుమణ్వంతుఁడు మహాభారము వహించుచున్నాఁడు గదా! ఎందువల్లనన,

తే. గీ. అరయ నాదుభారము విశ్రిమాన్వితంబు
మేర లేదు రుమణ్వంతు భారమునకు
నవనిపతి యెవ్వనియధీనుఁ డగుచునుండు
నతనిపాటులు వర్ణింప నలవి కాదు.

(ప్ర) అయ్యో? తరువాతనేమి? రాజుపర్యవస్థాపితుఁడయ్యెనా?

బ్రహ్మ—ఇప్పు డెట్లున్నాఁడో నేనెఱుఁగను. కాని యారాజు విరహ వేదనాతిశయమున “ఆమెయు నేను నిక్కడనవ్వితిమి ఇక్కడ

కథలు చెప్పుకొంటిమి. ఇక్కడ నిరువురము కూర్చుంటిమి. ఇక్కడ నామె ప్రణయకోపము వహించినది. యని పరిపరి విధముల విలపించుచుండ, మంత్రు లాతనిం దగుప్రయత్నంబుల నాగ్రామమునుండి యెటకేసిం గొనిపోయిరి. రాజు వెడలి పోవుటయు గ్రామము నిశాకరనక్షత్రములు లేనియాకాశము వలె శోభావిహీన మయ్యె. అందువలన నేను నక్కడనుండి లేచి వచ్చితిని.

తాప—ఆగ్రామమునకు నూతనముగా వెళ్ళిన యీబ్రహ్మచారికూ డనిట్లు ప్రశంసచేయుటచే నారాజు మిక్కిలిగుణవంతుఁడుగదా!

చేటి—రాజపుత్రీ! మరల నేస్త్రీ యీ రాజు పాణిగ్రహణము చేయునో? కదా?

పద్మా—నేను నాహృదయములో నిదే యనుకొనుచున్నాను.

బ్రహ్మ—నేను వెళ్లెదను సెలవిండు.

యౌగం&కాంచు—వెళ్ళుము కార్యసిద్ధియగుఁగాక!

బ్రహ్మ—తథాస్తు (నిష్క్రమించును)

యౌగం—ఈ పూజ్యురాలి యభ్యనుజ్ఞ వడసి నేనును వెళ్ళఁగోరుచున్నాడను.

కాంచు—అమ్మా! నీయనుజ్ఞవడసి యీయన పోఁదలఁచుకొన్నాడు.

పద్మా—సోదరవియోగమున కీమె వగవదుగద.

యౌగం—సాధుజనహస్తగత యగుటచే నీమె వగవదు. (కంచుకిని జూచి) ఓయీ! నేను వెళ్ళుచున్నాఁడను.

కాంచు—వెళ్ళుము. పునర్దర్శన మగుఁగాక!

యౌగం—తథాస్తు. (నిష్క్రమించుచున్నాడు)

కాంచు—లోపలికి వెళ్ళవలసిన సమయమయినది.

పద్మా—భగవతీ! నమస్కారము.

తాపసి—బిడ్డా? అనురూపవరునిం బడయుము!

వాస—అమ్మా! సెలవిమ్ము వెళ్లెదను.

తాపసి—అచిరకాలములో నీవు భర్తను గలిసికొమ్ము.

వాస—భగవతీ! అనుగ్రహింపఁబడితిని.

కాంచు—అమ్మా? రండు. ఇటు ఇటు. ఇప్పుడు సాయంకాలమయినది.

మ. పులుగుల్ చేరెఁ గులాయముల్, మునిజనంబుల్తోయముం జొచ్చి రు
జ్జ్వలుఁడై వహ్ని వెలింగె నాశ్రమమునన్ వ్యాపించె ధూమంబు మి
క్కిలి దూరంబుననుండి భ్రష్టుఁడయి సంక్షేపించి యాత్మీయర
శ్ములఁ దేరి స్మరలించి యస్తశిఖరంబుం జొచ్చెఁ బొద్దల్లనన్.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.

# స్వప్న వాసవదత్త నాటకము

## ద్వితీయాంకము

(అప్పుడు చేటి పరివేశించుచున్నది.)

చేటి—కుంజరికా! కుంజరికా? ఎక్కడ భర్తృదారిక! పద్మావతి యెక్కడ? ఏమనియెదవు? ఆరాజపుత్రి మాధవీలతా మండపపార్శ్వమున బంతి యాడుచున్నదనియా! అట్లయిన భర్తృదారిక దగ్గఱకుఁ బోయెదను. ఓహో! ఉత్కృత కర్ణచూలికంబు,వ్యాయామసంజనితస్వేదబిందువిచిత్రితంబు స్పృశ్యమానరమణీయదర్శనంబు నగుకందుకంబు నాడుచు నారాజపుత్రి యీలాగుననే వచ్చుచున్నది. సమీపమునకుఁ బోయెదను. (నిష్క్రమించుచున్నది.)

ఇది పరివేశకము.

(అప్పుడు బంతియాడుచు సపరివార యగుపద్మావతియు నావంతికా వేషధారిణి యగువాసవదత్తయుఁ బ్రవేశించుచున్నారు.)

వాస—సఖి? ఇదిగో నీబంతి.

పద్మా—అమ్మా! ఇప్పటి కీయాట చాలును.

వాస—సఖి! ఎంతోసేపు బంతి యాడుటచే నీచేతులెఱ్ఱఁబడి యెవరి చేతులవలెనో యున్నవి. రాజపుత్రీ! ఆఁడుకొనుమాడుకొనుము. కన్యాభావరమణీయ మయినయీకాల మాటల చేతనే వెళ్ళఁబుచ్చఁ దగినది.

పద్మా—ఏమమ్మా! నన్నెగతాలి చేయఁ దలఁచుచున్నావా?

వాస—సఖీ! లేదు లేదు ఈదినమున నీవు కడుంగడు శోభిల్లు చున్నదానవు సమీపమం దుండి నీవరముఖమును నేనుసంతోషముతోఁ జూచుచున్నాను.

పద్మా—చాలు! చాలు! నన్నెగతాళి చేయక యావలికి వెళ్ళు.

వాస—మారాజపుత్రి మహాసేనునిభార్యకు ముద్దులకోడ లగునఁట!

పద్మా—ఆమహాసేనుఁ డెవఁడు?

వాస—ఉజ్జయినిలోఁ బ్రద్యోతుఁడనుమహారాజు కలఁడు ఆయనకు మహాసేనుఁ డనునదిబలపరిణామనిర్వృత్తమగునామధేయము.

చేటి—మారాజపుత్రి కాసంబంధ మిష్టము లేదు.

వాస—అట్లయిన నేసంబంధ మిచ్ఛగించును?

చేటి—కలఁడుగదా! ఉదయనుఁ డనువత్సరాజు. ఆయనగుణము లీరాజపుత్రి కిష్టములు.

వాస—(తనలో)ఆర్యపుత్రునే భర్తఁగాఁ బడయ నభిలషించుచు న్నది. (ప్రకాశముగా) ఏమికారణముచేత?

చేటి—దయాళువని.

వాస—సరి, సరి! ఈమె కేమో పిచ్చి యెత్తినట్లున్నది.

చేటి—ఆరాజు కురూపుఁడా? ఏమి?

వాస—కాఁడు, కాఁడు. దర్శనీయుఁడే.

పద్మా—అమ్మా! నీ వెట్లు యెఱుఁగుదువు!

వాస—(తనలో) అయ్యో! ఆర్యపుత్రపక్షపాతమున నేను సముదాచార మతిక్రమించితిని. ఇప్పు డేమి చేయుదును! ఆ! తెలిసినది. (ప్రకాశముగా) సఖీ! ఉజ్జయనీజను లాలాగునఁ జెప్పుకొనఁగా వినియుంటిని.

పద్మా—ఔను! ఉజ్జయినీజనుల కాయన దుర్లభుఁడుకాఁడు సౌభాగ్యము సర్వజనమనోభిరామము కదా.

(అప్పుడు దాది పరివేశించుచున్నది.)

దాది—భర్తృదారికా! జయము! జయము? నిన్నిచ్చివేసినారమ్మా!

వాస—ఎవరికి?

దాది—వత్సరాజయినయుదయనునకు.

వాస—ఆరాజునకుఁ గుశలమా?

దాది—కుశలమే కాదు. ఆయన యిక్కడకు దయచేసినారు భర్తృదారికఁ జేపట్ట సిద్ధముగ నున్నారు.

వాస—అత్యాహితము గదా?

దాది—ఇం దేమియత్యాహితే మున్నది?

వాస—ఏమియును లేదు. ప్రథమభార్యనిమిత్త మావిధముగాసంతాపించి యింతలోనె యుదాసీనుఁ డయినాఁడుగదా యని యట్లంటిని?

దాది—అమ్మా! మహాపురుషహృదయము . లాగమపరిధానములు, సులభపర్యవస్థానములు కదా?

వాస—అమ్మా! ఆయన మీరాజపుత్రిని స్వయముగనేవరించినారా!

దాది—లేదు? లేదు. అన్యప్రయోజంబున వత్సరాజిక్కడకు రాఁగా నాతని యభిజనవిజ్ఞానవయోరూపంబులం జూచి మనమహారాజుగారే స్వయముగా నీమె నాయనకు నిచ్చిరి.

వాస—(తనలో) అట్లయిన నీవిషయమునందార్యపుత్రిదోషము లేదు.

(అప్పుడు మఱియొక చేటి ప్రవేశించుచున్నది)

రెండవచేటి—అమ్మా! త్వరఁపడు త్వరఁపడు. ఈదినముననే శుభ

ముహూర్తము కలదఁట! కాబట్టి కళ్యాణమహోత్సవ మీ నాఁడే జరుపఁ దగు నని రాజపత్ని యానతిచ్చు చున్నది.

వాస—(తనలో) ఈకార్యము త్వరపెట్టఁబడినకొలఁది నాహృదయ మంధీభూత మగుచున్నది.

దాది—భర్తృదారికా! రమ్మి.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

# స్వప్నవాసవదత్తనాటకము

## తృతీయాంకము.

(అప్పుడు చింతించుచు వాసవదత్త ప్రవేశించుచున్నది)

వాస—పద్మావతిని వివాహామోదసంకుల మగునంతఃపురచతుశ్శాలలో విడిచి నే నీప్రమదవనమునకు వచ్చితిని. ఇప్పుడు నాభాగధేయనిర్వృత్త మగుదుఃఖము నపనయించుకొనియెదను అహో! ఎంతయయ్యహితము. భర్తగారుకూడఁ బరాధీనులయిరికదా! ఇక్కడఁ గూర్చుండెదను. చక్రివాకి ధన్యురాలు పతివిరహము గలిగినప్పు డది జీవింపదు. నేను ప్రాణములను విడువఁ జాలనయితిని గదా! ఆర్యపుత్రు నెన్నఁటికయినఁ జూడకపోదునా యనునాసతో మందభాగ్యురాల నయి జీవించుచుంటిని.

(అప్పుడు పుష్పములను బట్టుకొని చేటి ప్రవేశించుచున్నది.)

చేటి—పూజ్యురాలయినయావంతిక యెందరిగినది చెపుమా! అమ్మో! చింతాశూన్యహృదయ యయి నీహారప్రతిహత యగుచంద్రలేఖవలె సమండితభద్రికం బగువేషము ధరియించి ప్రియంగుశిలాపట్టకముపయిఁ గూరు చున్నది. దగ్గఱకుఁ బోయెదను. (సమీపించి) ఆవంతికా! ఎంతసేపటినుండి నిన్ను వెదకుచుంటినమ్మా!

వాస—ఎందునకు?

చేటి—సత్కులప్రసూతయు, దయాశాలినియు, నిపుణయు, గావున

నీకౌతుకమాలికఁ బూజ్యురాలయిన యావంతిక గ్రుచ్చఁదగు నని మారాజపత్ని సెలవిచ్చినది.

వాస.—ఎవరికొఱకు దీనిని గ్రుచ్చవలయును?

చేటి.—మారాజపుత్రికొఱకు.

వాస.—(తనలో)ఇదియు నేనే చేయవలసివచ్చెఁగా! అహా! దేవతలు నిర్దయులుగదా!

చేటి.—అమ్మా! ఇప్పుడు వేఱుచింతఁ బెట్టుకొనక శీఘ్రముగా దండ గ్రుచ్చుము. అల్లుడుఁగారు మణిభూమియందు మంగళస్నానము చేయుచున్నారు.

వాస.—(తనలో) అహా! అన్యవిషయమును జింతించుకొనుటకయిన నాకు వీలు లేదుకదా! (ప్రకాశముగా) సఖీ! అల్లుఁడుగారిని జూచితివా?

చేటి.—ఆహా! రాజపుత్రికయందలి స్నేహముచేతను నాకుఁ బొడమిన కుతూహలముచేతను జూచితిని.

వాస.—అల్లుఁడుగా రెట్లున్నారు?

చేటి.—అమ్మా! చెప్పుచున్నాను విను? అటువంటివాని నిదివఱ కెన్నఁడుఁ జూడలేదు.

వాస.—సఖీ! చెప్పు. చెప్పు. అంతదర్శనీయుఁడా?

చేటి.—అడుగనేల! శరచాప విహీనుఁ డయిన సాక్షాన్మన్మథుఁడే.

వాస.—ఇంతటితోఁ గట్టిబెట్టు.

చేటి.—ఎందునకునన్ను వారించుచున్నావు?

వాస.—పరపురుష సంకీర్తనము వినఁగూడదు.

చేటి.—అటులయిన దండ శీఘ్రముగాఁ గ్రుచ్చుము.

వాస.—(తనలో) మందభాగ్యురాల నగునేను గ్రుచ్చవలసిన దే.

(ప్రకాశముగా) సఖీ? పూవులిమ్మా. గుచ్చెదను. (పూవులు పుచ్చుకొని చేతికేదో తగులగాఁ విడిచిపెట్టి చూచి) ఇది యేదయిన నోషధియా యేమి?

చేటి—ఔను, మంగళపరిద మయిన యోషధి.

వాస—(తనలో) ఇది సర్వవిధముల గుచ్చదగినదె! ఏలయన—నిది పద్మావతికిని, నాకును సౌభాగ్యప్రదము. (ప్రకాశముగా) ఈయోషధి పేరేమమ్మా?

చేటి—దీనిపేరు సపత్నీ మర్దనము.

వాస—ఇది గ్రుచ్చనక్కరలేదు.

చేటి—ఎందువల్ల?

వాస—ఆయనపరిథమభార్యమృతినొందినది కావున, గ్రుచ్చుటనిష్ప్రయోజనము.

(మఱియొకచేటి పరివేశించును)

రెండవచేటి—అమ్మా! త్వరఁపడు. త్వరపడు. అల్లుఁడుగారుపుణ్యస్త్రీలతోడ నభ్యంతర చతుశ్శాలం బ్రవేశించుచున్నారు.

వాస—ఇదిగోనమ్మా! తీసికో.

చేటి—సఖీ! నీవు వస్త్రమును దీసికొనిరా! నేను వెళ్ళుచున్నాను.

(ఇద్దరుచేటులు నిష్క్రిమించుచున్నారు.)

వాస—అదివెళ్ళినది. అహాో! యత్యాహితము. ఆర్యపుత్త్రుఁడు గూడఁ బరాధీనుఁ డగుచున్నాఁడుగదా! నిదరి వచ్చినపక్షమునఁ బండుకొని కొంతసేపు దుఃఖమును బోగొట్టుకొందును గదా!

(నిష్క్రమించుచున్నది.)

# స్వప్నవాసవదత్తనాటకము

## చతుర్థాంకము.

(అప్పుడు విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విదూ—(సంతోషముతో) అదృష్టవశమున మహనీయుఁడయిన వత్సరాజుయొక్క యభిప్రేతవివాహమంగళరమణీయమగుకాలము జూచుభాగ్యము లభించినది ఆవిధముగా మహాపద యను సుడిగుండములోఁబడి మునిఁగి మరల దేలి యింతవారమగుదుమని యెవఁడనుకొనెను. ఇప్పుడు నాయునికి మేడలమీద. స్నాన మంతఃపురదీర్ఘికలయందు. భోజనము మిక్కి మధురరసులయి సుకుమారము లయిన మోదకములు ఖాద్యములు. వేయేల! నేనిప్పు డప్సరసలు లేనిస్వర్గలోకమందు హాయిగానున్నాఁడను. కాని నాకొక గొప్పబాధ సంభవించినది. తిన్నతిండి నాకుసరిగా జీర్ణముకాదు. తెల్లనిదుప్పటలుపఱచిన మెత్తనిపానుపులమీఁద బండుకొనినను నిదర సరిగాఁబట్టదు. నాకు గర్భములో మహావాతము ప్రవేశించినట్లు తోఁచుచున్నది. అయ్యో! ఈపాడు రోగముచేత చలిదికూఁడు దినుటకు వీలులేక నాసౌఖ్యము చట్టుబండ లయిపోయినది గదా!

(అప్పుడు చేటి పరివేశించుచున్నది.)

చేటి—ఆర్యవసంతకుఁ డెక్కడకు వెళ్ళెను జెప్పుమా! (కొంచెము నడచి) ఇదుగో! ఆర్యవసంతకుడు. వసంతకా! ఎంతసేపటి

నుండి నిన్ను వెదకుచుంటి నయ్యా?

విదూ—(చూచి) కళ్యాణీ! ఎందునకు నన్ను వెదకుచుంటివి?

చేటి—అల్లుడుగారు స్నానము చేసిరాయని నిన్నడిగి రమ్మని రాజపత్ని చెప్పినది.

విదూ—ఎందున కిట్లడుగు చుంటివి?

చేటి—మఱే మున్నది! సుమనో వర్ణకముఁదెచ్చి యీవలయునని.

విదూ—ఆయన స్నానముచేసినారు. నీవు సర్వమును దీసికొనిరా? భోజనము మాత్రము వలదు.

చేటి—ఎందుచేత భోజనము తేవల దనుచున్నావు?

విదూ—నిర్భాగ్యుడనగునాకు నజీర్ణవ్యాధి ప్రవేశించినది. కోకిల గ్రుడ్లు తిరిగినట్లు నాకడుపులో వికారపెట్టి త్రిప్పుచుండును.

చేటి—కడుపుమాన మెఱుఁగక తెగఁ దిన్నందు కంతే కావలెను.

విదూ—సరేపో? ఇంతలో నేనునుమా రాజుగారిదగ్గకుఁ బోయెదను.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

---

ఇది ప్రవేశకము.

(అపుడు సపరివారయగు పద్మావతియు, ఆవంతికావేష ధారిణియగు వాసవదత్తయుఁ బ్రవేశించుచున్నారు.)

చేటి—భర్తృదారికా! ప్రమదవనమున కెందునకు వచ్చితివమ్మా?

పద్మా—సఖీ? నీవుఁ బెంచిన నల్లవావిలిచెట్లు పుష్పించినవో లేవో చూడవలయునని.

చేటి—రాజపుత్రీ? అవి పూచినవి. నడుమ నడుమఁ బగడములుగ్రుచ్చిన ముత్యాలహారములవలెఁ బుష్పములచేత మనోజ్ఞములయి యున్నవి.

పద్మా—సఖీ! అట్లయిన నేలజాగు చేసెదవు!

చేటి—భర్తృగారికా! ఈలోపున నీవాఱాతిపలకమీఁద క్షణమాత్రి

ము కూర్చుండుము. ఇంతలో నేను బూవులు గోసి తెచ్చె
దను.

పద్మా—అమ్మా! అక్కడఁ గూర్చుండుదమా?

వాస—అట్లే చేయుదము.

(ఇద్దఱు కూర్చుండుదురు.)

చేటి—(పూవులుకోసి) రాజపుత్రి! చూడు. చూడు! నాదోసిలిమణి
శిలవలకలతోవలెనే శేఫాలికా పుష్పములతో నిండియున్నది.

పద్మా—అహో! ఏమి యీపుష్పముల విచిత్రిత! అమ్మా! చూడు!
చూడు!

వాస—అహా! యీపుష్పము లెంతదర్శనీయము లయి యున్నవి.

చేటి—భర్తృగారికా! మరలగొన్ని పుష్పములు కోయుదునా?

పద్మా—సఖీ! వలదు. మరల గోయవలదు.

వాస—సఖీ ఎందుచేత వలదనుచున్నావు?

పద్మా—భర్తగారిక్కడకు వచ్చి యీపుష్పసమృద్ధినిఁ జూచి వృక్ష
ముల గౌరవింతురు.

వాస—సఖీ! భర్తనీయెడ బ్రియుఁడయి యున్నాఁడా?

పద్మా—అమ్మా! అది నేనెఱుఁగను గాని యాయనను విడిచియొక
నిముస మయిన నుండజాలను.

వాస—(తనలో) నేనతిదుష్కరమును జేయుచున్నదానను గదా!
ఈమెయు నిట్లే తలంచు చున్నది.

చేటి—నాభర్త నాయెడఁ బ్రియుఁడే యని భర్తృదారిక తలంచుట
మిక్కిలి మంచిదికదా!

పద్మా—నాకొక సందేహమున్నది.

వాస—అదేది?

పద్మా—భర్తగారు నాయెడ నెట్లున్నారో, పూర్వము వాసవదత్త

యెడఁగూడ నట్లేయుండిరా?

వాస—ఇంతకంటె నెక్కువగా నుండిరి.

పద్మా—నీవెట్లెఱుంగుదువు?

వాస—(తనలో) అయ్యో! భర్తృపక్షపాతముచేత నేను సముదాచార మతిక్రమించితిని ఇప్పు డీలాగునఁ జెప్పెదను (ప్రకాశముగా) స్నేహ మల్ప మయిన యెడల వాసవదత్తనుగూర్చి యట్లేల విలపించు.

పద్మా—కావచ్చును.

చేటి—భర్తృదారికా! "నాకుఁగూడ వీణనేర్పుఁ" డని భర్తను మెల్లఁగా నడుగవమ్మా?

పద్మా—అడిగితిని.

వాస—అందున కాయన యేమనిరి?

పద్మా—మాట్లాడక కొంచెమునిట్టూర్పు విడిచి యూరకుండెను.

వాస—అందునకుఁ గారణ మేమయియుండు నని నీ వూహించుచున్నావు?

పద్మా—పూజ్యురాలయిన వాసదత్తాదేవిగుణములు జ్ఞప్తికిరాఁగా దుఃఖావిష్టుడయి నాయెదుట వగచుట బాగుగ నుండదని యెట్టెటో దుఃఖము నాపుకొని మాటలాడలేక యూరకుండెనని నే నూహించు చున్నాను.

వాస—(తనలో) ఇదినిజమయిన యెడల నేను మిక్కిలిధన్యురాలను

(అప్పుడు వత్సరాజును, విదూషకుఁడును బ్రవేశించుచున్నారు.)

విదూ—ఇహిహి! ఎవరో మంకెనపూవులు గోయగా నవి పలుచ పలుచగా నిచ్చట నచ్చటఁ బడియుండుటచే నీయుద్యానవన మెంతరమణీయముగా నున్నదో! నీవిటురా! మిత్రుఁడా!

రాజు—మిత్రుఁడా! వసంతకుఁడ! ఇదిగో! ఇదిగో! వచ్చుచున్నాను.

మ. మునునే నుజ్జయినీపురంబరిగి రాట్పుత్రిక విలోకించి యొ
క్క నవావస్థను జెందనై దలుఁగులంగాముందునర్ గ్రుమ్మె యిం
కనుముల్కుల్ హృదినాటియున్న వపుడేకాదేచె వేమాఱుకా
మునివై దమ్ములె యెట్లు లారవ శరంబుం జిమ్మె వాఁడిచ్చటన్
విదూ—పూజ్యురాలయిన పద్మావతి యెక్కడికి వెళ్ళినదో! లతా
మండపమునకు వెళ్ళియుండవచ్చును. లేదా, వేగిసపువ్వులతో
నిండి పులికలాసము పఱచిన తెఱంగున నలరు పర్వతతిలకమ
ను రాతిపలకమీఁదికయిన సరిగియుండవచ్చను కాదేని, యధి
క కటుకగంధ మగునేడాకులయనంటుల తోటలోని కయి
నఁ జనియుండవచ్చు. అదియుంగానిపక్షమునమృగములయుఁ
బక్షులయుఁ జిత్రరవులతో నిండినదారు పర్వతమునకరిగియుం
డును. (పైకిఁజూచి) హీ, హీ, హీ, హీ! శరత్కాలనిర్మలమ
యిన యంతరిక్షమునఁ బరిసారితబల దేవబాహువట్లుదర్శనీయ
మయి సారసపక్షుల పంక్తియరుగుచున్నది. చూడుడు.
రాజు—మిత్రుఁడా! దానిం జూచుచున్నాఁడను.

సీ. సూటిగా నిడుదవై చూపట్టు నొకమారు
పలుచనై యొకమారు పరిఘవిల్లు
నిమ్నోన్నతం బయి నెగడు వేరొకమారు
గుంపుగా నొకమారు గూడియుండు
మఱలు వో స ప్తర్షి మండలి కైవడి
మెగుడును దిగుడునై మెసఁగుచుండుఁ
గుప్పసం బూడ్చిన సప్పంబుకడుపట్లు
నిర్మలం బైనట్టి నింగి నిపుడు
రెండుపాయలుగా గ త్తిరించునట్టి
విమల రేఖనా నొప్పు నీవిహగపంక్తి

మనుజనేత్రైకవర్ధ్యాయమాణ మగుచు
గగనలక్ష్మికి నొకయలంకార మగుచు.

చేటి—రాజపుత్రీ! తెల్లగలువపూలదండవలె స్వచ్ఛమయి యాకసంబునఁ బాఱుచున్న యాబెగ్గురుపులుంగులబారుచూడవమ్మా ఎంతసుందరముగా నున్నదో. (ఇటునటు చూచి) అమ్మో! రాజుగారు!

పద్మా—సఖీ! ఔను ఆర్యపుత్రుఁడె! అమ్మా! నీకారణమున నే నిప్పు డార్యపుత్రదర్శనమును మానుచున్నదానను. అందుచేత నిప్పుడు మాధవీమండపమును బ్రవేశింతము రమ్మా.

వాస—అట్లు చేయుదము.

(అట్లు చేయుచున్నారు.)

విదూ—పూజ్యురాలయినపద్మావతి యిక్కడకు వచ్చి వెళ్ళియుండవచ్చును.

రాజు—నీ వెట్లెఱుఁగుదువు?

విదూ—ఎట్లెటెఁగితినా? పూవులు కోసివేయఁబడిన యీ శేఫాలికాగుచ్ఛములం జూడుము.

రాజు—ఓహో! వసంతక! ఏమి యీపుష్పములవైచిత్ర్యము!

వాస—(తనలో) వసంతకునిపేరు వినుటచేత నేను మఱల నుజ్జయినీపురములో నున్నట్లు తలఁచుకొనుచుంటిని.

రాజు—వసంతక? ఈరాతిపలక మీఁదనే కూర్చుండి పద్మావతిరాకకెదురుచూతము.

విదూ—ఆహా! ఆలాగే చేయుదము. కాని, ఈశరత్కాలపుటెండ మిక్కిలి తీక్ష్ణమయి సహింప శక్యము గాకున్నది. కాఁబట్టి యీమాధవీమండపముఁ బ్రవేశింతము రమ్మ

రాజు—మంచిది ముందు నడువుము.

విదూ.—అట్లేయగుఁగాక !

(ఇద్దఱు నడుచుచున్నారు)

పద్మా.—ఆర్యవసంతకుఁడు తనయిష్టమువచ్చినట్లు గడబిడఁ జేయఁ దలఁచుకొన్నాఁడు. ఇప్పు డేమి చేయుదము?

చేటి.—భర్తృదారికా! తుమ్మెదలతో నింశి వేశ్రిలాడుచున్న యీతీఁగను గదిపి రాజుగారిని రాకుండఁ జేసెదను.

పద్మా.—అట్లు చేయుము.

(చేటి యట్లు చేయుచున్నది.)

విదూ.—హా! చచ్చితిఁ జచ్చితి! మిత్రుఁడా! నీ వక్కడనుండు. రాకు. రాకు.

రాజు.—ఎందుచేత?

విదూ.—ఈతుమ్మెదలొత్తుకొడుకులు నన్ను బాధపెట్టు చున్నవి.

రాజు.—భయము లేదు. భయము లేదు. తెమ్మెదలబాధ వివారించుకోవచ్చును. చూడు,—

మ. అలరుం తేనియఁ గ్రోలి మత్తుఁగొని యవ్యక్తధ్వనుల్ సేయు తేఁ
టులగ్రుచ్చుం బిగియాఱఁ గౌఁగిటను నాడుందుమ్మెదల్ గూరిమిన్
జెలికాఁడా! మనకాలిచప్పు డయినన్ భీతిల్లి యీ తేంట్లు నా
వలెఁ గాంతావిరహార్తిఁ గుందు మన మావంకన్ జనన్ వల్దిఁకన్.
అందుచేత మన మిక్కడనే కూర్చుందము.

విదూ.—అట్లే చేయుదము.

(ఇద్దఱు కూర్చుందురు)

పద్మా.—అమ్మయ్య! అదృష్టవశమున భర్తగా రిటురాక యక్కడనే కూర్చున్నారు.

వాస.—(తనలో) భాగ్యవశమున భర్తగా రెప్పటి దార్ఢ్యముతోనే యున్నారు.

చేటి—భర్తృదారికా! మన మిక్కడ బంధింపఁ బడినారము. ఆమ్మా యిదేమి? ఆవంతిక కన్నీరు విడుచుచున్నది.

వాస—అమ్మా! యిది తుమ్మెదల దుండగమువలన వచ్చినది. అవి మెగులుటవలన తెల్లుపుప్పొడి నాకంటఁ బడఁ గన్నుల నీరు కాఱు చున్నది.

పద్మా—ఔను.

విదూ—అయ్యా! ఈ ప్రమదవన మిప్పుడు నిర్జన మయియున్నది. ఒక్కప్రశ్న ని స్నడుగవలెనని యున్నది. అడుగుదునా?

రాజు—యథేచ్ఛముగా నడుగవచ్చును.

విదూ—ఎవర్తె నీ కెక్కువప్రియురాలు? అప్పటివాసవదత్తా! ఇప్పటి పద్మావతియా?

రాజు—నీవు నన్నిప్పుడు బహుమానతారతమ్య మడిగి గొప్పచిక్కులోఁ బెట్టఁ దలఁచుకొంటివా! యేమి?

పద్మా—సఖీ! వసంతకుఁడు భర్తగారినెటువంటిచిక్కులోఁ బెట్టినాఁడే?

వాస—(తనలో) నే నెంతయు మందభాగ్యురాలను.

విదూ—స్వేచ్ఛగా నిర్భయముఁగా జెప్పవయ్యా! ఒకర్తు మృతి నొందినది రెండవయామె యిక్కడ లేదు.

రాజు—నీవు వడవడ వాఁగుచుంటివి. కాని చెప్పుటకు నాకు నోరు రాదు.

పద్మా—భర్తగారు చెప్పఁగల దంతే!

విదూ—నే నెవరికి జెప్పనని యేయొట్టుపెట్టుకోమంటే ఆయొట్టు పెట్టుకొందును. ఇదిగో! నానాలుక కఱచుకొందును.

రాజు—మిత్రుఁడా! చెప్పుట కుత్సాహము లేదు.

పద్మా—అహో! ఏమి యితనిపురోభాగిత ఇంతమాత్ర మాయన హృదయ మయినఁ దెలిసికొన లేఁడేమి?

విదూ—ఏమి! నాకుఁ జెప్పవా? నాకుత్తరము చెప్పకుండ నీజాతి పలకనుండి యొక్కయడుగయిన నిన్నుఁ గదలనీయను జాగ్రత్త నీ విక్కడ బంధింపఁ బడితివి.

రాజు—బలాత్కారమున? జెప్పించెదవా! యేమి?

విదూ—ఔను. బలాత్కారముననే చెప్పించెదను.

రాజు—అట్లయిన నెట్లు చెప్పించెదవో చూతములే.

విదూ—దయ యుంచవయ్యా! దయయుంచు. కోపపడకు యదార్థస్థితి చెప్ప వని చనవుచేత బలవంతముగఁ జెప్పించెద నంటిని.

రాజు—చెప్పక గతిలేదు. విను—

గీ. లలితరూపవిలాసశీలములచేత
మెలఁత పద్మావతీదేవి మిగులఁగూర్చ
నైన వాసదవత్తతో నైక్య మొందు
హృదయమును జూలఁగొనఁజాల దింతవఱకు.

వాస—(తనలో) మేలు! మేలు! నాపడినదుఃఖమునకు నేఁటికిఁ బ్రతిఫలము ముట్టినది. అజ్ఞాతవాసమయిన నిప్పు డెంతో యూఱట గలుగుచున్నది.

చేటి—భర్తృదారికా! నీభర్త నిర్దయుఁడు సుమీ!

పద్మా—సఖీ! వలదు. వలదు. అట్లనఁబోకుము. భర్తగా రిప్పుడు సయితము పూజ్యురా లయినవాసవదత్తాదేవిగుణములఁ బ్రశంసించుచుండుటచేత సదయులే.

వాస—కల్యాణీ! నీసత్కులపరిసూనతకుఁ దగినట్లు పలికితివి.

రాజు—నేను జెప్పితినిగదా! నీ విప్పుడు చెప్పుము. నీ కిద్దఱిలో నెవరిమీఁద నెక్కువయిష్టము అప్పుడు వాసవదత్తమీఁదనా? ఇపుడు పద్మావతిమీఁదనా?

పద్మా—భర్తగారుకూడ వసంతుఁడై నాఁడే?

 

విదూ—నామాట యెందుకు? ఆమహాదేవు లిద్దఱిమీఁద నా కిష్టమె.

రాజు—మూర్ఖుఁడా? అట్లు బలవంతపెట్టి నాచేతఁ జెప్పించి విని యిప్పుడు మాటలాడవేమి?

విదూ—నన్నుఁగూడ బలాత్కరింతువా! యేమి?

రాజు—ఔను. బలాత్కరించెదను.

విదూ—అటు లయిన విన శక్యము గాదు.

రాజు—దయ యుంచవయ్యా! బ్రాహ్మణుఁడా దయ యుంచు స్వేచ్ఛగాఁ జెప్పు?

విదూ—అటు లయిన వినుము పూజ్యురా లయినవాసవదత్తాదేవి మీఁద నాకిష్టమే. పూజ్యురా లయినపద్మావతీదేవి యువతీ రత్నము చక్కనిచుక్క కోపమన్నమాట లేదుకదా! అహంకార మేమో యెఱుఁగనే యెఱుఁగదు మాట తేనె తేటగదా? పైఁగా దయారాశి. ఈగుణముల కేమి! ఇంత కన్న గొప్పగుణము మఱొకటి యున్నది యామెయొద్ద ఆర్య వసంతకుఁ డేడియేడి యని యెంతో యంతదయతోఁ బూఁట పూఁటకు నన్నామె కనుఁగొని, పంచభక్ష్యపరమాన్నములతో భోజనము పెట్టించి యాదరించుచుండును.

వాస—(తనలో) బాగు. వసంతకా! బాగు. ఇప్పుడు తలఁచుకో వలసిన దామాటె!

రాజు—ఉండు. ఉండు. వసంతక! ఇది యంతయు వాసవదత్తతోఁ జెప్పి నీపనిఁ బట్టించెదను.

విదూ—ఇంక నెక్కడి వాసవదత్త? వాసవదత్త చిరకాలము క్రిందటనే పోయినది.

రాజు—(విషాదముతో) ఔను. వాసవదత్తపోయినది.

ఆ. వె. పరుసమైనసీదు పరిహాసమునఁ జేసి
కరము నాదుమనసు కలఁతఁ జెందె
సందుచేతఁ దొంటియభ్యాసవశమున
మాట జాఱి వచ్చె నోటినుండి.

పద్మా—ఆహాహా! కథాయోగము మిక్కిలి రమణీయముగా నున్నది నృశంసకుఁ డగు వసంతకుఁడు వితండావాదము చేసి మనసు కలఁచినాఁడు.

వాస—(తనలో) మేలు. మేలు. ఇప్పుడు నాకు నమ్మిక కలిగినది. ఎదుట లేనప్పుడు చెప్పిన యిటువంటిమాట మిక్కిలి ప్రియ మయినమ్మఁ దగియుండును గదా?

విదూ—మిత్రుఁడా! ఊరడిల్లుము. విధినిర్ణయము దాఁట శక్యము గానిది కదా!

రాజు—మిత్రుఁడా! నీవు నాయవస్థ నెఱుంగవు.

చ. విడిచితి దుఃఖ మట్లయినఁ బ్రేముడి నెమ్మది వ్రేళ్ళువాఱుటన్
సడలక క్రొత్త దయ్యెడు విషాదము జ్ఞప్తికి వచ్చినప్పు డీ
వడువున నీప్రియాణమున వాసవదత్తఋణంబు దీర్చితిన్
గడుకొని బాష్పముల్ విడిచి, గావున బుద్ధిప్రసన్న మానిఁకన్

విదూ—ఈయనముఖ మశ్రుపాతముచేతఁ గలుష మయినది. కావున మొగము గడుగుకొనుటకు జలముఁ దెచ్చెదను

(అని వెళ్ళు చున్నాఁడు.)

పద్మా—అమ్మా! భర్తగారిముఖము బాష్పపటాలాంతరితమయినది మనము వెళ్ళుదము

వాస—అట్లే చేయుదము పోనీ, నీవుండుము వగచుచున్నభర్తను విడిచిపోవుట తగదు నేనే వెళ్ళెదను.

చేటి—ఈయమ్మ చెప్పినది బాగుగనున్నది. రాజపుత్రీ! భర్తగారి సన్నిధికిఁ బొమ్ము.

పద్మా—వెళ్ళుదునా ?

వాస—సఖీ! వెళ్ళు

(అని నిష్క్రమించుచున్నది)

విదూ—(తామరాకులలో నీరు పోసికొనివచ్చి) ఇదిగో పూజ్యురా లయినపద్మావతి.

పద్మా—అయ్యా! వసంతకా! అదియేమి?

విదూ—అదే యిది. ఇదే యది.

పద్మా—అయ్యా! చెప్పుఁడి. చెప్పుండి

విదూ—అమ్మా! వాయువశమున తెల్లుపుప్పొడి కనులం బడుట వలనఁ బ్రభువుగారి కనులనుండి బాష్పములువచ్చినవి కావున ముఖము కడుగుకొనుట కీజలముఁ దీసికొనివెళ్ళి యిమ్ము.

పద్మా—దయావంతులపరిజనులుసయితము దయావంతులేయగుదురు (భర్తను సమీపించి) ఆర్యపుత్ర! జయము! జయము! ఇదిగో ముఖోదకము.

రాజు—ఓహో! పద్మావతియా! (అపవారించి) వసంతక! ఇదేమి ?

విదూ—(చెవిలో) ఈలాగున సరిది చెప్పితినిలే (అని రహస్యముఁ జెప్పుచున్నాఁడు.)

రాజు—బాగు. వసంతక! బాగు. (మొగము కడుగుకొని) పద్మావతీ కూర్చుండుము.

పద్మా—చిత్తము (అని కూర్చుండును.)

రాజు—పద్మావతీ!

గీ. శారదస్వచ్ఛచంద్రికాగౌరమైన
కాశపుష్పపరాగంబు గాలి కెగిఱి
వచ్చి నేత్రద్వయంబున బడుటచేత
నీరు గ్రమ్మెను నెమ్మోము నీరజాక్షి
(తనలో)
గీ. క్రొత్త పెండ్లికూఁతు రీకువలయాక్షి
సత్యమును విన్నఁ గరము విషాద మొందు
పడఁతి యెంతయు ధీర స్వభావురాలె
కాని స్త్రీస్వభావం బతికాతరంబు.

విదూ.—అయ్యా! మధ్యాహ్నమయినది. పూజ్యుఁడయిన మగధరా జు నిన్నుఁ బురస్కరించుకొని మిత్రదర్శనము చేయవలసిన సమయ మిదే. సత్కారము సత్కారముచేతఁబ్రతిగ్రహింపఁ బడి ప్రీతిని గలుగఁజేయును. కావునరమ్ము. పోవుదము.

రాజు.—మంచిది. ఇదియుత్తమము (లేచి)
గీ. ఉత్తమ విశాలగుణముల కునికిపట్టు
లధికసత్కార కర్తలు నైనజనులు
తలచుగాఁ గానఁబడుచుందురు ధరణియందు
వారిసౌజన్య మెఱిఁగినవార లరిది.
(అందఱు నిష్క్రమింతురు)

చతుర్థాంకము.

# స్వప్నవాసవదత్తనాటకము

## పంచమాంకము.

(అప్పుడు పద్మినిక ప్రవేశించుచున్నది.)

పద్మి—మధుకరికా ! మధుకరిక ! త్వరగారావే !

మధు—(ప్రవేశించి) సఖీ! ఇదిగో వచ్చితిని. ఏమిచేయవలయును?

పద్మి—సఖీ! రాజపుత్రి పద్మావతి తలనొప్పిచేత బాధపడుచున్నదని నీవెఱుఁగవా!

మధు—అయ్యో ! అయ్యో !

పద్మి—చెలీ! నీవు వేగము వెళ్ళి యీమాట పూజ్యురాలయినయావంతికతోఁ జెప్పుము. భర్తృదారికకుఁ దలనొప్పి వచ్చినదని మాత్రముచెప్పుము. అంతట నామె వెంటనేవచ్చును.

మధు—సఖీ! అమె యేమి చేయఁగలదు ?

పద్మి—ఏమిచేయఁగలదా ? మనోహరము లయిన కథలుచెప్పి శీర్షవేదనఁ బోఁగొట్టి వినోదముఁ గలిగించును.

మధు—సరె! రాజపుత్రిక నిమిత్తము పాను పెక్కడ వేసినారు?

పద్మి--సముద్రగృహమందు వేసినారు. నీవిపుడు వెళ్ళుము. భర్తగారికీ విషయము తెలియఁజేయుటకు నేనార్యవసంతకుని వెదకెదను.

మధు—అట్లు చేయుము. (నిష్క్రమించుచున్నది)

పద్మి—ఇప్పుడు నే నార్యవసంతుని నెక్కడఁ జూడగలను.

(అప్పుడు విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విదూ—వాసవదత్తావియోగదుఃఖితుఁ డయి యిపుడు పద్మావతీపాణిగ్రహణముఁ జేసిన పూజ్యుఁ డయిన మావత్సరాజుయొక్క

సుఖావహమగు కళ్యాణమహోత్సవమునందు నింతింతయన
రాని మదనాగ్నిదాహము జఱుగుచున్నదికదా! (పద్మినికం
జూచి) ఏమే ! పద్మినికా ! ఇక్కడఁ దిరుగులాడుచున్నావు?

పద్మి—అయ్యో ! వసంతక ! భర్తృదారిక పద్మావతి తలనొప్పిచే
త బాధపడుచున్నదని నీకుఁ దెలియలేదా ?

విదూ—నిజముగానే నాకుఁదెలియదు.

పద్మి—అటులయిన నిది రాజుగారి కెఱింగింపుము. ఈలోఁపున నేను
సత్వరముగా శీర్షానులేపనము దెచ్చెదను.

విదూ—పద్మావతికిఁ బానుపెక్కడ వేసినారు ?

పద్మి—సముద్రగృహమందు వేసినారు.

విదూ-సరె!నీవుపెళ్ళు నేనుమారాజుగారితో విన్నవించుటకుబోయెదను.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశము.

---

(అప్పుడు వత్సరాజు పరివేశించుచున్నాఁడు.)

రాజు—

మ. మనమందిప్పుడు సైతముం దలఁచెదన్ బల్మారు, కాలక్రమం
బున నేవెండియు భార్యఁ జేకొని సుఖంబుంగాంచియున్ మంచుచే
హననంబొందిన పద్మినింబలెనె యయ్యావంతిభూపాలనం
దన లావాణకదగ్ధదేహ జనవంద్యన్ నాదుపారిణప్రియన్.

విదూ—(పరివేశించి) త్వరపడవయ్యా ! త్వరపడవయ్యా !

రాజు—ఎందునిమిత్తము?

విదూ—పూజ్యురాలయిన పద్మావతి తలనొప్పిచేతబాధపడుచున్నది

రాజు—నీ కెవరు చెప్పిరి ?

విదూ—పద్మినిక చెప్పినది.

రాజు—హా ! కష్టము.

మ. వరరూపంబు గుణంబులుం గలపిరియన్ బద్మావతిం జేకొనన్
జిరకాలాగతమైన శోకము శమించెన్ గొంత నాకిత్తఱిన్
గరమున్ దుఃఖమువడ్డపాఠిణి నగుటన్ జాడ్యం బొకింతైన నీ
తరుణీ వాసవదత్తనుంబలెనె నేఁదర్కింతుఁ జిత్తంబునన్.

పద్మావతి యెక్కడ నున్నది ?

విదూ—సముద్రగృహమందుఁ బండుకొనియున్నది.

రాజు—అట్లయిన నక్కడకు మార్గముఁ జూపుము.

విదూ—దయచేయుఁడు దయచేయుఁడు (ఇద్దఱు నడుచుచున్నారు.)

విదూ—ఇదే సముద్రగృహము. లోపలికిఁ దయచేయుఁడు.

రాజు—ముందు నీ వఱుఁగుము.

విదూ—నరే! (కొంచెమునడచి) హా! చచ్చితి, చచ్చితి. నీవు రాకు. ఉండు. ఉండు అక్కడ.

రాజు—ఎందుచేత?

విదూ—ఇదిగో నిక్కడ దీపఁపు వెలుఁగున బాము నేలమీఁద మెలమెలలాడుచున్నట్లు కనఁబడుచున్నది.

రాజు—(దగ్గఱకుఁబోయి చూచి చిఱునవ్వుతో) ఏమి ! మూర్ఖుని సర్పభ్రాంతి !

గీ. ఔర ! ద్వారబంధమున వేరిలాడుచున్న
పోడవుపూదండ తెగిపోయి పుడమినిఁబడి
గాలిచే రాత్రిజరజర గదలుటఁ గని
భ్రమసినాఁడవు నీ వది పామటంచు.

విదూ—(నిరూపించి) నీవు సరిగాఁ జెప్పితివి. ఇది పాము కాదు (ప్రవేశించి చూచి) పూజ్యురాలయిన పద్మావతి యిక్కడకు వచ్చి వెళ్ళిపోయినదని యూహించుచున్నాను.

రాజు—మిత్రుఁడా ! ఆమె రానేలేదని తలంచెదను.

విదూ—నీవెట్లెఱుఁగుదువు ?

రాజు—ఇందు దెలిసికోనఁదగిన దేమున్నది. చూడు—

చ. తలిపము వంగలేదు, ముడుతల్‌వడి దుప్పటి నల్గలే దెటన్
దలపయిఁ బూయుమందు లుపధానము నెచ్చట నంటలేదు రో
గులకనుఁదోయి కింపులొనగూర్చెడి శోభలు సేయలేదు పోఁ
గలుగునె ట్రైటికిన్ స్వయముగా దిగి మంచము రోగి యింతలోన్

విదూ—అటులయిన నీశయ్యమీఁద క్షణము కూర్చుండి యామె
రాకను బ్రతీక్షింపుము.

రాజు—మంచిది (కూర్చుండి) మిత్రుఁడా ! నిద్రవచ్చుచున్నది. ఏ
దయిన నొకకథ చెప్పుము.

విదూ—సరే ! నేను కథఁ జెప్పెదను. నీ వూఁకొట్టుము.

రాజు—మంచిది.

విదూ—అనఁగనఁగ నుజ్జయిని యనుపట్టము కలదు. అక్కడ
మిక్కిలి రమణీయములగు నుదయజ్ఞానములు కలవుగదా !

రాజు—ఉజ్జయినిమాట యెందుకయ్యా !

విదూ—నీకీకథ యిష్టములేనిపక్షమున మఱియొకకథఁ జెప్పెదను.

రాజు—మిత్రుఁడా ! ఈకథ నాకిష్టముగాకపోలేదు.

మ. వనజాతాక్షి యవంతిరాజసుతముస్ ప్రస్థానకాలంబునం
దనచుట్టంబుల నెల్ల లోఁదలఁచి వంతం గుంది యావాలుఁగ
న్గోనలం గూడిన బాష్పబిందువులపంక్తుల్ నాదువక్షస్థలిన్
నినిచెం బ్రేమను, నామనం బిపుడు దానిన్ జ్ఞప్తికిం దెచ్చెడిన్.

మఱియు—

గీ. గాన మామెకు నే నేర్పుకాలమందు
నన్నె చూచుచుఁ జేతివీణ దిగజాఱ

 

కలికి వాయించె నట్టియాకాశమందె
యదియ తలఁపునఁబాఱు నా కనుఁనిమిషము.

విదూ__పోనీ, మఱియొకటి చెప్పెదవినుము. బ్రహ్మదత్త మనునగరముగలదు. కాంపిల్యుఁ డనురా జందుఁ బాలించుచుండును.

రాజు__ఏమేమి ?

విదూ__(తిఱిగి యట్లే యనుచున్నాఁడు)

రాజు__మూర్ఖుఁడా ? నీవు కథ తలక్రిందుజేసి చెప్పుచున్నావు. రాజు బ్రహ్మదత్తుఁడు. నగరము కాంపిల్యమనిచెప్పుము.

విదూ__ఏమిటి! రాజు బ్రహ్మదత్తుఁడా? నగరముకాంపిల్యమా? సరె!

రాజు__ఔ నాలాగె !

విదూ__అట్లయిన నీవొకక్షణమూరకుండుము. ఇంతలో నీ మాటలు పదిసార్లు వల్లించి నోటఁబట్టించుకొందును. రాజు బ్రహ్మదత్తుఁడు. నగరము కాంపిల్యము. రాజు బ్రహ్మదత్తుఁడు నగరము కాంపిల్యము (అనివల్లించి) వినవయ్యా! కథచెప్పుచున్నాను. అయ్యో! ఈయన నిద్రపోయినాఁడే!. పోనీమిక్కిలి చలి వేయుచున్నది. ఇంతలోదుప్పటి తెచ్చుకొని వచ్చెదను.

(నిష్క్రమించుచున్నాఁడు)

(అప్పుడావంతి కావేషముతో వాసవదత్తయు, నొకచేటియుఁ బ్రవేశించుచున్నారు.)

చేటి__అమ్మా ! రమ్ము. రమ్ము. భర్తృదారిక తలనొప్పిచేత మిక్కిలి బాధపడుచున్నది.

వాస__పద్మావతి యెక్కడఁ బండుకొనినది?

చేటి__సముద్రగృహమందు.

వాస---అట్లయిన ముందు నడువుము.

(ఇద్దఱు నడుచుచున్నారు.)

చేటి---ఇదేసముద్రగృహము. అమ్మా! లోపలికరుగుము. ఇంతలో నేనువెళ్ళి తలకురాయుమందుఁ, దెచ్చెదను.(అనివెళ్ళుచున్నది.)

వాస---అహో! దేవతలు నాయెడ నిర్దయు లయినారుగదా! ఏలయన నావియోగము వలన దుఃఖించుచున్న భర్తగారికి మనోవిశ్రాంతి యొసఁగి యీపద్మావతి సంతోషముఁ గలిగించునను కొనుచుండ నీమెయు నస్వస్థురాలయినదిగదా! లోపలికిఁ బోయెదను. (ప్రవేశించి చూచి) ఏమి యీపరిజనముయొక్క పాలుమాలిక! అస్వస్థ యయిన పద్మావతి నొక్కతెను గేవలము దీపసహాయురాలుగాఁ జేసి యందఱును విడిచిపోయినారు. పాపమీపద్మావతి నిద్రబోయినది. మేలుకొనుదాఁకఁ గూర్చుండెదను. మఱియొకచోటఁ గూర్చుండిన యెడల స్నేహము తక్కువ యని తోఁపవచ్చును. అందుచేత నీమె శయ్యమీఁదనే కూర్చుండెదను (కూర్చుండి ఏమి చెప్పుమా! ఈపానుపుమీఁదఁ గూర్చుండగానే నామనస్సు మిక్కిలి యాహ్లాదముఁ బొందుచున్నది. అదృష్టవశమున శ్వాసములు తెంపులేక సమముగా వచ్చుచున్నవి. తలనొప్పికొంచె ముపశమించి నట్లున్నది. ఈపాన్పుమీఁద సగముభాగము వదలియొత్తిగిలి పండుకొనుటచేతఁ దక్కిన సగముభాగము మీఁద నేనుబండుకొని తన్ను గాఁగలించుకోవలసిన దని యామెయభిప్రాయ మయినట్లు కనఁబడుచున్నది. అందుచేతఁ బండుకొనియెదను.

(శయనము నభినయించుచున్నది.)

రాజు___(కలవరించును.) హా ! వాసవదత్తా !

వాస___(తొట్రుపడి లేచి) అమ్మో ! పద్మావతి కాదు భర్తగారు. నన్నాయన చూచిరా యేమి ! మహానుభావుఁ డయిన

యౌగంధరాయణుని మహాప్రతిజ్ఞాభారము నేఁడీయన నన్నుఁ జూచుటచేత నిష్ఫల మయినది గదా!

రాజు—హా ! అవంతిరాజపుత్రి !

వాస—అమ్మయ్య ! అదృష్టవంతురాలను. భర్తగారు కలగను చున్నారు. నన్నుఁ జూడలేదు. ఇక్కడ నెవ్వరును లేరు. అందుచే ముహూర్తకాల మిచ్చట నిలిచి నాకన్నులను హృదయమును సంతోషపెట్టుకొనియెదను.

రాజు—హా! ప్రియురాల! ప్రియశిష్యురాలా! నాకుఁబ్రత్యుత్తరమిమ్ము

వాస—ప్రాణేశ్వరా ! ఉత్తర మిచ్చుచునే యున్నదానను.

రాజు—కోపగించితివా ?

వాస—కోపగించలేదు. దుఃఖించుచుంటిని.

రాజు—కోపగింపకపోయినయెడల మాటాడవేమి ?

వాస—ఇఁక మీఁదనా ?

రాజు—విరహిక నీకు జ్ఞప్తికి వచ్చినదా ! యేమి ?

వాస—(రోషముతో) ఆ! చాలు. చాలు. ఇక్కడనయితము విరహికమాటయా!

రాజు—అటు లయిన విరహికనిమిత్తము నిన్నుఁ బ్రసన్నరాలుగఁ జేసికొందును. (చేతులు చాఁపుచున్నాఁడు)

వాస—ఎంతోసే పుంటిని. ఎవ రయిన నన్నుఁ జూడవచ్చును కావున వెళ్ళుదును. కాదు కాదు మంచముమీఁదినుండి క్రిందికి వ్రేలాడుచున్నభర్తగారిహస్తమును మంచముమీఁద నుంచి పోయెదను. (అట్లు చేసి నిష్క్రమించుచున్నది.)

రాజు—మేలుకొని (తొందరతో లేచి) వాసవదత్తా! నిలు. నిలు. హా! కష్టము కష్టము—

గీ॥ సంభ్రమంబున నే వెంట జనుచునుండ
ద్వారపక్షంబు ఘల్లునఁ దగిలె నాకు
నందుచేత భూతార్థమో యందరాని
యీప్సితమొ యిది సరిగ నే నెఱుఁగఁజాల॥

విదూ.—(ప్రవేశించి) ఓహో! ఆయన మేలుకాంచినాఁడు.

రాజు.—మిత్రుఁడా! నీకుఁ బ్రియము చెప్పెదను. వాసవదత్త బ్రదికి యున్నది.

విదూ.—ఇఁక నెక్కడి వాసవదత్త. వాసవదత్త పోయి చిరకాలమయినది.

రాజు.—వయస్య! అట్లనవలదనవలదు.

గీ॥ నేను బాన్పుపైఁ బవళించి నిదురఁ బోవ
మిత్రమా! నన్ను మేల్కొల్పి మెలఁత పోయె
కాలిపోయిన దనిచెప్పి కల్లవార్త
నన్ను వంచించె సుమి రుమణ్వంతుఁ డపుడు॥

విదూ.—ఆమె చనిపోయినది. ఇది యసంభావనీయము కాదు. ఆహా! ఉదయజ్ఞానము లని నేను జెప్పుటచేత నీ కామె జ్ఞప్తికి వచ్చి కలలోఁ గనఁబడి యుండనచ్చును.

రాజు.—క॥ కలయే యిది యగునేనిన్
మెలఁకువ రాకుంట నాకు మిక్కిలిప్రియమౌఁ
గలగా కిది భ్రమమైనన్
గలకాలము భ్రమయె యుండెఁగాఁ దగు నాకున్॥

విదూ.—వలదు. నిన్ను నీ విప్పు డపహాసితునిం జేసికోవలదు. ఏమన? ఈ రాజగృహమం దావంతి యనునొకయక్షిణి యున్నది. ఆమె నీకుఁ గనుపడిన దేమో.

రాజు.—కాదు. కాదు.

గీ॥ కలను గని మేలుకాంచి నేఁ గంటి నెదుటఁ
గాటుకకుఁ బాసియుండిన కనులతోడ
గుబురుగా నున్న నిడుదముంగురులతోడ
దర్శనీయమైనపతివ్రతాముఖంబు.

మఱియు నోమిత్రుఁడా! ఇటు చూడుము. చూడుము—

గీ॥ భయముపట్టి యాదేవి పట్టుకొన్న
బాహు విదె! స్వప్నకలితసంస్పర్శ యయ్యుఁ
బాయకున్నది చూడుము! మిప్పటికినయిన
హర్షరసముఁ గొల్పెడు పులకాంకురంబు॥

విదూ—అయ్యా! ఇప్పు డనర్థకవిషయములను జింతింపవలదు. చతుశ్శాలకుఁ బోవుదము రమ్ము. రమ్ము.

కాంచుకీయుఁడు—(ప్రవేశించి) దేవా! జయము! జయము! మాదర్శకమహారాజుగారు మీతో నిట్లు మనవిఁ జేయుచున్నారు. నీయమాత్యుఁ డగురుమణ్వంతుఁడు నీశత్రువగునారుణిని మర్దించుటకు మహాబలసమేతుఁ డయి వచ్చియున్నాఁడు. అందునకు రథగజతురగపదాతిమయము లగు నావిజయాంగములు గూడ దండయాత్రకుఁ బోవుటకు సన్నద్ధము లయి యున్నవి. కావున నీవు లెమ్ము. ఇఁక నిట్లయ్యె నని నమ్ము—.

సీ. నీపరితాపముముందు నిలువంగ నోపక
బెదరి నీశత్రువుల్ భిన్నులైరి
సతతంబు భవదీయ సద్గుణాసక్తులై
పౌరులు మనముల నూఱడిలిరి
పార్ష్ణిభాగములు నీపయనంపువేళల
శత్రుశూన్యములుగాఁ లుపఁబడియె

శత్రుమర్దనమందుఁ జలుపంగఁ దగినట్టి
సాధనంబుల నెల్లఁ జలిపినాఁడఁ
బరమపావన మగుభాగీరథీనది
దాఁటిపోయె నీదు దండు లెల్ల
వత్సదేశ మిపుడు స్వాధీన మయినది
వచ్చి యేలుమయ్య పార్థివేంద్ర॥

రాజు.—మంచిది.—

గీ॥ దంతితురఁగపంక్తులచేత దాఁటనగుచు
నిశితబాణకల్లోలనిర్నదరి మయిన
గాఢరణవార్ధి దారుణకర్మదక్షు
శత్రు నారుణి ముంచి నాశన మొనర్తు॥

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది పంచమాంకము.



# స్వప్న వాసవదత్త నాటకము

## షష్ఠాంకము.

(అప్పుడు కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కాంచు—ఎవరిక్కడ! రత్నతోరణద్వారమునొద్ద నెవరు కావలి యున్నారు?

(ప్రతీహారి ప్రవేశించును.)

ప్రతీ—ఇదిగో నే నున్నాను విజియను. ఏమి చేయవలయును?

కాంచు—విజయా! మహాసేనమహారాజునొద్దనుండి రైభ్యసగోత్రుఁడగుకాంచుకీయుఁడును, మహాసేనునిభార్యయయినయంగారవతీదేవి పంపిన వసుంధర యను వాసవదత్త దాదియు వచ్చి దర్శనార్థము ద్వారముకడ వేచియున్నారని వత్సరాజ్యలాభప్రవృద్ధోదయు లగు నుదయనమహారాజుగారితో విన్నవింపుము

ప్రతీ—అయ్యా! విన్నవించుట కిది సమయము కాదు. రాజుగారున్న ప్రదేశముకూడ మేము చొరరానిది.

కాంచు—సమయము గాకపోవు టనఁగా నెట్టిది?

ప్రతీ—అయ్యా! విను. ఇప్పుడు రాజుగారి శయ్యామహాప్రాసాదమున కెవరో వచ్చి వీణ వాయించిరి. ఆవీణాధ్వని విని "ఘోషవతీశబ్దమువలె వినఁబడుచున్నది," అని రాజుగారు పలికిరి.

కాంచు—తర్వాత! తర్వాత!

ప్రతీ—తరువాత రాజుగారక్కడకు వెళ్ళి "ఈవీణ యెక్కడనుండి వచ్చిన" దని యడిగిరి. అందునకు వీణవాయించునతఁ డిట్లు చెప్పెను. "అయ్యా! యిది నర్మదాతీరమందొక తీగకుం దగులుకొనియుండఁగా నేనుజూచితిని. దీనితో మీకుఁ బ్రయోజనము గలదియేని మీరు తీసికొనవచ్చును." అనవుడు నావీణఁ దీసికొని రాజుగారు దానిని దనశరీరమందుఁ బెట్టుకొని శోకవశమున మూర్ఛిల్లిరి. అనంతరము కొంతసేపటికి మూర్ఛఁదెలిసి మొగము వాచునట్లు బాష్పపర్యాకులుఁ డయి నగరి రాజుగారు ఘోషవతీ! నీవు కనఁబడితివిగాని యామెమాత్రము కనుపడలేదు గదా! యని పలికిరి. అయ్యా! అసమయమనఁగా నిట్టిది. ఇప్పు డెట్లు విన్నవింతును.

కాంచు—విజయా! విన్నవింపుము. భయము లేదు. ఈవిషయమును దానిసంబంధ మయినదే.

ప్రతీ—అయ్యా! ఇదిగో విన్నవించెదను. రాజుగారదే! శయ్యామహాప్రాసాదమునుండి దిగి యిటు వచ్చుచున్నారు. ఇక్కడనే నివేదింపఁగలను.

కాంచు—అట్లే చేయుము.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

---

(అప్పుడు వత్సరాజు విదూషకుఁడు ప్రవేశించుచున్నారు.)

రాజు—

చ. శ్రుతిసుఖనాద! ఘోషవతి! సుందరిచొక్కపుఁజన్నుదోయిపైఁ
దతజఘునస్థలంబుపయిఁ దార్కొని నిద్దుర వోవు నీవు నే

డలిశయదర్దశం గని విహంగరజోగణార్ణవండవై
పరితిభయ ముప్పతిల్ల వనవాసము నేగతిఁ జేయఁ గల్గితే.
మఱియు నో ఘోషవతి! నీవు కఠినురాలవు.

సీ. ఎలనాగజఘనమండలిఁ దాల్పఁగాఁ బుట్టు
బెడిదంబు లౌ పార్శ్వపీడనములు
కొంజెమ్మటలఁ దోగు గుబ్బలనడుమను
గడుపోయి నొడగూర్చు కౌఁగిలింత
లెదలోన విరహార్తి గదుర నం దలపోసి
తెలవచేసిన పరిదేవనములు
గానమధ్యమునందుఁ గంజాక్షి పలికెడు.
చిఱునవ్వు దళుకొత్తు జిలుఁగుపలుకు
లేల దలఁపవె యొకసారియేని నీవు
యింతలోపల మఱచిపోయితివె వాని
నింతకఠినాత్మురాలవం చెఱుఁగ నెపుడు
దారుమయపదార్థములకు దయలు గలవె.

విదూ.—మిత్రుఁడా! నీ విప్పు డతిసంతాపము నొందకుము.

రాజు—వయస్య! అట్లుకాదు.

గీ॥ చిరము నిందిరించియున్న నాచింత నిపుడు
మిత్రరత్నమ! యీవీణ మేలుకొలిపె
నెనతై ఘోషవతి ప్రియం బెంతొ గూర్చు
నానెలంతమాత్రము నాకుఁ గానరాదు.

వసంతకా! శిల్పిజనముకడకుఁ బోయి ఘోషవతినిఁ జక్కఁ
జేయించి క్రొత్తదానింబలెఁ జేసి తీసికొనిరమ్మ.

విదూ—మీయాజ్ఞాప్రకారము చేయుదును. (వీణఁ దీసికొని పోవు
చున్నాఁడు.)

ప్రతీహారి—(ప్రవేశించి) దేవా ! జయము ! జయము ! ఉజ్జయినీ నాథుఁ డగుమహాసేనుని యొద్దనుండి రైభ్యసగోత్రుఁ డగు కాంచుకీయుఁడును, మహాసేనుని దేవి యగునంగారవతి పంపిన వసుంధర యనువాసవదత్తదాదియు దర్శనార్థము వచ్చి ద్వారముకడ వేచియున్నవారు.

రాజు—అట్లయినఁ బద్మావతినిఁ గూడఁ బిలుచుకొని రమ్మా?

ప్రతీ—చిత్తము. దేవా! (ప్రతీహారి నిష్క్రమించుచున్నది)

రాజు—ఈవృత్తాంత మప్పుడే మహాసేనునకుఁ దెలిసినదా యేమి!

(అప్పుడు సపరివారయై పద్మావతి ప్రవేశించుచున్నది.)

ప్రతీ—రాజపుత్రీ! రమ్మా! రమ్మా!

పద్మా—ఆర్యపుత్రా ! జయము ! జయము!

రాజు—పద్మావతీ! వింటివా? మహాసేనునియొద్దనుండి రైభ్యసగోత్రుఁడగు కాంచుకీయుఁడును, నాతని దేవి యగునంగారవతి పనిచిన వసుంధర యనువాసవదత్తదాదియువచ్చివాకిటనున్నవారఁట!

పద్మా—ఆర్యపుత్ర! మాచుట్టాల కుశలవృత్తాంతము వినుట నాకు మిక్కిలి ప్రియము.

రాజు—వాసవదత్తస్వజనము నాస్వజనమేయని నీవు పలుకుట మిక్కిలి చక్కఁగా నున్నది. పద్మావతీ! కూర్చుండవేమి? ఇక్కడఁ గూర్చుండుము.

పద్మా—దేవరవారు నాతోఁ గలిసి కూర్చుండి వా రిద్దఱనుఁ జూడఁ దలఁచుకొన్నారా?

రాజు—ఇందు దోష మేమి?

పద్మా—నేను దేవరవారి ద్వితీయకళత్రమ నని యౌదాసీన్య మదాసీన కావచ్చును.

రాజు—కళత్రమును జూడఁదగినజనమును గళత్రమును జూడనీయక పంపివేయుచున్నాఁడని నా కపకీర్తి గలుగును. అందుచేతఁ గూర్చుండుము.

పద్మా—దేవరవారిచిత్తము. ఆర్యపుత్ర! వాసవదత్త తండ్రి గాని, తల్లిగాని యేమందురో యని నాకు విషాదముకలుగుచున్నది.

రాజు—అదియల్లే.

మ. అతఁ డేమా టనునో యటంచు మది నత్యంతంబు శంకింతు నా
క్షితినాథాత్మజ నే హరించితిని రక్షింపంగ లేనైతి, దు
ర్మతినై చంచలభాగ్యగర్వహతుఁడై పాలించద్గుణభ్రష్టుఁడై
పితమోహముం గనలేని పుత్రునిగతిం భీతిల్లెదన్ నేఁ గడున్.

(అప్పుడు కాంచుకీయుఁడు, దాది, ప్రతీహారి, ప్రవేశించుచున్నారు.)

కాంచు—ఓహో!

ఉ. అల్లుఁడు రాజ్యముం బడసెనంచు వినన్ ముదమయ్యెడున్ మహీ
వల్లభపుత్రిచావు దలపం జనియించును వంత దైవమా?
యల్లునిరాజ్య మన్యజనహస్తగతం బయి పోక యుండినన్
బిల్ల సుఖంచియున్న నిఁక నీ వొనరింపనిభద్ర ముండునే.

ప్రతీ—వారె? రాజుగారు. సమీపింపుఁడు.

కాంచు—(సమీపించి) మహారాజా! జయము! జయము!

దాది—దేవా! జయము! జయము!

రాజు—(సగౌరవముగా) అయ్యా!

గీ. కోరఁదగినట్టి చుట్టంబు గురువు నాకు
జగతిలోఁ గలరాజవంశముల కెల్ల
మాటమాత్రాన నుదయాస్తమయవిధాత
కుశలియై యున్నవాఁడె యాక్షోణివిభుఁడు.

కాంచు— ఆహా! మహాసేనునకుఁ గుశలమె. ఇక్కడి సర్వజనులకుశలము వినఁ గోరుచున్నాఁడు.

రాజు—(లేచి) మహాసేనుఁ డేమి యాజ్ఞాపించుచున్నాఁడు?

కాంచు—వైదేహీపుత్త్రిక వయిననీ కివిసయ మనురూపమయినదే. అయ్యా! మహాసేనునిసందేశమును దేవర కూర్చుండియే వినవచ్చును.

రాజు—మహాసేనుని యాజ్ఞాప్రకారము చేసెదను. (కూర్చుండును.)

కాంచు—"అదృష్టవశమున శత్త్రువులచే నపహరింపఁబడిన రాజ్యము మరలఁ జే జిక్కెన" దని సంతసించుచున్నాము. ఏలయన—

గీ. పంద లగువారియందు దుర్బలులయందుఁ
బరిభవ మొందు దుత్సాహంబు వసుధ నేల
నరయ నుత్సాహవంతులే యనుభవింత్రు
తఱుచుగా రాజ్యలక్ష్మిని ధరణియందు.

రాజు—ఇది యంతయు మహాసేనుని పరిభావమే.

మ. మును నన్నాతఁడు గెల్చి బిడ్డవలెనే పోషించి లాలించె నా
తనికన్యన్ గికురించి తెచ్చితిని కాంతం గావలేనైతిఁ దా
వినయుం బుత్త్రికచావు నెప్పటివలెన్ బ్రీతిన్ ననుం జూచు నా
యనయే హేతువు వత్స దేశము లిటుల్ స్వాధీన మిష్టాటకుఁ

కాంచు—ఇదే! మహాసేనుని సందేశము. అంగారవతీదేవి సందేశము నేదాది యెఱిగించును.

రాజు—హా! తల్లీ!

గీ. శోడశాంతఃపుర జ్యేష్ట శుద్ధచరిత
నగరసౌభాగ్యదేవత నయవిశాల
నాపరివాసంబుఁ దలఁపోసి నవయుతల్లి
కుశలముగ నున్నది గదమ్మ! కొఱంత లేక.

దాది__ఆదేవి కుశలముగా నున్నది. దేవరవారి సర్వగతకుశల మడుగుచున్నది.

రాజు__సర్వగతకుశలమా! అమ్మా! కుశల మీ విధముగానున్నది.

దాది__దేవరవా రీవిధముగా నతిమాత్రసంతాప మొందఁ దగదు.

కాంచు__దేవా! ఊఱడిల్లుము. ఈవిధముగా దేవరవారిచేత ననుకంప్యమాన యగువాసవదత్త మృతినొందియు బ్రతికి యున్నది. కాకపోయినను__

గీ. ఎవ్వఁ డెవనిఁ గావఁ గలఁడు మృత్యువేళఁ
ద్రాఁడు తెగఁ జేఁద నెవ్వఁడు దాల్ప నోపు
నడవివంటిది సుమ్మి యీయఖిలజగము
సారెసారెకుఁ బుట్టుచుఁ జచ్చుచుండు.

రాజు__అయ్యో! అట్లుకాదు. కాదు.

గీ. శ్రీమహాసేనపుత్రి నాశిష్యురాలు
ప్రాణసమ యయినప్రియురాలు పట్టమహిషి
తలఁప కుండంగ నామెను దరమె నాకు
నమిత దేహాంతరంబుల యందునైన.

దాది__మాదేవి యిట్లు మనవిసేయుమన్నది__"వాసవదత్తగతించినది. నీ వల్లుఁడ వయినను నాకును, మీమామగారికిని మా కుమారుఁ డయినఁగోపాలుఁ డెట్టివాఁడో నీవు నట్టివాఁడవే. అందుచేతనే మొదట నిన్నుజ్జయినికిఁ దీసికొనివచ్చి, వీణ నేర్పుటయను నెపమువెట్టి యనగ్నిసాక్షికముగా బిడ్డనిచ్చితిమి. నీమనశ్చపలతచేత వివాహమంగళమహోత్సవము కాకుండఁగనే కన్యాసమేతుఁడవయి వెళ్ళితివి. పదపడి చిత్రఫలకమునందు నీయొక్కయుఁ వాసవదత్తయొక్కయుఁ బ్రతికృతులు నిర్మింపజేసి వివాహమహోత్సవము గావించితిమి. ఆచిత్ర

ఫలక మిదిగో నీయొద్దకుఁ బంపితిమి దానిం జూచి సుఖపడుము."

రాజు—ఓహో! ఆపూజ్యురాలు కృప యుట్టిపడునట్లును దగినట్లును జెప్పినది.

గీ. అమ్మహాదేవి సెలవిచ్చినట్టిమాట
ప్రియము రాజ్యలాభములు నూటింటికంటె
నధికదోషంబుఁ జేయునాయందునయిత
మంతయనురాగమును నిల్పినందువలన.

పద్మా—ఆర్యపుత్రా! చిత్తరువులో నున్న గురుజనమును జూచి నమస్కరింపవలయు నని కోరుచున్న దానను.

దాది—భర్తృదారికా! చూడు చూడు (అని చిత్రఫలకమును జూపుచున్నది)

పద్మా—(చూచి తనలో) అహో! ఇది యచ్చముగాఁ బూజ్యురాలయిన యావంతికవలె నున్నది (ప్రకాశముగా) ఆర్యపుత్రా! ఈప్రతికృతి పూజ్యురాలయినవాసవదత్తపోలిక నున్నదా!

రాజు—పోలిక గాదు. ఆమెయే యని తలంచెదను.

గీ. సాటిలేనట్టి యీమేనిచాయ కకట!
యట్టిదారుణదురవస్థ యెట్టుగలిగె
నతివవదనమాధుర్యంబు నక్కటకట!
యెట్లు దహియించెనో యగ్ని యెఱుఁగరాదు.

పద్మా—దేవరవారిప్రతికృతిని జూచి యిది వాసవదత్తరూపముతో సరిగా నున్నదో లేదో చెప్పఁగలను.

దాది—రాజపుత్రీ! చూడు! సరిగాఁ జూడు!

పద్మా—(చూచి) మీబొమ్మ మీరూపమునకు సరిగా నుండుటచేత

వాసవదత్తప్రతికృతియు నామెరూపమునకు సరిగా నుండుటకు సందేహము లేదు.

రాజు—దేవీ! చిత్తరువును జూచినది మొదలు ఖేదమోదములు రెండింటితోఁ గూడినట్లు కనుపడుచుంటి వేమి?

పద్మా—ఆర్యపుత్రా! ఈప్రతికృతిలో సరియయినరూపముగల స్త్రీ యిక్కడనున్నది.

రాజు—వాసవదత్త కాదు గద!

పద్మా—ఏమో!

రాజు—అట్లయిన నామెను శీఘ్రముగా రప్పింపుము?

పద్మా—ఆర్యపుత్ర! నేను కన్య నయి యుండినకాలమున నొకానొక బ్రాహ్మణుఁడు "ఈమె నాచెల్లెలు, ప్రోషితభర్తృక, పరపురుషుని జూడ నొల్లదు." అనిచెప్పి యామెను నాయొద్ద న్యాసముగా నుంచెను. కాఁబట్టి యామెను నాతోఁగూడఁ దీసికొనివచ్చెదను. అప్పుడు మీరు చూచి తెలిసికొనవచ్చును.

రాజు—గీ. చెలియ నిజముగా విప్రునిచెల్లెలైన
స్పష్టముగఁ బరస్త్రీ యంచుఁ బలుకవచ్చుఁ
జిత్రముగ నప్పుడప్పుడీ ధాత్రియందు
మానిసినిఁ బోలుమానిసి గానఁబడును.

ప్రతీ—(ప్రవేశించి) దేవా! జయము! ఉజ్జయినీనివాసి యగు బ్రాహ్మణుఁ డొకఁడు దేవిగారిహస్తమునందుఁ దనచెలియ లనిచెప్పి యొకస్త్రీని న్యాసముగా నుంచినాఁడఁట. ఆన్యాసము నిప్పుడు తిరిగి పుచ్చుకొనుటకు వచ్చి ద్వారముననున్నాఁడు.

రాజు—పద్మావతీ! ఇతఁడా బ్రాహ్మణుఁడా.

పద్మా—కావచ్చును.

రాజు—అభ్యంతరసముదాచారము నడపి యాబ్రాహ్మణుని శీఘ్రముగాఁ బ్రవేశపెట్టుము.

ప్రతీ—దేవరవారి చిత్తము. (నిష్క్రమించును.)

రాజు—పద్మావతీ! నీవును వెళ్ళి యామెను దీసికొనిరమ్మా?

పద్మా—దేవరవారియాజ్ఞాప్రకారముచేసెద. (వెళ్ళుచున్నది)

(అప్పుడు ప్రతీహారియు యౌగంధరాయణుఁడును బ్రవేశించుచున్నారు.)

యౌగం—(తనలో) అహో!

గీ. మనుజపతిహితార్థము పట్టమహిషిఁ దాచి
యతనికి హితంబుఁ జేసితి నంచు నెఱిఁగి
కార్యసిద్ధిని గనియు నీయాత్మ లేందురి
జే మనునో యంచు శంకింతు హృదయమందు.

ప్రతీ—వారె! మహారాజుగారు సమీపమునకు దయచేయుఁడు.

యౌగం—దేవా! జయము! జయము!

రాజు—ఈస్వర మెప్పుడో విన్నట్లున్నది ఓబ్రాహ్మణుఁడా! నీ చెల్లెలిని బద్మావతీహస్తమందు న్యాసముగా నుంచితివా?

యౌగం—ఔను. ఉంచితిని.

రాజు—అట్లయిన నీతని చెల్లెలిని వేగముగాఁ దీసికొనిరండు.

ప్రతీ—చిత్తము. (అనివెళ్ళును.)

(అప్పుడు ఆవంతిక, పద్మావతి, ప్రతీహారి ప్రవేశించుచున్నారు.)

పద్మా—అమ్మా! రమ్మా! రమ్మా! నీకుఁ బ్రియము చెప్పెదను.

ఆవంతి—ఏమి, యేమి?

పద్మా—నీయన్నగారు వచ్చినారు.

ఆవం—సంతసమె! ఆయన కిప్పటికయిన జ్ఞప్తికి వచ్చినది.

పద్మా—ఆర్యపుత్రా! జయము! జయము! న్యాసముగా నుంచఁబడినయామె యిదిగో!

రాజు—పద్మావతి! న్యాసమును సాక్షులయెదుట నీయవలయును. ఈ రైభ్యగోత్రుఁడును నీవసుంధరయు సాక్షులు కాఁగలరు.

పద్మా—అమ్మా! వసుంధరా! ఇదిగో నీపూజ్యురాలు

దాది—(ఆవంతికను నిరూపించి చూచి) అమ్మో! మాభర్తృదారిక వాసవదత్త.

రాజు—ఏమి! మహాసేనపుత్రి యగు దేవియా! అట్లయిన నీవు పద్మావతీసమేతవై యంతఃపురముఁ బ్రవేశింపుము.

యౌగం—వలదు. వలదు అంతఃపురము ప్రవేశింపఁ దగదు. ఈమె నాచెల్లెలు గదా!

రాజు—నీ వేమనియెదవు? ఈమె మహాసేనపుత్రి కాదా?

యౌగం—ఓ రాజా!

గీ. పరిభవ మొందితి భారతవంశమందు
నీతివిదుఁడవు విజ్ఞాననిధివి శుచివి
దృఢమతివి రాజధర్మోపదేశకుఁడవు
పరసతిని బల్మిచే నిట్లు పడయఁ దగదు.

రాజు—సరే! అట్లయిన రూపసాదృశ్యమును జూతము. యవనికం దొలగింపుఁడు.

యౌగం—స్వామీ! జయము! జయము?

వాస—(తెరఁ దొలఁగించి) ఆర్యపుత్రా! జయము! జయము!

రాజు—అహో! ఈయన యౌగంధరాయణుఁడా! ఈమె మహాసేనపుత్రియా! (ఇద్దఱను గౌఁగలించుకొని)

క. ఇది కలయా, నిజమా! యా
సుదతినె వెండియును నేను జూచితి నిట నీ
ముదితయె యీగతిఁ గనఁబడి
యదయత ననుఁ గన్నుఁ బ్రామి యౌనా, డటిగెన్.

యౌగం.—స్వామీ! దేవినిఁ దాఁచి నేను దేవరవారియెడ మహాప రాధము చేసితిని. కావున దేవరవారు నన్ను క్షమింప వేఁడు చున్నాఁడను.

(అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు)

రాజు.—(లేవనెత్తి) ఓయీ! నీవు యౌగంధరాయణుఁడవా?

మ॥ కపటోన్మాదములన్ నటించియును, సంగ్రామంబులం జేసియుం
జపముల్ సల్పియుశాస్త్రదుష్టములుమంత్రంబుల్ప్రయోగించియున్
విపదంభోధినిముఁజ్జు మాకుల మముస్ వేమాఱు యత్నంబులం
గృపతోఁ జేసి సముద్ధరించితివిగా నీమేలు సామాన్యమే॥

యౌగం.—మేము స్వామిభాగ్యమునే యనుసరించి పోవువారము.

పద్మా.—ఓహో! ఈమె పూజ్యురాలయిన వాసవదత్త. అమ్మా! సఖీజనవ్యాపారములయందు నిన్నుంచి నేను సముదాచారము దాఁటి తప్పుజేసితిని. కాఁబట్టి తలవంచి వేఁడుకొందును. క్షమియింపుము.

వాస.—(పద్మావతిని లేవనెత్తి) సౌభాగ్యవతి! లెమ్ము లెమ్ము న్యాస మని పేరువడసిన నాశరీరమే యపరాధము చేసినది. తప్పు నీదికాదు.

రాజు.—వయస్య! యౌగంధరాయణా! దేవిని దాఁచుటలో నీయభి ప్రాయ మేమి?

యౌగం.—కౌశాంబీనగరమును మఱల సంపాదింపవలయునని.

రాజు.—పద్మావతిహస్తమం. దీమెను న్యాసముగా నుంచుట కేమి కారణము?

యౌగం.—పద్మావతి మీకు దేవి యగునని పుష్పకభద్రాదులయిన యాదేశికులు సెలవిచ్చిరి.

రాజు.—ఇది రుమణ్వంతుఁడు కూడ నెఱుఁగునా?

యౌగం.—స్వామీ! అంత తెలుఁగుదురు.

రాజు.—అహో! రుమణ్వంతుఁ డెంత మోసఁగాడు.

యౌగం.—దేవా! వాసవదత్తాదేవి కుశలముగా నున్నదనుశుభవార్త దెలియఁజేయుట కిప్పుడే రైభ్యుఁ డయిన యీకాంచుకీయుని వసుంధరను మహాసేనునియొద్దకుఁ బంపుఁడు.

రాజు.—వాసవదత్తా పద్మావతీ సమేతులమయి మన మందఱము గూడనుజ్జయినికిఁ బోవుదము.

(భరతవాక్యము.)

క॥ జలనిధిపర్యంతంబై
వెలయుచు నేకాతపత్రభృతమై సీతా
చల వింధ్యకుండలం బగు
నిల ధృతి మారాజసింహుఁ డేలెడుగాత॥

(అందఱును నిష్క్రమించు చున్నారు.)

ఇది షష్ఠాంకము.

స్వప్నవాసవదత్తనాటకము.

సమాప్తము.

# అవిమారకము

## ప్రథమాంకము.

(నాంద్యంతమందు సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సీ. జలధితోయమునుండి సానుకంపంబుగాఁ
జమ్మంగఁ బడి నిల్చి కొమ్ముచివర
నలకాల నిమిడి యాహతదైత్యవర్గమై
యాక్రమింపఁ బడి యాజియందు
రక్షింపఁబడిన సుదర్శనచక్రమహిమచే
భుక్తమై కడుఁ బ్రీతిపూర్వకముగ
నిరుపమధీరత నిజబాహువశమయి
యుచ్ఛ్రితైకాతపత్రోజ్వల మయి
తే. గీ. దనరువసుమతీమండలి దయ దలిర్ప
నోసఁగుఁ గావుత మీకు దామోదరుండు
రాక్షసారాతి యాదినారాయణుండు
సచ్చిదానందనిలయుండు సర్వవిభుఁడు.

(తెరవంకజూచి) ఓసీ! యిటు రా

(నటి ప్రవేశించి)

నటి—అయ్యా! ఇదిగో వచ్చితిని.

సూత్ర—ఓసీ! కుతూహలముచేత నీమొగంబునఁ బొడచూపుచున్న చిరునవ్వు నీమనోగతమైన భావము నివేదించుచున్నట్లున్నది. ఏదో చెప్పఁ దలఁచుకొన్నావుకాదా.

నటి—మీరు భావజ్ఞు లగుటలో విస్మయ మేమున్నది.

సూత్రి—అటులయిన నీయిష్ట మేమో చెప్పుము.

నటి—నేను మీతోఁ గలిసి యుద్యానవనమునకుఁ బోఁ గోరు చున్నాను. అక్కడఁ జేయవలసిన నియమకార్య మొకటి నాకుఁగలదు.

(తెరలో)

భూతిక! కురంగీరక్షణార్థము నీవుఁగూడ నుద్యానవనమున కరుగుము. అంజన గిరియను నేనుఁగు మదించి చరించుచున్నది.

సూత్రి—ఓసీ రాజపుత్రిక యుద్యానవనమున కరిగినదన్న మాట విన్నావుకదా అందువలన నిప్పు డుద్యానవనమున నన్నిదెస లను రాజభటపరిగుప్తము లై యుండును రాజపుత్రిక వెడలిపోయిన తరువాత మనము యథేచ్ఛముగ వెళ్ళవచ్చును.

నటి—సరే! మీచిత్తమువచ్చినట్లు చేయుదము.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

ఇదిస్థాపన

(అప్పుడు రాజు సపరివారముగఁ బ్రవేశించుచున్నాఁడు)

రాజు—

చ. సవనము లెన్నొ జేసితిఁ బ్రసన్నులు నాయెడలన్ మహీసురుల్
చవిఁగని రాజులో భయరసంబును మత్తనృపాలు రెల్ల నా
కవిరళభూతి యున్న మది హర్షములే దొకయింత యేల వై
భవములు కూఁతులం గనినవారలకుం బహుచింతలే సుమీ.

కేతుమతి! నీవు పోయి దేవిని బిలిచికొని రమ్మా.

ప్రతీహారి—దేవా! చిత్తము (అని నిష్క్రమించును.)

(అప్పుడు సపరివారముగ దేవి ప్రవేశించుచున్నది)

దేవి—మహారాజ! జయము. జయము.

రాజు—దేవీ! నీముఖము నిత్యప్రసన్న మయినను నేఁ డత్యంత ప్రసన్నమయి యున్నది. . ఈమహర్షమునకుఁ గారణ మేమి.

దేవి—దేవ! మనకురంగినిమిత్తము దూత వచ్చినాఁడని మీరే సెలవిచ్చితిరిగదా. అందుచేత నచిరకాలములోనే యల్లుని జూడఁ గలుగుదు నని సంతోషించుచున్నాను.

రాజు—ఆ! అదికూడ నిజమే అయినను నిశ్చయము కాలేదు రమ్మా. ఇటు కూర్చుండుము.

దేవి—దేవా చిత్తము. (అని కూర్చుండును )

రాజు—దేవీ! వివాహము లనఁగా బహువిధములఁ బరీక్షించి చేయఁదగినవి. ఎందుచేతననఁగా,

తే. గీ. అల్లునిగుణంబు లించుకే నరయకుండఁ
దనదునభిలాషకై తండ్రి తనయ నొసఁగ
నది కులద్వయంబును మాపు మదముచేతఁ,
గూలయుగముఁ బొంగినయేఱు గూల్చునట్లు.

ఏదో చప్పుడువలె నున్నది. అది బహుకారణములవల్ల కావచ్చును.

తే. గీ. దూరపుది మైనబహుజనోద్భూత మగుట
దగ్గరది వోలె నున్న దీధ్వని సహసి
కారణము లుండు దీనికిఁ గానియేమొ
మాకురంగికి శంకించు మనసు కీడు.

దేవి—అమ్మో నాకూఁతు రుద్యానవనమున కేగినది.

రాజు—ఎవఁడురా అక్కడ.

(భటుఁడు ప్రవేశించి)

భటుఁడు—మహారాజా! జయము ఆర్యకౌంజాయనుఁడు దేవర వారితో నేదో మనవి చేయుటకు వచ్చినాఁడు.

రాజు—త్వరగాఁ బ్రవేశపెట్టుము.

భటుఁడు—చిత్తము దేవా! (అని నిష్క్రమించును)

(అప్పుడు కౌంజాయనుఁడు ప్రవేశించుచున్నాఁడు).

కౌంజా—(నిర్వేదముతో) అహా! మంత్రిత్వ మెంతకష్ట కార్యము ఎందుచేతనన,

మ. ఘనకార్యంబులు సిద్ధిగన్న యెడలన్ క్ష్మాభర్త దాఁబ్రజ్ఞ,యే
పనులైనన్ జెడెనా యమాత్యునిది లోపం బంద్రు, సన్మంత్రులం
చును విఖ్యాతిని గాంచు మెల్లయెడలన్ శోభిల్లి భూపాలదం
డనముం గాంతురు చిన్నతప్పులకె కట్టా! మందభాగ్యుల్ జనుల్.

జయసేన! మహారాజు గారెక్కడ నున్నారు? ఏమనుచున్నావు ఉపస్థాన గృహమం దున్నా రనియా? అట్లైన నది నిశ్శంకముగాఁ బ్రవేశింపఁ దగినచోటు (నడచి సంభ్రమముతో) దేవా! అనుగ్రహిం పు మనుగ్రహింపుము.

రాజు—తొందరపడకు. తొందరపడకు. సుఖముగాఁగూర్చుం డి వృత్తాంతముఁజెప్పుము.

కౌంజా—దేవా! చిత్తగింపుఁడు. రాజపుత్రికతోఁగూడ నుద్యానవనమునకుఁ బొమ్మని దేవరవారు నన్నాజ్ఞాపించిరి గదా.

రాజు—అట్లు చెప్పినమాట నిజమె ఇప్పు డేమి?

కౌంజా—అట్లు రాజపుత్రిక యుద్యానవనమున కరిగి యథా సుఖముగా నాడుకొని మరలివచ్చుచుండఁగా దాసదాసీజనుల గొడవ లును నవ్వులును విని బెదిరి ఘోరబృంహితము సేయుచు స్రవించు మద జలవర్షముచేత మొగమెల్ల దడియ మావటీని నేలం గూల్చి చమిరి మునుకు నైచిన తెరంగున మన్నుమేసంగ్రమ్మ నవ్యక్తభీమమూర్తి యై మూర్తీభవించిన వాయుదేవుఁడోయన తనలఘుప్రచారము దృ ష్టాదృష్టమై యుండ దేవరవారి మంత్రులయందు నింత నారోపింపఁ దలచుకొన్నదియుంబోలె నొకానొకపురుషునకు మాత్రము ప్రతిష్ట గలిగింప నిశ్చయించుకొన్నదియుంబోలె, దుర్మదాంధమై యొక్క దంతానశమందుఁ బ్రవేశించెను.

రాజు—గ్రంథవిస్తర మటుండనిచ్చి ముందిది చెప్పు కురంగి కుశలముగ నున్నదా?

కౌంజా—దేవరవారి యదృష్టము మిక్కిలి మంచిదైనప్పుడు కుశలముగా నేల యుండకపోవును.

రాజు—అమ్మయ్య. అదృష్టవంతుఁడనె. ఇప్పుడు వృత్తాంతము నీయిష్టము వచ్చినట్లు జెప్పు.

కౌంజా—అనంతరము ప్రాకృతజను లందఱుఁ బరుగులెత్తిరి. స్త్రీలు హాహాకార మాత్రముచేతనే ప్రతీకారము చేసిరి. కొందరు పురుషులు చచ్చినవారివెనుక దాగొనిరి. నీతిగుప్తుఁడ నయిననేను ద్వారమందు నిలిచి యుద్యానవనమునకుం గొంపోఁబడిన సమస్తోప కరణములు సరిగా నున్నవో లేవో యని పరీక్షించుచుంటిని. అంత లో నాగజము రాజపుత్రిక పల్లకిమీఁదికే వెళ్ళెను.

 

దేవి—అమ్మా ఇటమీఁద నేమగునో గదా.

రాజు—అప్పుడు కురంగి కెవ్వరు దిక్కైనారు

కౌంజా—అప్పు డొకదర్శనీ—(సగముచెప్పి యూరకుండును)

రాజు—ఇప్పుడు యథేష్టముగాఁ జెప్పు. మహాపదలు పరిహారములు లేనివికదా!

కౌంజా—అప్పుడొకానొకపురుషుఁడు మిక్కిలి దర్శనీయుఁడయ్యు విస్మితుఁడు గాక తరుణవయస్కుఁడయ్యు నహంకారభావములేక శూరుఁడయ్యు దాక్షిణ్యవంతుఁడై సుకుమారుండయ్యు మహాబలవంతుఁడై మదగజంబుబారిం బడుటకు సిద్ధముగానున్న రాజపుత్రికకుఁ దత్కాలదుర్లభమగు నభయంబు నొసంగి నిశ్శంకముగ నాగజేంద్రముతోఁ దలపడెను.

రాజు—అతనిఋణము మన మెన్నఁడుఁ దీర్చికొనలేము. తరువాత తరువాత.

కౌంజ—అంతట నాదుష్టగజ మతని సలలితసరభసకరతలతాడనంబులఁ గడుంగడు రోసముం బూని వెంటనే రాజపుత్రిని విడిచి వానిం జంపఁ దలఁచి యాతని సంకకు మరలెను.

దేవి—అతనికిఁ గుశల మగుఁగాక.

రాజు—తరువాత తరువాత.

కౌంజ—అనంతర మక్కడికి వచ్చినభూతికుఁడును నేనునుం గలసి రాజపుత్రికను వెండియుఁ బల్లకిలోఁ గూర్చుండఁ బట్టి త్వరితముగఁ దోడ్కొనిపోయి కన్యాంతఃపురమునఁ బ్రవేశపెట్టితిమి.

రాజు—అహా! ఇదియెంతో గొప్పప్రమాదముగదా. సరె భూతికుఁ డెందుచేత రాలేదు?

కౌంజ—"ఓయి! నీవుపోయి యీవృత్తాంతము రాజుగారికివి

స్నవింపుము. నేనాపురుషుని ప్రవృత్తిని వంశమును గనుఁగొని శీఘ్రముగ మరలి వచ్చెద" నని భూతికుఁడు నాతోఁ జెప్పిపోయెను.

రాజు—అట్లయిన భూతికుఁడు సర్వము పరీక్షించి వచ్చునా? కౌంజాయనా పరవ్యసనములఁ జూచి సహింపలేక సహాయము జేయునట్టి యాపురుషుఁడేకులమున జనించెనో యెఱుఁగుదువా ?

కౌంజా—స్వామీ ! నేను కడజాతివాఁడనని యతఁడెందుచే తనోతన్ను గప్పిపుచ్చుకొనుచున్నాఁడు.

దేవి—మహారాజ! కులీనుఁడు గానివాఁడట్టి దయాళువు కాఁగలఁడా

రాజు—కాని మాట యథార్థము.

(అప్పుడు భూతికుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భూతి—(విస్మయముతో) అహో ! భూమి ప్రచ్ఛన్న రత్నమయియున్నది కదా. ఆపురుషుని నిర్వ్యాజ విక్రమముచేత మానధనుల విక్రమబుద్ధులు మందీభూతము లయినట్లున్నవి. నాకొక్క సంశయము కలదు. ఎందుచేత నతఁడు తన్ను దనవంశమును గప్పిపుచ్చుకొనుచున్నాఁడు? ఐన నేమి. ఎవ్వఁడు సూర్యుని హస్తముచేత నాచ్ఛాదింపఁగలఁడు.

చ. గురుజనశాసనంబునను గోప్యము లైనస్వకీయకారణాం
తరముల మారువేసములు దాల్చి చరింతురు సజ్జనుల్ భువిన్
బరులకు నాపదల్ పొడమ పట్లను దొంటిప్రతిజ్ఞ లన్నియున్
మరచుచు వ్యక్తు లయ్యెదరు మానవకోటికి మేలు సేయఁగాఁ.

జయసేన! ప్రభువు వారెక్కడనున్నారు? ఏమనుచున్నావు—ఉపస్థానగృహమందున్నా రనియా? అది నిశ్శంకముగాఁ బ్రవేశింపఁదగిన చోటు ఇదే ప్రవేశించెదను. (ప్రవేశించి) అహో! ఈమహారాజుగారు దేవీసమేతు లైయున్నారే. (సమీపించి) మహారాజ!జయముజయము

రాజు.—దేవీ! నీ వభ్యంతరమందిరముఁ బ్రవేశించి కురంగి నూరార్పుము. నేను వెంటనే వచ్చెదను.

దేవి—దేవరవారిచిత్తము (నిష్క్రమించుచున్నది.)

రాజు—పరోపకారార్థము తనశరీరము దాఁచుకొనని యామహాపురుషుని వృత్తాంతమేమి?

భూతి—దేవ! అవధారు. అతఁడొక్కముహూర్తమనానరము గా నత్వరితముగా నలలితముగామిత్రునితో నాడినచందంబున నామదపుటేనుఁగుతో నాడి నివర్తనానువర్తనాదిగతి విశేషంబులచే దానిని భ్రమింపఁజేసి యాపనిచేత సిగ్గుపడినవాఁడుంబోలె మహాజనులు తన్నుగూర్చి సేయుప్రశంసను సహింపక తలవంచుకొని యథేచ్ఛముగఁ దననివాసమునకుం జనియెను.

రాజు—ఓహో! సంతోషించితిని. ఇదినాకు రెండవలాభము.

భూతి—తదనంతర మాఁడుయేనుఁగులం గొన్నిఁటిని దోడ్కొనిపోండు. యామదగజంబును మెల్లమెల్లగా ననునయించి గజశాలం బ్రవేశపెట్టి నే నాపురుషుని ప్రవృత్తిని వంశమును నన్యాపదేశమునఁ దెలిసికొనుటకుఁ బోయితిని.

రాజు—పిమ్మట నీవేమినిశ్చయించితివి? అతఁ డంత్యజుఁడని యిదివఱకు మేము వినియుంటిమి.

భూతి—పాపము శమించుఁగాక ! శమించుఁగాక ! అతఁడట్టివాఁడు కాఁడు. ఏదో కారణముచేత నతఁడుతన్నుఁదనవంశమును గప్పిపుచ్చుకొనుచున్నాఁడు.

రాజు—నీవు పరీక్షించితివా ?

భూతి—పరీక్షించుట కేమున్నది ?

ఉ. రూపము దివ్యరూప మగు రూఢిగవాక్కులు బ్రహ్మవాక్కులు
దీపితసౌకుమార్యమును దేజము శక్తియు శౌర్యముల్ సుమీ

యీపలుకే యథార్థమగునేని యతం డొకమాలయేని నా
నాస్పృథుశాస్త్రమార్గముల నామపరిశ్రమ నిష్ఫలం బగున్

రాజు.—అతనికి భార్య యున్నదా?

భూతి.—అంతయుఁ గలదు. కళత్రమును నేను స్వయముగా వెళ్లిగిచూడలేదు.

రాజు—పరస్త్రీదర్శనము జేయఁ గూడదు. గనుక నీవు కళత్ర విషయము కనుఁగొనలేమ సరే. అతనితండ్రినేల నీవుపరీక్షింపలేదు!

భూతి—సత్పుత్రసంపన్నుఁ డైనయతనిదర్శనము జేసితిని. యతఁడు,

శా. వ్యాయామస్థిరదీర్ఘపీనభుజుఁడున్ జ్యాఘాతసంకల్పిత
స్ఫాయత్ తీవ్రకిణప్రకోష్ఠుఁడును నై ప్రచ్ఛన్నుఁ డైయుండియున్
జ్ఞేయుం డయ్యెను రాజచిహ్నములచేఁ జెన్నొందుటన్ దోయద
చ్ఛాయన్ డాఁగిప్రభానుమేయుఁ డగుభాస్వంతుండువోలెన్నృపా.

రాజు—ఈప్రసంగము చాలును. మరల బరీక్ష సేయుము.

భూతి— దేవరవారి యాజ్ఞాప్రకారము చేసెదను.

రా—ఇప్పుడు కాశీరాజుదూతనుగూర్చి యేమి చేయ వలయును?

భూతి—స్వామీ! దూతలు నూరుమంది వచ్చుచుందురు. పోవుచుందురు.

తే. గీ. ఇందుఁ గర్తవ్య మొకటి లే దెంచిచూడ
వసుధఁ గన్యాపితృత్వంబు వంద్యము సుమి
రాచకన్నెల నాశింతురు రాకొమరులు
జయపతాకంబు మల్లులసమితి వోలె.

రాజు—అందలి యభిప్రాయ మేమి?

భూతి—ప్రీతిచేతను మోమోట ముండఁ గూడదు. గుణ బాహుళ్యమును సమయౌచిత్యమును, నుత్తరకాలస్థితిని జక్కఁగాఁ బరిశీలించి వేగిరపాటును దీర్ఘసూత్రత్వమును విడిచి దేశకాలముల కవిరోధముగాఁ గార్యము సాధింపవలయు నని దానియభిప్రాయము.

రాజు—భూతికుఁడు లెస్సగాఁ జెప్పినాఁడు. కౌంజాయన! ఏల నీ వూరకుంటివి ?

కౌంజా—స్వామీ! క్షత్రియు లనేకు లున్నను పూర్వసంబంధవిశేషముండుటచేతను దేవరవారికి భగినీభర్తలగుటచేతను కాశీరాజ సౌవీరరాజులు సమానులు. మనకు సంబంధయోగ్యు లని దేవరవారిదివఱకే తలంచుచున్నారు. ఆయిరువురలో సౌవీరరాజు మును పొకసారి తనపుత్రున కమ్మాయి నిమ్మని దూత నంపినాఁడు. కన్యమిక్కిలి చిన్నది. ఇప్పుడు తొందర యేమి యని యేదో వంక బెట్టి మన మాదూతను బూజించి సగౌరవముగాఁ బంపితిమి. ఇప్పుడు కాశిరాజు బిడ్డను దన కుమారున కిమ్మని దూత నంపినాఁడు. ఈవిషయమున బలాబలవిచారణలో దేవరయే ప్రమాణము.

రాజు—కౌంజాయనుఁడు చక్కఁగాఁ బలికినాఁడు. భూతిక సకలరాజమండలముమాట యటుంచి యిప్పుడు నిరూపింపఁబడిన యీయిరువురిలో నెవరికడ విశేష మున్నది?

భూతి—వారుమహారాజులు. భృత్యుల మయినమేము వారి యోగ్యతాయోగ్యతల నెంచి చూపింపఁ గూడదు. దేవరవారి మంత్రులకు దేవరవారే యధికారులు.

రాజు—ఉపచారవాక్యములు చాలును. నిశ్చయ మేదో తెల్పుఁడు.

భూతి—ఇప్పుడు దేవరవారి కడ్డు చెప్పఁగూడదు. సౌవీరరాజ

కాశీరాజులు భగినీభర్తలగుటచే దేవరవారికి సమానులు. అందు సౌవీరనాథుఁడు దేవిగారికి సోదరుఁడగుటచేత గుణాధికుఁడు.

రాజు—నీవు నాసంకల్పమున కనుకూలముగ నే పలికితివిగదా?

భూతి—నేను రెండువిధములచేత ననుగ్రహింపఁబడితిని.

రాజు—ఓయీ సౌవీరరాజు మరల మనకడకు దూత నేల పంపలేదు.

భూతి—ఆవిషయమున నాకును నించుకసందేహము కలదు. లెస్సగాఁ బరీక్షించి చెప్పవచ్చు నని నే నింతవఱకు మాటాడలేదు.

రాజు—ఆయన కుశలియై యున్నాఁడా?

భూతి—వేఁగులవాండ్రిట్లనుచున్నారు.

తే. గీ. పుత్రిసహితుఁడై యారాజు పోయె నెటకొ
జరుపుచున్నారు కార్యముల్ సచివు లరసి
రాజగృహము ప్రవేశింప రాదు గాన
నేమి హేతువో యీస్థితి కెరుగరాదు.

రాజు—ఇందుకుఁ గారణ మేమిచెపుమా?

మ. కడుఁ గామాతురుఁడై యమాత్యతతిచే గాసిల్లి బంధింపఁగాఁ
బడెనా దారుణరోగసంకలితుఁడై ప్రాణంబులం బాసెనా
జడుఁడై బ్రాహ్మణశాపముం బడసి నిష్టన్ శాంతులం జేయునా,
విడువంగాఁ బని యేమి గేహమును బృథ్వీభర్త యీరీతిగన్.

ఈవృత్తాంతము బరీక్షించి శీఘ్రముగ రమ్ము.

భూతి—దేవరవా రాజ్ఞాపించినట్లు జేయుదును.

రాజు—కౌంజాయన! ఇప్పుడు కాశీరాజదూత విషయమున నేమి జేయవలయును.

కౌంజా—అట్లైన మనము కాశీరాజదూతను బూజించి పంపవము. వివాహములు బహుముఖములు కావున వానిని యథేష్టముగ సాధింపవలయును.

రాజు--అహో! అమాత్యులబుద్ధి కార్యమునేగాని, స్నేహము నపేక్షింపదు.

(తెరలో)

స్వామీ! జయము. మహారాజ! జయము. పదినాళికలైనవి

భూతి—స్వామి! స్నానవేళ యతిక్రమించుచున్నది. తక్కిన విషయ మంతఃపురమం దాలోచింతము. మీరుఁగూడ సమ్మాన్యయి గారి నోదార్పవలెను. దేవిగారుగూడ మీకొఱ కెంతో సేపునుండి యెదురు చూచుచుందురు. మహాజనులును నీ యుపదర్శనమునందు దేవరవారిని జూడఁగోరుచున్నారు.

రాజు—అహో! రాజ్య మత్యంతభార మైనదిగదా.

సీ. ధర్మంబు మునుముందుఁ దలపోయవలయును
మంత్రిని గనిపెట్టి మసలవలయు
రాగరోషములు ధీరత దాచవలయును
నీలోకవృత్తంబు నెఱుఁగవలయుఁ
చారనేత్రముల దేశము జూడవలయును
బాటింప వలయును బ్రజలసుఖము
ఆత్మరక్షణ సేయ నగుఁ బ్రియత్నముచేత
భండనంబున నది పనికిరాదు.

తే. గీ. మృదుపరుషగుణంబులు కడు మెలపుతోడఁ
గాలయోగంబుచేఁ బ్రయోగంబు సేసి
పాలనము సేయవలయు భూపాలుఁ డెప్పుడు
నిత్యధర్మతత్పరుఁడైన నృపుఁడు వెలయు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ప్రథమాంకము

# అవిమారకము.

## ద్వితీయాంకము.

(అప్పుడు విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విదూ——అహో! రాజకుమారు లవస్థావిశేషంబుల నెఱుఁగరు కదా. అందుచేతనే పూజ్యుఁడయిన యవిమారకుఁడు ఋషిశాపంబువలనఁ గలిగినకులభ్రంశమును జండాలకులపరివాసమును దన విజ్ఞానమును గురుజనంబును లెక్కసేయక హస్తిసంభ్రమదివసంబున నెప్పుడు కుంతిభోజపుత్రిక యయినకురంగి కంటఁ బడినదో యప్పటినుండియు మారిపోయి క్రొత్తవాఁడయిన ట్లున్నాఁడు. ఇహిహిహిహి పలుమాట లేల? నాతోఁగూడ గోష్ఠి గట్టకున్నది. ఎల్లప్పుడుఁ జింతించుచు నభిరమించును. అనర్థము లొక్కటొక్కటిగ రాక గుంపులు గూడి వచ్చు ననులోకోక్తి నిక్కమే కదా. ఇం దేమిసంబంధ మున్నది. ఆచిన్నది మహారాజపుత్రిక. నేను మాలవాఁడ నని చెప్పుకొనుచున్నాఁడితఁడు. అంతవఱకు నేను బ్రాహ్మణనింద దప్పించుకొనుటకై బ్రాహ్మణులగృహములలోనే తిరుగుచు మా రాజకుమారుని బసకుఁ బ్రచ్ఛన్నుఁడ నయి పోవుచున్నాఁడను.

(అప్పుడు చేటి ప్రవేశించుచున్నది.)

చేటి——అవస్థ లీవిధముగ మాఱిపోవుటచే రాజగృహంబున నాకుఁ బని విశేషముగ లేనందున నగరము జూడ వచ్చితిని. అదిగో ఆర్యసంతుష్టుఁ డిటే వచ్చుచున్నాఁడు. మంచిది కొంచెము సేపితనితో వేళాకోళ మాడి వినోదించెదను. ఓసీ! కౌముదిక! బ్రాహ్మణుఁడు దొరికినాఁడా? ఏమనుచున్నావు —దొరకలేదనియా.

విదూ——చంద్రికా! ఏమి టది.

చేటి——అయ్యా! బ్రాహ్మణునికొఱకు వెదకుచున్నాను.

విదూ——బ్రాహ్మణు డెందుకు?

చేటి——వేఱుపని యేముండును, భోజనమునకుఁ బిలుచుటకు.

విదూ——ఓసీ! నే నెవఁడను, బ్రాహ్మణుఁడను గానా?

చేటి——నీవుబ్రాహ్మణుఁడవే గాని వైదికుఁడవు గావు.

విదూ——ఎందువలన నేను వైదికుఁడను గాను? నేను పండితుఁడను గాననుకొన్నా వేమో చూడు. రామాయణ మనునాట్యశాస్త్ర మొకటి యున్నది. అందులోని వైదుశ్లోకములు నే నొక్కసంవత్సరములోపుగానే వల్లించితిని.

చేటి——ఎఱుఁగుదు నెఱుఁగుదును. ఈయఖండమయిన తెలివి మీకే గాదు మీకులమువారి కందఱకుఁ గలదు.

విదూ——కేవలము శ్లోకములే గావు. అర్థముకూడా వల్లించితిని. మరొకవిశేషము. అక్షరములునేర్చి యర్థముగూడ నేర్చినబ్రాహ్మణుఁడు దొరకుట కష్టము.

చేటి——అట్లయిన దీనిమీఁదనున్నయక్షరము లేవో చెప్పుము

(అని యుంగర మిచ్చుచున్నది.)

విదూ——(తనలో) నాకక్షరములు రావు. ఏమిచెప్పుదును? అయిన నిట్లు చెప్పెదను. (ప్రకాశముగా) ఓసీ! ఆయక్షరము నాపుస్తకములో లేదు.

చేటి——అక్షరాలు రానివాఁడవుగనుక దక్షిణ లేకుండ వట్టి భోజనము చేసిపొమ్ము.

విదూ——సరె, సరె.

చేటి——అయ్యా! నీయుంగరము నేను గూడఁ జూచెదను. ఇమ్ము.

విదూ——చూడుచూడు, నాయుంగరము చూడఁ దగినదే.

చేటి.—(పుచ్చుకొని) అదిగో రాజకుమారుఁ డిటే వచ్చుచు న్నాఁడు

విదూ.—(వెనుకనై పుజూచి) ఏఁడీ ఏఁడీ. రాజకుమారుఁడు.

చేటి.—ఈమూఢబ్రాహ్మణుని బుట్టలోఁ బెట్టితిని. ఈయుం గర మీతని కియ్యక యీమనుష్యులగుంపులో దూఱి యీతని వంచించి నాలుగువీథులమొగలోఁ బడి పోయెదను.

(నిష్క్రమించుచున్నది.)

విదూ.—(అంతటఁజూచి) చందిరికా! చందిరిక! ఎక్కడ చందిరిక? అయ్యో! నన్నిది మోసపుచ్చినది. ఈదొంగదాసియొక్క నైజము నే నెరిగి యుండియు భోజనము పెట్టుదు నని యాస గొల్పుటచేత నమ్మి మోసపోయితిని. (నడచి) దీనిభోజనముగూడ వట్టి యబద్ధమే యని తోఁచుచున్నది. (ముందుజూచి) అన్నన్న! అదిపరుగెత్తిపోవుచున్నది. నిలునిలు దొంగదాసి! పారిపోకు. ఏమిది? నామాట వినిపించుకొనక యది పరుగెత్తుచునే యున్నది. నేనును బరుగెత్తెదను (పరుగెత్తిపోవును) కలలో నేనుఁగుచేతపట్టుపడినవానికాళ్లవలె నాకాళ్లు సాగక దిగఁబడిపోవుచున్నవి. అంటకుండలు కడుగునట్టి యీబానిస కూఁతురుయొక్క వృత్తాంతము రాజకుమారునితోఁ జెప్పెదను.

(నిష్క్రమించును)

ఇది ప్రవేశకము.

---

(అప్పుడు కూర్చుండి యవిమారకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

అవి.—

చ. ఎడపక కూడి స్వప్నముల, నేనికతుండపునీటితుంపరం
దడిసినమేనితో, భయమునం జలియించెడుగన్నుదోయితో

బెడఁ గగురాఫకన్నియను వెండియు మేల్కని పూర్వజన్మమున్
దడవెడుజాతివేత్తవలె దాని స్మరించెద మాటిమాటికిన్.

ఆహా! ఏమి యీయనంగునిబలము. ఎందువల్ల నన,

చ. అదిమొద లన్యరూపముల నక్కట చూడదు దృష్టి, బుద్ధియున్
ముదమును గాంచు, విహ్వలత బొందు స్మరించును మాటిమాటికిన్
వదనము చెందియున్నయది పాండుత, మేనుకృశించెడున్, బవల్
మదినసమానశోకమును మాపులు మోహము, బొందుచుంటిఁగా.

కాకున్నను బురుషుల కధైర్యము కూడదు. నేను సంకల్పించుకొలది మదను డంతకంతకు విజృంభించుచున్నాఁడు. అందువలన నేనింక మీఁద సంకల్పము మానెదను. (జ్ఞాపకముచేసికొని) ఆహాహా! ఏమియామె రూపసంపద! రూపమునకుఁ దగినయౌవనము, యౌవనమునకుఁ దగిన సౌకుమార్యము.

ఉ. చందురులోని మేలిరుచి చక్కనిముద్దియ యయ్యెనో ప్రతి
చ్ఛందముగా రచించెనొకొ చానలరూపులకున్ విధాత దీ
నిందరుణీతనూధరుని నీరధిశాయిని నాధునిఁ రమా
చందనగంధి బాసి నృపసద్మమునన్ వసియించుచున్నదో.

అయ్యో! ఏమి యామెనుగూర్చి నేను మరలఁదలపోయనారంభించితినే. ఇప్పుఁ డేమిచేయుదును? మనస్సుగూడ నాయిచ్ఛాప్రకారము నడుచుట లేదు ఇప్పుడు—

తే. గీ. కడుఁబ్రియత్నంబుచేతను క్షణము నేపు
తెఱవపైనుండి మనసును ద్రిప్పిన నది
తొల్లి యలవాటుపడినట్టితోవ కేగుఁ
డప్పువల్లనవడిన శాస్త్రంబులాగు.

మనస్సు జయింప శక్యము కాదు. ఆమెనే స్మరించెదను. అహో! అందఱి స్త్రీలయొక్క గుణము లొక్కచోట గుమి గూడినవి.

(చింతించుచుఁ గూర్చుండును)

(అప్పుడు దాదియు నళినియుఁ బ్రవేశించుచున్నారు)

దాది—(సవితర్కరముగ) అహో! కార్య మెంతదుస్సాధ్యముగా నున్నది. ఈలాగునఁ జేసినచో రాజగృహము దూష్యమగును. చేయనిచో నామె యవశ్యము విపత్తు నొందును నే నెన్నో యుపాయములు విచారించితిని ఆమె తనకోరికె నాకుసయితమిప్పటికిని జెప్పక దాఁచుచున్నది. పాపము! ఏమిదాచినది. అదిమొదలుకొని యామె పూలదండ దరికి రానియ్యదు, ఆహారమువమాట యెత్తనీయదు, ప్రియసఖులతో నిష్టాగోష్ఠిని మెలఁగదు; ఊరక నిట్టూర్పులు విడుచును; అసంబంధముగ మాటలాడును; ఏమిచెప్పుచున్నదో యెఱుఁగదు; తనలోఁదానెనవ్వుకొనును; ఒంటిగాఁ గూర్చుండి యేడ్చును ఏదోరోగమని వంకబెట్టుచుండును; చిక్కి శల్యమయినది. మేను పాలిపోయినది; ఒకటే నాశ్చర్యము; ఈవిధముగా నవస్థావిశేషముల నొందుచుండియు నామె సిగ్గుచేతను వెఱపుచేతను నిజకులాభిమానముచేతను బాలభావముచేతను గుట్టు వెలిపుచ్చి యొకరితో నైన నాలోచించి యెఱుఁగదు.

నళినిక—ఆలోచింపకేమి. నాతో నంతయుఁజెప్పుచునేయున్నది.

దాది—సఖీ! నీయభిప్రాయము నాకుఁ దెలిసినది. ఈయవస్థ నెఱిఁగి యామెనెట్లయిన నతనితోఁ గలుపవలసినదని.

నళి—అటువంటి గుణవిశేషములచేత వెలయుచున్న యతఁడు కులహీనుఁ డెట్లగును?

దాది—అదేసందేహము. దేవిగారి సమీపమున మంత్రులు చెప్పుచుండ వినియుంటిని. అతడు కులహీనుఁడు కాఁడనిచెప్పిరి. ఏదో కారణముచేత దుష్కులజుఁడనని పైకిఁ జెప్పుచున్నాఁడట.

నళి—ఎవఁడై యుండును జెప్పుమా?

దా__ఆసందేహము లేకపోయిన యెడల నిటువంటి మంచి గుణములు కలవాఁడెవ్వఁడు మనకల్లుఁడుగ లభింపఁగలఁడు.

(తెరలో)

చ॥ విభవము శక్తి రూపము వివేకము నుండిన నుండుఁ గాక దు
ర్లభములు వృత్తశుద్ధులు కులంబునఁ దక్కువ యైనవారియం
దభిమతసిద్ధిగా వినెద రాతనివంశము ప్రాప్త వేళలన్
శుభమగు నింక శంక విడి శుద్ధమనస్కత మీర లుండరే.

దాది__సఖి! ఆమా టెవరిది?

నళి__ఇక్కడ నెవరుఁ గనఁబడుట లేదు.

దాది__నామేను గరి పొడుచుచున్నది. ఇది నిశ్చయముగ దైవము చెప్పినమాట. నామాట తప్పదు. ఇది కేవలమానుషవాక్యము కాదు.

నళి__ఆతనివిషయమై కులసందేహము పోయినది. మనమాటచొప్పునసతఁడు నడచునా లేదా యనిసందియం పడుచున్నాను. అతనిని మోహింపఁ జేయఁగల జనము ధన్యమైనది. ఇన్నిమాటలేల? నిజముగ మదనదేవుఁడు సయితము రాజపుత్రికరూపముఁ జూచి సంతాప మొందును. కాఁబట్టి యితఁడుఁగూడ సంతాప మొందుచున్నాఁడని తలఁచెదను.

దాది__సఖి! యిదె యతనివాసము. ఆహా స్త్రీసంభ్రమదివసమున నిక్కడికే కదా వచ్చితిమి.

నళి__సఖీ! ఈద్వారముఖము ముగ్గులు మొదలయినవి పెట్టియుండుటచే దర్శనీయ మైయున్నది. రమ్ము ప్రవేశింతము.

దాది__సఖి! ఏఁడీ రాజకుమారుఁడు. ఏమనుచున్నావు ? చతుశ్శాలయందున్నాఁ డనియా. ఇదిగో! రాజకుమారుఁ డొంటిగఁ గూర్చుండి యేమోచింతించు చున్నాఁడు.

నళి—సఖీ! ప్రవేశింతము.

దాది—ఇట్లుచేయుదము. (ప్రవేశించి) అయ్యా! మీకుసుఖమా

అవిమారకుఁడు—అహా! ఏమి యామె రూపసంపద.

దాది—(ఆకులముతో) ఏమిది! యిట్లున్నాఁడు. అయ్యా! మీ కుసుఖమా?

అవి—

చ. ఘనకటిభారఖిన్నమలగాత్రిము, ఔమ్మకుచాలసంభ్రమా?

దాది—అమ్మా! ఏమోపేరిలుచున్నాఁడు.

అవి—

కనుఁగవదెచ్చె నందము మొగంబున కోష్ఠము బింబతామ్రి మా

దాది—ఈయన నింత మోహింపఁజేయునట్టి యాజనము మిక్కిలి ధన్యము.

అవి—

అనుపమభీతియందును దదంగము లోచనపాత్రి పేయమా,

దాది—కార్యము చక్కఁబడినది.

అవి—

ననవిలుకానికయ్యముల నాతివిలాసము లెట్లు లుండునో

దాది—ఆమెయే యితని కింతవెట్టి యెత్తించుచున్నది.

నళి— లెస్సగాఁజెప్పితివి. ఇతఁడును సంతాపించుచున్నాఁడు.

దాది—నీవు చక్కఁగఁ గనిపెట్టితివి. అయ్యా! మీకుసుఖమా

అవి—(చూచి సిగ్గుపడి) మీయిరువురకు స్వాగతము.

ఉభయులు—అయ్యా! మీకు సుఖమా?

అవి—మీదర్శనముచేత సుఖమే యగును.

దాది—అయ్యా! మీ రేమిచింతించుచున్నారు?

అవి—కళ్యాణి! శాస్త్రము చింతనచేయుచున్నాను.

దాది—ఒంటిగఁగూర్చుండి చింతనచేయవలసిన యారహస్యశాస్త్రమేది?

అవి—కళ్యాణి! యోగశాస్త్రము చింతనచేయుచున్నాను.

దాది—(చిఱునవ్వుతో) మంగళవచనమె నోట వచ్చినది అ యోగశాస్త్రమే యగుఁగాక!

అవి—(తనలో) ఈవాక్యమున కర్థమేమి. విషయము వేఱొకటి కాఁగా నాయభిలాషమునవలన నేను మఱొకటిగా సమర్థించుచున్నాను. (పరికాశముగ) నీ వేమనుచున్నావు?

దాది—మేమును యోగముగోరియే వచ్చినాము. మీరును యోగము ననుమతించుచున్నారు గనుక మాకార్యము నెఱవేరినది మారాజగృహమునందు నిర్జనమైన చోటుకలదు. అచటఁ గూడ నెల్లప్పుడు యోగమే చింతుంచుజనము కలదు. ఆజనములోఁ గలసి దేవరవారు నిశ్చలముగా యోగచింత చేయవచ్చును.

అవి—నాకింకను నవశిష్టములయినభాగ్యములు కొన్ని గలవా? (ఆసనమునుండి లేచి) కళ్యాణి! నాప్రాణములు తిరిగి వచ్చినట్లున్నవి. ఎందువల్లననఁగా,

తే. గీ. తీక్షణంబు, భయాకులదృష్టవిషము
సౌమ్యము, మనోజ్ఞ మునగు నాజాణ మొగము
నేఁ గని విమోహితుఁడ నైతి నిన్నినాళ్ళు,
భవదమృతవాక్యముల నిప్డు బ్రతికిపోతి.

దాది—అయ్యో! అదృష్టవంతులము. మమ్ము మీరు రక్షించినారు. ఇంకపలుమాట లేల? కన్యాంతఃపురము నేఁడే ప్రవేశింపఁ దగును. కన్యాంతఃపురరక్షకుఁడును, మంత్రియు, నైసభూతికుఁడు మహారాజుగారి యాజ్ఞపరికారము కాశీరాజు దూతతో నేఁడు వెళ్ళినాఁడు.

అవి.—మంచిది అదే మొదటిపక్షము. కళ్యాణి! ఔషధము దొరికినతరువాత దాని నుపయోగింపని మూర్ఖరోగి యుండునా?

దాది.—ప్రవేశమాత్రమే దుర్లభము. ఒక్కసారి ప్రవేశించితిరా యంతఃపురమున మీచిత్త మొచ్చినంతకాల ముండవచ్చును.

అవి.—నేనుబ్రవేశించినానను కొ! మేడ తలుపులగడియలు తీసి యుంచుము.

దాది.—అట్లే చేయుదుము. అంతఃపురమునఁ జేయవలసిన దంతయుఁ జేసి మేము సిద్ధముగ నుందుము. మీరు జాగరూకతతోఁ బ్రవేశింప వలయును.

అవి.—కళ్యాణి! రాజగృహముయొక్క విధానమునాకించుక జెప్పుము.

దాది.—ఈలాగు. ఈలాగు. (అని చెవిలో జెప్పుచున్నది.)

అవి.—ఓహో!

తే. గీ. నృపునిగృహసంవిధానంబు నెఱుఁగుకతన,
సందు నే బ్రవేశించినయట్లె దలఁతు
దైవ మీపట్ల నన్యథా దలఁపకున్న
బరులు మెచ్చంగఁ దగియుండుఁ బౌరుషంబు.

(ఆలోచించి) కళ్యాణి! ఈకార్యమందు నాకు మీనమ్మక మేమి?

ఉభ.—ఇది నమ్మకము. (అనిచెవిలోఁ జెప్పుచున్నారు.) రాజకుమార! జయము.

అవి.—సరె మీరిఁక వెళ్ళుఁడు. అర్ధరాత్రమున గనిపెట్టుకొనియుండుఁడు.

ఉభ.—చిత్తము దేవా! (ఇద్దఱునిష్క్రమించుచున్నారు.)

(అప్పుడు విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విదూ.—ఆహా! ఈనగర మెంతశోభగా నున్నది. భగవానుఁడైన సూర్యుఁడ స్తమించుచున్నాఁడు పెరుఁగుముద్దలవలె నున్న తెల్లని

మేడలయందును సంగళ్ళముంగిళ్ళయందును సూర్యకాంతి బెల్లపుపా సకమునలె వ్యాపించుచున్నది. వెలయాండ్రును నాగరవిటులును, జక్క-గనలంకరించుకొని యొండొరులం జూచువేడ్క-ఁ దమతమమేడల యందు విహరించుచున్నారు. నేనటువంటివిశేషము లన్నియుఁ జూచి వికలచిత్తుఁడైన రాజకుమారునకు సాయ ముండవచ్చితిని. అతఁడు నాదురదృష్టముచేతనెవ తెనోజూచి చిత్తవిభ్రమముగలిగి క్రొత్తవాఁడు లాగున్నాఁడు. ఇదెమారాజపుత్రునిగృహము. రాజపుత్రికయొక్క-దాదియు సఖియు రాజకుమారుని యిల్లువిడచి యిప్పుడే పోయిరని యంగడివీథిని నేను వింటినిగదా. వారికేమిపనియుండును జెపుమ?పు రుషులభాగ్యము లేఁగుతుండమువలె మిక్కి-లిచంచలములు. బహుశఃమాయాపదలు గట్టెక్క-వచ్చును. అవస్థకుఁ దగియున్న మారాజ గృహము బ్రవేశించెదను. (ప్రవేశించి) హి. హి. ఇదిగో! మారాజ పుత్రుఁడు. ఏదో రంగు పూసికొన్నట్లు తెల్లఁబారినమొగముతో నిటేవచ్చుచున్నాఁడు. ఐననేమి, చక్క-నివారి కన్నియు నలంకారములే యగును. (సమీపించి) అయ్యా! నీకు జయము.

అవి.—మిత్రుఁడ! నీవు నగరములో మిక్కి-లి జాగుచేసితివే.

విదూ.—మొదట బ్రాహ్మణార్థమునకుఁ బిలువఁబడి పిదప భోజనము దొరకక భంగపడినబ్రాహ్మణుఁడు వలె నీవు రేయింబగళ్ళుఁ జింతించుచున్నావు. దినమంతయు నగరమందుఁ దిరిగి నరసు నెందును గానక వాఁడుమొగముతోవచ్చు పామరవేశ్యలవలె నీప్రక్క-ను బండుకొనుటకయి యింటికి వచ్చితిని.

అవి.—మిత్రుఁడ! నీకొకప్రియము చెప్పెదను.

విదూ.—మనఋషిశాపము సమాప్తమైనదా యేమి?

అవి.—మూర్ఖుఁడ! అవశ్యము కాఁదలచినకార్యములఁగూర్చి సంతోషపడ నేల?

విదూ—అట్లైన మ శేమున్నది?

అవి—కురంగియొక్క దాదియు సలినికయు, నీకుగనబడ లేదా?

విదూ—ఆహా! వారిద్దరుఁ గనఁబడినారు. ఏమి తెచ్చినారు?

అవి—నాకు శోకనివారణమగు నౌషధముఁ దెచ్చినారు.

విదూ—ఏది యేది చూడనిమ్ము.

అవి—సమయము వచ్చినప్పుడుఁ జూచెదవు అంతేవఱకు విను.

విదూ—చెప్పు, చెప్పు?

అవి—ఇన్నిమాట లెందుకు. నేఁడొ కిన్యాంతఃపురముఁ బ్రవేశింపుమని దాది నన్ను బురికొల్పినది.

విదూ—(నవ్వి) అంతఃపురము బ్రవేశించి బ్రదుకఁదలఁచుకొన్నావా? కుంతిభోజునిమంత్రులు విషమశీలురుసుమా!

అవి—ఏమి నీకును శంకింపఁ దగినకారణ మున్నదా?చూడు.

ఉ. ఒక్కఁడనే ససైన్యముగ నోర్చితి వైరుల నాఁటలోన, నే
నుక్కడఁగించినట్టియరు లుచ్ఛదశేఁ మఱి బొందలేదు నాఁ
డక్కుటిలాసు రేంద్రుఁడవి యాకృతి దాలిచి నాభుజద్వయిన్
జిక్కి నశింపలేదె యిఁక నేను మనుష్యుల లెక్క సేతునే?

విదూ—ఎరుగుదు నీయమానుష కర్మము లెరుగుదును. ఐన ను నర్ధరాత్రమునఁ బరగృహప్రవేశ మన్నివిధముల శంకింపవలసినదె.

అవి—నేను సారాంశము జెప్పెదవినుము. కుంతిభోజునికన్యాంతఃపురము సర్వవిధములఁ బ్రవేశించితీరవలయును. నీవు మహాబ్రాహ్మణుఁడవు.గనుక దీని ననుమతింపవలయును.

విదూ—నన్నువిడిచిపో మెదవా యేమి. నేను ని న్నెప్పుడును విడువను. నీవు వద్దు మొఱ్ఱో యన్ననొక్కఁడను వెంబడింపకమానను.

అవి—నీకు శాస్త్రమార్గములు తెలియవు.

తే. గీ. పరగృహంబున నొక్కఁడే యరుగవలయు.
మఱియొకనితోడఁ దగుసేయ మంతనంబు,
పలుజనులతోడఁ గయ్యంబు సలుపవలయు
శాస్త్రనిర్ణయంబిదిసుమీ సఖుఁడవినుము.

కాబట్టి కుంతిభోజునికన్యాంతఃపురమునేనొకఁడనే ప్రవేశింపగలను. మావిషయమున నీవు శంకింపఁ దగదు. చూడు,

తే. గీ. మితగుణము కుంతిభోజభూమిధవునేన
యానృపతిగేహమునఁ సొచ్చు టతిసులభము
అఱసిచూడంగ మేము భుజాయుధులము
శంకనీయ మేమున్నది సఖుఁడ నీకు.

విదూ—అట్లైన నీవు కృతనిశ్చయుఁడవైతివి. ఇప్పుడు నగరము ప్రవేశింతము రమ్ము. అక్కడ నాకొకమిత్రుఁ డున్నాఁడు. ఆతనిగృహమందు మనము కొంత ప్రొద్దు గడుపుదము.

అవి—నీవు చక్కఁగ జెప్పితివి. ఇప్పుడు నే నభ్యంతరమందిరమునకుఁ బోయి సాయాహ్నికకృత్యములఁ దీర్చుకొని మహారాజుగారి యనుజ్ఞబడసి వాసగృహమమునందు శయనసంవిధానముజొచ్చిపిమ్మట నగరముం బ్రవేశించి నీమిత్రునియింటఁ గొంత సేపు గడుపుదము.

చేటి—(ప్రవేశించి)భర్తృదారక! జయము.జయము. స్నానోదకము సిద్ధమయినది.

అవి—ఇదె,యిదె వచ్చుచున్నాఁడను. నీవు ముందు నడువుము,

చేటి—చిత్తము దేవ!

అవి—మిత్రుఁడ!భగవానుఁడైన దివాకరుఁ డస్తమించినాఁడు. ఇప్పుడు.

తే. గీ. పొలుచు జీఁకటి పూతచేఁ బూర్వదిక్కు
సంజకెంజాయతో నొప్పుఁ జరమదిశయు,

మిన్ను రెంట విభక్తమై మెఱయుచున్న
దర్ధనారీశ్వరాకార మనుకరించి.

విదూ.—నీవు లెస్సగఁ బలికితివి. పగలు గడచినది. ప్రదోష కాల మాసంఘమైనది.

అవి.—ఆహా! యేమియీజగత్తుయొక్క విచిత్రస్వభావత! ఏలయన.

తే. గీ. చెలిమికాఁడ! పొద్దనుబొట్టు చెరిగి పోయె
దుస్సహంబగుబీరెండ తొలఁగి చనియెఁ
బ్రచుర మయ్యెను జుక్కలబారు మింటఁ
జల్లనయి హాయిగావీచె సన్నగాలి
చోరులిందందుఁ జోరఁబడఁ జూచుచుండ్రి
దాఁగియున్నారు కాముకుల్ తరుణమరయ
మనుజలోకంబు క్షణములో మార్పుఁజెంది
యూర! వేషాంతరము బూనినట్టు లుండె

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

ద్వితీయాంకము

# అవిమారకము

## తృతీయాంకము.

(అప్పుడు కురంగియు నిరువురు చేటులుఁ బ్రవేశించుచున్నారు.)

కురం.—సఖీ ! అతఁడేమిచెప్పెను ?

మాగధిక—ఎతఁడు ?

కురం.—(తనలో) అయ్యో ! మందభాగ్యరాలను. గుట్టు బయటబెట్టుకొంటిని. (ప్రకాశముగ) ఎతఁడా ? కన్యాపుర చేటుఁడు.

మాగధిక—కన్యాపుర చేటుఁడు నా కగుపడినాఁడు. పలుకరించితినిగూడ. ఏమియుఁజెప్పలేదె.

కురం.—అన్నా ! కన్యాపురచేటుఁడు చిలుక పంజరము చేయించి నాకియ్యలేదని దేవితోఁ జెప్పెదను.

మాగ—చిలుకపంజరము నీకున్నదికదటమ్మా.

కురం.—ఓసీ పేరిలకీ! ఒకటేకాదునాకున్నది? రెండవదున్నదా

మాగ.—కావచ్చును.

కురం.—సఖీ ! ఇప్పుడెంత ప్రొద్దయినది?

మాగ.—ప్రదోషకాల మయినది.

కురం.—అట్లయిన మేడ నెక్కుదము రమ్మ.

మాగ—ఓసీ విలాసినీ ! నీవుముందు వెళ్ళి యాసనములను శయనములను సిద్ధముచెయ్యవే.

విలా.—నీవు నిద్రపోయితివి కాఁబోలు. శయనాసనములు సిద్ధముచేసి యెంతసేపైనది?

మాగ.—సఖీ! నీవు ప్రతిపనిలో నాలస్యము చేయుదువని నాన మ్మకము ఉదయమునవై చినపక్షిశ్లేయిప్పుడువై చితినని చెప్పుచున్నావు

విలా.—సఖీ! అట్లనవద్దు. రాజపుత్రికపేరు చెప్పఁగానే పాకఁ తశయనములు క్రొత్తశయనము లగును.

మా--సఖీ! అట్లయిన వెళ్లిచూచెదను (అందరునడచుచున్నారు)

విలా—ఇదే మేడ.

కురం- నీవుముందునడువుము(మేడనెక్కుటనభినయించుచున్నారు

మాగ—బాగు విలాసినీ! బాగు. నీపేరునకు దగినట్లె రచి యించితివె శయన మీశిలాతలమున రచియించితివా?

విలా.—శయన మభ్యంతర మండపములో రచియించితిని. మాగధిక! నాయాలస్యము చూచితివా?

మాగ---ఆహా! చూచితిని. అతిపండితురాల వయినావు. నీ వలెనే పండిత చేటవృత్తుఁడగు మగనిఁ బడయుము.

కురం—సఖీ! ఈశిలాతలముననొక్కనిముసముగూర్చుండెదను.

మాగ.—రాజపుత్రీ నీకిష్టమైనట్లు జేయుము.

(అందఱుఁ గూర్చుండుదురు.)

మాగ---రాజపుత్రీ! నేనొక యాఖ్యానము జెప్పుదునా?

కురం--సఖీ నీయసంబద్ధపరిలాపములు నేనెఱుఁగుదును.కట్టిపెట్టు

మాగ---రాజపుత్రీ! కథ క్రొత్తదమ్మా.

కురం---నిన్ను వేడుకొనుచున్నాను. గాని నన్ను బలవంత పెట్టకుము. ఒక్కనిముసము పండుకొనియెదను.

విలా---భర్తృదారికను సుఖముగాఁ బండుకొన నియ్యవే. కథ నాకుఁజెప్పు. నేను వినియెదను.

కురం---(తనలో) ఈకథ యేమైయుండును?

మాగ—సఖీ! విను. భర్తృదారికను గుఱించి.

కురం--అయ్యో! నాగుట్టుబయలుపడినది.పరిభ్రష్టురాలనైతిని.

విలా—సఖీ ! నీవీకథ యెక్కడవింటివి !

మాగ— దేవిగారి పరిచారిక యైన వసుమిత్రివలన వింటిని.

విలా—అట్లయిన స్వయముగా దేవిగారివలన వినినట్లె.

మాగ—కాశిరాజునకు జయవర్మయను కుమారుఁడు కలఁడు రాజపుత్రిక నతనికీయనిశ్చయించినారు.ఆయనదూతకూడవచ్చినాఁడు మహారాజుగారాదూతనెంతోగౌరవించినారుప్రధానముకూడజరిగినది

కురం—(తనలో) ఇదివట్టిమాట.నాకునేనేయజమానురాలను.

మాగ—అప్పుడుదేవిగారిట్లుచెప్పిరి. "నాకూఁతురు చిన్నపిల్ల దానింజూడకనేనొక్కదినమయినను బ్రాణమునిలుపఁజాలను.మహారాజు గారు ప్రసన్నులయినయెడ నిల్లరికపు టల్లుని దేవలయునని వేఁడు కొనుచున్నాను.

విలా—తరువాత, తరువాత.

మాగ—తరువాత మహారాజుగారికిఁ గూడ నదియిష్టమయి నది. ఈదినము నక్షత్రము మంచిదని యాదూతతోఁ గూడ మంత్రియైన యార్యభూతికుఁడు వెళ్ళినాఁడు.

కురం—(తనలో) అయ్యో ! కార్యము వ్యవధానమైనదే.

విలా—ఆహా ! ప్రియము. ప్రియము. రాజపుత్రికయొక్క రూపయౌవనము సఫలమయినది.

(అప్పుడు నళినిక ప్రవేశించుచున్నది.)

నళినిక—మాయమ్మ యిట్లు చెప్పినదికదా. "అమ్మాయి ! నీవువెళ్ళి యీవృత్తాంతము రాజపుత్రికతోఁ జెప్పుము. ప్రియములు ప్రియురాండ్రు చెప్పినప్పుడు ప్రియతరము లగును. ఆమె నన్నుజూచి చెప్పిన ట్లితరులతో విశ్వాసముంచి చెప్పదు.సహయము వచ్చినప్పుడు

నేనునా మెప్రక్కనే యుండెద"నని ప్రియమంతయుభర్తృదారికకు విన్నవించెదను.

కురం——నాకు వెట్టిమెత్తించుచున్న యీక్రొత్తరోగమేమిటి చెపుమ? పూలదండలపై మనసుపోనీయదు. గోష్ఠిపయి ధ్యానము నిలువనీయదు. ఇదిదారుణము మనోహరము గూడనై యున్నది. నళినికా ఏమిచేయిది. (నిట్టూర్పు పుచ్చుచున్నది.)

మాగ——రాజపుత్రీ ! నేను మాగధికను.

విలా——భర్తృదారిక !. నేనువిలాసినిని గాదటమ్మా.

నళిని——(సమీపించి)రాజపుత్రి! నేనునళినికను. మేడమెట్ల చప్పుడుచేతనేనీవు తెలిసికొనియుందువు. రాజపుత్రీ దేవిగారిట్లనుచున్నారు

కురం——ఏమని?

నళినిక——(చెవిలో) ఇట్లు. ఇట్లు.

కురం——అయ్యో ! చారిత్రము హీనము

నళినిక——అయ్యో! అతఁడు సంభావనీయుఁడమ్మా. అతఁడే యితఁడుగదమ్మా

కురం——నళినిక ! నన్నుబట్టుకొమ్మా

నళినిక——మంచిదమ్మ

విలా——నళినిక ! వివాహమెప్పుడగును ?

ఇప్పుడు.

(తెరలో)

నళి--చిరంజీవివిగమ్మ

(తెరలో)

రాజపురుషులారా! మంత్రి గారిమాంతరము వెళ్లినాఁడనిమంత్రిభృత్యుఁడొక్కఁడైనఁ గన్యాపురరక్షణార్థము రాలేదు. సరే!వారిష్టమునచ్చినట్లుజేయనీ. ఈసంగతి రేపు రాజుగారితో విన్నవించెదను.

 

విలా__సఖీ ! నళినిక ! నామాటకుత్తర మియ్య వేమి?

నళి--ఆరాజకుమారుఁ డెప్పుడిక్కడికివచ్చునో యప్పుడేవివాహముగును

విలా__ఆయన నిర్విఘ్నముగఁ బ్రవేశించుఁగాక !

నళినిక__అట్లేయగుఁగాక !

మాగ.__సఖీ !రావె ! చతుశ్శాలలో గూర్చుందము.

విలా--అట్లగుఁగాక!ప్రదోషము వెళ్లిపోయినదివెన్నెలవచ్చినది.

నళి__సఖి నాకుఁగూడ శయనము పఱుచుము.

మాగ__అవకాశమున్నది. నిదుర వచ్చువఱకు రాజపుత్రికకుపచారము చేయుము.

నళి__సరె. (విలాసినీమాగధికలునిష్క్రమించుచున్నారు)

(అప్పుడవిమారకుఁడు త్రాడుచేతబూని కత్తిబట్టుకొని చోరవేషముతోఁ బ్రవేశించుచున్నాఁడు.)

అవిమార__(సవిమర్శముగా) అహో! తారుణ్యము మిక్కిలి కష్టమైనది కదా. ఎందువల్లననఁగా

ఉ. రాగము వృద్ధిజేయును కరంబు ప్రమాదము నాశ్రయించెడున్
దా గణియింపనీయ దొకతప్పుఁ సాహసవృత్తిఁ జొచ్చు స్వే
చ్ఛాగమనంబు సల్పెడును సైచదు నీతిపథంబు సన్మనీ
షాగురుఁ డైనవానిమతి సైతమహో వివశంబు జేసెడున్.

ఏమిది ! ఆత్మాధీనము లయిన యర్థములందు మందుఁడ నగుచున్నాను. ఇప్పుడు__

గీతమాలిక.

పట్టణం బంతయును నాకుఁ బరిచితంబె
రక్షిపురుషులబాహుబసారం బెఱుఁగుదు

గాటముగఁ బర్వినట్టిచీఁకటులతోడ
నర్ధరాత్రింబు భీమ మై యదను గూర్చె.
వాఁడికత్తి కేలను నిల్చి తోడు సూపు
నతిదృఢముగ నిశ్చిత మయ్యె నంతరాత్మ
ఇన్ని విధములఁ జింతింపనేల నేను
నిపుడు దుష్కరం బగునర్థ మేది నాకు.

అహో! ఏమి యర్ధరాత్రిముయొక్క భయంకరత్వము. ఇప్పుడు,

సీ. గాఢనిద్రను గూడి గర్భస్థులట్టుప్రజ
లురు మోహమును జెందియున్నవారు
నిశ్శబ్దముగ జనుల్ నిదురించుచుండుట
హర్మ్యముల్ ధ్యానించునట్టు నిలిచె
మేటిచీఁకటి తమ్ము మింగివై చినయట్లు
దారిలోపల నున్నతరువు లెల్ల
స్పర్శానుమేయభావము జెంది యున్నవి
కందోయి కక్కట కానఁబడక

తే. గీ. నఖిలజగము నంతర్ధాన మైనయట్లు
వరలు ప్రచ్ఛన్నమైన రూపంబుఁ దాల్చి,
గ్రంథములలోన వినినయాకాళరాత్రి
నేఁడె వచ్చియున్నటు లుండె నిశ్చయముగ.

చ. పలుతిమిరప్రవాహములఁ బారుచు నున్నవి మార్గవాహినుల్
పులినతలంబులట్లు గడుఁ బొల్చుచునున్నవి హర్మ్యమాలికల్
చెలఁగెడు దిక్కులన్నియును జీఁకటిలోన మునింగినట్లు తె
ప్పలపయి దాటి పోఁ దగినభాతిగఁ జీఁకటి యున్న దిత్తరిన్.

(నడచి చెవి యొగ్గి) అహో! గాంధర్వధ్వనివలె వినఁబడుచున్నది.
కాంతతోఁగూడ గాంధర్వ మనుభవించుచు సార్వకాలసుఖి యయిన

యీపురుషుఁ డెవ్వఁడు చెప్పుమా ? ఇతఁడు స్వయముగా వీణ వా యించుచున్నాఁడు. ఏలయన—

తే. గీ. మేడ కడు నెత్తు గిటికీలుఁగూడ మూసి
రరయఁ గానంబునకు నర్హ మట్టిచోటె
సానునాద మయి వచ్చె తంత్రీనినదము
సకియ వ్రేళుల కిటువంటి శక్తి గలదె.

పాట మాత్రి మూఁడుదాని దే.

ఉ. తానము మంద మెంతొ విశదంబు పరివృత్తము, వక్త్రనాళికా
స్థానములం జనించెడును శారివ్యతరంబయి నాద మెంచ స్త్రీ
గానమె యంటకుం గలదు కారణ మొక్కటి వేర, కంకణ
ధ్వానముతో వినంబడెడు వారక తత్కర తాళనాదముల్.

(నడచి చూచి) అహహా ! ఈయన యెవఁడోకాని తనపై నలిగినకాంతను బ్రతిమాలుచున్నాఁడు. ఈతఁడు చేసినయపరాధ మేదో గొప్పదయ్యె యుండవచ్చును. ఏలయన భర్త యెంత సేపటినుండియుఁ బ్రతిమాలుచున్నను నీమె ప్రసన్నురాలు కా లేదు. ఒక వేళ ప్రసన్నురాలయినను నీమె యేదో మిష పెట్టఁ గోరుచున్నది. ఏలయన,

ఉ. ఆవిలబాష్పరుద్ధజడమా మృదుగద్గదకంఠ మొప్ప నా
థా విడు నీకు నే నెవరితన్ నను నంటకు మంచుఁ బల్కు స
ద్భావముచేఁ బ్రసన్న యయి భర్తృవశంగత యయ్యుఁ దాల్తస్త్రీ
భావముచే సరోజముఖి పల్కుఁ గడుం బ్రతికూలవాక్యముల్.

ఇది యేపక్షి చెప్పుమా? భైరవస్వరముగలిగియున్నది? ఆహా ! ఇది గుడ్లగూబ. ఏమి యిది నవ్వుచున్నదా ? గుడ్లగూబస్వరము విని భయపడి ప్రియురాలు పాప మితని గాఁగలించుకొన్నది. ఇది వయస్సునకుఁ దగినపనియె. ఈపరవ్యాపారవీక్షణ మెందుకు నాకు? స్వకార్యము నాధించుకొనియెదను. (నడచి) ఎవఁ డితఁడు ? ఈనగరాపణా

ళిందమునందు సందిగ్ధమనస్కుఁడై స్నిగ్ధముగా మాటలాడుచున్నాఁడు. పాప మితఁడు నావంటివాఁడై యైయుండవచ్చును. ఈతఁడు,

చ. పరిజనులెల్ల మెల్లమెలఁ బల్కు మటంచును నొక్కి చెప్ప నా
భరణరవంబుల న్విని ససు భ్రాంతుఁ డగున్, మదనార్తుఁడయ్యు నీ
గరితలకూటము ల్మిగులఁ గష్టములంచు నుపన్యసించు చె
చ్చెర సమయస్థలంబునకుఁ జేరఁ దలంచును బోవఁ డక్కటా.

(నడచి) అహో! ఈవెన్నెల యెంతచక్కఁగానున్నది. ఇది వెన్నెల కాదు. ఇది వీథికిరువంకల బారులు గట్టియున్న మేడలోని కిటికీలనుండి పైకిఁ బ్రసరించుచున్న దీపాలవెలుఁగు. ఇక్కడ మిక్కిలి ప్రయత్నముతో నాత్మసంరక్షణము జేసికోవలయును. ఓహో! వీఁ డెవఁడో దొంగ. వీఁడు.—

ఉ. పరికరబంధముల్గలిగి బంధురలీలను హృష్టచిత్తుఁడై
పరగృహవాదమండె తనభావము చేష్టలు చూడ్కి నిల్పి స
త్వరగతి నేగుచుండియును దారిని దీపఁపువెల్గు జూచి ము
ష్కరుఁడు తొలంగు నాయడుగుచప్పుడుల న్విని భీతచిత్తుఁడై.

నాకు వీనితో నేమి? వీనింబరిహరించెదను. ఈనృశంసుఁపోయినాఁడు. ఇంక నేనును బయలుదేఱెదను. (నడచి) ఇదిగో! వీరు రక్షిపురుషులు ఇప్పుడేమి చేయుదును? తోఁచినది యుపాయము. శృంగాటకమందున్న యీ విటసభ ప్రవేశించెదను. (అట్లు చని)

చ. అలఁతిమగంటిమిం గలుగునారెకులం గని యే దొలంగుటం
గలకల నవ్వుచున్నయటు గన్పడుచున్నది నాకృపాణి యీ
తలవరు లెంత నాయెదుటఁ దద్బలముం గని జంక నేను నేఁ
దొలఁగితి కార్యసాధనము తుష్టిని జేసికొనందలంచుటన్.

రక్షిపురుషులు వెళ్ళినారు. రక్షించుకొనఁ గలవానికి రక్షకులెందుకు.

తే. గీ. జనసహాయ మక్కఱలేని శౌర్యమూని
నిబిడరాగలోభాత్ములు నిశఁ జరింతుర్రి
విషమ మయ్యు సుఖం బిచ్చు విస్మయముగఁ
బౌరుషపుసాక్షియగు నిశాభ్రీమణ మార.

ఇదిగో రాజగృహము. అహో! ఈప్రాకార మెంతస్థిరముగా నెంత యున్నతముగా నున్నది. లోపలకుఁబోకుండఁ బురుషులిక్కడనే వారింపఁబడుదురు, కపిశీర్షకములు దిట్టముగా నున్నపక్షమున నేను కోటప్రవేశించినట్లే యెంచుకొనవచ్చును. ఇక్కడ నిలిచి త్రాడెగుర వైచెదను. ప్రజాపతికి నమస్కారము. సర్వసిద్ధులకు నమస్కారము. బలిశంబరమహాకాలురు ప్రసన్నులగుదురు గాక! రాత్రి విజృంభించు గాక! నిద్ర వర్ధిల్లుఁగాక. పద్మ యనుమతించుగాక. సర్వవిఘ్నములు లయమును బొందుగాక! శత్రువులు నిహతు లగుదురుఁగాక. భగవతి యైనకాత్యాయని యనుగ్రహించునుగాక. (త్రాఁడువిసరుచున్నాడు) కపిశీర్షకమునకుఁ ద్రాఁడు గట్టిగాఁ దగులుకొన్నది. ఏమి కాగలకార్యముయొక్క ప్రభావము. త్రాడు విసరఁగనే తగుల్కొన్నందున నాకార్యము సిద్ధించినట్లే తలంచుచున్నాను. భగవానుఁడైన ప్రజాపతి బలవంతుఁడుగదా! ఎందువల్ల ననఁగా—

తే. గీ. ఇదిమదీయకార్యం బని యెంచి నరుఁడు
కష్టపడినఁ గార్యముసిద్ధి గనక పోదు
యత్నములు సేయుపిదపఁ గార్యముల సిద్ధి
దుర్లభం బయిన నందలిదోష మేది?
నరుని నిత్యశుభప్రయత్నములచేతఁ
బురుషకారంబు సిద్ధిని బొందుచుండు
గట్టిపూనిక గలదేని గార్యసిద్ధి
యవల దైవనిధానంబు ననుసరించు.

సరె తాడిఁకు పట్టుకొని యెక్కెదను (ఎక్కి చూచి) అహాహా! ఏమియీ రాజగృహముయొక్క శోభ.

మ. విపులంబయ్యు మితోపమం బగుచు శోభిల్లున్ విభాగంబుచే,
నెపుడున్ దట్టమె యయ్యునంద మయికన్పించుం గ్రమాభ్యున్నతిన్
నృపగేహంబు సహస్యమాలముగ ధాత్రీదేవి కాకాశముక్
నిపుణత్వంబునఁ గూర్చుచున్నకరణిం జెల్వారుఁ జిత్రంబుగాన్.

ఇక్కడ నిలువఁ గూడదు. అట్టాలపత్రోలికలయందున్న కుక్కల వలన సర్వవిఘ్నములు కలుగును. సరె! ఈతాడితో దిగిమెదను. (దిగి) ఇప్పు డీత్రాడెందు దాఁచువాఁడను. (చింతించి) సరె తెలిసినది. ఈతాడు త్రెంపి ముక్కలుచేసి యీహస్తిశాలలో నిందందు జిమ్మివైచెదను. (అట్లు చిమ్మి నడచి)

సీ. కామినీకలగానకలితమై వినవచ్చెరమ్యమైతంత్రిస్వరమ్ములిచట మఱియొకచోటికిఁ బోయెదను.

మత్తదంతావళమదసముద్భూతగంధామోద మవిరళం బైనదిచట ఇందు క్షణ ముండి వెళ్ళెదను.

దీపాలవెలుఁగిది దీనిలో నారెకుల్ స్పష్టంబుగాఁగానఁబడెదరిచట ఇపు డేమిగతి?

రాజీవతతితోడ రాజమందిరమెల్లశాంతమైనదినిశాసమయమగుట. ఆమె చెప్పినమార్గ మిదె. ఈదారిన బోయెదను. ఇదె మందాకిని. అదె దారుపర్వతము. ఇది యుపస్థానసభ. అహాహా! అదే కన్యాపురప్రాసాదము. ఈమేడకు కట్టుపని విశేషముగా నుండుటచేతను గవాక్షములు దగ్గరఁగా నుండుటచేతను దీని నెక్కుట సులభము. అట్లుగాక యెక్కుట కష్టమైన నేమి మానుదునా?

తే. గీ. వనితకడఁ జేర నభిలాషవశత మేడ
నెక్కఁగోరెడునాకు నిం కేటిశంక,

తమిస్రతూడులముండ్లభయమ్మచేత
విడుచునే తటాకము దాహపీడితుండు.

కానీ, యెక్కెదను. (ఎక్కి) ఇదె యామె చెప్పినజాలయంత్రము. (ప్రవేశించి చూచి) బాగు కుంతిభోజ! బాగు. నీభవనము స్వర్గమును వేళాకోళము సేయుచున్నది. ఇక్కడ,

సీ. కొమరారుమాణిక్య కుట్టిమస్థలముల
హాయిగానిదురించు నంచపిండు
వైడూర్యమౌక్తికవరనిర్మితంబులై
సికతాపరితానముల్ చెలువు మీరుఁ
బగడాలతోఁ గట్టఁబడినవి స్తంభముల్
వేలుగా మాటలు వేయునేల
మణులకాంతులముందు మందిరదీపముల్
మంద తేజంబులై మండఁదొడఁగె.

ఈరౌద్రవేష మింక చాలును. (చోరవేషమును దీసి తలుపు దెఱచుచున్నాఁడు)

నళినిక—రాజకుమారుని వృత్తాంత మేమైనదో? నేఁడు నా ప్రియుఁడు వచ్చుననుమాట వినఁగానే యీయవస్థలో దుర్లభమైన నిద్రను రాజపుత్రిక యెట్లో తెచ్చుకొనినది.

అవి:—(విని తొందరతోసమీపించి) కళ్యాణి! ఇదే నా వృత్తాంతము.

నళి—(చూచి సంతోషముతో) రాజపుత్రునకు స్వాగతము

అవి:—(చూచి యానందముతో)

మ. తనివిం జెందదు దృష్టి సాంగముగఁ గాంతం గౌఁగిలింపం దలంచును నాబుద్ధియు వేగిరంపడియెడున్ సుప్తాంగనన్ లేపఁ జూ

చును రాగం బతిమాత్రి మై తనులతన్ శుష్కింపఁగాఁ జేయు నా
మన సానందవశంబున న్మునిఁగెడుం బల్మారు మోహాంబుధిన్

నళి—(తనలో) ఇతఁడు భగవానుఁడైన కామదేవుఁడే ప్రివా
హమువలె నుభయపక్షములను బీడించుచున్నాఁడు (ప్రికాశముగా)
రాజకుమార! శయనతల మలంకరింపుము

అవి—మంచిది (అని కూర్చుండును)

నళి—భర్తృదారక రాజపుత్రికను మేలుకొల్పుదునా ?

అవి—కళ్యాణీ చాలు నీబాల్యచాపలము చాలు. చూడు?

తే. గీ. కనఁగవమె గాని నాకు వేగనులు లేవు
చిత్త మతిమూఢ మభిలాష చిరతరంబు
కామవార్ధికిఁ బారంబు గంటి నేఁడు
కలికి! క్రీడింపనిమ్ము నాకన్నుఁగవను

నళి—ఎఱుఁగుదు నెఱుఁగుదును రాజపుత్రికను గూర్చియే
మీపరిశ్రమ మంతయును.

అవి—నాపరిశ్రిమ నేఁడు సఫల మైనది.

కురంగి—(మేలుకొని) సఖి! ఏమి నిర్దయగాఁ బలుకుచుంటివి?

నళి—రాజపుత్రి! నే నేమంటిని.

అవి—ఈమె యిటువంటి మోహము బొందుటచేత నాజీవిత
ఫలము నేను బడసితిని.

కురం—(తనలో) అమ్మా! పరిభ్రష్టురాల నైతిని. (ప్రికాశ
ముగా) సఖి! నే నేమంటిని?

నళి—రాజపుత్రి! నీ వేమియు ననలేదు.

అవి—ఈమె మోహవిస్తరముచేత నాకు రెండపసారి
మోహము కలుగుచున్నది.

కురం—నళినిక! చాల సేపటినుండి మేలుకొని కూర్చున్నావు

ఇప్పు డెంత ప్రొద్దు పోయినది?

నళి—అర్ధరాత్రి మయినది.

కురం—అట్లైన నీవు మిక్కిలి యలిసి యుందువు. రా. నన్ను గౌఁగిలించుకో.

నళి—(రహస్యముగా) అయ్యో! నేను కాళ్ళు పిసికెదను. రాజ పుత్రికను మీరు కౌఁగలించుకొనుఁడు.

అవి—(సంతోషముతో) మంచిది. ఇట్లే నీవు ప్రియశతముల వినుచుందువు గాక!

కురం—రావె? మిక్కిలిచనువుచేత నాలస్యము చేయకు.

నళినిక—ఇదిగో వచ్చితిని. (అవిమారకుని ముందుకుద్రో యుచున్నది.)

కురంగి—(కనులు మూసికొని బలవంతముగ లాగి యవిమా రకుని గౌఁగలించుకొనుచున్నది) ఎవరే! నాకిప్పుడు కాళ్ళు పిసుకు చున్నవారు?

నళి—(చెవిలో) ఇట్టిటు—

కురం—(తొందరతో) అయ్యయ్యో! నాచరిత్ర మతిహీన మైనది. అయ్యో! భయ మగుచున్నదే.

అవిమారకు—

మ. ఉవిదా! క్రొత్తపడంతివా చిరమనోమోగంబుచేఁ బ్రాఁతదా
నవెసూ గాలికిఁ దూలుతీఁవ పగిదిన్ గంపింపఁగా నేల భీ
తి విసర్జించి ప్రసన్నరాల వయి నన్ దేర్పంగ దే నిండుకూ
ర్మి, వృథావాక్యము లేటి కింక శరణార్థిన్ నన్ను రక్షింపవే.

(కురంగి సిగ్గుతో నళినికను జూచుచున్నది.)

నళి—భర్తృదారక! లెమ్ము లెమ్ము. రాజపుత్రి యేమో చెప్పుచున్నది. లెమ్ము లెమ్ము.

అవి—సరే. (అని లేచుచున్నాఁడు).

(దాది ప్రవేశించుచున్నది)

దాది—రాజకుమారా! జయము జయము.

అవి—ఓహో! నీవా?

దాది—నళినిక! అభ్యంతరమండపమునందు శయనము రచి యింపఁబడినది. రాజకుమారుని రాజపుత్త్రికను నందుఁ బ్రవేశ పెట్టుము.

నళి—అట్లే చేసెదను.

(దాది నిష్క్రమించుచున్నది.)

నళి—రాజకుమార! అభ్యంతరమండపములో శయన మమ ర్పఁబడినది. భర్తృదారికతోఁగూడ మీరందుఁ బ్రవేశింపుఁడు.

అవి—ఇట్లే నీవు ప్రియశతములు వినుచుందువుగాక!

(అని యామెచేయి తనచేతితోఁ బట్టుకొని లేచుచున్నాఁడు)

నళి—భర్తృదారక! రమ్ము రమ్ము.

అవి—ఇదిగో ఇదిగో వచ్చుచున్నాను.

(ఇద్దఱు నడుచుచున్నారు).

అవి—(సంతోషముతో) యౌవనముయొక్క ఋణము తీఱి పోయినది. ఏలయన—

మ. కనులందశ్రులు గ్రమ్మఁ జన్మొనలు గ్రుంగం గాఁగిటన్ జేర్చితిన్
వనితన్ సిగ్గున శ్రోణిభారమున నీవామాక్షి తొట్రిల్లెడుం
జనుచో సప్తపదప్రమాణభువి యెంచన్ యోజనం బయ్యె, నా
కనుకూలంబుగ రాత్రియున్ యుగశతం బౌనేని నే ధన్యుఁడన్.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

మూడవయంకము సమాప్తము.

---

# అవిమారకము

## చతుర్థాంకము.

(అప్పుడు చాంగేరికాహస్త యయి మాగధిక ప్రవేశించుచున్నది)

మాగధిక—అహో! యేమి యీపరిజనముయొక్క ప్రమాదము. ప్రొద్దుపొడిచి యింతసే పైనను ప్రాసాద మలంకరింపలేదు. గోష్ఠీజనకోలాహలము వినఁబడదు. ఏమి చెప్పుమ! రాత్రి మేలుకొనఁబట్టి యామె ప్రభాతమునందుఁగూడ నిద్రించుచుండవచ్చును. సరె భర్తృదారికను మేలుకొల్పెదను. (నడుచుచున్నది)

(అప్పుడు విలాసిని వీజనముతోఁ బ్రవేశించుచున్నది)

విలాసిని—మాగధిక! నిలునిలు.

మాగ—సఖి! న న్నాఁపకు. భర్తృదారికనిమిత్తము సుమనావర్ణకము దీసికొని పోవుచున్నాను.

విలా—భర్తృదారికకు సుమనావర్ణక మెందుకు. అలంకార మెందుకు.

మాగ—అవినీతురాల! అమంగళము పలుకకు. భర్తృదారిక నిత్యాలంకృత యగుఁగాక!

విలా—కాదే. భర్తృదారికకు నామె యాకృతియే ప్రశస్తాలంకార మని చెప్పుచున్నాను.

మాగ—ఉన్మత్తురాలా! పుష్పమును బరిమళింపఁ జేయవలెనా?

విలా—అది తగియున్నది. స్వభావరమణీయవస్తువుల కలంకారము చేసినపక్షమున నవి మిగుల రమణీయములగును.

మాగ— సఖి! భర్తృదారికయొక్క రూపమున కనురూపుఁ

వైనభర్త చక్కఁగాఁ గూర్పఁబడినాఁడు.

విలా—పక్షపాతము చాలును. రాజకుమారునిసమీపమందు రాజపుత్త్రిక పద్మినివలెఁ గనఁబడును.

మాగ—చక్కఁగాఁ బలికితివి. భగవానుఁ డయినకామదేవుఁడు శరీరముదాల్చి యీవిధముగా వచ్చినాఁ డని నేను తలంచుచున్నాను.

విలాసి—అల్లే! రాజపుత్త్రిక యారాజకుమారుని విడచి క్షణకాలమైన సుఖముగా నుండదు.

(అప్పుడు కన్నీరు పెట్టుకొనుచు నళినిక ప్రవేశించుచున్నది.)

నళినిక—(శోకముతో) సుఖములకు బహువిఘ్నములు కలుగుచుండు నన్నలోకోక్తి నిజము. భర్తృదారిక యవిచ్ఛిన్న సుఖసంభోగనితర యయి యిప్పటికొక్క సంవత్సరమైనది. మనగోష్ఠీజనమున కుత్తరకురువాసముసంభవించినది. ఈవృత్తాంతమునేఁడుమహారాజుగారికిఁ దెలిసిన దని విన్నప్పటినుండియు మేను వడఁకుచున్నది. పాపము ముద్దరాలయిన భర్తృదారిక మదనకారముచేతను లజ్జావికారముచేతను మిక్కిలి పీడింపఁబడి సంతాపముచేతఁ జైతన్యము లేనిదానివలె నున్నది. ఈమేడ దీపము లేనియిల్లువలె నాదృష్టికిఁ గనఁబడుచున్నది. భర్తృదారిక లేనిపక్షమున నాకు హృదయప్రీతికరమైన దేదియు నిందుండదు. రాజకుమారుఁడు నిరపాయముగ నంతఃపురము దాఁటి యావలకు వెళ్ళినాఁడని విని నాహృదయము ప్రహ్లాదితమైనట్లున్నది. ఇప్పుడు కన్యాంతఃపురము లెస్సగా నరికట్టఁ బడినది. (నడచి) ఆ! సఖులిరుగో. సఖీ! మాగధికా యిదియేమిటే!

మాగధిక—సఖి! ఏమిటే యడుగుచున్నావు. ఇది రాజపుత్త్రిక కలంకార సమయము గాదటె?

నళి—ఉత్సవదినము వెళ్ళిపోయినది.

ఇద్దరు—ఓసీ! కలగనుచున్నావాయేమి! ఆవృత్తాంతము మాకుఁగూడ జెప్పుము. మనమందము సమానల మగుదుము.

నళి—రాజకుమారుఁడు నిశ్చయముగా వెళ్ళిపోయినాఁడు.

ఇద్దఱు—అమ్మో!

నళి—భర్తృదారికయొక్క దుఃఖమునుజూచి సహింపఁజాలక నేనును నిటువచ్చితిని.

మాగధిక—ఆమెయొక్క యవస్థఁజూడశక్యము కాదు గదా. అయినను భర్తృదారికను మన మూరడింతము.

ఇద్దఱు—అట్లే చేయుదము.

(అందఱునిష్క్రమించున్నారు.)

ఇదిప్రవేశకము.

---

(అప్పు డవిమారకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

అవి—(శోకముతో)

తే.గీ. భాగ్యవశమున నెట్టెటో బైటఁబడితి
నాతనువుమాత్రమే రాచనగరునుండి
నాఁటఁగోలెఁ జేరదునన్ను నామనస్సు
దృఢముగాఁ బ్రియురాలు బంధింపనోపు.

కురంగియవస్థ యెట్లున్నదో

చం. జనులమహాపవాదములు సైపక సిగ్గును జెంది యుండునా
జనపతిచేతఁ గట్టువడి చాలభయంబునఁ గుందుచుండునా
కనుఁగవనుండి బాష్పములు గారఁగ నన్ గనలేక రాత్రులన్
మనమునినందలంచుచునుమాటికి మోహము జెందుచుండునా

అమ్మయ్య! యిప్పుడుదానికిం బ్రతీకారము గనఁబడినది. ఆమెయు నాయందలి యపేక్షచేతఁ దనశరీరమునైన నపేక్షింపదు. అందువలన నేనును నామెకొఱకే ప్రాణములను బరిత్యజించెదను. (నడచి)

కొన్నిదినములనుండి నేనువిదేశమునందున్నాఁడనుగదా ఇప్పుడునాకు మనస్సు శరీరముఁ గూడ దుఃఖకారణములై యసహ్యములై కనఁబడుచున్నవి. ఇప్పుడు,

చం. పరిచయవర్ధమానదృఢ బంధురరాగము గల్గుదాని భా
సురమగునూత్న యౌవనము సోయగముం గలదానిధారుణీ
వరసుత నొంటిఁగావిడచి ప్రాణము నిల్పిశి వంచకుండనై
ధరపయి నన్నుఁబోలెడు కృతఘ్నుఁడు కష్టుఁడొకండుగల్గునే.

ఇప్పుడు మదనునిచేత లోనఁ దహింపఁబడుచున్న నన్ను భగవానుఁడయిన సహస్రమయూఖుఁడు పైన దహించుట కారంభించినాఁడు. (అంతటఁ జూచి) అహా! యీగ్రీష్మముయొక్క ప్రతిభయత యెంతయధికముగా నున్నది. ఇప్పుడు,

సీ. ఆపీతసారమై యవనీతలంబెల్ల
వేఁకిసోఁకినయట్లు వెచ్చనయ్యె
దావాగ్నిగవయుటఁ దరులు నీడలులేక
క్షయరోగమున గుందు కరణిదోఁచె
గాడ్పుచేఁ గొండలు ఘనగుహాముఖములఁ
దెఱచి యాక్రోశించు తెఱఁగు దోఁచె
నీలోక మంతయు సినపాత నష్టమై
మూర్ఛిల్లినటులుండె ముమ్మరముగ.

ఇప్పుడేమి చేయుదును! నేను నడువఁ జాలకున్నాను. ఏలయన—

చం. ఇసుమనునగ్ని చూర్ణముల నేడ్తెరబూసెడు మేనగాడ్పు, పై
విసరుచు నెండుటాకులను వృక్షము లెంతయుఁ బీడసేసెడున్
వెస దవవహ్నిచేఁగరగి నీరయినట్లుగఁ దోఁచెభానుఁడున్
వసుమతి సూర్యపాకమున బ్రిద్దలు వారెడు దారుణంబుగన్.

హాప్రియురాల! హాసుందరి! నాకుఁ బ్రతివచనమిమ్ము. (మూర్ఛిల్లుచు

న్నాఁడు. లేచి నిట్టూర్పు విడిచి పైకిఁజూచి) భగవానుఁడైన సహ
స్రరశ్మి యరికట్టఁబడినాఁడు.

తే. గీ. గాలితోఁడ్కొని వచ్చినకాఱుమొయిలు
పొద్దుగప్పెడు నందు నద్భుతమదేది
మనసునం దుండి నన్నేచు మదనుఁగప్పి
పుచ్చి నాతాప మార్చు టద్భుతముగాని.

ఈజీవన్మరణముతో నేమి ప్రయోజనము? దేహపరిత్యాగము జేసెద
ను. (లేచినడచుచున్నాఁడు.) ఏమిచేయుదును; సరె తెలిసినది. ఈయ
రణ్య తటాకమునందు శరీరము విడిచెదను. ఛీ! నామరణమార్గము కే
వల మధర్మముకదా. అభిమాన మోహమువలన మహాపథము మఱ
చితిని. మఱియొకప్రయత్నము జేసెదను. (చూచి) సరె తెలిసినది.
అహో కారుచిచ్చు దగ్గరనే కనఁబడుచున్నది. దానికి నాప్రాణము
లాహుతి చేసెదను. (సమీపించి) నమస్కరించి భగవానుఁడ!అగ్ని
భట్టారక;

గీ. ఏకచిత్తంబు గలవారి యిష్టసిద్ధి
యగ్ని సాధింపఁగలదేని యనఘమూర్తి!
యేకకీర్తిని మైనయీ యిందువదన
కాంత యగుఁగాక నాకు జన్మాంతరమున.

(అగ్నిని బ్రవేశించి కుతూహలముతో) ఇప్పుడేమి జరుగుచున్నది

మ. తరువుల్ దగ్ధము లైస్ఫులింగ తతిచే ధాత్రీస్థలింగూలు భీ
కరకీలావళి నాకు జందనపు బంకంబట్ల శీతంబగున్
కరుణంజూపెడునగ్ని నాపయిఁ గడున్ గామాతురుండంచు బం
ధురమౌ ప్రేమను జేర్చెఁ గౌఁగిటను నన్నుందండ్రిబిడ్డంబలెన్.

ఆహాహా! యింతకంటె విస్మయనీయ మేమున్నది. అగ్ని నన్ను ద
హింపలేదుగదా దీని కేదోకారణ ముండవచ్చును. మఱొక ప్రియ

త్నము చేసెదను. (నడచి) ఇదిగో మహాపర్వతము,

సీ. కాఱుమబ్బులగుంపు గ్రమ్ముటచే మిశ్ర
సంధిగ్ధకూటవిస్తార మగుచు
నాకాశచరులైన యమరసంతతులకు
సంతత విశ్రమస్థాన మగుచు
సత్కవిమతి బోలెఁ జాలవిచిత్రమై
పిరియమిత్ర సంయోగ హృద్యమగుచు
నీచభూపతిబోలె నిష్ఫలాఢ్యంబయి
దనరారుచున్న దీధరణిధరము.

ఈపర్వతమునందు నాప్రాణములను విడిచెదను. మరుత్ప్రపాతము సర్వార్థసాధకము గదా! ఎక్కెదను. (ఎక్కిచూచి) ఈశైలముమీఁద నున్న జలమున స్నానముచేసి సంధ్యావందనము జేసి మంత్రము జపించెదను. (అట్లుచేసి జపము చేయుచున్నాఁడు)

(అప్పుడు విద్యాధరుఁడు భార్యాసమేతుఁడై ప్రవేశించుచున్నాఁడు)

విద్యాధరుఁడు—

సీ. ఉదయకాలంబున నుత్తరకురుభూమిఁ
గడువేడ్క తోడుతఁ గడపినాము
మహనీయమైనటి మానససరమందు
స్నానంబు నటమీఁద సలిపినాము
మందరాచలమహాకందరాంతరముల
నెఱజవ్వనపుఁబనుల్ నెఱపినాము
చలువలీనెడు హిమాచలగుహాగృహముల
విహరించువేడుక వెడలినాము

గీ. మట్టమధ్యాహ్నమగువేళ మనసుదీర
మలయధారుణీధరశృంగముల వసించి

 

చందనమహీజశీతలచ్ఛాయలందు
హాయిగా నిదురించెయుద నంబుజాక్షి.

(ఆకాశయానమునిరూపించి) సౌదామిని! చూడుము చూడుము. భగవతియగు వసుంధరయొక్క దూరస్థమైన యాకృతి మిక్కిలి దర్శనీయమై యున్నది. ఇక్కడ—

మ. గిరు లేనుంగులుబోలు, వార్ధు లమరుం గ్రీడాసరంబుల్బలెం
దరువుల్ నాచునుబోలు బాపిటలచందంబూనెడున్ వాహినుల్,
వరసౌధంబులు బిందుల ట్లమరెడున్ బ్రిచ్ఛన్న నిమ్నస్థలం
బరయన్ భూమి కనంబడు న్గగమహో యత్యంత సంక్షిప్తమై.

కళ్యాణీ! అవనిహాసుశాలవు గమ్ము. శీతచందన నిలయంబగుమలయంబునకుం బోదము.

సౌదా.—అయ్యా! అట్లే చేయుదము.

(ఉభయు లాకాశయానము నిరూపించు చున్నారు)

సౌదా.—అయ్యా! నేను విశ్రాంతి లేకుండ రాంజాలను.

విద్యా.—అట్లయిన నేపర్వతము మీందనైన నించుకసేపు విశ్రమించివెళ్ళుదము.

సౌదా.—అయ్యా! అదినాకుం బ్రియము.

(ఇద్దఱుం దిగుచున్నారు.)

విద్యా.—సౌదామిని! చూడుము చూడుము.

తే. గీ. వనధిపరివృతయగుభూమి పడెడునట్లు
లంబుదముల వెన్కకుం ద్రోయునట్లు దోంచె
నహహా! క్రొక్కాఱు మబ్బులయట్టులున్న
యీవిజృంభమాణ పటుమహీధరములు.

కళ్యాణీ! యీపర్వతము మనకు ముహూర్తకాల మాతిథ్యమిచ్చుటకుం దగియున్నది. అందువలన విశ్రమించి పోవుదము.

సౌదా—అయ్యా! అట్లేచేయుదము.

విద్యా సౌదామిని! పుష్పించిన వృక్షములనుండి యాఱవభాగము గ్రహించుట మనకుధర్మము. అందువలన వృక్షములు ఋణవిముక్తము లగునట్లు చేయుదము.

సౌదా—అయ్యా! అట్లుచేయుదము.

(అనిపూవులు గోయుచున్నారు.)

విద్యా:—(అవిమారకుని జూచి) అహో! యెవ్వఁడితఁడు? ఆహా తెలిసినది. మంత్రిభ్రష్టుఁడైన విద్యాధరుఁడు గదా. ఏలయన నిటువంటిరూప మనుష్యుల కుండదు. అదృష్టవశమువలన నీతఁడు కనఁబడినాడు. కానీ నేనును దనపూర్వ వృత్తాంతము మరచిన యాతని నడిగెదను.

అవిమారకుఁడు:—సరే! దేవకార్యము దీర్చితిని. ఈశైలము నుండి పడియెదను. (పక్కనుఁజూచి విధ్యాధరుంగనుఁగొని) ఓహో! యెవ్వఁడితఁడు? నేనుకలగనుచున్నానా? నేనునిద్రించుట లేదే. అంత్యకాలమునందు మనుష్యులకు వైపరీత్యములు గనఁబడును. ఇది యదియే యైయుండవచ్చును. అట్లుకనఁబడుట మూఢచిత్తులకుఁ గదా! నేనో సర్వమెఱిఁగినవాఁడను. సరే! యీయన నడిగెదను. అయ్యా! యేకులాన్వయము నీచేత నలంకరింపఁ బడుచున్నది!

విద్యా:—విను! నేను మేఘనాదుఁడనువిధ్యాధరుఁడను. ఈమె నాకుటుంబిని. పేరు సౌదామిని. నేఁడు భగవానుఁడైన యగస్త్యునారాధించుటకు విద్యాధరులచేతమలయపర్వతము మీఁద నుత్సవమారంభింపఁ బడినది. అక్కడికి మేమును వెళ్లవలసియున్నాము. ఇక్కడ ముహూర్తము విశ్రమించి పోవలెనని దిగినాము. ఇదే మా వృత్తాంతము. నీవెందుచేత భూతలమును దేవలోకము చేయుచున్నావు?

అవి.—(తనలో) ఇతనితో నేమిచెప్పుదును? మరణము ప్రా

ప్తించినయీసమయమున నసత్యము వచింపఁగూడదు.(ప్రకాశముగా) అయ్యా! నేను సౌవీరరాజపుత్రుఁడను అవిమారకుఁడు నాపేరు.

విద్యా:—(తనలో) ఇదియబద్ధము. ఇది మనుష్యాకృతికాదు. (ప్రకాశముగ) అట్లయిన నీవేకాకివై యిచ్చటి కేలవచ్చితివి.?

అవి:—(తనలో) ఏమిచెప్పుదును. (తలవంచుకొని గూరుచుండును.)

విద్యా:—(తనలో) సరే! నేనె తెలిసికొనియెదను. (విద్యనుప్రయోగించుచున్నాఁడు) అహో! కష్టము. ఇతఁడు భగవానుఁడైన యగ్ని దేవునిపుత్రుఁడు తన్నుఁ దానెఱుఁగఁడు. కున్తిభోజపుత్రికయైన కురంగి నభిలషించి కొంతకాల మామెనుగూడిరమించి గుట్టు బైటఁబడినపిదప నం దుండి వెడలి వచ్చినాఁడు. మరల నారాజాంతఃపురము బ్రవేశించుట కుపాయముఁ గనిపెట్టలేక మరుత్ప్రపాతము సేయఁదలఁచి యీపర్వతమెక్కినాఁడు. ఆబాలికయు నచ్చట జీవన్మరణ మనుభవించుచున్నది. పాప మితనికి నే నీకార్యమున సాయముచేసెదను. (ప్రకాశముగ) ఓయవిమారక! మిత్రిత్వ మనఁగా మిష లేనిది కదా. నీగుట్టు నే నెఱిఁగితిని. దానిని నీవు కప్పిపుచ్చఁ జాలవు.

అవి:—చెప్పుము?

విద్యా:—నేఁడు మొదలుకొని మనకిరువురకుసఖ్యమగుఁ గాక నీయవస్థ సకలము మాకుఁ దెలిసినది. ప్రాణపరిత్యాగము నిమిత్తము నీ వీపర్వత మెక్కితివికాదా?

అవి:—మిత్రుఁడా! అదినిజమె.

విద్యా:—నీవునాయందిట్లు విశ్వాస ముంచుటచేత సంతసించితిని. ఈవిషయమున నీయాజ్ఞ యైనపక్షమున నందుఁబ్రవేశించుట కుపాయమున్నది. నీవేమి చేయుదువు?

అవి:—(సంతోషముతో) మాలుమాటెందుకు? పరివేశించె దను. ఈపరియత్న మందు కేగదా.

విద్యా:—మిత్రుఁడ! అట్లైన నుంగరము చూడుము. (అని యుంగరముఁ జూపుచున్నాఁడు.)

అవి;— మిత్రుఁడ! దీనిప్రయోజన మేమి?

విద్యా:—ఈయుంగరము కుడిచేతివ్రేలికిఁ బెట్టుకొన్న యెడల నీవెవరికిఁ గనఁబడవు. ఎడమచేతికిఁ బెట్టుకొన్న పక్షమున నెప్పటి యట్లనుందువు.

అవి:—మిత్రుఁడ! యిదినిజమా?

విద్యా:—ఇదిగో నీకుఁ బ్రత్యక్షముగాఁజూపి నమ్మకము గలి గించెదను. మిత్రుఁడ! నీకు నే నగుపడు చున్నానా?

అవి:—ఆ చూచుచున్నాను.

విద్యా:—అవహితుఁడవు కమ్ము.

అవి:—అవహితుఁడనై యున్నాను.

విద్యా—(కుడిచేతివ్రేలికిఁ బెట్టుకొని) మిత్రుఁడ! నీకు నే నగుపడుచున్నానా?

అవి—మిత్రుఁడ! నీడయేని గనఁబడుట లేదు. శరీరమెట్లుగనఁ బడును? లోకమందు సుఖవంతు లిట్టివారే కదా!

చ. విలసితమంత్రశక్తి నొకవేళఁ దిరోహితులౌచు నొండువే
ళల వివృతాంగు లౌచును విలాసముతో వనితాసహాయులై
మెలఁగుచు శైలశృంగముల మింటను నెవ్వరు సంచరింతు రా
యలఘులె సౌఖ్యవంతులుఁ గృతార్థులు వారలె సర్వవేత్తలుౘ.

కానీ! నేనీయంగుళీసాహాయ్యమునఁ బరివేశించెదను.

విద్యా—(ఉంగర మెడమచేతికిఁ బెట్టుకొని) అట్లైన నుంగ రముఁ దీసికొమ్ము.

అవి.—(తీసికొని) అనుగ్రహింపఁబడితిని.

విద్యా—కాదుకాదు. నేనేయనుగ్రహింపఁబడితిని. ఏలయన-

క. తనకడ రత్నముగలదని
తనియఁడుసుమి సజ్జనుండు దాని న్మదిఁ గో
రినపాత్రి యాచకునకున్
వినయముతో నిచ్చి మిగుల వేడుకఁ జెందున్.

అవి.—నాకొకటి సంశయముకలదు. ఇది నాశరీరముమీఁదఁ బెట్టి పరీక్షించినయెడల నెట్లుండునో చూడవలయును.

విద్యా—అట్లైన నీకుడిచేతివ్రేలికిఁ బెట్టుకొమ్ము.

అవి.—మంచిది. (కుడిచేతివ్రేలికిఁ బెట్టుకొనును.)

విద్యా—మిత్రుఁడా! కత్తిపుచ్చుకో.

అవి.—మంచిది (ఖడ్గముపుచ్చుకొని విస్మయముతో) అహో! యేమి యీఖడ్గముయొక్క పరిభావము.

తే. గీ. అశని పరిచ్ఛన్నరూపంబు నందెవొక్కొ-
మెఱుపు ఖడ్గకృతంబయి మెఱయునొక్కొ-
రవికృతం బైనదీప్తిఁ దిరస్కరించి
యాక్రమించెను దావాగ్ని యడవి నెల్ల.

విద్యా—అహో! యేమి యీయగ్నిపుత్రుని వీర్యము. ఈఖడ్గముయొక్కపరిభావము విద్యాధరులలో నైనఁ గొందఱు మాత్రమే సహింపఁగలరు. భగవానుఁడైన యగ్నిదేవుఁడే యీతని రక్షించుచున్నాఁడు.

అవి.—(ఖడ్గముఁజూచి)అహో! విద్యాభగవతుల ప్రభావములు

తే. గీ. దివ్యమగు పరిభావంబు నొందితిని నేను
నంతియే కాదు దివ్యుండ నయితిసుమ్మి

సాధుగుణవిశిష్టులు గానిజనము లింక
నెఱుఁగఁజాలరు నా దేహ మెదుట నున్న.

మిత్రుఁడా! నాపనియైనది. ఖడ్గము పుచ్చుకొ.

విద్యా—సరె నీయిష్టము. ఈయుంగరముదాల్చి యతఁడేగాక తాల్చిన వానిం దాఁకినవాఁడును, వానిం దాఁకినవాఁడును గూడఁ గనఁబడరు. ఇది నిశ్చయము.

అవి—మిత్రుఁడ! సంతసించితిని. ఇది యభ్యుదయముకంటె నభ్యుదయము. మిత్రుఁడ! నానిమిత్తము నీకాలస్య మైన దనుకొను చున్నాను. ఇప్పుడు వేళాతిక్రమణము కాఁగూడదు.

విద్యా—సరె, నీసెలవయినయెడల నేను బోయెదను.

అవి—వేయిమాటలేల?

తే. గీ. అనఘచరిత! మీవంటివిద్యావశులకు
సేయఁగలమె ప్రత్యుపకృతి చిన్నదైనఁ
బ్రాణ మిడుట నమ్ముడుబోతి నయ్య నీకు
భృత్యుఁడను జేయఁ బనుపు నీప్రియ మదేమొ.

విద్యా—నీబుద్ధి నిష్కపట మైనదని యెఱుఁగుదును. నీవు నామాట ననుసరింపఁ దలఁతు వేని—

చం. నెనరున నన్దలంపు మెద నీప్రియురాలికి నాదుపేరియసిన్
నను నెఱిఁగింపుమీ గరుణ నాగతులం గనిపట్టుచుండు మీ
జనపతిపుత్రి నాటలరసంబులఁ గౌతుకవార్ధిఁ దేల్పుమీ
పని గలయప్డు నే నటకు వచ్చి మెలంగెద నీదుసన్నిధిన్.

అహో! పురుషస్వభావ మెటువంటిది. నాకు నిన్ను విడువ మనస్సుబుట్టుటలేదు. మిత్రుఁడా! మేము వెళ్లుచున్నాము.

అవి—సరె. మీరువెళ్ళుఁడు. పునర్దర్శనమగుఁగాక!

విద్యా—మంచిది.

(ప్రియురాలితోఁగూడ విద్యాధరుఁ డెగురుచున్నాఁడు.)

అవి.—(పైకిఁజూచి) అదిగో! పూజ్యుఁ డైన మేఘనాదుఁడు గగనార్ణవమునఁ బ్రవేశించినాఁడు. ఇతఁడు—

సీ. అనిలవేగముచేత నగ్రికేశంబులు
మిగుల నక్కజముగ నెగురుచుండ
మేఘము ల్పలువూఱు మేనితో నొరయుటఁ
గమ్మని మైపూఁత కరఁగిపోవఁ
గుడిచేతితోడ నెన్నడుము గట్టిగఁబట్టి
వెనువెంటఁ బ్రియురాలు వెడలుచుండ
మకుట సంస్థితలసన్మాణిక్యరుచులు తా
రలకాంతిఁ గరముఁ దిరస్కరింప

తే. గీ. నుత్తరీయంబు చలియింప నురుకృపాణి
మొలను దట్టితో బిగఁ గట్టి పోవుచుండె
నంత కంతకుఁ జవమున నల్పమైన
యాకృతిని దాల్చె ఘనుఁడు విద్యాధరుండు.

ఈమెయు విద్యాబలమున మగని ననుసరించుచున్నది.

చ. జవమునఁ గొప్పు వీడి యిరుచక్కియలం జరియించుచుండఁ జ
న్గవ పెనుద్రేఁగుచే నసదుఁగా నసియాడఁగ నిండుకూర్మి మై
థవుఁ డిడుపూర్వకాయమును దప్పక కేల గ్రహించి మబ్బుల
న్గవిసినక్రొమ్మెఱుంగుగతిఁ గన్పడి పైదలి యిటె మాయ మా.

పూజ్యుఁ డైన మేఘనాదుఁడు వెళ్ళిపోయినాఁడు. నేనును నేఁడె నగరాభిముఖుఁడనై పోయెదను. సరె కొండ దిగియెదను. (దిగి) అబ్బా! అలసిపోయితిని. కాని, యీతాతిమీఁద నొక్క ముహూర్తము కూర్చుండి పిదప వెళ్ళెదను. (కూర్చుండును.)

(అప్పుడు విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విదూ.—అహో! యేమి పూజ్యుఁడు సుగృహీతనామధేయుఁడు నగు సౌవీరరాజుయొక్క దురదృష్టము. చిరకాలము సంతానహీనుఁడై నిజనియమవిశేషములచేతను బరమేశ్వరప్రసాదంబులచేతను మనుజలోకదుర్లభుఁడైనసత్పుత్రునిఁ బడసియు వెండియు సంతానహీనుఁడే యయ్యెను. నా కంత్యకాల మాసన్నమగుటచేతను బంధుజనుల భాగ్యదోషముచేతను రాజకుమారుఁ డిట్లు పరిభ్రష్టుఁడయ్యెను. రాజకుమారుఁడు క్షేమముగా వెళ్ళినాఁడని నేఁడెకదా రాజపుత్రిక చెప్పినది. అతిసుకుమారుఁడైన రాజకుమారుఁడు మదనార్తుఁడై యేకాకియై పరిభ్రష్టుఁడైనప్పుడు కుశలముగా నున్నాఁడని యెవ్వఁడు చెప్పఁగలఁడు? నేనీప్రపంచ మంతయు సంచరించి మారాజకుమారుని గాని యతనిశరీరమునుగాని చూచి తీరెదను. అట్లు చూడఁజాలనినాఁడు పరలోకమునకైన నేగి యతనికి సాయము చేసెదను అబ్బ! యలసిపోయితిని. కానీ, యీచెట్టునీడ నొక్కగడియ విశ్రమించి వెళ్లెదను.

(నిద్రించుచున్నాఁడు)

అవి.—సంతుష్టునియొక్క యవస్థ యెట్టిదో కదా! నేను సుఖముగా నంతిపురివిడిచి పోయినానని యతఁడు విన్నపక్షమున మంచిదె! విననియెడల పాప మాబ్రాహ్మణుఁడు నిష్కారణముగఁ జచ్చిపోవును. అతఁడు లేనియెడల నాప్రయత్నము లన్నియు వ్యర్థములగును. అతఁడు—

తే. గీ. ఆలమున జోదు, గోష్ఠిలో హాస్యరసము'
అరులయెడ సాహసుఁడు, శోకమందు గురుఁడు,
పలుకు లేల నాహృదయోత్సవంబ యతఁడు
రెండుభాగము గ్గద నాశరీర మరయ.

 

(అంతటఁజూచి) ఎవఁడో బాటసారి యీచెట్టునీడను బండుకొన్నాఁడు. (సమీపించి) నాహృదయమున కభ్యుదయము దైవవశమునఁ గలిగినది. ఇతనిం గౌఁగిలించుకొనుటకు నామనము తత్తరపడుచున్నది.

విదూ—(మేలుకొని) అబ్బ! చాలసేపు నిద్రపోయితిని. ఇఁక వెళ్ళిపోయెదను. విభ్రష్టమనోరథులకు విశ్రాంతి యుండునా. (అవిమారకునిఁ జూచి) ఏమి! పూజ్యుఁడై నయవిమారకుఁడా.

అవి—ఇదిగో! నా స్నేహితుఁడు. సంతోషము.

(ఒండొరులం గౌఁగిలించుకొనుచున్నారు).

విదూ—(పక్కనవ్వి) ఓమిత్రుఁడ! యింతకాలము నీవేమి చేసితివో చెప్పు?

అవి—మిత్రుఁడ! నేనుచేసిన దిది—(అని ఉంగరము కుడిచేతి వ్రేలికిఁ బెట్టుకొని మాయమగుచున్నాఁడు)

విదూ—హా! హా! మిత్రుఁడా నీవెక్కడున్నావు? ఏమిది! కనుపడఁడు. అతనిమీఁదనే ధ్యానము పెట్టుకొని యతఁడు కనఁబడినాఁడని భ్రమపడితినిగాఁబోలు! కాదు కాదు. స్ఫుటము చేసెదను. ఓ మిత్రుఁడ! నీవు దాఁగితివా గట్టియొట్టుపెట్టెదను.

అవి—మిత్రుఁడ! ఇదిగో నేను.

విదూ—ఎక్కడ! ఎక్కడున్నావు?

అవి—(ఉంగర మెడమచేతికిఁ బెట్టుకొని) వయస్య! ఇదిగో నేను.

విదూ—మొట్టమొదట నిజమైన యవిమారకుఁడు కనఁబడెను ఇప్పుడు మాయావిమారకుఁడు కనఁబడుచున్నాఁడు. ఓయీ మాయావిత్తక! ఇన్నిమాయలు నేర్చినవాఁడవు నీవేల కన్యాంతఃపురమందుఁ బ్రచ్ఛన్నరూపములో సంచరింపలేదు.

అవి—మిత్రుఁడ! ఇప్పుడే కాదా యిది లభించినది.

విదూ—ఆశ్చర్య మాశ్చర్యము. ఇదిప్పు డెక్కడనుండి వచ్చినది?

అవి—ఆవృత్తాంత మంతయు నంతఃపురమందుఁ జెప్పెదను.

విదూ—ఇప్పుడు నాకాఁకలి యగుచున్నది.

అవి—మూర్ఖుఁడ! నీవు త్వరగా రా. భోజనశాలకుఁ బోవుదము. నాచేయి విడిచిపెట్టకు.

విదూ—ఆశ్చర్య మాశ్చర్యము. నేనుఁగూడ నదృశ్యుఁడ నైనాను. నాశరీర మిప్పు డున్నదా లేదా? ఉమ్మివైచి చూచెదను. నా శరీరముమీఁదఁ బడునో లేదో. థూ. థూ.

అవి—మూర్ఖుఁడ! అట్లు చేయకు చేయకు. మన మిప్పు డాలస్యము చేయవద్దు. కాంతాసందర్శనార్థము నామనము తత్తరపడుచున్నది. (విదూషకుని లాగుచున్నాఁడు.)

విదూ—నాకంతతొందర లేదు.

అవి—మూర్ఖుఁడ! భోజనమునకైన నీకుఁ దొందరలేదా?

విదూ—ఉన్నది కాని కొంచెముకాలమువిశ్రమించిపోవుదము.

అవి—కురంగి నన్నుఁ దలఁచుకొనుటలేదా?

విదూ—ఆనగ్నాంధశిరోమణిక యింకను బ్రతికియున్నదా?

అవి—మిత్రుఁడ! నేను వేఁడుకొనుచున్నాను. త్వరగా రా.

విదూ—గర్భాదానమునకుఁ బోవు బ్రహ్మచారివలె నీ వింత తొందరపడుచున్నావేమి?

అవి—మూర్ఖా! యిటు రా.

విదూ—నన్ను లాగకు. వెంట నడిచెదను.

అవి—(నడచి) ఇదె! నగరము.

విదూ—ఈనగరశోభను జూచుచున్నాను.

అవి—ఇదె రాజగృహము.

మ. మును పేరాజగృహంబు రాతిరి భయమ్ము న్బొందుచున్ నెమ్మనం
బున నే సాహసవృత్తిఁ జొచ్చితినో యాభూపాలగేహంబె నేఁ
డనుమానంబుఁ దొఱంగి పట్టపగలే యత్యంతమాయాబలం
బున నేఁ జొచ్చెద జ్ఞాని పండితగణంబుం జొచ్చుచందంబునన్.

(నడచి) కురంగి స్నానముచేసి యీపాటియప్పు డీమేడమీఁదఁ గూర్చుండును.

విదూ.—ఎక్కడో యొకచోటఁ బ్రివేశింతము రమ్ము. భిక్షాకాల మతిక్రమించుచున్నది.

అవి.—రా. అభ్యంతరమందిరమె ప్రవేశింతము. (ప్రవేశించి) ఇక్కడ—

చ. మునుపు పురంబు నంతిపురమున్ నిలయం బయి యుండెడిన్ మన
స్వినులకు దుర్వియోగమున వేఁగెడువారికి నిప్పుడన్నదో
యనయము సంతసించెడు కృతార్థులకున్ సుకృతంబు లాచరిం
చినమహనీయమూర్తులకుఁ జిత్రముగా నిది తానకం బగున్.

(నిష్క్రమించుచున్నారు).

ఇది చతుర్థాంకము.

---

# శ్రీ వి మా ర క ము

## పంచమాంకము.

(అప్పుడు కురంగియు నళినికయుంబ్రవేశించుచున్నారు.)

నళి—భర్తృదారిక! సంతాపము చాలించు. కన్యాపురప్రాసాద మెక్కి కనులకు వేడ్క చేసికొందము.

కురం—సఖి! నీవు నా హృదయము నెఱింగితివా యేమి. ఓసీ! పరిజను లెఱుంగక వర్షకాల రమణీయము లయి, నెత్తావులు వెదఁ జల్లువకుళ సరళసర్జార్జుంకదంబ నీప నిచుళ ప్రభృతి పుష్పములను దెచ్చి నాకున్మాదము గలిగించిరి. ఈనెమిళ్ళు రాజకుల మానసంబున నతిపీతమర్ధభావము జేయుచున్నవి. అవి మనచేతఁ బలుమాఱు లాలింపఁబడిన వయ్యు దేశకాలపరిజ్ఞానము లేక సర్వజ్ఞత్వముఁ బూని యున్నట్లు కనఁబడుచున్నవి. శుకశారికలును వ్యాఖ్యానము సేయుట కారంభించినవి. మంత్రియైనభూతికునియొక్క శారికకూడ నా నెవ్వాగ నెఱుఁగక సర్వలోక వృత్తాంతము జెప్పుదు నని వచ్చినది. నారోగ మెట్లున్నదని యడిగి పరామర్శచేయ వచ్చిన జనముసైతము నన్ను బలవంతపెట్టి యేదోగొడవ చెప్పుదురు. అందుచేత నొక్కముహూర్తము మేడమీఁదఁ గూర్చుండఁ గోరుచున్న దానను.

నళి—సరె! నీ కేది యిష్టమో యది చేయుదము.

(ఇద్దఱు మేడ నెక్కుచున్నారు.)

కురం—సఖి! యిక్కడఁగూడ మహానర్థమే దాపుర మైనది. మెఱుపుదీపము ధరించి కాలమేఘము సిద్ధ మయినది.

నళి—భర్తృదారిక! బెంగ పెట్టుకొనకు. చూడుచూడు! క్రొత్తమబ్బులచేత నరికట్టఁబడిన సూర్యమండలముగలిగి రాలుచున్న

సన్న చినుకుతో నాకాశ మెంత రమణీయముగా నున్నదమ్మ.

కురం—చూచుచున్నాను. ఆకాశ మెంతో రమణీయముగా నున్నది నిజమే.

(అంతట నవిమారకుఁడు విదూషకుఁడుఁ బ్రవేశించుచున్నారు.)

అవి—మిత్రుఁడ! ఆకురంగి కనఁబడినది. ఈమె—

ఉ. రోగముచేత నీలలన రూఢిగ నెమ్మెయిఁ బూయకున్నఁ గా
లాగురుచందనంబులు, నిజాభరణంబులు దాల్ప కున్న, బల్
వేఁగుచు హావభావములు వీడిన, హేతువివర్జితంబు లౌ
నాగమముల్ బలెం దనరు నౌర! నిసర్గమనోహరాంగియై.

విదూ—అహో! సంతుష్టుఁడ నైతిని. నీవు సర్వలోకములందు నేనే చక్కనివాఁడ నని గర్వించు చున్నావు. స్వభావ రమణీయమైన యామె రూపముచేత నీ విప్పుడు జయింపఁబడినావు. నీ వియోగముచేత నీమెచిక్కినదని తలంచెదను. ఇట్లున్నను నీమె బాలచంద్ర రేఖవలె కనుబండువు సేయుచున్నది.

అవిమా—మిత్రుఁడ! నీ వతిపండితుఁడ వైనాఁడవే. ఏమీ యీ యాశ్చర్యము!

విదూ—ఓయి! నిత్యపరిచయముచేత నీవు నన్ను వేళాకోళము చేయుచున్నావు. కాని, క్రొత్తవాఁడు నన్ను చూచిన పక్షమున నా సంగతి యెఱుఁగక గొప్పబుద్ధిమంతుఁడ ననుకొని ప్రశంసించును. ఈ సంగతి నే నెఱిఁగి యీ నగరమం దెవరితోను సహవాసము చేసి గుట్టుబయటఁబెట్టుకొన లేదు.

అవి—చాలు! నీ యుదాసీనభావము చాలు! ప్రియురాలు బహుజనపరివేష్టితయ గుటచేత మనరాక దెలియఁజేయుటకు సమయము చిక్కకున్నది. అందుచేత నిప్పుడామె మేడమీఁద నున్నను మన మక్కడికే పోయి పలుకరింతము.

విదూ.—నీవు లెస్సగాఁ బలికితివి. మేడమీఁది కెక్కుదము.

అవి.—మిత్రుఁడ! చప్పుడు కాకుండ నెక్కవలయును.

విదూ.—అబ్బో! అది నాచేతఁ గాదు. అన్నము దిగబెట్ట కుండ నెవఁడు తినఁగలఁడు. నే నిక్కడనే కూర్చుండెదను. నీవే మేడ నెక్కు.

అవి.—నిన్ను విడిచితినా నీవు మరలఁ గనఁబడుదువా?

విదూష.—ఆమాట నేను మఱచిపోయితిని. తిరిగి చెప్పు!

అవి.—ఇటురా! (అని యెక్కి చూచి) మిత్రుఁడ! యిదిగో నాప్రియురాలు నళినికతోఁగూడ శిలాతలమందున్నది. ఈమె—

చ. వనటను దీన మౌమొగము వామకరంబునఁ జేర్చి కమ్మవి
ల్తునకు సహాయకారి యయి దుర్భర మయ్యెడువానకాఱు నో
ర్వనిదయి బాష్పబిందువులు వారణ సేయఁగఁ బైకిఁజూచుచున్
ఘన మగుచింత నొందెడును గంజదళాక్షి యలోలదృష్టియై.

కురంగి.—(తనలో) ఈజీవన్మరణముతో నేమి ప్రయోజనము? (ప్రకాశముగా) నళినిక! నీవుపోయి స్నానపరికరంబులు దీసికొని రమ్మని మాగధికతోఁ జెప్పు.

నళి.—అమ్మో! నిన్నొకతను విడిచి యెట్లు పోదునమ్మా. ఇక్కడెవరు లేరుగదా!

(అప్పుడు హారిణిక ప్రవేశించుచున్నది.)

హారిణిక—భర్తృదారిక! జయము జయము. నీతలనొప్పి యే లాగున్నదో కనుఁగొని రమ్మని యమ్మగారు పంపినారు. ఈ యౌషధము రాచికొనుమమ్మ!

కురం.—నళినిక! నీ విప్పుడే వెళ్ళు. ఇప్పుడు వర్షము కురియు నని తోఁచుచున్నది. అభినవ మయిన యాకాశతోయముతో నేను స్నానము చేయఁ దలఁచుకొన్నాను కాఁబట్టి స్నానపరికరములను

వేగము పంపు

నళి—అమ్మా! చిత్తము

అవి—ఈమె పరియత్నమేమి చెపుమ?

కురం—సఖి! ఒక్కసారి యిటురా.

నళి—ఇదిగో వచ్చితిని.

కురం—సఖి! నీశరీరము చల్లఁగా నున్నదా?

నళి—ఏమో నే నెఱుఁగను.

కురం—చెలీ! యిటువచ్చి నన్నుఁగౌఁగిలించుకో.

నళి—అట్లే చేసెదను. (అని కౌఁగిలించుకొను చున్నది.)

కురం—సఖి ! నీశరీర మతిశీతలము నతిమనోహరము నై యున్నది.

నళి—నేను కృతార్థురాల నైతిని.

కురం—సఖి! ఇప్పుడు నాశరీరతాపము నశించిన ట్లున్నది. (స్వగతము) అమ్మయ్య! సఖీపరిణయ మైనది. ఈమెశరీర సంసర్గము సమాప్తమైనది. (ప్రకాశముగా) నీ విఁక వెళ్ళు.

నళి—నీయిష్టము వచ్చినట్లు చేసెదను.

హరి—భర్తృదారిక! అమ్మగారితో నేమనిమనవి చేయుదును

కురం—మీయమ్మాయివిగతరోగయైస్వస్థయైనదనిచెప్పుము.

హరి—నీకెట్లు తెలిసినదని యామె యడిగినచో నేమని విన్నవింతును?

కురం—ఔషధవిశేషముచేత బాధ నివారణ మైనది. నేను చక్కఁగా నెఱుఁగుదునని చెప్పు.

హరి—అమ్మా! చిత్తము.

అవి—ఈమె ప్రయత్న మేమిచెపుమ!

గీ. వేఁడినిట్టూర్పు పలుమాఱు విడువఁజొచ్చె
సశ్రుపూర్ణనేత్రములతో నన్నిదెసలు

మాటిమాటికిఁ బరికించు, మౌనమూని
యేమి సేయంగఁ దలఁచెనో యిగురుఁబోఁడి.

కురం.—(తనలో) సరే! ఉత్తరీయము మెడకురిపెట్టుకొని మృతినొందెదను. (లేచి యట్లుచేసి యుఋముచప్పుడు విని భయపడి) అమ్మో! రక్షింపుము. రక్షింపుము. (అని పడుచున్నది.)

అవి.—మిత్రుఁడ! ఇఁకమీఁద నుపేక్షింపఁగలమా. (ఉంగర మెడమచేతికిఁ బెట్టుకొని) ప్రియురాల! భయపడకు భయపడకు.

(అని కురంగిని లేవఁదీయుచున్నాఁడు.)

కురం.—(సంతోషముతో) ఏమిది! ఇది నిజమేనా? నేను మాధురాల నైన ట్లున్నాను.

అవి.—ప్రియురాల! సంశయము విడువుము. (కౌఁగిలించుచున్నాఁడు.)

కురం.—ఆశ్చర్యము! ఒక్కక్షణములో నాశరీరతాప మంతయుఁ బోయినట్లున్నది.

అవి.—ఈమెయాలింగన మెంతసౌఖ్యప్రదమై యున్నది!

చ. నిరతమనోభియోగమున నీరజలోచన నాకు నెంతయుం
బరిచిత యయ్యు నెమ్మనమునం దాలికూటమియందుకంటెఁ గూ
ర్చె రసవిశేషముల్, పుడమిరేనికి సాహసలబ్ధమైన సం
గరజయలక్ష్మివోలె నధికప్రమదం బిడు నీమె నాకిటన్.

విదూ.—ఈమె యేడ్చుటకు మొదలుపెట్టినదా యేమి? అతిమాత్రసంతాపమెందుకు? అట్లయిన నేనుగూడ నేడ్చెదను. నాకంటినుండి యొక్కనీటిచుక్కయైన రాలకున్నది. నే నెట్లేడ్వఁగలను? మానాయన చచ్చిపోయినప్పుడు నే నెంతో ప్రయత్నముచేసి యేడుపుతెచ్చుకొంటిని. ఒక్క బాష్పబిందువైన రాలేదు. తండ్రి చచ్చినప్పుడే లేనిదుఃఖ మిటువంటిసమయములో వచ్చునా? సరే! ఏలాగో యొక

లాగునఁ గష్టపడి యేడుపుదెచ్చుకొని విచారించెదను.

అవి___అతిపరిహాసముచాలించుము. స్నేహ మనఁగా నిర్వ్యాజ మైనదికదా?

చ. సమయ మెఱుంగకుండ విరసంబుగ హాస్యము చేయు చుంట మి
త్రిమ కడుదూషణీయమగు తానకబుద్ధి నిజంబ కార్యమో
గమున వివేకబాలిశులగాత్రములుండు సమానరీతిగాఁ
గ్రిమమున వారిబుద్ధులవికాసముమాత్రము భేద మయ్యెడున్.

(అప్పుడు నళినిక ప్రవేశించుచున్నది.)

నళిని___హారిణికా! హారిణిక! ఏమే తలుపు మూసియున్నది? అయ్యో యెంతకష్టము. తలుపుమూయుటచేత నీమె తన్నపగతసంతాపురాలుఁగాఁ జేసికొనుచున్నదని తలంచెదను. హారిణికా! హారిణిక! అయ్యో! అయ్యో! అంతపని యైయుండును.

అవి___కంఠధ్వని నళినికదివలె నున్నది. మిత్రుఁడా! తలుపు తీయుము.

విదూ___నీచిత్తము వచ్చినట్లు చేయుదును. (తలుపు తెఱచి) మహానుభావురాల! రా! రా!

నళి___అమ్మో! యిప్పు డీపురుషుఁ డెవఁడు?

విదూ___ఆహాహా! ఎంతచక్కఁగాఁ దెలిసికొంటివి. ఓహో! రాజభవనమందుండుటచేతఁ గలిగిన తెలివితేటలు గాఁబోలివి. నన్ను జూచి పురుషుఁ డని యెవరనుకొనుదురు? నే నాఁడుదాననుగాని మగవాఁడను గాను.

అవి___నళినికా! ఈవలకు రా.

నళి___ఓహో! భర్తృదారకుఁడా? రాజకుమార! నమస్కారము. అయ్యో! యీపురుషుఁ డెవఁడు?

విదూ___నేను చేటిని. నాపేరు పుష్కరిణి.

అవి.—సంతుష్టుఁడనుసఖుఁడు నాకొకఁ డున్నాఁడని పలుమా ఱు మున్ను చెప్పుచు వచ్చితినికాదా ! అతఁడే యీబ్రాహ్మణుఁడు.

నళి.—ఔనా నీబ్రాహ్మణుఁడు మున్నొకసారి నాకు నగరా పణాళిందమునందుఁ గనఁబడినాఁడు.

విదూ.—ఔనౌను! యజ్ఞోపవీతముచేత నేను బ్రాహ్మణుఁడను; చీవరముచేత రక్తాంబరుఁడను. గుడ్డవిప్పితే శ్రీమణకుఁడను. నీచేతిలో దేమిటి ?

నళి.—ఉపస్నానము భర్తృదారికనిమిత్తము తెచ్చితిని.

విదూ.—ఆఁకలిచేత నేడ్చుచున్న రాజపుత్రికకు నీయుపస్నాన మెందుకు? త్వరగా వెళ్ళి భోజనము తీసికొనిరా! నేనీయగ్రవీథమందుఁ గూర్చుండెదను.

నళి.—ఓయీ బ్రాహ్మణబ్రువుఁడ! ఇదికూడ భోజన మను కొనుచున్నావా? అదియెల్ల నటుండనిమ్ము. అనేక పురుషసంపాతము గల రాజమార్గమున నెట్లు పట్టపగలే భర్తృదారకుఁడువచ్చి యీమం దిరముఁ బ్రవేశింపఁగలిగెను?

అవి.—అది యంతయు సంతుష్టుఁడై నీకుఁ జెప్పఁగలఁడు.

నళి.—ఈబహుమానవచనము వెళ్లుమని నాకు సెల వొసంగు చె. సరే! యితనిం దీసికొని చతుశ్శాలఁజొచ్చి గోష్ఠీజనముతోఁ గూడ నితనివలన వృత్తాంతమంతయు వినియెదను. బ్రాహ్మణుఁడ రా రా!

(అని లాగుచున్నది.)

విదూ.—అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యము.

కురం.—ఈబ్రాహ్మణుఁడు హాస్యగాఁడు.

అవి.—మిత్రుఁడ! నీవెగతాళిపా లగుచున్నావు.

విదూ.—నే నెగతాళిపాలగుటలేదు. ఈమె యెగతాళిపాలగు చున్నది. ఎందుచేతననఁ దనయవస్థ తెలిసికొని యేదో చేయఁబూని

మేఘగర్జనము విని యంతయు మఱచి నేలఁ జదికిలఁబడినది.

కురం___అయ్యో! అది యీయనకూడ చూచినాఁడు కాఁబోలు!

నళి___అయ్యా! బ్రాహ్మణుఁడ! రావయ్యా. నిన్ను వేఁడికొనుచున్నాను.

విదూ___భోజనము పెట్టుదువేని నేను నీవెంట వచ్చెదను. ఆగంతుకునకు భోజనదానమేకద యిష్టము.

నళి___భోజనమేకాదు. నాసర్వాభరణము లిచ్చెదనురావయ్య

విదూ___నెయ్యిపేరుచెప్పినమాత్రమునఁ బైత్యము నశింపదు. ఇయ్యఁదలఁచుకొన్న దేదో నాచేతిలోఁ బెట్టు.

నళి___అట్లేచేయుదును. (నగలు తీసి యిచ్చుచున్నది.)

విదూ___ఇదిగో విను,

నళి___ఓయీ! మూఢబ్రాహ్మణ! చతుశ్శాలఁ బ్రవేశించి గోష్ఠీజనముతోఁ గలిసి నీవృత్తాంతము విందును రా.

విదూ___సరె!పూజ్యురాలైనయామెసెలవుఁగైకొనివచ్చెదను.

నళి___ఇఁక రాకపోవుటకు నీకేమధికారమున్నది? నా నగలన్నియుఁ బుచ్చికొని నాకు మగఁడవైతివి. తత్క్షణమే రా! (విదూషకునిఁ జేతితోఁ బట్టుకొనుచున్నది.)

విదూ___ఈలాగున లాగకు! లాగకు! నేను మిక్కిలి సుకుమారుఁడను.

నళి___ఎఱుఁగుదు నీసుకుమారత్వ మెఱుఁగుదు. సుకుమారుఁడవైతివేని త్వరగారా!

విదూ___ఇదిగో వచ్చుచున్నాను.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

అవి___ప్రియురాల! చూడు! పరమదర్శనీయములై ప్రావృట్కాలపల్లవములై యున్న యీమేఘములం జూడుము.___

సీ. పౌర్ణిమాహోఘోషణాడంబరానేక
రూపక్రియలు గల్గి రుచిరములయి
యింద్రదత్తంబులై నృత్తగీతంబులఁ
బ్రోడకా వెలఁదులపోల్కి నొంది
చుక్కలపేరిటి చక్కెరబోఁడులు
దాఁగెడు తెర లయి దనరుచుండి
పాలయల్కలనుదాల్చుపాలఁతిమిన్నలకు స
ల్కలుదీర్చి సంధిపాలకము లగుచు
సర్వశైలంబుల స్నానంబుచేయించు
బెడిదంబుకా నీటికడవ లనఁగ
మెఱుపుపాములు దాఁగుమేటిపుట్టలనంగ
నాకసంబున మొల్చు మోక లనఁగ

గీ. పరిసవబాణబాణ నిశాణఫలకములన
వారిరాశి సలిలభైక్షహారవములు
అమరయంత్ర ప్రపలిన చంద్రాగ్గళములు
కాఱుమబ్బులు కూర్చెడుఁ గౌతుకంబు.

కురం—ఇప్పు డివి మిక్కిలి దర్శనీయము లైనవి.

అవి—అహో! ఏమియీధారలవిపులతయు విరళతయు.

తే. గీ. మొగిలు గగనార్ణవోర్మిలపగిది మెఱయు
నంబుదపరిరోహములటు లమరె ధార
లసురకాంతలబొమలట్టు లలరుమెఱుపు
లంబుదకుచమర్దనయోగ్యయౌవన మిది.

కురం—ఆర్యపుత్ర! మేఘుఁడు వర్షించుట కారంభించినాఁడు.

అవి—ప్రియురాల! రమ్ము. అభ్యంతరమందిరమునకుఁబోదము.

కురంగి—(సంతోషముతో) ఆర్యపుత్రుఁడు సెలవిచ్చినట్లే చేసెదను.

(ఇరువురు నిష్క్రమించుచున్నారు.)

# అవిమారకము

## షష్ఠాంకము.

(అప్పుడు దాది ప్రవేశించుచున్నది.)

దాది—అహో! విధినియోగము లెంత నియమరహితములు ఏలయన రాజపుత్రికను మొట్టమొదట సౌవీరమహారాజుగారు తమ కుమారుఁడైన విష్ణుసేనున కిమ్మని కోరినారు. ఇప్పుడు జాతి యేదో తెలియనిమానుషలోకదుర్లభాకృతివిశేషము గల యొకానొకనితో నామెకు సంయోగము కలిగినది. నేఁడు కాశిరాజపుత్రుఁడైన జయవర్మను సుదర్శనాదేవితోఁగూడ మంత్రియైన భూతికుఁడు తోడ్కొని వచ్చి యంతఃపురమునందుఁ బ్రవేశపెట్టినాఁడు. కాశిరాజు యజ్ఞవ్యాపారమునం దుండుటచేత స్వయముగా రాఁజాలక పోయెను. ఇది యేమగునో కదా!

(అప్పుడు వసుమిత్రి ప్రవేశించుచున్నది.)

వసుమిత్రి—అహో! జ్యోతిష్కులు విషమస్వభావులుకదా! తమ ముహూర్తవిశేషమునే యెక్కువగాఁ బాటింతురు. కాని, పని తొందర నెంతమాత్రము లెక్కసేయరు. పెండ్లికుమారుఁడు నేఁడే వచ్చినాఁడు. వివాహముకూడ నేఁడే నిశ్చయింపఁబడినది. ఏమిది! దాదియైనజయద యప్రసన్నయై యేదో చింతించు చున్నట్లున్నది. జయద! అమ్మగారు నిన్ను రమ్మని సెలవిచ్చినారు.

దాది—ఎందుకో యెఱుఁగుదువా?

వసు—మఱెందుకు. ఈకార్యమునుగుఱించియాలోచించుటకే

దాది—ఇప్పు డమ్మగారి యభిప్రాయ మేమి?

వసు—తనవంశస్థుఁడైనవిష్ణుసేనునియొక్కయవస్థ దెలియక

పోవుటచే బిడ్డను జయవర్మ కిచ్చుట కిష్టపడకున్నది. మహారాజుగా రును సౌవీరరాజపుత్రునిజాడ తెలియక యధికసంతాపము నొందు చున్నారు.

(అప్పుడు నళినిక ప్రవేశించుచున్నది.)

నళిని—కష్టము లన్నియు నేదో సంకేత మేర్పఱచుకొని యొక్కసారిగా వచ్చి పడినట్లున్నవి. ఏమిది! మాయమ్మ వసుమిత్రి తోఁ గూడ నేదో యాలోచించుచున్నది. ఈమెను సమీపించి కష్ట వృత్తాంత మేమో వినియెద.

వసు—సఖి! నళినిక! యిటు రావె. కంచుకిసహవాసముచేత నీ వంతఃపురవృత్తాంతము లెస్సగా నెఱుఁగుదువు.

నళి—క్రొత్తవిశేష మొకటియున్నది. అది మీకుఁ దెలుపు టకే నేను వచ్చితిని.

వసు—అమ్మాయి! చెప్పు.

నళి—సౌవీరరాజుయొక్క మంత్రులు మనమహారాజుగారి యొద్దకు దూత నొక్కనిఁ బంపిరి. ఆదూత యిట్లు మనవిజేసెను. "మామహారాజుగారు మీనగరమునందు సపుత్రదారకళత్రముగఁ బ్రచ్ఛన్నముగ నున్నారని మావేగులవాండ్రు చెప్పిరి. ఆవృత్తాంత ము మీరు చక్కఁగాఁ బరిశీలించి కనిపెట్టవలయు."

ఉభయులు—ఏమి! ప్రచ్ఛన్నవేషముతో నున్నారనియా. తరువాత తరువాత?

నళి—అవియెల్లవిని యతఁడిచ్చినజాబు చివరంటఁ జూచికొని మనమహారాజుగా రార్యభూతికుని వెంటఁ బెట్టికొని వారిని వెదుకం బోచ్చిరి.

దాది—ఏ మగునో చెప్పుమా?

వసు—సరే! నీవంతఃపురమునకుఁ బొమ్ము,

నళిని—అట్లే పోయెదను.

వసు—సరె మనముఁగూడఁ బోయి యమ్మగారి దర్శనము చేయుదము రమ్ము.

దాది—అట్లే చేయుదము.

(ఇద్దఱు నిష్క్రమించు చున్నారు.)

ఇది ప్రవేశకము.

(అప్పుడు సౌవీరరాజభూతికులతోఁగలిసి కుంతిభోజుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

కుంతి—

మ. చిరకాలంబుగతించె నిన్నని సఖా చింతిపుమీ శైశవ
స్ఫురితస్నేహముకౌఁగిలింపవె ననున్ భూపాల! గాఢంబుగాఁ
బరమప్రీతిని తెప్పపా టొదవకుండన్ నిన్ననన్ చిత్తమ
బ్బురపఁ దొందరనొందెమైత్రియునవీభూతంబుగాఁదోఁచెడిన్

సౌవీ—నీయిష్టమువచ్చినట్లు చేసెద (అని కౌఁగిలించుకొను చున్నాఁడు)

కుంతి— తే. గీ. చింత గవియుట మతిమెల్లఁజెదిరిపోయెఁ
బలుకు గద్గదమయ్యె బాష్పహత మాటఁ
గలుష మయ్యెను గన్నిటికతన మొగము
హర్షసమయంబున వికార మయ్యె నార. 2

సౌవీ—నీసమాగమముచేత నేఁడు మిక్కిలి పరిహృష్టుఁడనయి తిని కాని పుత్రిస్నేహము మిక్కిలి పరిబల మైనదికదా?

తే. గీ. పుత్రివిషయ మానాశోకపూరమెల్ల
హృదయగత మయి జృంభించె నిన్నినాళ్ళు

నీసహాయంబు లభియించె నేఁడు గాన
బాష్పరూపంబు దాలిచి బైటఁబడియె.

కుంతి—పుత్రవిషయకశోక మేమి?

భూతిక—దేవరవారికిఁ దెలియదు కాఁబోలు! ఈయన కుమారుఁడు సంవత్సరమునుండి కనఁబడుట లేదు.

సౌవీ—పుత్రస్నేహము మిక్కిలి ప్రబల మైనదికదా! చూడు

తే. గీ. అసమరూపదోర్బలధుర్యు నధికశౌర్యుఁ
బుత్రు నవిమారకుఁ దలంచి పొక్కుచుంటి
నతఁడు తావకపదరజోంచితశిరస్కుఁ
డైన నాకంటె నవని ధన్యాత్ముఁ డెవఁడు.

భూతి—(తనలో) కుమారునివియోగముచేత నీతఁ డధికసంతాపము నొందుచున్నాఁడు. ఈయనను మఱియొకసంభాషణలో దింపెదను. (ప్రకాశముగా) దేవరవారి కీయాపద యెట్లుసంభవించినది?

కుంతి—మాటలసందడిచేత నేనును నావిషయమడుగ మఱచి నాను.

సౌవీ—ఇది భూతికుఁడే యెఱుఁగును. నానోటనే వినఁ గోరె దరేని వినుఁడు.

కుంతి—మేము సావధానుల మై యున్నాము.

సౌవీ—ఎఱుఁగుదురుకదా! అతికోపి యైనచండభార్గవుఁ డను బ్రహ్మర్షి యున్నాఁడని.

కుంతి—పూజ్యుఁ డైనయాతపోనిధినిఁగూర్చి విన్నాఁడను.

సౌవీ—ఆయన నాదేశమునకు వచ్చినాఁడు. ఆయనశిష్యుఁ డొకఁ డడవిలోఁ బెద్దపులివాతఁ బడి మృతి నొందినాఁడు.

కుంతి—తర్వాత తర్వాత.

సౌవీ—ఆకాలమునందే నేనును దైవవశమున వేఁటకై యా

ప్రదేశమునకే పోయి యుంటిని.

కుంతి—తరువాత, తరువాత.

సౌవీ—ఆతఁడు నన్నుఁజూచి విజృంభమాణరోషంబున ముడి వడిన కన్బొమలచే నదనంబు విషమీకృతంబుగా, జడ లూఁగుచుండ శిష్యునిమీఁదఁ జేయి వైచి క్రోధాగ్ని చేత దహింపఁ జేయువాఁడుం బోలె నామాట చెవినిఁబెట్ట నిచ్ఛగింపకయే సంరంభంబున మాటలు తొట్రువడ నన్నసేకవిధములఁ దిట్ట నారంభించెను.

కుంతి:—తర్వాత తర్వాత.

సౌవీ:—తరువాత నేనును రాఁగలదురవస్థయొక్క ప్రాబల్య ముచేత నోపిక లేనివాఁడనై మహర్షిం జూచి "వృత్తాంతము చెప్పవు ఊరక తిట్టమొదలుపెట్టితి" వని క్రుద్ధుఁడనై వెండియు నిట్లంటి.

చ. తెలుపవు వృత్త మేమియును దీవరరోసము బూని నన్నొడల్
దెలియక యిచ్చవచ్చినటు దిట్టఁగఁ జొచ్చి తకారణంబుగాఁ
దలఁప మహర్షిరూపమును దాల్చినమాలఁడ వౌదు గాని, బి
ట్టలుకను బూనియుండుట మహర్షివిమాత్రము గావు సుమ్మికన్.

కుంతి:—నీ వసమానముగాఁ బల్కితివి.

సౌవీర:—అప్పలుకులు విని యనంతరం బతఁ డాజ్యధారావ సిక్తుఁడై నహుతాశనదేవుఁడుంబలెఁ గన్నుల నిప్పులంగ్రక్కుచుఁ బలుమాఱు శిరఃకంపము జేసి యెట్టెట్టు యెట్టె ట్టని పలుకుచు నిట్లు శపించెను.

తే. గీ. మహితు బ్రహ్మర్షిముఖ్యు నన్మాలఁ డంచుఁ
గినుకచేతను నిట్లు బల్కితివి గాన,
దారపుత్రులతోఁ గూడ దప్ప కుండ
మాలవాఁడ వయ్యెదవు నా మహిమచేత.

కుంతి:—మహాపురుషులయనర్థములకు మూల మల్పముగదా

భూతి:—సౌఫీర రాజకులముయొక్క యదృష్ట మింతవఱకు మంచిదె.

తే. గీ. అధికకోపసమావిష్టుఁ డమ్మహర్షి
యంత్యజుఁడవు గమ్మనితిట్టె నంతె కాని
యమ్మహాగ్రహావిష్టరూపమ్ము తోడ
సర్వమును భస్మపటలంబు సలుపఁ డయ్యె.

కుంతి:—నీవు లెస్సగాఁజెప్పితివి. తర్వాత తర్వాత.

సౌవీ:—అనంతరము నేనుశాపప్రతిబద్ధమనస్కుఁడనై యమ్మహర్షిని మిక్కిలి బతిమాలుటయు నతఁడు మెల్లమెల్లఁగాఁ బ్రకృతిభావమునొంది యనుగ్రహించి యిట్లనియె—

క. శాపవశంబున వత్సర
మోపికఁ బ్రచ్ఛన్నవృత్తి నుండుము, పిదపన్
శాపవిమోచన మయ్యెడు
భూపాలక! వత్సరంబు పూర్ణం బగుడున్.

ఇట్లుపలికి ప్రసన్నచిత్తముతో నోయి కాశ్యప ! యిటురా యని తనశిష్యునిం బిలుచుటయు నంతకుమున్న బెబ్బులిచేత మృతి నొందినబ్రహ్మచారి బ్రతికి లేచివచ్చెను. శాపపరికారము నేనును జండాలవ్రతము సంవత్సరము నెఱపితి. ఇప్పుడు శాపవిముక్తుఁడ నైతిని.

కుంతి:—అహో ! మహాపదయొక్కపరివృత్తినివృత్తులు చిత్రముగానున్నవి. అదృష్టవశమున నీ విప్పుడు వర్ధిల్లుచున్నాఁడవు.

భూతి:—దేవ! జయము. జయము.

కుంతి:—ఓయి! విష్ణుసేనునితల్లి సపరివారముగా నంతఃపురముఁబ్రవేశించినదా?

భూతి.—ఆహా! యామె చిరపరిచిత మైనయాయంతఃపురముఁ

బ్రివేశించి ప్రిణయము నెఱపుచున్నది.

కుంతి:—విష్ణుసేనుఁ డవిమారకుం డెట్లయ్యెను?

భూతి:—దేవ! అవధరింపుఁడు. ధూమకేతు వనురాక్షసుఁ డొకఁడు కలఁడు. ఆదురాత్ముఁడు సర్వలోకమారణముకొఱకు సంచరించుచు నొకానొకప్పు డవిరూపముఁదాల్చి సౌవీరరాష్ట్రమును నిర్మూలనము జేయుట కై సంకల్పించెను.

కుంతి:—ఈకథ యపూర్వముగా నున్నదే. తర్వాత తర్వాత?

భూతి:—తరువాత స్వదేశమందలి సమస్తప్రజలయార్తిం జూచియు నారాక్షసుని దౌర్జన్యమునకుఁ బ్రతిక్రియ గనుంగొనలేకయు, సౌవీరవల్లభుఁడు క్లేశపరవశుఁడయ్యెను.

కుంతి:—తర్వాత తర్వాత?

భూతి:—అనంతర మదియెల్ల నెఱిఁగి కుమారవిష్ణుసేనుఁడు తోడిబాలకులతో నాడుకొనుచు క్షితిరేణుపరుషగాత్రుఁడై జల్పములల్లల నాడ నంగరక్షకు లైన పురుషులు ప్రమత్తులైనసమయమున దైవయోగంబున రాక్షసుఁడెచ్చట నుండెనో యచ్చోటికిఁబోయెను

కుంతి:—ఆహా! ఆశ్చర్య మాశ్చర్యము. తర్వాత తర్వాత?

భూతిక:—అంతట నా రాక్షసుఁడు రాజకుమారుంజూచి సుసంపన్న మైన యాహారము తనకు లభించిన దని పరమప్రీతినొంది తనదుష్కర్మ నారంభించెను.

కుంతి:—అబ్బ! ఏమి రాక్షసుని నృశంసత. తరువాతతరువాత?

భూతి:—అనంతర మా రాజకుమారుఁడు మందహాసము జేసి కవియ—

తే. గీ. కొంగ వజ్రపాతంబునఁ గూలునట్లు
కాఱుచిచ్చున గహనంబు గాలునట్టు

లాయుధసహాయహీనుఁ డానతనిచేత
నీచరాక్షసుఁ డంతట నేలఁగూలె.

కుంతి:— ఇతఁడు దేవసంజాతుఁడుగాని, కేవలమనుష్యుఁడై యుండఁడని నాఁడు హస్తిసంభ్రమసమయంబుననే నే నంటిని.

సౌవీ:— రాజ! నీవు చారులవలన సహసి నేతుఁడవు. అవిమారకునిఁ గూర్చి యేమి యాలోచించితివి?

భూతి— స్వామి!

తే. గీ. వెళ్ళవలసిన దేశముల్ వెళ్ళినారు
చారు, లెందుఁ గన్పడలేదు వారి కతఁడు
మనుజనాయక! నీపట్టి మాయ మయ్యె
ననుచుఁ బరిశీలనము సేయ నాత్మఁదోఁచె.

(అప్పుడు నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు)

నార—

ఉ. చేయుదుఁ బ్రీతచిత్తు సరసీరుహసంభవుఁ బ్రత్యహంబు స్వా
ధ్యాయముచేత, గీతముల నచ్యుతు నుద్గతరోమహర్షణుం
జేయుదు, ధారుణిం గలహసృష్టిని సుస్వరసృష్టి తంత్రిలం
బాయకఁ జేయుచుండుదు నుపాయపరంపర పన్ని నేర్పుతోన్.

ఓహో! కుంతిభోజునితండ్రి యైనదుర్యోధనునిచేత మేము చిరకాల మారాధింపఁ బడితిమి. అతఁడు పరలోకమున కరిగినతరువాత కుంతిభోజుఁడు మాయెడ భృత్యభావమే దాల్చి యున్నాఁడు. నేఁడవిమారకుఁడు కనఁబడకపోవుటచేఁ గుంతిభోజునకు సౌవీరరాజునకు గొప్ప మనస్సంకటము కల్గుచున్నది. నే నిప్పు డవిమారకునిఁ జూపి వారి మనస్సంకటమును బాపఁదలఁచి భూలోకమునకు దిగితినికదా!

(అని కుంతిభోజసౌవీరరాజులయెదుట నిలుచు చున్నాఁడు.)

కుంతి— అహో! భగవానుఁ డైనదేవర్షి నారదులు దయ

చేసినారే. భగవానుఁడ! అభివాదము చేయుచున్నాను.

నార— నీకు శుభ మగుఁగాక!

కుంతి—నే ననుగ్రహింపఁబడితిని.

సౌవీ—భగవానుఁడ! అభివాదము చేయుచున్నాను.

నార.—నీకు శాంతి యగుఁగాక!

సౌవీ—నే ననుగ్రహింపఁబడితిని.

కుంతి—(చెవిలో) భూతిక! యిట్లు చేయుము.

భూతి—దేవ! చిత్తము (నిష్క్రమించి, ప్రవేశించి) ఇదిగో అర్ఘ్యపాద్యములు.

కుంతి—దేవ! అనుగ్రహించి యర్ఘ్యపాద్యములుగ్రహింపుఁడు

నార—అట్లె యగుఁగాక!

కుంతి—(అర్చించి) దేవా! మీయవతరణముచేతనాగృహము పావన మైనది.

సౌవీ—దేవర్షి దర్శనముచేత నా కిప్పుడు శాపవిమోచనమైనది

నార—నే నిప్పుడు నీదర్శనార్థమే రాలేదు. అవిమారకుఁడు కనఁబడక పోవుటవలన మీకుఁ గలిగినదుఃఖముఁ దెలిసి వచ్చితిని.

ఉభయులు—అట్లైన మేము సంతాపవిముక్తుల మైతిమి.

నార—భూతిక! సుదర్శనాదేవిం దీసికొనిరా.

భూతి—చిత్తము దేవ! (అని నిష్క్రమించి సుదర్శనతో మరలఁ బ్రవేశించును.)

సుదర్శ—ఓహో! దేవర్షి దయచేసెనే.

భూతి—ఔ నాలాగె.

సుద—నాపుత్రకునివివాహ మిప్పుడు సనాథ మైనది. (సమీపించి) దేవ! నమస్కారము.

నార—

తే. గీ. ఓమహాభాగురాల! నీ వొందు మమ్మ
యీ తెఱంగున నిత్యంబుఁ బ్రీతిశతము
కుంతిభోజుండు, సౌవీరకుతలపతియుఁ
బ్రీతిపీడితు లౌదురుగాత సతము.

సుద—నే ననుగ్రహింపఁబడితిని.

నార—అయ్యా! అడుగవలసిన దేదైన నుండినపక్షమున సన్ని ప్పు డడుగుఁడు.

ఉభయులు—మే మిద్దఱ మనుగ్రహింపఁబడితిమి.

కుంతి—మహాత్మ! సౌవీరరాజపుత్రుఁడు జీవించియున్నాఁడా?

నార—ఆహా.

సౌవీ—ఎందుచేతఁ గనఁబడఁడు?

నార—పెండ్లితొందరచేత.

సౌవీ—ఏమీ! కుమారునకు వివాహమైనదా?

కుంతి—ఏప్రదేశమందు?

నార—వైరంత్యనగరమునందు.

కుంతి—వైరంత్యమనుపేరుగలనగర మున్నదా? సరె! యెవ నియల్లుఁ డైనాఁ డతఁడు?

నార—కుంతిభోజునికి

కుంతి—అతఁ డెవఁడు?

నార—తే. గీ. అతఁడు తండ్రి కురంగికి, క్షితివిభుండు
పరిధితవైరంత్యపట్టణవల్లభుండు
నందనుండు దుర్యోధననరవరునకు
కుంతిభోజుఁ డాతఁడ పీవ కువలయేశ.

కుంతి—ఇన్నిప్రశ్న లెందునకు. నాపుత్రిక యైనకురంగియం దు నిర్విష్టుఁడై నాఁడనియూ దేవరవారు సెలవిచ్చుచున్నారు.

నాగ—ఔ నట్లె—

కుంతి—నేను సిగ్గుపడుచున్నాను. కన్య నిచ్చినవా రెవ్వరు? కన్యాంతఃపుర మతఁ డెట్లు ప్రవేశింపఁగలిగెను?

నార—తే. గీ. ఎవ్వ రిచ్చెనో యన నేల యిచ్చెబ్రహ్మ
చూడఁబడెనామె మదగజక్షోభ వేళఁ
బౌరుషంబున మును పిద్ద ప్రిబలమాయె
నంతిపురిఁజొచ్చినాఁడాతఁ డక్కజముగ.

కుంతి—అట్లగుఁగాక! అట్లేయుండవచ్చును. ఋషివచనము నిష్ప్రతివచనము. మహాత్మ! కురంగికిని సౌవీరరాజకుమారునకును వివాహకాలమువచ్చినదా? ప్రయత్నములు సేయఁదగునా?

నార—జరుగవలసినసమయమున వా రిరువురకు గాంధర్వ వివాహ మిదివఱకే జరిగినది.

కుంతి—అగ్నిసాక్షికముగా వివాహము చేయఁగోరుచున్నాఁ డను.

నార—అగ్ని నిత్యసాక్షియె. ఐనను స్వజనపరితోషణార్థ మభ్యంతరమందిరమున సముదాచారముమాత్ర ముపాధ్యాయుని చేత నడిపించి భార్యాసమేతముగాఁ గుమారవిష్ణుసేను నిక్కడికి శీఘ్రముగ రావింపుము.

కుంతి—మహాత్మ! యిదె వెళ్లుచున్నాను.

నార—నీవుండుము. భూతిక! నీవు వెళ్ళు

భూతి—భగవానుఁడాజ్ఞాపించినట్లుచేసెద. (నిష్క్రమించును)

కుంతి—దేవ! దేవరవారితో మనవిచేసికొనవలసినవిషయ మొకటియున్నది.

నార__ఇటురా! యథేచ్ఛముగాఁ జెప్పుము.

కుంతి__దేవ! సుదర్శనాపుత్రుఁడైన జయవర్మకుఁ గురంగి నిచ్చెద నని మాటయిచ్చి యామె నిటకు భర్తృసమేతముగాఁ దోడి తెచ్చితిని. ఇప్పు డేమిసేయవలయు నని దేవరవారు సెలవిచ్చెదరు?

నార__ఇట్లు చేయుదము. ఒక్కనిముస మేకాంతముగనుండు

కుంతి__అట్లే చేయుదును. (ఆవలకుఁ బోవుచున్నాఁడు)

నార__సుదర్శన! యిటురా

సుద__దేవ! యిదె వచ్చితిని.

నార__నామాటలు విన్నావుగదా!

సుద__సౌవీరరాజకుమారునియొక్కగుణసంకీర్తనమువిన్నాను

నార__అట్లుకాదు. నీవు మఱచితివికాఁబోలు! అగ్ని దేవుని ప్రసాదమువల్ల నీ వొకకుమారునిఁగంటివి. అతఁడే నీజ్యేష్ఠపుత్రుఁడు

సుద__అమ్మో! అది దేవరవారికిఁ దెలిసినదా?

నార__తెలియ కేమి? నాయాజ్ఞాప్రకారము జేయుము

సుద__అట్లే చేయుదును. సెల వియ్యండి.

నార__ఈ కుమారుఁడు నీకగ్నివలన జన్మించినాఁడు. నీసోదరియైనసుచేతనకూడఁ దత్సమయమందె ప్రసవ మయ్యెను. ఆమె కన్నమగశిశువు పుట్టినతోడనే మృతినొందెను. అప్పుడు నీవు కన్న యీపుత్రుని నీసోదరికిచ్చితివి. సౌవీరరాజును మిక్కిలి సంతుష్టుఁడై ప్రీతిసదృశములైనక్రియలొనరించి విష్ణుసేనుఁడను పేరుపెట్టెను. అమానుషస్వరూపబలపరాక్రమవీర్యములుగలిగి వర్ధమానుఁడైన యాకుమారునిచేత నవిరూపధారియైనరాక్షసుఁ డొకఁడు సంహరింపఁబడుటచేత లోక మీతని కవిమారకుఁ డని పేరుపెట్టెను. అనంతర మతఁడు బ్రహ్మర్షి శాపవశంబునం దిరుగుచు గజసంభ్రమదివసంబునఁ గురంగిం జూచి సముద్ధమదనాభిలాషుఁడై యత్యంతపౌరుషముచేత

సమీపించి కురంగి నతఁడు చూచుటచేత శంకించి కన్యాపురరక్షకులు పరీక్షింపఁగా మహానుభావుఁ డైనయగ్ని దేవునిప్రభావంబున నతఁడు వారిచేఁ బట్టువడక వెడలి పోయెను. ఆనిర్వేదముచేత నతఁ డగ్నిం బ్రవేశించి తండ్రియైన యగ్ని దేవునిచేతఁ బ్రేమమీఱఁగౌఁగలింపం బడి యగ్ని తన్ను దహింపలే దని మరుత్ప్రపాతము సేయఁ దలఁచి యొకానొకపర్వత మెక్కెను.

సుద—అయ్యో! అత్యాహితమె.

నార—అచ్చట నొకానొకవిద్యాధరుఁడు తదూపసందర్శన మాత్రముననే సంతసించి ప్రీతిచేత నంతర్ధానకార్యమాత్ర మైనయం గుళీయకముఁ బ్రసాదించెను. అది కుడిచేతిని దాల్చినా యదృశ్యుఁ డగును. ఎడమచేతఁ బెట్టికొనెనా యెప్పటివలె నుండును.

సుద—ఆశ్చర్య మాశ్చర్యము.

నార:—తరువాత నతఁడా యుంగరము కుడిచేతఁదాల్చి సం తుష్టుఁ డను పేరుగలబ్రాహ్మణునితోఁ గలిసి కుంతిభోజునికన్యాంతః పురముతనగృహంబువలెఁ బ్రవేశించి కురంగితో యథేష్టముగా నభిర మించి సుఖంబున నుండెను. ఇది వృత్తాంతము. ఇప్పు డేమిచేయఁ దగును?

సుద—పడుచుపిల్ల యీవిధముగా వంచింపఁబడినందుకు నాహృదయము చలించుచున్నది కాని సంతోషము కూడ నన్నుఁ గ్రమ్ముచున్నది. దేవ! యీదినములలో మాకురంగి జయవర్మకుం భార్య యగు నని తలంచితిని కాని యామె యిప్పుడు జయవర్మకు వదినె యై వందనీయురా లైనది.

నార:—నీవు చెప్పినమాట సత్కులజాతుల కుచిత మైనది. జ్యేష్ఠునిభార్య కనిష్ఠున కెట్లీయఁబడును. సుదర్శన! కురంగి జయవర్మ కంటె నయసునఁ బెద్ద దని కాశిరాజుతోఁ జెప్పు. కురంగిచెల్లెలు

సుమిత్రి యనుపిల్ల కలదుకదా! ఆమె జయవర్మభార్య కాఁగలదు.

సుద—మహర్షివచనము పరిగ్రహించితిని.

నార:—కుంతిభోజు ననుసరింపుము.

సుద—దేవ! చిత్తము.

(అప్పుడు పెండ్లికొడుకువేషముతోఁ గురంగియు భూతికుఁడును వెంటఁ రా నవిమారకుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

అవి:—అహో! నే నీవృత్తాంతముచేత సిగ్గుపడుచున్నట్లున్నాను.

తే. గీ. హస్తిసంభ్రమసమయంబునందు నాఁడు
నన్నుఁ గని నా తెగువ మెచ్చికొన్న జనులు
నేఁటివృత్తాంతమును విని నీచుఁ డనుచు
దోష మారోపణము జేసి దూరకుందెరి. 15

(నడచిచూచి) అహో! భగవానుఁడై ననారదుఁడు వచ్చియున్నాఁడే. ఇతఁడు—

తే. గీ. నిగ్రహానుగ్రహంబుల నిరవధికుఁడు
ఆగమములందు గీతంబులందుఁ బ్రోడ
స్నిగ్ధములయందు వైరముల్ సృష్టి జేసి
చతురమతి నష్టకార్యముల్ చక్కఁజేయు. 16

కుంతి:—కుమారా! ఇటు యిటు. మనకులదైవత మైనదేవర్షికి నమస్కారము చేయుము.

అవి:—దేవ! నమస్కారము.

నార—సహపత్నీకముగ మీకు జయ మగుఁగాక!

అవి:—అనుగ్రహింపఁబడితిని. మామ! అభివాదము ః చేయుచున్నాను.

కుంతి:—వత్స ! యిటు రమ్మి. రమ్మి.

క. క్షమచే గెలువుము విప్రుల
నమితంబగుకరుణచేత నాశ్రితులను దే
జముచే శత్రునృపాలుర
నమితజ్ఞానంబుచేత నాత్మ గెలువుమీ. 17

అవి:—అనుగ్రహింపఁబడితిని.

కుంతి—వత్స ! యిటురా. తండ్రి కభివాదము చేయుము.

అవి:—ఓతండ్రి! అభివాదము చేయుచున్నాను.

సౌవీ:—వత్స ! రమ్మి రమ్మి

తే. గీ. నిబిడనరవేషమున దర్శనీయుఁడ వయి
గురునమస్కారశుభ్రివ క్త్రుఁడవు నైన
ఈవు నానందబాష్పపూర్ణేక్షణములఁ
జూచెదవుగాక మావలె సుతునిఁ బ్రియుని. 18

కుమారా! మామగారికి నమస్కారము చేయుము.

అవిమా:—మాతుల ! అభివాదముచేయుచున్నాను.

కుంతి:—వత్స ! రమ్మి రమ్మి

మ. హరితుల్యుండవు కమ్మి నిత్యము మహాయజ్ఞంబులం జేసి స
త్యరతిం బం క్తిరథక్షమావిభునిసామ్యం బొందిఁ; వర్ధిల్లుమీ
నిరతస్ఫూర్జితసంపద్దానములచే నిర్నిద్ర తేజంబుచేఁ
జిరకీర్తిం గను తండ్రికిన్ సముఁడ వై చింతావిహీనుండ వై. 19

సౌవీ—కుమార! సుదర్శనునకు నమస్కారము జేయుము.

కుంతి:—సుచేతనకు ముందుగా నమస్కారము చేయక సుదర్శకభివాదము చేయుట యనుచితముగదా.

నార:—ఇటు చేయుటకుఁ గారణ మున్నది. సుదర్శనకే ముందుగానమస్కారము చేయుము.

ఉభయులు—అట్లే చేయుదురు.

అవి:—అమ్మ ! నమస్కారము.

సుద—పుత్ర! యీమెతోఁగూడి చిరంజీవివి కమ్ము (కౌఁగిలించుకొని) చిరకాలమునకు నిన్నుఁ జూడఁగలిగితిని. నేనిప్పుడు పుత్రసంపత్తిరస మనుభవించుచున్నాను. (అని యేడ్చును)

కుంతి—

తే. గీ. స్నేహజనితబాష్పార్ద్రకుతూహలాక్షి
ప్రసవిద్దుగ్ధయుతకుచద్వంద్వయు నగు
నీతరుణి విష్ణుసేసునిమాత యనుచు
నలసుచేతసదాదియే యనుచుఁ దోఁచె. 20

నార:—అతిస్నేహము చాలును. సుచేతన యగుసుచేతనయు, సుదర్శనయగు సుదర్శనయు నంతఃపురమున సుఖ ముందురుగాక! సౌవీరరాజ ! భార్యతోడను బుత్రులతోడను నీవుఁగూడ నంతఃపురమునకుఁ బొమ్ము.

కుంతి:—దేవరవారు సెల విచ్చినట్లు చేయుదును.

సుద—దేవ ! చిత్తము.

నార:—అచిరకాలములోనె సౌవీరరాజు స్వదేశమునకుఁ బోవుఁగాక! కాశిరాజగుజయవర్మకు సుమిత్రనిచ్చి వివాహము సేయుము. నీవును సన్నిహితుఁడవు కమ్ము.

కుంతి:—అనుగ్రహింపఁబడితిని.

నార:—కుంతిభోజ! నీ కింక నేమిప్రియము సమకూర్తును?

కుంతి:—దేవరవారు నాయెడ ననుగ్రహింతు రేని నే నింతకంటె నేమి కోరుదును.

తే. గీ. బ్రాహ్మణులకు గోవులకు మేల్పరఁగుఁగాత !
యెల్లప్రజలకు సౌఖ్యంబె యెసఁగుఁ గాత !

నార:— సౌవీరరాజ! యింక నీ కేమిప్రియము సమకూర్తును?

సౌవీ:— దేవరవారు నాయెడఁ బ్రసన్ను లగుదు రేని నేనిం తకంటె నేమి కోరుదును.

కడలియను నల్లచీరను గట్టుకొన్న
యీపుడమి మానృపాలకుం డేలుఁగాత!

భరతవాక్యము.

నీరజస్సు లై గోవులు నెగడుఁగాక
ఎల్లశత్రుమండలి శమియించుఁగాక
ఈవసుంధర యంతయు నేలుఁగాక
క్షితిపవర్యుఁడు మారాజసింహనృపతి.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది షష్ఠాంకము.

# బాలచరితము

## ప్రథమాంకము.

(నాంద్యంతమందు సూత్రధారుఁడు ప్రవేశించు చున్నాఁడు)

సూత్ర—

సీ. కృతయుగంబునయందు క్షీరశంఖాంగుఁ డై
నారాయణుం డనునామ మూని
త్రిచరణార్పిత జగత్త్రితయుఁడై త్రేతను
గనకవర్ణత విష్ణువనఁగఁ బరఁగి
ద్వాపరంబునను దూర్వాశ్యాముఁడై రఘు
రాముఁడై పొసరించి రావణవధఁ
గలియుగంబున యందుఁ గాటుకచాయలఁ
బొలుచుశ్రీహరి మిమ్ముఁ బోచుఁగాత.

ఆర్యమిశ్రులతో నిట్లు విన్నవించుకొను చున్నాఁడను. అహో! ఏమిది! నేను విజ్ఞాపనవ్యగ్రుఁడనై యుండఁగా నేదో శబ్దమువలె వినఁబడుచున్నది. చూచెదఁగాక.

(తెరలో)

గగనచరుఁడను నేను.

సూత్ర—అహా! తెలిసినది.

తే. గ. కురియు చున్నది సొంపుగాఁ గుసుమవృష్టి
దేవదుందుభినాదముల్ దివిని మొఱయు
వృష్ణికులసముద్భవుఁ డైనవిష్ణుఁ జూడ
నారదుం డదె వచ్చి యున్నాఁడు నేఁడు.

(నిష్క్రమించు చున్నాఁడు)

(అంతట నారదుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

నార.—

తే. గీ. గగనచరుఁడను నేను ముజ్జగములందు
నధికవిశ్రుతిఁ గన్న సంయమివరుండ
బ్రహ్మలోకంబునుండి నే వచ్చు చుంటిఁ
బ్రబలకలహప్రియుండ నారదుఁడ నుండి.

ఓహో!

తే. గీ. అలరు చుందుము స్వేదపాతాంతరముల
వీణమీటి మైనను బోరు వెట్టి మైన
దేవదానవవైరముల్ దీఱె యిపుడు
గగనము ప్రశాంత మగుట వేడ్కలు గతించె.

మఱియు;

తే. గీ. ప్రాప్తిమనకు లన్న నా కెదఁ బరమభక్తి
బహుమతంబులు బహుతపోవనము లైన
వీణియను మీటుటయు భీమవిగ్రహములు
పెనుచుటయుఁ బ్రియంబు లివి చెప్పితి నిజంబు.

అందుచేత భగవంతుఁడును లోకాదియు ననిధనుండును నవ్యయుండును లోకహితార్థము కంసుని వధియించుటకు వృష్ణికులమునం దుద్భవించినవాఁడును నగునారాయణుని సందర్శించుట కిచ్చటికి వచ్చితిని గదా! ఇదిగో పూజ్యురా లైన దేవకీదేవి. మాయచేత శిశుత్వమును బొందినట్టిత్రిలోకేశ్వరుని గ్రహించి వసుదేవునితోఁ గూడి మెల్లమెల్లఁగా స్వగృహమునుండి యీవలకు వచ్చు చున్నది.

తే. గీ. అఖిలలోకంబులకు నభయప్రదాత
సురగురు రథాంగధరు దైత్యసూదను హరి

మందరాద్రినిఁ బలె జేతులందుఁ దాల్చు
శాంతచిత్త శోకార్త యీచంద్రవదన.

ఇదిగో! ఇదిగో! భగవంతుఁడు నారాయణుఁడు.

తే. గీ. ఇతఁ డనంతవీర్యుఁడు కమలేక్షణుండు
వేల్పుదొరలకుదొర దైత్యవీర్యహంత
కర్త భువనపాలికిఁ ద్రిలోకధ్వజుండు
భూతభర్త బహుపురాణపూరుషుండు.

ఔరా ! ఈతనిజన్మకారణమున వైరబీజ ముత్పన్నమైనది ఇంతలో భగవంతుఁ డైననారాయణునకు నేను ప్రదక్షిణముఁ జేసి బ్రహ్మలోకమునకుఁ బోవుదును.

నమోభగవతే త్రైలోక్యకారణాయ.

శ్లో. "నారాయణాయ నరలోకపరాయణాయ
లోకానునాయ కమలాపలలోచనాయ
రామాయ రావణవిరోచనపాతనాయ
వీరాయ వీర్యనిలయాయ నమో వరాయ"

(నిష్క్రమించు చున్నాఁడు)

(అప్పుడు బాలు నెత్తుకొని దేవకీదేవి ప్రవేశించుచున్నది.)

దేవ—హా! ఎంతకష్టము. జన్మసమయసముద్భూతము లైన మహానిమిత్తములు నాకుమారుని మహానుభావత్వమును సూచించుచున్నవి. ఈలక్షణముల నింతప్రత్యక్షముగ నేను గన్నులారఁ జూచుచుండియు దురాత్ముఁ డైనకంసహతకునినృశంసత్వమునుం దలంచి నమ్మఁజాల కున్నాను. ఎంత మందభాగ్యురాలను! ఆర్యపుత్రుఁ డెం దరిగెనో? అమ్మా ! యిదిగో యార్యపుత్రుఁడు. హర్షవిస్మయవికసితలోచనులై యీయన యిల్లే వచ్చు చున్నారు.

(అంత వసుదేవుఁడు ప్రవేశించు చున్నాఁడు)

 

వసు—(సవిమర్శముగా) ఓహో! యిదేమి?

తే. గీ. మెఱయు చున్నది మింటఁ గొ్రిమ్మించుతీఁగ
చండవాతసముద్ధూతజలదభీమ
గర్జనల భూమి వడఁకె జగద్ధితముగ
నవతరించె శ్రీహరి రహస్యముగ నిందు.

(చూచి) యీదేవకి,

గీ. జననకాలకళ్యాణలక్షములఁ గని
యాసపడి యేడవకుమారు నరయఁ దలఁచి
యార్వురుకుమాళ్ల శోకంబు నాత్మ మిఁ్రింగి
తనయుఁ డనుకంసమృత్యువు దాల్చి వచ్చె.

దేవకి—(సమీపించి) ఆర్యపుత్రా! జయము జయము.

వసు—దేవకీ! ఇప్పు డర్ధరాత్ర మైనది. మధురాపురమందలి సమస్తజనులు నిద్రించు చున్నారు. అందువలన నెవ్వఁడుఁ జూడ కుండ బాలకుని దీసికొని పోయెదను.

దేవ—ఆర్యపుత్రా! యీతని నెక్కడికిఁ దీసికొని పోయెదరు?

వసు—దేవకీ నిజము చెప్పితివి. ఎక్కడికిఁ దీసికొని పోవలయునో నే నెఱుఁగను. ఏలయన దురాత్ముఁడైన కంసుఁ డేకచ్ఛత్రచ్ఛాయముగ భూమి నంతను శాసించు చున్నాఁడు. అందువలన బాలకు నెందుదాఁచవలెనో యెఱుఁగను. అయినను దైవమెక్కడికిఁ దీసికొని పోవునో యక్కడికె బోవుదును.

దేవ—ఆర్యపుత్రా ! బాలకునిఁ గడసారి కన్నులకఱవుదీరఁ జూడఁ గోరుచున్న దానను.

వసు—ఓసీ! అతిపుత్రవత్సలా.

గీ. ఎంతజూచిన ఫల మేమి యిందువదన
దాచెనుముఖముఁ జొచ్చినశీతరశ్మి యితఁడు

మక్కువను నీవు జూచినమాత్రమునను
గంసుఁ డితనికి మృత్యువు గాక యున్నె.
దేవ — అట్లు కాకపోవుఁ గాక.
వసు — నీవుపలికినది సర్వదేవతలుపలికినట్లె. బిడ్డనుదీసికొనిరా.
దేవ — ఆర్యపుత్రా! ఇదిగో పుచ్చుకొనుఁడు.
వసు — అహహా! బాలుఁ డెంతబరువుగ నున్నాఁడు.
తే. గీ. పద్మదళనేత్రుఁ డైనయీబాలకుండు
వింధ్యమందరసారుఁ డై వెలయు చుండు
నెట్లు మోచెనో గర్భమం దితని నీమె
యహహా! పూఁబోండ్లధైర్య,మత్యద్భుతంబు.
ఓ దేవకీ ! నీవు లోపలికిఁబొమ్ము.
దేవ — ఇదిగో ! మందభాగ్యురాలను వెళ్లు చున్నాను.
వసు — ఈ దేవకి,
ఆ. వె. హృదయ మిచటఁ దనశరీర మచట నుంట
రెండు తెఱఁగు లైనరీతిఁ జనెడు
దివమునందు సీట ద్వివిధ మైన కనఁబడు
చంద్రరేఖ వోలె సారసాక్షి.
పాపము! దేవకి లోపలికిఁ బోయినది. నేనును నగరద్వారము
ను సమీపించెదను. అహో !
తే. గీ. తొంటి బిడ్డలమరణంపుదుఃఖమునకు
రాజభయము తోడగుట నర్భకుని వీని
మందరాద్రినిఁ బలెఁ జేతులందుఁ దాల్చి
మసలకుండఁ బో వలతును మార్గమందు.
(నడచి) ఇదే! నగరద్వారము. ప్రవేశించెదను. (ప్రవేశించి)
అహో! మధురాపురమందలి సమస్తజనులును నిద్రించు చున్నారు.

ముందుకు వెళ్లెదను. (కొంతనడచి) మధురానగరముఁ దాఁటితిని. అహో! యీచీఁకటి మిక్కిలి దట్టముగా నున్నది. ఎందుచేత నన నిప్పుడు,

తే. గీ. అంధకారంబు మెయిఁ బూసినట్టు లయ్యె
నింగి కాటుక వర్షించుభంగిఁ దోఁచె
దుష్టజనసేవయుం బోలె దృష్టి యిపుడు
నిష్ఫలం బయి యున్నది నిశ్చయముగ.

అహో! ఏమి యీయంధకారముయొక్క పరిభుత్వము.

తే. గీ. అప్రకాశంబులై యున్న యఖిలదిశలు
వృక్షతతి ఘనీభూత మౌ విధము దోఁచెఁ
జక్కఁగా నున్నయీప్రపంచమున కిపుడు
వచ్చె రూపవిపర్యయ మచ్చెరువుగ.

అయ్యో! నడచి వెళ్లఁజాల కున్నానే! ఆహా! దీప మగపడు చున్నది. దురాత్ముఁడైనకంసుఁడు నేను దాఁటిపోయితి నని విని దీపి కాపరివృతుఁడై నన్ను బట్టుకొనుటకు వచ్చుచున్నాఁడా యేమి? కానిమ్ము నే నతనికి గర్వభంజనము చేసెదను. (కత్తి యొఱనుండి తీయు చున్నాఁడు.)

(మరలి చూచి) ఏమిది! ఎవరును లేరే.

తే. గీ. చిమ్మచీఁకటుల్ జగ మెల్లఁ గ్రమ్ముకొనుటఁ
దెన్ను గానక నడయాడు చున్ననాకు
వెలుఁగు గలిగించు చున్నాఁడు పిన్నవాఁడు
దారి తప్పక సరిగ నే దాఁటిపోవ.

ఇదిగో మార్గము. వెళ్లెదను. ఇదిగో! యమునానదిసమీపము నకు వచ్చినాఁడనే! కానివర్షముచేత నిది నిండి యున్నది. నాప్రియ త్నము వ్యర్థ మగును గాఁబోలు. ఇప్పుడేమి చేయుదును? ఆహా!

యుపాయము పొడకట్టినది.

తే. గీ. ఉరగమకరసంకులము మహోర్మియుతము
మది కయిన దుస్తర మగు నీనదిని నేను
బాహు లను తెప్ప నీఁది విపత్తు గడపి
దైవ మున్న సిద్ధినిఁ గాంతుఁ దప్ప దింత.

(అట్లు చేసి విస్మయముతో) ఆహా! జలము రెండుపాయలైనది. ఇక్కడ నీరు కదలక యున్నది. అక్కడ ప్రవహించు చున్నది. భగవతి యైన యమునానది నాకు మార్గ మిచ్చినది. ఈమార్గమునఁ బోయెదను. (దాటి) యమునానదిని దాటితిని. ఏమిది! హుంకార శబ్దమువలె వినఁబడు చున్నది. మందభాగ్యుఁడ నైననేను గొల్లపల్లె సమీపమునకు వచ్చి యుందును. ఇక్కడకు సమీపమున నున్న గొల్లపల్లెలో నామిత్త్రుఁ డైననందగోపుఁడు కాఁపుర మున్నాఁడు. అతనిని నేను కంసునిశాసనంబున మున్నొకసారి సంకెళ్లతో బంధించి కొరడాతోఁ గొట్టితిని. సరే! యీపల్లె ప్రవేశించెదను. కాదుకాదు. అట్లు ప్రవేశించితినా వసుదేవుఁడు రాత్రివేళ వ్రేపల్లెఁ జొచ్చెనని గోపాలకులు శంకింతురు. అందువలన నీన్యగ్రోధవృక్షముక్రిందఁ దెల్లవాఱువఱకుఁ గనిపెట్టుకొని యుండెదను. ఓహోహో! న్యగ్రోధదేవతలార! ఈబాలకుఁడు లోకహితార్థముగాఁ గంసవధార్థము వృష్ణికులమందు జనియించినపక్షమున గొల్లపల్లె నుండి యెవఁడో యొకఁ డిక్కడికి వచ్చుఁగాక. ఎవఁడో యొకఁడు కాదు. నాచెలికాఁడగు నందగోపుఁడే వచ్చుఁగాక.

(అప్పుడు చచ్చినకూఁతును జేతఁబట్టుకొని నందగోపుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

నంద.—(శోకముతో) కూఁతురా కూఁతురా అయ్యో! నా గృహలక్ష్మి యిందొక్కనాఁడైన నాడుకొనక మ న్నుందఱవిడిచియి

ప్పుడు పోవుచున్నావటే అహో యిప్పుడీచిమ్మచీఁకటి కారుదున్నపో
తులమందవలె నెంతనల్లఁగా నున్నది!

తే. గీ. మబ్బు గ్రిమ్ముటవెన్నెల మాయ మగుడు
నిశి నిమీలితాకాశమై నివ్వటిల్లి
నల్లదుప్పటి తననిలువెల్లఁ గప్పి
పండుకొన్నమాగోపికపగిది నొప్పు.

నేటియర్ధరాత్రిమున నాభార్య యశోద యీపిల్లను గన్నది. పాపము పుట్టఁగానే దీనిప్రాణములు బోయినవి. రేపు మాగొల్లపల్లెలో సాంప్రదాయసిద్ధముగాఁ జిరకాలమునుండి జరుగు చున్న నిండ్రయజ్ఞ మనునుత్సవము జరుగును. అందువలన నీదుఃఖము మాగోపజనమెల్ల ననుభవించుట నాకిష్టము లేక సంకెళ్ళబరువుచేత నడువలేక గాళ్ళీడ్చుకొనుచు నే నొక్కఁడనే యీబిడ్డను దీసికొని వచ్చితిని. పాపము యశోద యాఁడుబిడ్డ పుట్టినదో మగబిడ్డ పుట్టినదో యెఱుఁగక మూర్ఛవడి యున్నది. అయ్యో! కూఁతురా కూఁతురా!

వసు—ఎవఁడు చెప్పుమా యీరాత్రివేళ దుఃఖించు చున్నాఁడు. పాపము వీఁ డెవఁడో నావంటివాఁడే.

నంద—అయ్యో! మాగృహలక్ష్మియం దొక్కనాఁ డైన నాఁడుకొని మమ్మసంతోషపెట్టక మ మ్మందఱ విడిచి పోవుచున్నావటే కూఁతురా.

వసు—కంఠస్వరముచేత నితని నానవాలు పట్టఁగలను! ఇతఁడు నామిత్రుఁడైన నందగోపుఁడు కావచ్చును. మిత్రుఁడా! నందగోపుఁడా యిటురమ్ము.

నంద—(భయముతో) ఎవఁడు చెప్పుమా. నన్ను నందగోప నందగోప యని పిలుచుచున్నాఁడు. ఇతని కంఠస్వరము మున్నెప్పుఁడో విన్నట్లున్నది. వీఁడు రాక్షసుఁడై యుండునా లేక పిశాచమై

యుండునా? ఇటువంటిభయంకర మైనరాత్రివేళ వచ్చినపిల్లను జేతిలోఁ బెట్టుకొని నే నేమిచేయుదును?

వసు__మిత్రుఁడా! నందగోపుఁడా! సందేహింపవలదు. ఇటు రమ్ము.

నంద__(చెవియొగ్గి సావధానముగా) అమ్మో! స్వరయోగముచేత నితఁడు స్వామి యైనవసుదేవుఁ డని తెలిసినది. సమీపించెదను. కాని యాయనదగ్గఱ నా కేమిపని యున్నది? నే నొకయపరాధము జేసినపుడు రాజైనకంసునిశాసనము ననుసరించి యీతఁడు నాకు సంకెళ్ళు వైచి మునికోలతోఁ గొట్టి యున్నాఁడు. అందుచేత నే నతనికడకుఁ బోవను.

ఛీ! నానృశంసభావము తగులఁబడ. ఈతఁడు నా కెన్నో యుపకారములు చేసినాఁడు. నేను దుఃఖించినప్పుడు దుఃఖించినాఁడు. నేను సుఖించినప్పుడు తాను సుఖించినాఁడు. అట్లు చేసినను రాజశాసనమువల్లఁ గావించిన యొక్కయపకారమును మాత్రమే తలంచుకొని నేను కఠినుఁడ నగుచున్నాను. కాఁబట్టి నే నీతనికడ కేగెదను. ఈ బిడ్డ నేమి చేయుదును? కాని యిట్లు చేసెదను. తెల్లవాఱుచున్నది. స్వామియైనవసుదేవుఁడు పిల్లవానినొకని నెత్తుకొని యున్నాఁడు. స్వామీ! జయము! జయము!

వసు__మిత్రుఁడా! నందగోపుఁడా! పూజ్యములైనగోవులకుఁ గుశలమా!

నంద__చిత్తము దేవా! కుశలమే.

వసు__నీపరిజనమునకుఁ గూడఁ గుశలమా?

నంద__పరిజనమా? చిత్తము. దేవా కుశలమే.

వసు__ఏదో గుడ్డఁగప్పి మఱుగు పఱచితి విదియేమి?

నంద__స్వామీ! యేమియులేదు.

వసు.—నిజముఁ జెప్పకపోయితివా నాతోఁడే?

నంద—చెప్పక గతిలేదు. వినుఁడు దేవా! నేఁటియర్ధరాత్రి మున నాభార్యమైనయశోద—కాదుకాదు, మీబానిసకూఁతురైన యశోద యీయాఁడుబిడ్డను గన్నది. పాప మిది పుట్టఁగానే ప్రాణములు పోయినవి. మాగొల్లపల్లెలో సాంప్రదాయసిద్ధముగాఁ జరుగుచున్న యింద్రయజ్ఞమహోత్సవము రేపు జరుగును. అందుచేత నీదుఃఖము మాగోపజను లెల్లరనుభవించి యుత్సవము మానికొనుట నాకిష్టము లేక సంకెళ్ళబరువుతో నడువలేక కాళ్ళీడ్చుకొనుచు నే నొక్కఁడ వారికీవర్తమానము దెలుపక చచ్చినబిడ్డను దీసికొని యిటు వచ్చితిని. పాపము యశోద తన కాఁడుబిడ్డ పుట్టినదో మగబిడ్డ పుట్టినదో యెఱుఁగదు. మూర్ఛపోయి యున్నది.

వసు—అయ్యయ్యో! లోకమున కధిష్ఠానభూతుఁడైనయముని వంచింప శక్యముగాదుగదా! మిత్రుఁడా యీమృతకళేబరము కట్టెపుల్లవంటిది కావున దానింబాఱవైవుము.

నంద—పాఱవైవఁ జాలను స్వామీ. పాఱవైవఁజాలను.

వసు—పాఱవైచుటే లోకధర్మము.

నంద—ఏలినవారు సెలవిచ్చినట్లే చేసెదను. అయ్యో! కూఁతురా కూఁతురా (అని కూర్చుండి యేడ్చుచున్నాఁడు.)

వసు—ఏడువ కేడువకు. లే లే.

నంద—(అట్లుచేసి సమీపించి) స్వామీ! నీ బానిసీఁడుచేయవలసినపని యేమొ సెలవిండు.

వసు—చెలికాఁడా! దురాత్ముఁడైనకంసుఁడు నాయాఱుగురుకుమాళ్ళను నిర్దయుఁడై చంపినాఁడన్నమాట నీవుగూడఁ నెఱుఁగుదువుగదా?

నంద—ఎఱుఁగుదు స్వామీ! ఎఱుఁగుదును.

వసు—ఈయాయుష్మంతుఁ డేడవకుమారుఁడు. నేను నిర్భాగ్యుఁడను. పుత్రభాగ్యము నాకు లేదు. నీ వదృష్టవంతుఁడవు. ఈబిడ్డను నీవు దీసికొనిపోయి పెంచుకో.

నంద—భయము స్వామీ! భయము. వసుదేవుఁడు తనకుమారుని నందగోపుని చేతిలోఁబెట్టి పెంపించుచున్నాఁడని రాజైన కంసుఁడు విన్నయెడఁ జెప్పవలసిన దేమున్నది బాబూ! నాబుఱ్ఱ యెగిరిపోయినదన్నమాటే?

వసు—(తనలో) అయ్యో! కార్యము భంగమైనదే. నృశంసకులు మిక్కిలి జాగరూకులై యుందురు. సరే! ఈతనితో నిట్లు చెప్పెదను. (ప్రకాశముగా) మిత్రుఁడా! నందగోపుఁడా!

కం. నావలన నీకు నుపకృతి
యావంతేనియును గొల్లి యై యున్న యెడన్
నీవున్ బ్రత్యుపకారము
గావింపఁగ వలసినట్టి కాలమువచ్చెన్.

నంద—ఏమేమీ! ప్రత్యుపకారమా నావలన. ఎంతమాట! కంసుఁడు వద్దననీ, కంసునియబ్బ యుగ్రసేనుఁడు వద్దననీ, యీబిడ్డను నేను పెంచెదను. ఈయండి పిల్లవాని నాచేతికి.

వసు—మిత్రుఁడా! పుచ్చుకో.

నంద—స్వామీ! చచ్చినపిల్లను మోసికొనివచ్చితిని గనుక మైలపడియున్నాను. ఒక్కనిమేషమాగుఁడు. యమునానదికిఁ బోయి స్నానముఁజేసి వచ్చెదను.

వసు—మిత్రుఁడా! గొల్లపల్లెలోఁ గాఁపురముండుటచే నీవు సహజముగనే శుద్ధుఁడవు.

నంద—అట్లైన నేను గొల్లలయాచారప్రకారము మట్టితోనే శుద్ధిం జేసికొందును.

వసు—అందు దోషము లేదు. అట్లు శౌచము జేసికొమ్ము.

నంద—ఏలినవారు సెలవిచ్చినట్లే చేసెదను. స్వామి! ఆశ్చర్య మాశ్చర్యము. నేను మట్టిఁదీసికొనుచుండఁగా నేల బిద్దలు చేసికొని కాఁడిపోడుగున జలధార పైకి లేచి నన్ను స్నానము చేయించుచున్నది.

వసు—అది యీబాలుని ప్రభావమే. శౌచము జేసికో.

నంద—ఆలాగే చేసికొన్నాను స్వామి!

వసు—పుచ్చుకో పిల్లవానిని.

నంద—స్వామీ! నాచేతులు మిక్కిలి దుర్బలములై యున్నవి. పిల్లవాఁడు మందరపర్వతమంత బరువున్నాఁడు. ఈతని నేను మోయలేను సామీ.

వసు—మిత్రుఁడా! నీవు మహాబలపరాక్రముఁడవుగదా.

నంద—స్వామీ! నాబలపరాక్రమములు చిత్తగింపుఁడు. ఎద్దులు పొగరుకొని దుండగము సేయుచున్నప్పుడు కొమ్ములు పట్టుకొని వానినివిసిరి యావలఁ బాఱవైవఁగలను. పెరుఁగుకడవలబండ్లూ బిలో దిగఁబడి కూరుకొని పోయిన వాని నే నొక్కఁడనె లాగి లేవనెత్తఁగలను. అంతబలవంతుఁడను నేనే యీపిల్లవానిని మోయలేనని భయము కలుగు చున్నది.

(అప్పుడు విష్ణుదేవుని పంచాయుధములును గరుత్మంతుఁడును బ్రవేశించు చున్నారు.)

గరు—

తే. గీ. గరుడుఁడ సుపర్ణుఁడను మహాఘనజవుండ
హరికి రథము నై ధ్వజము నై యమరి యుంటి
సమరదానవగణవిగ్రహంబులందు
విష్ణుబలమున మోసితి విష్ణు నేను. 22

చక్రము—

మ. హరిచక్రింబను నేను నిల్తు హరిహస్తంబందు మధ్యాహ్నభా
స్కరచండాతపతుల్య మైనఘన తేజం బూనుదున్ క్షీరసా
గరముం ద్రిచ్చుతజిం ద్రివిక్రమమునన్ గర్వించిజృంభించునా
సురవర్గంబులఁ బట్టి, చెండితి రణక్షోణిన్ సురల్ మోదిలన్.

శార్ఙ్గము—

చ. అనిమిషులెల్ల మెచ్చ హరిహస్తవిలగ్నసువృత్తమధ్యమై
దనరెడు శార్ఙ్గమేను బలదర్పములం బురుషుండ వేసముం
గన విరిబోఁడినాదు హరికై దనుమాడితి సంగరంబులన్
ఘనరథవాజివారణనికాయయుతంబుగ దైత్యసైన్యముల్. 23

కౌమోదకి—

తే. గీ. వినుఁడు కౌమోదకిని నేను విష్ణుగదను
సరయువు మథించి విష్ణునిశాసనమున
రాక్షసబలంబుఁ గూల్చి తదక్తనదుల
మున్ను బలుమాఱు క్రీడించి ముదముగంటి.

శంఖము—

తే. గీ. శంఖమును నేను నను క్షీరజలధినుండి
స్వయముగా నెత్తి తీసెను చక్రపాణి
నాదుశబ్దంబు వినినంత నాశనంబు
నొందుదురు దేవశాత్రవుల్ యుద్ధమందు.

నందకము—

తే. గీ. నందకకృపాణమును నేను నన్నుఁ జూచి
బవరమునఁ బాఱిపోవనివాఁడు లేఁడు
వినుఁడు ప్రభవిష్ణుఁడై నయావిష్ణుదేవుఁ
డాత్మఁ దలఁచుకొన్నంతనే యరుగు చుందు.

చక్రి—

తే. గీ. చక్రశార్ఙ్గగదాఖడ్గశంఖములము
దైత్యమర్దనులము రణస్థలములందు
వాసుదేవునిపనులు దీర్పంగ నతని
పరిజనంబుల మగుమేము వచ్చినాము.

అందఱు—అట్లగుఁగాక. (అని విష్ణుని జేరుదురు)

వసు—మిత్రుఁడా! యీబాలునకు నమస్కారముచేయుము.

నంద—స్వామీ! యట్లే చేసెద. రాజకుమారా! దండము. దండము. నిన్ను మోయుటకు గోపజనములో బలపరాక్రమవంతుఁ డెవఁడు?

చక్రము—భగవానుఁడా! మహావిష్ణూ! పరమేశ్వరా! నారాయణా! నీకు నమస్కారము.

మ. అమరుల్ నేయఁ దలంచునట్టిఘనకార్యాకార్యముల్ నీ మహ
త్త్వముచే సిద్ధినిఁ బొందుచున్నయవి దేవా!గాన నీవిష్ణు భా
రము లేకుండఁ గరంబుఁ జుల్కనశరీరం బూని మాపైఁ బ్రసా
దము సేయంగదె యీమహాత్ముని ప్రయత్నం బెల్ల సార్థంబుగాన్

వసు—పుచ్చుకో పిల్లవానిని.

నంద—చిత్తము దేవా!

వసు—మిత్రుఁడా! తెల్లవాఱినది. ఇఁక నీవు వెళ్ళు.

నంద—స్వామీ! ఆశ్చర్య మాశ్చర్యము. నాసంకెళ్ళు తమంతట విడిపోవుచున్నవి.

వసు—అది యంతయు నీకుమారునిప్రభావమే. కాని నీవు వేగము పొమ్ము.

నంద—దేవరవారు సెల విచ్చినట్లె చేసెదను.

వసు—ఉండుండు. ఒకసారి యిటురా.

నంద—స్వామీ! యిదిగో వచ్చితిని.

వసు—

తే. గీ. ప్రకృతిచేతనె నీ వతివత్సలుఁడవు
నిండుదయఁ జూపఁగద వయ్య నిసువుమీఁద
దగ్ధభూయిష్ఠశేషయాదవకులైక
బీజ మీవేళ నీచేతఁ బెట్టినాఁడ

కుమారునకు నీవేమి చేసెదవు?

నంద—స్వామీ! చిత్తగింపుఁడు. కుమారున కేమి లోటు స్వామీ! అతఁ డొకయింటికిఁ బోయి పాలు డాగును. మఱొక యింటికిం బోయి పెరుఁగుదాఁపును. ఇం కొకయింటికి వెళ్ళి వెన్న ముద్దలు మ్రింగును. వే ఱొకయింటికిఁ జని పాయసము మెక్కును. మఱియొకయింటి కరిగి మజ్జిగకడవ లాగికొనును. ఇన్నిమాట లెందుకు? మావేపల్లెకు దొరయై యుండఁ గలఁడు?

వసు—అట్లేయగుఁగాక! ఇఁక నీవు వెళ్లు.

నంద—చిత్తము దేవా.

వసు—నందగోపుఁడు వెళ్ళినాఁడు గదా. ఇంక నేనును మధురాపురమున కరిగెదను. (నడిచి) ఏడుపువలె వినఁబడు చున్నది. ఏమైయుండును? కంసుభయమువలన నందగోపుఁడు మరలి వచ్చియుండఁడు గదా? (నడిచి) అహో! ఈబిడ్డ బ్రతికినది. దీనిఁ దీసికొని పోయి దేవకిదేవి కిచ్చి దురాత్ముఁడైనకంసుని వంచించెదను. (గ్రహించి) ఇది యెంతభారముగా నున్నది? ఈబాలికయుఁ గొంచెమించుమించుగా మాబాలునియంత బరువున్నది. ఇంక నే నరిగెదను. అహో! భగవతియైన యమునానది యావిధముగానే యున్నదే సరే! పోయెదను. యమునానదిని దాఁటితిని. ఇదే నగరద్వారము. నేను బయలుదేఱునప్పుడువలెనే మధురానగరమందలిజను లందఱు నిద్రించు చున్నారు. సరే ప్రవేశించెదను. (ప్రవేశించి) ఇదే దురా

త్మ్మఁ డైన కంసునిగృహము. ఈయిల్లు పెద్దమ్మ పరివేశించినట్లు పాడువాఱు చున్నది. ఇదే నాయిల్లు లక్ష్మీప్రసన్న మైన ట్లగుపడు చున్నది. సరే నే నంతఃపురముఁ బరివేశించి దేవకి నూఱడించెదను. దేవతలు మేలు చేయుదురు గాక.

(నిష్క్రమించు చున్నాఁడు.)

ప్ర థ మా ం క ము .

సమాప్తము.

# భాలచరిత్రము.

## ద్వితీయాంకము.

(అప్పుడు చండాలయువతులు ప్రవేశించు చున్నారు.)

అందఱు—భర్తా ! రమ్మీ. రమ్మీ. కన్యకల మగు మేము నిన్ను వివాహ మాడవచ్చితిమి.

(అప్పుడు రాజు కంసుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

రాజు—అహో ! ఏమిది ?

గీ. క్షోణి కంపించె మేడలు గూలి పడఁగ
నుదధికల్లోలముల నూఁగు నోడవోలెఁ
గర్మఫలనిమిత్తములచేఁ గలుగ నున్న
దశుభ మో శుభ మో తెలియంగ రాదు. 1.

అందఱు—భర్తా ! రమ్మీ.రమ్మీ. కన్యకలమగు మేము నిన్ను వివాహ మాడ వచ్చితిమి.

రాజు—గీ. రక్షిపురుషు లెవ్వరు నిందు రాక యుంట
దివ్వెలను దాల్చి పడఁతుకల్ దిరుగ కుంట
నకట నీలోత్పలాంజనశ్యామ లైన
మాలెతలు జొచ్చినారు నామందిరంబు. 2.

అందఱు—భర్తా ! రమ్మీ. రమ్మీ. కన్యకలమగు మేము నిన్నువివాహ మాడ వచ్చితిమి.

రాజు—ఈచండాల యువతులు లెక్కకు మీఱి యున్నారే!

గీ. నా యలిగినంత నశియింతురి నాపగతులు
వశగతులు నాకు శశి, సూర్య, వహ్ని ముఖులు

యమునకు యముండ భయమున కరయ భయము
నైన నను ధిక్కరింత్రు వీరద్భుతముగ. 3.

అందఱు—భర్తా ! రమ్మా. రమ్మా.

రాజు—ఆహాహా ! ఏమి యీయాపదలు . అహో! వీ రంద ఱకస్మాత్తుగ వెడలిపోయి రే! ఇఁక నేనభ్యంతరమందిరమున కరిగెద.

(అప్పుడు శాపపురుషుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

శాప—అన్నా ! నేనిప్పు డెందుఁ బ్రవేశింతును?

రాజు—

మ. అవనింజొచ్చినరుద్రకోప మన దంష్ట్రాభీలవ క్త్రింబుతో
డ విలోలత్ఫణిపింగలాక్షములతోడన్ స్వేచ్ఛమై వచ్చి వీ
డెవఁడో కాటుకముద్దలా గిప్పుడు నట్టింటం బ్రవేశించి తా
నవురా! యిట్టటుగ్రుమ్మరుంగొరవులన్ హ స్తంబులంద్రిప్పుచున్. 4.

ఎవఁడవురా నీవు ?

శాప—ఏమి ! న న్నెఱుఁగవా ? నేను మధూకఋషి నీ కిచ్చిన శాపమును. నా పేరు వజ్రబాహుఁడు.

గీ. వల్లకాటిలోపలనుండి వచ్చినాఁడ
లెక్కలేనికపాలమాలికలు దాల్చి
భయముఁ గొలుపుచండాలరూపంబుతోడ
గంసు నంతరంగముఁ జొచ్చి కలఁచు కొఱకు. 5.

రాజు—అసంభావ్య మైనకోరికఁ గోరు చున్నాఁడవే.

ఆ. వె. కనకకూట కుంజ కలిత మా కనకాద్రిఁ
గాకి యెక్కగాలి కదపఁ గలదె ?
భంగ మకర కలితవారాశితోయంబు
నంజలిపుటిఁ దాగ్రవ నగునె చెప్పుమ. 6.

శాప—కాలము వచ్చినపుడు నీవు తెలిసికొనియెదవు.

రాజు——అహా ! ఏమిది యితఁడు హఠాత్తుగ వెళ్ళిపోయె! నాఁడే ! నేను పాన్పుమీఁదికిఁ బోయి, పండుకొని, కనులు మూసికొని, నిద్రఁబోయెదను. (నిద్రించుచున్నాఁడు)

శాప——అహా ! ఇతఁడు నిద్రఁబోయినాఁడు. అలక్ష్మి ! ఖలతీ ! కాళరాత్రి ! మహానిద్రా ! పింగలాక్షీ ! రండి. రండి. అభ్యంతరమందిరమునఁ బ్రవేశింతము.

అందఱు——అట్లే యగుఁ గాక.

(అప్పుడు రాజ్యలక్ష్మి ప్రవేశించుచున్నది.)

రాజ్య——మీరు లోపలఁ బ్రవేశింపఁ గూడదు.

శాప——నీ వెవతవు ?

రాజ్య——ఏమి! నన్నెఱుఁగవా? నేనీకంసుని రాజ్యలక్ష్మిని.

శాప——ఆలాగా రాజ్యలక్ష్మివా? ఎవ్వరైన నేమి! ఇక్కడనుండి లేచిపో. ఇది నాయిల్లయినది.

రాజ్య——

ఉ. ఈనిశివేళ బాలిశుఁడ! యెవ్వనియండను లంకవంటి యీ
నానిలయంబుఁ జొచ్చితివి నన్ను గణింపక ధిక్కరించుచున్
వేనుడు: లేటికిన్ విను ప్రవేశముగాదు మదీయవాసమా
నీ నిలయంబు తేరి కన నేనియు శక్యమె నీకు దుర్మతీ.

శాప——ఓభగవతీ ! పద్మాలయా! కంసశరీరమునుండి నీవు తొలఁగుము.

తల్లీ ! విష్ణుదేవునియాజ్ఞ యైనది.

రాజ్య——ఎట్టెటు ! విష్ణుదేవునియాజ్ఞయైనదా ? ఓహో ! కష్టము! కష్టము!!

కం. చిరసంవాసముచేతను
 ధరణీశ్వరు విడువఁజాలఁ దద్దయు బలవ

త్తర మౌగుణ సంగాప్రిహము
కరముం దపియింపఁ జొచ్చెఁగద నామనసుక్.

కానిమ్ము! విష్ణుదేవునియాజ్ఞ యతిక్రమింపఁ గూడనిది గదా! అందువలన నేనును విష్ణుసన్నిధి కరిగెదను. (నిష్క్రమించుచున్నది)

శాప—రాజ్యలక్ష్మి తొలఁగిపోయినది. వహ్వా! ఇప్పు డిది నాయిల్లయినది. అలక్ష్మి! ఖలతీ! కాళరాత్రీ! మహానిద్రా! పింగలాక్షీ! రండి రండి. అభ్యంతరమందిరముఁ బ్రవేశించి స్వజాతిసదృశ మగుక్రీడ సేయుఁడు.

అందఱు—నేఁడు మొదలుకొని యపనీతధర్మచారిత్రుఁడవు గమ్మ.

శాప—(కంసునిఁ జూచి)

క. అనయ మధర్మపరాయణు
నిను బిగికౌఁగిటను జేర్తు నెయ్యం బలరన్
మునిశాపము నై వచ్చితి
వినాశ మొందెదవు నీవు వేవేగ మిఁకన్.

(అంతర్హితుఁ డగుచున్నాఁడు.)

ప్రతీహారి—(ప్రవేశించి) దేవా! జయము. జయము.

రాజు—ఎవరువారు?

ప్రతీ—దేవా! నేను యశోధరను.

రాజు—యశోధరా! చండాలయువతీజనము లోపలి కెట్లు వచ్చినది నీవు చూడలేదా!

ప్రతీ—అయ్యో! చండాలయువతీజనమా. ఆశ్చర్యము! నిత్యము దేవరవారి పాదసూరాభుముం గని పెట్టికొనియుండుజనమునకే యిందుఁ బ్రవేశించుట దుర్లభమైయుండఁగఁ జండాలయువతీజనము మాట చెప్ప నేటికి? నా కన్ను నగరుఁ బ్రవేశించుటేమి?

రాజు—నేను కలగంటినా యేమి? యశోధరా! నీవు వెళ్ళి బాలాకియను కాంచుకీయునిఁ బంపుము.

ప్రతీ—చిత్తము. దేవా!

(అప్పుడు కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కాంచు—మహారాజా! జయము. జయము.

రాజు—అయ్యా బాలాకీ! నేటిరాత్రి ఝంఝామారుతము వీచినది. భూకంపము గలిగినది. మింటనుండి కొఱవులు పడినవి. వీని యర్థ మేమో కార్తాంతికపురోహితుల నడిగి తెలిసికొని రమ్ము.

కాంచు—చిత్తము దేవా! (అని వెళ్ళి తిరిగి ప్రవేశించి) దేవా! కార్తాంతికపురోహితుల కీవిషయము విన్నవించితిని.

రాజు—వారేమని చెప్పిరి?

కాంచు—చిత్తగింపుఁడు దేవా!

గీ. గగనవాసి యాభూత మొక్కటి నశేందర్!
వచ్చి కార్యాంతరంబున వసుధఁ జొచ్చెఁ
గగనదుందుభిరవము, భూకంపము, నను
నీవికారముల్ తజ్జన్మహేతుకములు.

రాజు—

కం. ఏవానిజన్మకతమున
నీవసుమతి కంప మొందె నీరీతిగ వాఁ
డే వానినందనుండో
యావిధజన్మఫల మేమొ యరయుఁడి మీరల్.

కాంచు—చిత్తము దేవా! (అని నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) జయము దేవా! అమ్మాయి దేవకికి కొకయాఁడుపిల్ల పుట్టినది. దేవరవారితో నే నెన్నఁ డబద్ధము జెప్పను. నేను దాదిచేతిలోఁ బిడ్డను చూచినాను.

రాజు—బ్రాహ్మణవచన మనృత మనుకొంటిని కాని యది సత్యమై కనఁబడుచున్న దే! ఓయీ! నీవు వెళ్లి వసుదేవునిఁ బిలిచి కొని రమ్ము.

కాంచు—మహారాజా! చిత్తము. (అని నిష్క్రమించు చున్నాఁడు)

రాజు—వసుదేవుఁడు ధర్మశీలుఁడు; సత్యవాది. అందులో నాయెదుట నసత్యమెన్నఁడుఁ బలుకఁడు. కానీ! విందుము గాక.

(అప్పుడు వసుదేవుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

వసు—గీ. అర్గటకరమాళ్ళమృతిదుఃఖ మనుభవించి
దారుణవిషాదకృశ మైనతనువుఁ దాల్చి
నిష్కరుణుఁ డైనయీదుష్టనృపుఁడు పిలువ
నస్వతంత్రభృత్యుఁడువోలె నరుగు చుంటి.

ఆహా! లోకవృత్త మిట్టిదే కదా!

కం. భయశంకలు గలవాఁడును
భయశంకలు లేనివాఁడు భయపడుచునో ని
ర్భయముఁగ నో పోవలె భూ
దయితునిసన్నిధి కుభయములుఁ దప్పనిపతిగాన్.

(సమీపించి) శౌరసేనీపుత్రా! కూర్చుంటివా?

రాజు—యాదవీపుత్ర! కూర్చుండుము.

వసు—సరే (అని కూర్చుండి) శౌరసేనీపుత్ర! ఏల మమ్ము రావించితివి?

రాజు—యాదవీపుత్రా! దేవకి ప్రసవించినదా?

వసు—అవును ప్రసవించినది.

రాజు—ఏమిబిడ్డ పుట్టినది?

వసు—(తనలో) నేనుగూడ నేఁటికాలమున కసత్యముఁ జెప్ప

వలసి వచ్చినదగదా! అయిన నేమి కుమారరక్షణార్థ మసత్యముసత్య మేయని నాకుఁ దోఁచుచున్నది. ఇప్పు డేమి చేయుదును? ఆహా! తోఁచిన దుపాయము. (ప్రకాశముగా) ఆమె కాఁడుబిడ్డ పుట్టినది.

రాజు—గీ. కూఁతు రైనను గొడు కైనఁ గొంకులేక
యే నవశ్యంబు వధియింతు నీశిశువును
దైవ మొనరింపఁ దలఁచినదాని నిపుడు
పురుషకారంబుచేతనేఁ బోవ నడఁతు.

ప్రతీహారి—(ప్రవేశించి) దేవా! జయము. జయము దేవవారితోఁబుట్టు దేవకి యిట్లు విజ్ఞాపనము చేయుమన్నది. "ఈశిశు వాఁడుది. విశేషించి పసిబిడ్డ. కావున కరుణింప ననుగ్రహింపవలయు" నని.

వసు—శౌరసేనీపుత్రా! పాపము! దేవకియొక్క మాటఁ జెల్లింపుము. ఆఁడుపిల్లలయందు స్త్రీల కధికతర ప్రేమగదా!

రాజు—ఏమి! నీకుఁ దొల్లింటిప్రతిజ్ఞ జ్ఞాపక మున్నదా?

గీ. తొల్లి నామీఁద నలిగి మధూకమాని
శాప మిచ్చినయట్టియాసమయమందు
దేవకీగర్భజుల నెల్లఁ దెగించివైతు
నని ప్రతిజ్ఞ సేయఁగ లేదె యాగ్రహమున.

వసు—ప్రతిజ్ఞా! ఇంక నేను మాట లాడను.

ప్రతీ—దేవా! అమ్మాయి దేవకి కేమని ప్రత్యుత్తరము నివేదింతును?

రాజు—యశోధరా! యీవిషయమున నన్ను నిర్బంధపెట్ట వలదనియు మఱియొకప్రియతర మైనకార్యముఁ దనకుఁ జేసెద ననియు దేవకితోఁ జెప్పుము.

ప్రతీ—చిత్తము దేవా.

రాజు—యశోధరా! యీలాగునఁ జేయుము.

ప్రతీ—దేవరవా రక్కడికిఁ దయచేయుఁడు.

వసు—(తనలో) ఈరహస్యమును సర్వవిధములఁ గాపాడఁ దలంచినవాఁడనైనను బరులబిడ్డను దెచ్చి చంపింపవలసి వచ్చెను గదా యని చింతిల్లు చున్నాఁడను. ఇంతి యెందుకు నాకుమారునే దెచ్చి కంసున కర్పింతునా? కాదు కాదు.

కం. ముందుగ నీదారిక మృతి
నొంది యనంతరము బ్రితికె నోరు లెఱుఁగక మ
న్నందనుమహిమంబున మృతి
నొందదు బాలిక యటంచు నూహింతు మదిన్.

ఇఁక నేను లోపలికరిగి దేవకి నూరడించెద. (అని నిష్క్రమించు చున్నాఁడు)

రాజు—ఆపిల్ల నిక్కడికిఁ దీసికొని రా!

ప్రతీ—దేవర వారిచిత్తము. (అని నిష్క్రమించుచున్నది.)

(అప్పుడు పిల్లను దీసికొని దాదియు రక్షిపురుషులుఁ)
బ్రవేశించు చున్నారు.

అందఱు—మెల్లమెల్లఁగ నడువుము. ఇదిగో! మధ్యమద్వారము. రమ్మీ.

దాది—దేవా! జయము ఈపిల్ల కడుపులో నున్నదిమొదలు కొని మిక్కిలి జాగ్రత్తతో రక్షించితిని.

రాజు—ఔరా! ఈపిల్ల రాజులకుఁ గూడ దర్శనీయ మై యెంతముద్దులు మూటగట్టుచున్నది? నేను గూడ స్త్రీవధఁ జేయవలసి వచ్చినది గదా.

దాది—దేవా! మెల్లమెల్లఁగఁ బట్టుకొనుఁడు.

రాజు—ఇది కంసపాషాణము. ఇంక నేనతిసాహస మనుష్ఠింపవలయును.

కం. ఇదియే సప్తమగర్భం
బిది మునిశాపమున జన్మ మెత్తెను భువిపై
నిది నాశన మొందిన నా
మదికిన్ శాంతంబు గలుగు? మాట లికేలా?

(అని బిడ్డను పట్టుకొని నలికి)

ఔరా!

కం. ఒకతునుక నేలఁబడె వే
ఱొకతునుకయు మింటఁ జేరి యున్నది శస్త్ర
ప్రకరము సేతుల వెలసెడు
నీకన్నిది జంపివైచు నీక్షణమందే.

అహో! ఇది యిప్పుడు—

గీ. వాఁడిమొన గల్గుశూలంబు పట్టి చేత
వికటరౌద్రవేషమున జృంభించు చుండె
ప్రళయకాలంబునందు నుత్పన్న మైన
కాళరాత్రివిధంబునఁ గ్రాలుచుండె.

(అప్పుడు కాత్యాయని ప్రవేశించు చున్నది.)

కాత్యా—

గీ. శుంభు, మహిషాసురు, నిశుంభు క్షోణిఁ గూల్చి
నిహతశత్రులుఁ గాఁ జేసి నిర్జరులను
పరిభవ మొందితి వసుదేవువంశమందు,
నేను కాత్యాయనిని, గంసహింసకొఱకు.

కుండోదరుఁడు—

సీ. ఉగ్రకన్నుఁడ నాఁజఁ గుండోదరుండ
భూరిభైరవరవముతోఁ బుట్టినాఁడ
గగనమునుండి యవని శీఘ్రంబ జొత్తు
బాహుబలమత్తు లగుదైత్యవరులఁ గూల్ప.

శూలము—

ఉ. శూలము నే ప్రసన్నుఁడను క్షోణితలంబునఁ జేరితిన్ మృడా
నీలలితప్రసాదమున నీటగునుజ్వలదివ్యరూపమున్
దాలుతుఁ గార్తికేయుఁ డల తారకవృత్తమునబ్ధినుండి ని
ర్మూలముఁ జేసి తెచ్చినటు క్రూరునిఁ గంసునిదుంపఁద్రెంపెదన్

నీలుడు—

కం. నీలుండఁ గలహకర్తను
నాలములో మడమ దిరుగనట్టిమగండన్
గూళన్ గంసునిఁ దుంచెద
బాలుఁడు స్కందుండు క్రౌంచపర్వతముఁ బలెన్.

మనోజవుఁడు—

ఉ. ఏను మనోజవుండఁ బరమేశ్వరి శాంకరి కార్య మంతయున్
బూని యొనర్పవచ్చితిని భూరిబలుండను వాయువేగుఁడన్
దానవకోటి నిర్దయతఁదాఁకి దహించెద గడ్డిమేటి వై
శ్వానరుఁడేచి కాలిచినభంగిని దారుణసంగరంబులన్.

కాత్యాయని—కుండోదర! శంకుకర్ణ! సుహాసీల! మనోజవ! రండు రండు భగవంతుఁ డైనవిష్ణునిబాలచరిత మనుభవించుటకు గోపాలకవేషప్రచ్ఛన్నులమై వ్రేపల్లెయం దవతరింతము.

అందఱు— దేవీ! నీచిత్తముచొప్పున వర్తింతుము.

(అని సపరివారముగా కాత్యాయని నిష్క్రమించుచున్నది.)

రాజు—అహహో! తెల్లవాఱెన దే?

కం. శాంతి పొనరించు పొంకెై
శాంతికి నుచితం బయిననిశాంతముఁ జొత్తున్
శాంతులు జేయించెద నా
శాంతులతో నాదుమదికి శాంతి ఘటిల్లున్.

ద్వితీయాంకము
సమాప్తము.

# బాలచరితము

## తృతీయాంకము.

(అప్పుడు వృద్ధగోపాలకుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

వృద్ధ—ఓరీ! మేఘదత్తా! ఓరీ! వృషభదత్తా! ఓరీ ఘోషదత్తా! గోవులను గట్టివేయుఁడు. గోపరికర మీబృందావనమునం దుఁ గడుపునిండ నీరుఁ ద్రావి హంభారవములతో నిండ్లు చేరినవి. ఈయెద్దు దారిలో నొకపుట్టఁ గాళ్ళతో మొనలంటఁ ద్రొక్కివైచినది. ఆపుట్టలోనుండి పాడురంగు గలత్రాఁచుబాములు బుస్సున లేచి నల్లగలువదండలు జుట్టి నట్లు కొమ్ములకుఁ జుట్టుకొని యెంతో శోభఁ దెచ్చెను. తోకఁ బైకెత్తి మోఁకాళ్ళు క్రిందికి వంచి చందమామ వంటి తెల్లనిమేను గలయీయెద్దు కొమ్ములకొనలతో, నేల కోరాడి మన్ను పైకెగఁజిమ్ము చున్నది. ఇప్పుడు దామకునిఁ బిలిచెదను. ఓరీ! దామకా! ఆవులను దూడలను మంచిచోటఁ గట్టివైచి నీవు గూడరా.

(అప్పుడు దామకుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

దా—ఆహాహా! నందగోపునిబీళ్ళలో నెంతగడ్డి యున్నదో! కుమారుఁడు పుట్టినదిమొదలుకొని మిక్కిలి యద్భుత మైనయానంద మాతనికిఁ గలుగు చున్నది. కానీ గోధన మిక్కడ నుండుఁ గాక. మా మామకడకుఁ బోయెదను. మామా! దండము.

వృద్ధ—మనకును గోధనమునకును శాంతి గలుగుఁ గాక, శాంతి గలుగుఁ గాక.

దామ—మామా! నందగోపున కేనాఁడు కొడుకు పుట్టెనాఁ

డో యానాఁడు మొదలుకొని పశువులు తెగుళ్ళు లేక హాయిగా నున్న వి. సమస్తగోపజనమునకుఁ బ్రీతి వర్ధిల్లుచున్నది. ఎక్కడఁ జూచిన నక్కడ మొక్కలు. ప్రతిచెట్టునకుఁ గావలసినన్నిపండ్లు.

వృద్ధ— మఱియొకయాశ్చర్య మున్నది. నందగోపపుత్రుఁడు పుట్టిన పదియవనాఁడు పూతనయనురాక్షసి విషపూరితస్తన యై నందగోపీరూపము ధరించి వచ్చెను. అప్పుడది బాలకు నెత్తుకొని పాలు గుడుపు నెపంబునఁ జన్ను నోటఁ బెట్టెను. అప్పు డది యెఱిఁగి బాలకుఁడు దానిప్రాణములు పీల్చివేయ నది రాక్షసరూపిణి యై నేలఁ బడి చచ్చెను. అనంతరము నందగోపపుత్రుఁ డొక్కనెలయీఁడు గల వాఁడైనపుడు శకటాసురుఁడు శకట రూపముఁ దాల్చి వచ్చెను. అది యెఱిఁగి బాలకుఁడు కాలితో నొకతన్ను తన్ని పిండి పిండి చేయ రాక్షస రూపముఁ దాల్చి యతఁ డప్పుడే మృతి నొందెను. అనంతరము మాసములు గడచి నందపుత్రుఁడు సంవత్సరములలోఁ బడ్డతర్వాత నొకనాఁ డొకయింటికిఁ జని పాలుత్రాగును. మఱియొకయింటికిఁ జని పాయసము మెక్కును. వే ఱొకయింటికిఁ జని పెరుగుఁ ద్రావును ఇంకొకయింటికిఁ బోయి వెన్న మెసవును. వేఱొకయింటికిఁ బోయి చల్లకుండఁ బరిశీలించి చూచును. పిమ్మట గోపికలు కోపించి బాలుని యాగడములు గోపిదేవితో మొఱవెట్టుకొనిరి. నందగోపికయు వారిమొఱలు విని బిట్టలిగి త్రాడుఁ బుచ్చుకొని కొంత బాలుని నడుమునకుఁ గట్టి మిగిలినది రోటికిఁ గట్టెను. అతఁ డారోలీడ్చుకొంచు రాఁగా నది రెండుమద్దిచెట్లకుఁ దగుల్కొనెను. అప్పు డారెండు చెట్లుం గలసి యొక్కటయ్యెను. నందగోపకుమారుఁ డారెండుచెట్ల నడుమనుండి రో లీడ్చుకొని పోవ మద్దిచెట్లు రూకటివేళ్ళతోఁ గూలి పిండి పిండియై రాక్షసరూపమును ధరించి మృతి నొందెను. అంతట స్వామి యైనదామోదరుఁడు మహాబలపరాక్రమసంపన్నుఁ డగు నని

మనగొల్లలందఱుఁ జెప్పుకొనిరి. నందగోపపుత్రుఁడు వెనుకకు ముందుకుఁ బరువు లెత్తగలయీఁడు గలవాఁ డైనప్పుడు ప్రలంబుఁ డను దానవుఁడు నందగోపవేషము ధరించి వచ్చెను. వచ్చి వాఁడు సంకర్షణుని మెడమీఁద నెక్కించుకొని పాఱిపోవుచుండఁగా నది మెఱిఁగి సంకర్షణుఁడు తలమీఁద నొకమొట్టికాయి మొట్టెను. ఆదెబ్బచేత వాఁడు గుడ్లు వెళ్ళఁబెట్టి దానవరూపముఁ దాల్చి వెంటనే చచ్చెను. ఒకనాఁడు తాటిపండు దెచ్చుకొనుటకై గోపకుమారుఁడు త్రాటితోఁట కేగెను. అక్కడ ధేనుకుఁ డనురాక్షసుఁడు గార్దభరూపముఁ దాల్చి యుండెను. అప్పు డది మెఱిఁగి స్వామి యైనదామోదరుఁడు వానియెడమకాలు బట్టుకొని పై కెగురవేయఁగ వానిమేను తగిలి తాటిపండ్లూడి క్రిందఁ బడెను. వాఁ డప్పుడు రాక్షసరూపముఁ దాల్చి తక్షణమే మృతినొందెను. అనంతరము కేశి యనుదానవుఁడు గుఱ్ఱపురూపుఁ దాల్చి రాఁ గా ప్రభువైనదామోదరుఁడు దానిని మోచేతితో మొగముమీఁదఁ గొట్టెను. అప్పుడా గుఱ్ఱము రెండు ముక్కలై దానవరూపముఁ దాల్చి మృతినొందెను. స్వామిదామోదరుఁ డిట్టి యద్భుతకర్మము లనేకములు చేసెను.

దామ—మామా ! అదియంతయు న టుండనీ. నేఁడు స్వామిదామోదరుఁ డీబృందావనమందు గోపకన్యకలతోఁ గలసి హల్లీసకమనునాట నాడవచ్చు చున్నాఁడు.

వృద్ధ—అట్లైన సర్వగోపాలజనముతో స్వామి దామోదరుని యొక్క హల్లీసకమును జూచి యానందింతము.

దామ—మామా ! నీయిష్టప్రకారము.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

(ఇది ప్రవేశకము)

(వృద్ధగోపాలకుఁడు మరలఁ బ్రవేశించుచున్నాఁడు)

వృద్ధ—

గీ. భానుఁ డుదయించుటకుమున్న పరమభక్తి
శిరసు వంచి నమస్కృతిఁ జేయవలయు
నమృతపూర్ణ దేహములతో నమరునట్టి
యావులకు జగన్మాతల కనుదినంబు.

ఏమి! మాపల్లియలలో సమృద్ధి. ఆయాటఁ జూచుటకు సర్వ మాయత్తముఁ జేసికొని వెళ్ళుదము. ఓహో! గోపకన్యకలార! ఓసీ! ఘోషసుందరీ ! చంద్రరేఖా ! మృగాక్షీ ! వనమాలీ ! త్వర గా రండి. త్వర గా రండి.

(అప్పు డందఱుఁ బ్రవేశించుచున్నారు.)

అందఱు—మామా ! నమస్కరించు చున్నాము.

వృద్ధ—బిడ్డలార ! అదిగో.! స్వామిదామోదరుఁ డావుపాల వలెఁ దెల్లనిమేను గలసంకర్షణుండును గోపాలకులును పరివేష్టింప గుహలో నున్నసింహమువలె నిటే వచ్చుచున్నాఁడు.

{ అప్పుడు గోపజనపరివృతులైన దామోదర సంకర్షణులు ప్రవేశించుచున్నారు. }

దామో.—(విస్మయముతో) ప్రకృతిచేతనే రమణీయరూప ములు గలగోపకన్యకలయొక్క వేషగ్రహణవిశేష మెంత చమత్కా రము గ నున్నది !

ఉ. కైరవనేత్రలున్ వికచకంజనిభాస్యలు స్వర్ణచంపకా
గౌరమనోహర స్ఫురితగాత్రలు శ్రావ్యమృదుప్రలాపలున్

హరివిచిత్రవర్ణకలితాంబరలున్ వనపుష్పమాలికా
స్ఫారశిరోజపాశలును వచ్చిరి నృత్యము సేయ గోపికల్.

సంక—ఇదిగో! ఈగోపబాలకులు వచ్చియున్నారు.

సీ. రమణీయఝిండిమారావంబు సల్పుచు
నుల్లాసమునఁ గొండ ఉన్నవారు
పంకజదళనేత్రవదను లై నృత్యంబు
నొనరించుచును గొండ ఉన్నవారు
హుంభారవంబుల నొప్పారు చుండి యీ
బృందావనంబున నెలసినట్టి
ఘోషంబునను గానగోష్ఠీప్రసక్తు లై
యుత్సాహమునఁ గొండ ఉన్నవారు.

వృద్ధ—అవును స్వామి ! అందఱు సన్నద్ధులై వచ్చినారు.

దామ—స్వామీ ! జయము. జయము.

సంక—దామకా! అందఱు గోపబాలకులు వచ్చినారు.

దామ—అవును స్వామి! అందఱు సన్నద్ధులై వచ్చినారు.

దామో—ఘోషసుందరీ ! వనమాలీ ! చంద్రరేఖా ! మృగాక్షీ ! ఘోషవాసుల కుచిత మైనట్లు హల్లీసక మనునృత్తబంధము నారంభింపుఁడు.

అందఱు—చిత్తము దేవా !

సంక—దామకా ! ఆతోద్యములు వాయింపుఁడు.

దామ—చిత్తము దేవా !

వృద్ధ—స్వామి ! మీరు హల్లీసక మాడుచున్నప్పుడు నే నేమి చేయ వలయును ?

దామో—నీవు చూచు చుండుము.

వృద్ధ—చిత్తము స్వామీ ! (అందఱు నృత్యము చేయుచు

నా్నరు) హా! హా! ఏమిగానము ! యేమినృత్యము ! ఏమివాద్యము నేను గూడ నృత్యము చేసెదను. (అని కొంతసేపు నృత్యముఁ దొ్రిక్కి) అబ్బా !నాకాయాస మొచ్చినది.

(ఒక గోపాలకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

గోపా—హా! హా! స్వామీ! యిచ్చోటనుండి వెళ్లిపో వెళ్లిపో!

దామో—నీకు మతిపోయినదా యేమి ?

గోపా—స్వామీ ! అరిష్టర్షభుఁ డను రాక్షసుఁ డీసమీపమున నున్నాఁడు. వాఁడు వజ్రాయుధప్రముద్దవలె భూతలము నిజఖురపుటాగ్రములచే బ్రిద్దలు చేయుచున్నాఁడు. ఆచప్పుడు విని గొల్లపల్లియలో మేఘ ముఱుము చున్నదా యని మాకు శంక వొడము చున్నది.

దామో—అన్నయ్యా ! అరిష్టర్షభుఁ డీలాగే వచ్చుచున్నాఁడు. ఈగోపబాలకులను బాలికలను దీసికొనిపోయి, యాపర్వతశిఖర మెక్కి, యాదురాత్మునకును నాకును జరుగుయుద్ధము మీరందఱుఁ జూడుఁడు. నే నిప్పుడే వానిఁగొ్రివ్వడఁ గింతును.

(సంకర్షణుఁడు వారిని వెంటఁ బెట్టుకొని పోవుచున్నాఁడు.)

దామో—ఇదిగో! ఇదిగో! దురాత్ముఁ డైనయరిష్టర్షభుఁడు.

గీ. ధరణి ఖురపుటంబులచేతఁ ద్రవ్వివైచి
శృంగముల నదీకూలముల్ జిమ్మివైచి
భీరులై తన్నుఁ జూడ నాభీరులెల్ల
నఱచుచును వచ్చె నీవృషభాసురుండు 4.

(అప్పు డరిష్టర్షభుఁ డను వృషభాసురుఁడు ప్రవేశించును.)

వృష—ఇదిగో ! నేను వచ్చినాను.

గీ. గగన మొరయుచు శృంగాగ్రగాఢరుచులఁ
బగతుఁ దెగటార్ప వృషభరూపంబు దాల్చి

కల(గి బృందావనము పరితిగర్జ లీన
హాయి( దిరుగు చుంటిని వైరి నాక్రమించి. 5.

మ. కనుబొమ్మల్ ముడివైచి నే నలిగి హుంకారంబు( గావించు మా
త్రన వ్రేపల్లియలోని వేత్రితలకు గర్భస్రావ మౌ జుమ్మి వీ
కను నాడెక్కలు దాకి యర్ధశశి రేఖల్ దో(ప(గా సర్వకా
ననసంయుక్తముగా మహీస్థలిగడు న్గంపించు నాఘట్టనన్. 6

నందగోపపుత్రు( డెం దరిగినా(డు? ఓనందగోపపుత్రా! ఎక్క డున్నావు?

దామో—ఓవృషభాధమా! ఇటు. ఇటు. ఇక్క డున్నాను.

వృష—అహో!

కం. నను నుగ్రరూపు ఘననా
దుని దుర్వారబలదర్పధుర్యుని( గని నె
మ్మనమున విస్మయముం భీ
తిని బొంద(డు బాలకుండు దిట్టగిమె సుమీ. 7.

దామో—

గీ. నీవలన నక్కజంబు( గ నేను వినిన
యాభయం బెట్టిదో చెప్పు మసురముఖ్య!
భయము( గొన్నట్టివారి కభయ మొసంగ
నవతరించితి ధారుణియందు నేను. 8.

వృష—ఓహో? నీవు బాలు(డవు. అందువలన నీవు భయ మేమో యెఱు(గవు.

దామో—ఓరీ! వృషభాధమా? ఏ మేమి? బాలు( డనిన న్నిప్పు డధిక్షేపించు చున్నావా?

ఆ. వె. నల్లత్రాచుబాముపిల్ల చేవ గరుపం గ(
బడిన యత(డు మృతిని బడయ కున్నె?

క్రౌంచపర్వతంబు ఖండింపఁ బడలేదె ?
కరము బాలుఁ డైనస్కందుచేత.

వృష—కానచ్చును.

దామో—

గీ. వజ్రికఠినోపలచయంబువంటివాఁడ
వగుదు వీ వైన నిటు విను మయ్య మూర్ఖ !
చిగురుటాకంతకులిశంబు చేవ మిగిలి
తునియలుఁగ మేటికొండలఁ దునుమ లేదె? 10.

వృష—ఓనందగోపపుత్రి ! ఆయత్తముఁ జేసితివా ?

దామో—నిన్నుఁ జంపుటకా ?

వృష—సమర్థుఁడవు కాఁబట్టి చేయఁగలవు.

దామో—సంశయ మేమి !

వృష—అట్లయిన స్వజాతిసదృశ మైనయాయుధముఁ గ్రహింపుము.

దామో—ఆయుధమా? అబ్బో !

సీ. గిరిసానువులువోలె గురుకఠినాంసంబు
లమరునాబాహువు లాయుధములు
బలహీను లైననీవంటివారికిఁ గాక
మహితశస్త్రము లేల ? మాదృశులకు
చటులబాహాదండసం పరిహారంబులఁ
బీడ్యమానుండ వై విడిచి ప్రాణ
మవనిపైఁ గూలెద వటుగాకయుండిన
దామోదరుఁడఁ గాను దైత్య ! నేను. 11.

వృష—అట్లే యుద్ధము చేయుదము.

దామో—ఓగోవృషాధమా ! నే నొక్కయెడమకాలిమీఁద నిలిచి యుండెదను. నీకు బల మున్నపక్షమున నిలిచి యున్నచోటు నుండి నన్నుఁ గదుపుము.

వృష—అందుకు సందేహ మేమి ? (అట్లు చేయుట కుద్యమించి చేయలేక మూర్ఛబోవును)

దామో—ఓవృషభాసురా ! ఊఱడిల్లు మూఱడిల్లుము. ఇటువంటి బలము చేతనా నీవు గర్వించితివి ?

వృష—(తనలో) ఈబాలుఁడు దుస్సహ తేజుఁడే.

కం॰ హరుఁడో యాతం డమరే
శ్వరుఁడో గాక మధుదైత్యసంహారకుఁడో
యరయఁగ నీతఁడు సాక్షా
త్పురుషోత్తముఁడే వితర్కములతో నేలా.

కం. ఎం దెందు మేము జనసం
బొందుదు మం దంద పుట్టుచుండును జగ దా
నందుఁడు త్రిలోకధారుఁడు
మందరధరుఁ డసురకోటిమర్దనమునకై. 13.

ఆహాహా ! విష్ణుదేవునిచేత నిహతుఁడనైనను నాకక్షయలోకంబులు ప్రాప్తించును. అందువల్లయుద్ధముఁ జేసెదను. (ప్రకాశముగ) ఓనందగోపకుమారా ! నాకు వెండియు దర్పము జనించినది.

దామో—ఆలాగా ! అట్లయిన నిప్పుడు నిలు.

మ. మొదటం గాలికి దూలి వెండియు నభమ్ముం గ్రిమ్ము వర్షర్తు నీ
రద మట్టుల్ దొలుదొల్త నోడి యిటుగర్జల్ సేయుచే వెండి చి
మ్మెద రా రమ్మిటు మాట లేమిటికి భూమిన్ వ్రియ్యలై గూలిపో
వుదు వజ్రాహతి నంజనాచలతటంబుంబోలి యొక్కుమ్మడిన్.

(అట్లుచేసి)

ఇదిగో ! ఇదిగో! దురాత్ముఁడైనవృషభాసురుఁడు.

మ. తొరగె న్నెత్తురు నోట, ముక్కులనుఁ, గన్దోయి న్వెస, న్వీనులుం,
జరణంబుల్ గదలించెడున్ గకుదపృచ్ఛంబుల్ జలించెన్ మహా

 

మరితాత్ముం డగునీవృషాసురుఁడు తోడ్తోఁ గూలె వజ్రాహతిన్
ధరణిం ద్రెళ్ళెడు. శైలశృంగ మటు లుద్యద్గర్వముం బాయుచున్.

(అప్పుడు దామకుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

దామ.—స్వామీ! జయము. జయము. స్వామివైనసంకర్షణుఁడుకొండమీఁద నుండఁగ యమునాహ్రదమునందుఁ గాళీయుఁడనుసర్పరాజు లేచి విజృంభించుచున్నాఁ డని విని వాని నెదిరించుటకుం బోయినాఁడు. స్వామీ! సంకర్షణుని నివారింపుము నివారింపుము.

దామో.—కాళీయుఁ డను పన్నగపతి దర్పవంతుఁ డొకఁడు కలఁ డని నేనును విని యుంటిని. కానీ! నేనునుఁ బోయి యతనిగర్వంబడంచెదను.

కం. గోవులు బ్రాహ్మణు లాదిగ
నీవసుధాప్రజల వీఁడు హింసించెను నేఁ
డే వీని మద మడంచెద
కావర మడఁగి యిఁక వీఁడు కడుశాంతుఁ డగున్.

(అందఱు నిష్క్రమించిరి.)

# భామాకలాపము. 

## చతుర్థాంకము.

(అప్పుడు దామోదరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దామో.—

మ. పాలు పాముత్తచకోరనేత్రములతోఁ బొంగారుపాలిండ్లతోఁ
జలితోష్ఠంబులతో వికీర్ణచికురసస్త్రపరిసూనాళితోఁ
బలుమాఱిట్టట్టు జాఱుపయ్యెదలతోఁ బ్రవ్యక్తముల్ గానిప
ల్కులతో నావెనువెంట వచ్చి రిదె యీగోపాంగనల్ భీతలై.

(అంతట గోపకన్యకలు ప్రవేశించు చున్నారు.)

అందఱు—స్వామీ! వద్దు. వద్దు. ఆజలాశయముఁ బ్రవేశింప వద్దు. ఇది దుష్టమహాసర్పమునకు నివాసము.

దామో.—వద్దు వద్దు. విచారింపవలసిన పనిలేదు. మీరు చూచెదరు గాక.

సీ. చకితకరివారితసంప్రేక్షితజలంబు
భయదంబు నిర్వ్యాళపక్షిగణము
స్నిగ్ధతోయంబును సింధుగంభీరంబు
నగుహ్రదంబునుజొచ్చి-మిగులఁగలఁచి
శంకించి గోపికాజనములు నిండారు
ప్రేమమై నన్ను వారించుచుండ
యమునానివాసప్రియం బైనభుజగంబు
మర్దించి గరువంబు మాన్చఁజేతు.

అందఱు—స్వామీ! సంకర్షణ! స్వామియైన దామోదరుని సగస్సుఁ జొఱకుండ నివారింపుము నివారింపుము.

(అప్పుడు సంకర్షణుఁడు పరివేశించు చున్నాఁడు.)

సంక—చాలు భయవిషాదములు. మీయనురాగముచేత నిట్లనుచున్నారు. ఇదే మీరు చూచెదరుగాక.

గీ. విషదహనశిఖాజ్వాలలు వెడలి నోట
యన్ని దెసలను వ్యాపించి యడలుగొల్పఁ
గెఱలి తనమీఁదఁ బడవచ్చు కృష్ణుఁ జూచి
బుస్సుమని లేచుచున్నాఁడు భోగివరుఁడు.

అందఱు—స్వామి! దామోదరుఁడుఁగూడ నట్టివాఁడే.

దామో—సర్వలోకహితార్థముగ నీసర్వమును నేనవశ్యము వశపఱచుకొందును. (అని సరస్సుఁ బరివేశించుచున్నాఁడు.)

అందఱు—హాహాహా! పొగ బయలుదేఱుచున్నది.

దామో—ఏమి! యీసరోవరగాంభీర్యము. ఇక్కడఁగదా!

తే. దుస్సహాఫణీంద్రవిషధూమధూమ్రిమగుట
నల్లపట్టుదువ్వాలువవర్ణంబుఁ గలిగి
యింద్రనీలవీచులతోడ నెసఁగు యమున
నిమిషమున నిర్విషంబుగ నే నొనర్తు.

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

(అప్పుడు వృద్ధగోపాలకుఁడు పరివేశించు చున్నాఁడు.)

వృద్ధ—ఆహా స్వామీ! ఈకన్యకలు వారించినను వినక యమునాహ్రదముఁ జొచ్చితివా? సాహసించి పరివేశించవద్దు. వద్దు. ఇందు నీచుబారిపి, పెద్దపులులు, నడవిపందులు, మదపుటేనుఁగులు మొదలైన జంతువు లెక్కడివక్కడ చచ్చినవి. ఏమిది! ఇతఁడు కనఁబడుట

లేదు. ఇప్పు డేమి చేయుదును ? కానీ! యీకుంభఫలాశవృక్ష మెక్కి చూచెదను. హాహాహా! పొగ బయలుదేఱినది!

సంక — ఇదిగో! మీరు చూచు చుండుఁడు.

తే. ఉరగమును గేలఁబట్టి దామోదరుండు
కొలను మొదలంటఁ బలుమాఱు కలఁచివైచి
మెఱయుచుండె నల్లనిత్రాఁచు మేనిమీఁద
మబ్బుమీఁదను జెలువొందుమఘువుఁడట్లు

వృద్ధ — ఇహిహీ! దేవా సాధు సాధు.

(అప్పుడు కాళీయునిఁబట్టుకొని దామోదరుఁడు ప్రవేశించుచున్నాఁడు)

దామో — ఓహో! నేను,

మ. పస యెల్లంజెడఁ గాళియాహి మొదలన్ భజించి నాచేయి యొ
క్కసిడంబై తనరార మేటితలపైఁ గాలొండు స్థాపించుచున్
విసముం గ్రిక్కుఫణావళుల్ గలుగునాభీమాహినెమ్మేని పై
నసమానాద్భుతకౌతుకంబు లడరన్ హల్లీసకం బాడెదన్.

అందఱు — ఆశ్చర్యము స్వామీ యాశ్చర్యము. కాళీయుని మైదుపడగల నాక్రమించి హల్లీసక మాడుచున్నావు.

దామో — నే నిప్పుడు పువ్వులు గోసెదను.

కాళి — హా! హా!

మ. భువనాభోగముఁ జక్రవాళగిరియున్ భూతేశువింటన్ గుణం
బవునాగేంద్రుఁడు మందరాచలమునె ట్లారీతిగా శాతమ
న్యవదంతావళహస్తకర్కశమదీయాంగంబు నీమేనుఁ జు
ట్టి వెసం గాలునిపోలికంపి కడు తుష్టిం జెందెదన్ డింభకా.

వృద్ధ — హా! హా! స్వామీ! ఆకారముఁ దాల్చిన యమునానదివలె నున్న కాళియాహిని బుష్పసమాన మైన పాదములతోఁ ద్రొక్కుచు స్వామియైన దామోదరుఁడు పువ్వులు గోయుచున్నాఁడు.

బాగు స్వామీ! బాగు. త్రొక్కు త్రొక్కు. నేనుకూడ సహాయము చేసెదను. దేవా! భయ మగుచున్నది. ఈవృత్తాంత మంతయు నంద గోపునకు నివేదించెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

దామో.___

తే. కడు వగర్చుచునున్న యీకలుషచిత్తు
విషనికేతను నాయతవృత్తభోగు
మత్స్యమకరనాశ మగు నీమడుగునుండి
గట్టునం బాఱవైచెదఁ గడిమి మెఱయ.

కాళి.___ఓహో! యిటు విను.

తే. గీ. ఎవనిమేను రోషాగ్నిచే నెపుడు పొగయు
నతఁడె దహియింపఁ జాలు నీయవనియెల్ల
మంట లెగయఁగ నిపు డేను మఱఁడఁ జేతు
దేవగణముతోడుత వచ్చి కావు మీవు.

దామో.___కాళీయా! నీకు శక్తియున్నపక్షమున నాభుజ మొకటిఁ గాల్చుము.

కాళి.___అహ్హహ్హ!

తే. ఏడుకులపర్వతంబులతోడఁ గూడి
నాలుగుసముద్రములకును నడుమ నున్న
యెల్లభూమండలంబుఁ దహింపఁగలను
నీభుజముఁ గాల్పఁ జాలనే? నేను మూర్ఖ!

ఇప్పు డీమట్టున నుండు. చూడు నిన్ను భస్మముఁ జేసెదను.

(విషాగ్నిని గ్రక్కు చున్నాఁడు.)

దామో.___ఆహా! నీబల మేమో కనఁబఱచితివి.

కాళి.___దేవా! నారాయణ! అనుగ్రహింపు మనుగ్రహింపుము.

దామో—ఈబలముచేతనా నీవింత గర్వించితివి?

కాళి—దేవా! యనుగ్రహింపుము.

మ. ఎది గోవర్ధన మపరిమేయమహిమం బేపారఁ గా నెత్తెనో
ఎది యామందరతుల్యసార మగునో యెద్దాని నీలోకముల్
పదియున్నాలుగు నాశ్రయించి మనునో భవ్యాత్మ యానీజయా
స్పద మా బాహువు కాల్చి వైచుటకు నాశక్యంబె లోకేశ్వరా!

దేవా! అజ్ఞానముచేత మర్యాద నతిక్రమించితిని. రాణివాస ముతోఁగూడ శరణముఁ జొచ్చుచున్నాను.

దామో—కాళీయా! నీవీయమునాహ్రద మేల ప్రవేశించితివి?

కాళీ—దేవా! దేవరవారియుత్తమవాహన మైనగరుడుని వలన భయంపడి యిందుఁ జొచ్చితిని. దేవరవారిప్రభావమునగరుడునివలన నభయము గలుగుఁగాక యని కోరుచున్నాను.

దామో—అట్లగుఁగాక! యగుఁగాక!

క. శిరమున మత్పాదంబును
ధరియింపుము చిహ్న గాఁగ దానిం గని యా
గరుడుం డభయం బిచ్చును
బరమాప్తుఁడు వాఁడు మాకుఁబన్నగనాథా.

కాళి—అనుగ్రహింపఁ బడితిని.

దామో—మఱల నీవు నీస్థానముఁ జేరుము.

కాళి—నారాయణుని యాజ్ఞాపరికారము చేసెదను.

దామో—కాదు. కాదు. ఇటురా!

కాళి—దేవా! యిదే వచ్చితిని.

దామో—నేఁడు మొదలుకొని గో బ్రాహ్మణులు మొదలగు సమస్తప్రజలకుఁ బ్రమాదము లేకుండఁ జేయవలయు.

కాళి—భగవానుఁడా! ఈజలమంతయు నావిషముచేతఁ గలుషమైనది. అందువలన నిపుడు నే నావిషమంతయు గ్రహించి యమునానది విడిచి యొండొక కడకుఁబోయెదను.

దామో—ఆట్లైన నీవు వెడలిపొమ్ము.

కాళి—భగవానుఁడైన నారాయణుని యాజ్ఞాప్రకారముగఁ జేయుచున్నాఁడను. (అని సపరివారముగా నిష్క్రమించును.)

దామో—నేనును హ్రదమునుండి కోసి తెచ్చిన పువ్వులను గోపకన్యకల కిచ్చెదను.

అందఱు—ఈస్వామి మనకు హృదయానందముఁ జేయుచు నక్షతశరీరుఁడై యీలాగే వచ్చుచున్నాఁడు. దేవా! జయము జయము.

సంక—అదృష్టవశమున గో బ్రాహ్మణహితము చేయఁబడినది.

దామో—ఇదిగో! యీపువ్వులు పుచ్చికొనుఁడు.

అందఱు—దేవా! ఇవి మనవారు పూర్వమెన్నఁడుఁ గోసి యెఱుఁగనివి. చంద్ర సూర్యకిరణములు వీని నెన్నఁడు స్పృశియించియే యెఱుఁగవు. అందువలన వీనిం బుచ్చికొనుటకు మాకు భయమగుచున్నది.

దామో—పాప మీకన్యకలు పూర్వపుభయమునే స్మరియించుకొని యింకను జంకుచున్నారు. భయపడ నక్కఱలేదు. భయపడ నక్కఱలేదు. ఇప్పుడు నాహస్తస్పర్శమున నీపుష్పములు సౌభాగ్యవంతము లైనవి. కావున పుచ్చికొనుఁడు.

అందఱు—దేవరవారి యాజ్ఞాప్రకారము చేసెదము.

(అప్పుడు భటుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

భట—ఓగోపాలకా! నందగోపకుమారుఁ డెం దరిగినాఁడు!

గోపాలకుఁడు—ఆస్వామి కాళియుఁ డనుమహానాగుని మర్దించి గోపకన్యకలు దన్నుఁ బరివేష్టింప నందున్నాఁడు.

భటు—(సమీపించి) ఓనందగోపకుమారా! అనుగతార్థనామధేయుఁ డగు నుగ్రసేనమహారాజుయొక్క కొడుకు కంసమహారాజుగారు మిమ్మాజ్ఞాపించుచున్నారు.

దామో—ఏమని యాజ్ఞాపించు చున్నాఁడు?

భటు—మధురాపురమున ధనుర్మహమను మహోత్సవము జరుగును. దానిం జూచుటకు మిమ్మిద్దఱను రమ్మని యాజ్ఞాపించు చున్నారు,

దామో—అన్నయ్యా! దేవరహస్యకాల మిదే కదా?

సంక—సరే! యిపుడే శీఘ్రముగఁ బోవుదము.

దామో—సరే! ఆలాగుచేయుటే ప్రథమకల్పము.

చ. కనకకిరీట మూడి పడఁగాఁ దలవెంట్రుకలుం జికాకుగాఁ
గను తెగఁ దారహారములు కాంచనబాహుపురుల్ ప్రభగ్నముల్
గను శిశుహంతఁ గంసు నిట గట్టిగఁ బట్టి వధింతు గర్వ మే
చిన మదదంతి పై కుఱుకు సింగముకైవడి మించి వేగ్రిమ్మడిస్.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

# బాలచరిత్రము

## పంచమాంకము.

(అంతట రాజైన కంసుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

రాజు.—

మ. తతబాహాబలవిక్రమస్ఫురితుఁడై దామోదరుం డాబలా
న్వితుఁడై ఘోషమునం జరింపు ననుచున్ విన్నన్కి నేర్పొర్ప నీ
గతిఁ గల్పించితిఁ గార్ముకోత్సవము రంగంబుం జోరం జేసి నేఁ
డితనిన్ మల్లురచే నియుద్ధమునఁ జంపింతుక్ సుఖింతున్ మదిన్.

ధ్రువసేన! ధ్రువసేన!

భటుఁడు—(ప్రవేశించి) మహారాజా! జయము; జయము.

రాజు—ధ్రువసేన! నందగోపపుత్త్రుఁడు వచ్చెనా?

భటుఁడు—మహారాజా! చిత్తగింపుఁడు. దామోదరుఁడు గోపజనపరివృతుఁడై సంకర్షణునితోఁ గూడ మనపురము ప్రవేశించి చాకలివాండ్రయొద్దనుండి బలాత్కారముగ వస్త్రములు లాగి తీసికొనియెను. అది విని మావటీఁడగు మహామాత్త్రుఁ డుత్పలాపీడమను మత్తగజముచేత నాతనిం ద్రొక్కించుటకై దాని నతనిపైఁ దోలి పురికొల్పెను. అనంతరము,

తే. గీ. అద్రివలె వచ్చి పడుచున్నయామ్ముఁ జూచి
గాంచి గోపకుమారుండు కనలి బిట్టు
గోపబృందమధ్యమునుండి యేపుమీఱ
వెడలి దానినంతము లూడఁబెరికి చంపె.

రాజు.—ఏమి? చంపెనా! సరే మఱల వెళ్ళి వృత్తాంతమంత యుఁ దెలిసికొని రమ్ము.

భటుఁడు.—దేవరవారు సెలవిచ్చినట్లు చేసెదను. (అనినిష్క్ర మించి మఱల ప్రవేశించి) మహారాజా! జయము, జయము. ఇప్పు డా నందగోపకుమారుఁడు మహోత్సవాధికారులు ధ్వజపతాక ములు నాటి, మాల్యదామాలంకృతముచేసి, యగురుధూపసమే తము చేసి సింగారించబడిన రాజవీధిం బ్రవేశించి రాజకులద్వారము నందు గంధపుగిన్నె చేతఁబట్టుకొని నిలిచి యున్నమదనిక యను కుబ్జికను జూచి దానిచేతినుండి గంధము తీసికొని తనమేనంబూసి కొని యాచేతితోనే కుబ్జదేహమును నిమిరి దానికిఁ గుబ్జభావముం దొలఁగించి మాలకరులయంగళ్ళనుండి పువ్వులగ్రహించి చుట్టుకొని ధనుశ్శాలాభిముఖుఁడై చనెను.

రాజు.—అతనియుద్దేశమేమి? ఏమిచేయఁదలంచుచున్నాఁడు? అట్లైన నీవు శీఘ్రిమె మఱలవెళ్ళి వృత్తాంతము తెలిసికొనిరమ్ము.

భటుఁడు.—చిత్తము దేవా! (అని నిష్క్రమించి మఱలఁ బ్ర వేశించి) మహారాజ! జయము. జయము. అనంతర మాగోపకుమా రుఁడు ధనుశ్శాలారక్షకుఁడైన సింహబలుఁడు తన్ను నివారింప నిలు వక వానిని దవడ విఱుగునట్లుఁ గొట్టి చంపి ధనుశ్శాలం బ్రవేశించి ధనువును గ్రహించి యది రెండుముక్కలుగ విఱిచి యిప్పు డాస్థాన మంటపమువంక కరుగుచున్నాఁడు.

మ. అవతంసీకృతబర్హిబర్హరమణీయం బైనవేషంబు క
న్గవకుం బండువు సేయఁగా సజలమేఘశ్యామవర్ణంబుతో
నవపీతాంబరధారియై కనులు కెంపున్ బట్టు ఘూర్ణిల్ల మృ
త్యువుచందంబున రామునింగలిసి హా! తోతెంచుచున్నాఁడిటుల్.

రాజు.—నాగుండె కొట్టుకొనుచున్నది. వెళ్లు. నేను మును

పనుకొన్నట్లు చాణూరముష్టికులను బిలుచుకొనిరమ్ము. యుద్ధసన్నద్ధులై యుండవలసినదని వృష్ణికుమారుల కానతిమ్ము.

భటు—దేవా చిత్తము. (అని నిష్క్రమించును).

రాజు—నేనును మేడ యెక్కి చాణూరముష్టికులయుద్ధమును జూచెదను. (మేడ మెక్కి) మధురికా! తలుపు తెఱువుము.

ప్రతీహారి—దేవా! చిత్తము. తెఱచుచున్నాను.

రాజు—(ప్రవేశించి కూర్చుండుచున్నాఁడు)

(అప్పుడు చాణూరముష్టికులు ప్రవేశించుచున్నారు)

చా—

క. మదగజమట్టులు దర్పా
స్పదముగ వచ్చితిని యుద్ధసన్నద్ధుఁడనై
యిదె చంపెద దామోదరు
నదయుఁడనై రంగమధ్యమందునఁ దృటిలోన్.

ముష్టి—

క. లోహమయముష్టిహస్తుఁడ
సాహసుఁడను ముష్టికుండ క్షణమున గిరిసం
దోహంబును వజ్రింబటు
లాహవమునఁ జంపివైతు నాబలరామున్.

భటుఁడు—ఇదె మహారాజుగారు. మీరు వారిసన్నిధి కరుగుఁడు.

ఉభయులు—(సమీపించి) దేవా! జయము జయము.

రాజు—చాణూరముష్టికులారా! సకలప్రియత్నములచేతను నేఁడు మీరు ఋణము దీర్చికొందురుగాక!

ఉభయులు—దేవా! చిత్తగింపుఁడు. కరణసంధాబంధపరిహారమ్ము లగుయుద్ధవిశేషములతో సిద్ధమై వెళ్ళుచున్నాము. దేవరవారు చిత్తగింతురుగాక!

రాజు—మంచిది. అట్లె చేయుఁడు. ధృవసేనా! గోపకుమారుల నిద్దఱను బిలిచికొని రా.

భటుఁడు—మహారాజా! చిత్తము. (అని నిష్క్రమించును).

(అప్పుడు ధృవసేనునిగూడి దామోదరసంకర్షణులు ప్రవేశించుచున్నారు)

దామో—అన్నయ్యా!

మ. ధరణిన్ నేనవతార మొందుటలు వ్యర్థంబౌ వ్రిజంబందు నీ
పురమం దేనొనరించుకృత్యములు సమ్మోదంబు నాకీవు దు
ష్కరదు జన్మాంతరదైత్యుఁ గంసహతకుం గష్టాత్ము దుర్వారదు
శ్చరితుం గూలుచునంతకున్ జనులు తుష్టస్వాంతు లౌనంతకున్.

సంక—

తే. గీ. ముష్టికాసురు లోహోగ్రముష్టిహస్తు
ముష్టియుద్ధంబుచేఁగూల్చి పుడమిమీఁద
నంబరంబునఁ జరియించునభ్రిమట్లు
చండమారుతమూర్తినై సంచరింతు.

భటుఁడు—అదె మహారాజుగారు సమీపింపుఁడు.

ఉభయులు—ఎవనికి మహారాజు?

భటుఁడు—మాకును సమస్తజగమునకును.

దామో—నేఁడుమొదలుకొని కాఁడు.

భటుఁడు—మహారాజా! జయము జయము. ఇదిగో వారు వచ్చిరి.

రాజు—(చూచి) ఆదామోదరుఁ డితఁడా? అహో!

శా. శ్రీమంతుండు మదాంధసింధురగతిశ్రీభాసమానుండు సు
శ్యామాంగుండు విశాలవక్షుఁడు మహాంసస్ఫారబాహుద్వయుం

డే మున్నే వినియుంటి చిత్రకథలా నీబాలుచారిత్రముల్
సామర్థ్యంబు గలండు ముజ్జగము లిచ్చం ద్రిప్పి యాడింపఁగన్.
ఇతఁడును లలితగంభీరాకారుఁడు. దామోదరునియన్న యసురా
ముఁ డితఁడెవ్వై యుండును. వీఁడు—

తే. గీ. కమలపత్రవిశాలనేత్రములవాఁడు
లలితశశిమూర్తి నీలచేలంబువాఁడు
రజితపరిఘులఁ బోలుదోర్ద్వయమువాఁడు
కలువపూలదండలు మెడఁ గ్రాలువాఁడు.

దామో—అన్నయ్యా! మనతో యుద్ధము జేయ సన్నద్ధులై యున్నవారు వీరే యని తలంచెదను.

సంక—కావచ్చును.

రాజు—ధృవసేనా? యుద్ధము జరుగనిమ్ము.

భటుఁడు—దేవా! చిత్తము. (అని పూలదండ చిమ్ముచు న్నాఁడు).

మల్లుఁడు—మోయింపుఁడు మ్రోయింపుఁడు యుద్ధభేరీలు.

చా—దామోదరా రారమ్ము. నేఁడు నాభుజద్వంద్వముచేత సిద్ధిం బొందఁగలవు.

దామో—

మ. ఇదిగో వచ్చితి నిల్వు నాభుజబలం బేరీతి సైరింతువో

ముష్టి—ఓయీ ఓయీ బలరామా! నాపిడికిలిపోటువలన నీ దేహమునుండి నెత్తురుకాలువలు దొఱఁగ నిప్పుడె ప్రాణములు విడు వఁగలవు రా రమ్ము.

సంక—

వదరం బోకు కృతాంతుపాలి కిపుడే పంపింతు ని న్ముష్టికా!

దామో—(చాణూరునిఁ జంపి)

చిదుమ న్నెముమ్మలు చూర్ణమై యితఁడు చచ్చెన్

సంక— ... ... చచ్చె నీతం డహా

మధుఁ గంసారిని గూడఁ గాలుపురికిం బంపింతు వేవేగమే.

(మేడ యెక్కి కంసునిశిరముఁ బట్టి పడఁద్రోచి) వీఁడెవీఁడె దురాత్ముఁడైన కంసుఁడు.

మ. పొడి యయ్యెం గటిజానుజంఘలుభుజంబుల్ రొమ్ముఁ; గట్టెబ్బొ
 టెడువి స్సీర్ణముఖంబుఁ; గన్నుఁగవ ఘూర్ణిల్లంగఁ జొచ్చెం దెగెన్
 మెడలో హారములెల్ల; దారము లొగిం గేయూరలగ్నంబు ల
 య్యెడు; నీకంసుఁడుగూలె వజ్రిహతశైలేంద్రంబుశృంగంబటుల్.

(తెరలో)

అయ్యో! అయ్యో! మహారాజా. (మరలఁ దెరలో) హీహా హా వృష్టియోధులారా! ఓరోరి యనావృష్టిశివకహృదికపృథుక సోమదత్తాక్రూరప్రముఖులార! స్వామిఋణముఁ దీర్చికొనుట కిదియె తగినసమయము. కావున మీరందఱు శీఘ్రముగ రండు.

దామో— సైన్యమును నివారింపుము.

సంక— ఇదె ఇదె వారించుచున్నాను.

మ. తురగస్యందనదంతియోధవరసందోహాగ్రనాదంబు ని
 ర్భరఖడ్గక్షురికోగ్రకుంతముసలప్రాసంబునై యొప్పు నీ
 యరిసైన్యంబు మహానిలక్షుభిత మా యాధోనిధింబోలె భీ
 కరమద్బాహుయుగంబుచేఁ గలఁచెదఁ ఖండించి యోధావళిన్.

(అప్పుడు వసుదేవుఁడు ప్రవేశించుచున్నాఁడు)

వసు— ఓహోహో! మధురాపురవాసులారా! సాహసము వలదు, సాహసము వలదు.

తే. గీ. వీఁడు రోహిణేయుఁడు నాదు పెద్దకొడుకు
 వీఁడు దేవకీతనయుండు పిన్నకొడుకు

చాలు సంరంభ మేల శస్త్రములు దాల్ప
స్వయముగా వచ్చె హరి కంసవధముకొఱకు.

సంక—(చూచి) ఇదిగో నాయనగారు. తండ్రీ! సంకర్షణుఁడను. నమస్కరించుచున్నాను.

దామో—తండ్రీ! దామోదరుఁడను.నమస్కరించుచున్నాను.

వసు—మీ కక్షయవిజయము గల్గుఁగాక! సత్పుత్రజన్మఫలమును బొంది నేనిప్పుడుగదా కృతార్థుఁడనయితిని.

ఉభయులు—అనుగ్రహింపఁబడితిమి.

వసు—ఎవఁ డక్కడ?

భటు—(ప్రవేశించి) ఆర్యపుత్రా! జయము జయము.

వసు—ఆకళేబరముల నావలఁ బాఱవైవ నాజ్ఞాపింపుము.

భటు—దేవరవారు సెలవిచ్చినట్లు చేసెదను.

గోపాలకులు—ఇహిహీ! ఈరాజ్యము గొల్లవాండ్రదైనది.

వసు—ఎవఁ డక్కడ?

భటు—ఆర్యపుత్రా! జయము జయము.

వసు—నీవు శీఘ్రముగఁ బోయి దామోదరుఁ డిట్లాజ్ఞాపించుచున్నాఁడని యనావృష్టితోఁ జెప్పుము. ఉగ్రసేనమహారాజును సంకెళ్ళు విడిపించి పట్టాభిషేకమునిమిత్తము దీసికొనిరావలయును.

భటు—చిత్తము దేవా! (అని నిష్క్రమించుచున్నాఁడు)

వసు—అహో!

క. మొఱసెను సురతూర్యంబులు
కురిసెను భువి పుష్పవృష్టి క్రూరునిఁ గంసుం
బరిమార్చిన జెగజెట్టిని
హరి నర్చించుటకు వచ్చి రమరులు భక్తిన్.

(తెరలో)

ఉ. అమలవిశాలరాజభవనాపణగోపురభాసమానమై
విమలసువర్ణసౌధములఁ బ్రీతి యొనర్చుచు దర్శనీయమై
యమితవిభూతి నొప్పుమధురాపురముం గమలాయతాక్షుఁ డా
యమరవిభుండు విష్ణుఁడు శ్రియఃపతి బ్రోచెడుఁగాక నెప్పుడున్.

వసు—ఓహోహో! మధురాపురవాసులారా! మీరందఱు వినుఁడు. వినుఁడు. దైత్యేంద్రపురార్గళోత్పాటనసమర్థుండును, సర్వక్షత్రియరాజ్యమ్మఖావలోకనుఁడును, వసుదేవసంభవుండును నగు నీ దామోదరునియనుగ్రహంబునం జేసి పునరధిగతరాజ్యుం డగునుగ్రసేను నిశాసన మిప్పుడు చాటింపఁబడుచున్నది.

అందఱు—ఇప్పుడు నృపతిరాజ్యము ప్రతిష్ఠింపఁబడినది.

వసు—ఎవఁడురా అక్కడ. మహారాజును దీసికొనిరండు.

భటు—చిత్తము దేవా. (అని నిష్క్రమించును.)

(అప్పుడుగ్రసేనుఁడు ప్రవేశించును).

ఉగ్ర—

తే. గీ. చిరతరోపరోధంబునం జేసి నాకుఁ
బ్రాప్తమైనట్టియీక్లేశభార మిపుడు
కేశసూదనుచే దొలఁగింపఁబడియెఁ
జక్రిధరుచేత వజ్రిక్లేశంబువోలె.

భగవత్ప్రసాదమువలన వ్యసనార్ణవమునుండి సముద్ధరింపఁబడితిని.

(అంతట నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు).

నార—

క. మరణము నొందఁగఁ గంసుఁడు
హరి నర్చించుటకు సురలయానతిచేతన్
గరుడోరగగంధర్వా
ప్సరలం గూడుకొని యిందు వచ్చితిఁ భక్తిన్.

దామో—అహో! దేవఋషి యైననారదుఁడా? దేవమునీ! నీకు స్వాగతము. ఇదె యర్ఘ్యము. ఇదె పాద్యము.

నార—సర్వము గ్రహించుచున్నాఁడను.

(అప్పుడు గంధర్వాప్సరసలు పాడి యాడుచున్నారు)

నార—

క. నారాయణ నీకు నమ
స్కారము దివ్యులును నతులఁ సలుపుచు నున్నా
రీరాక్షసమథనముచే
ధారుణి రక్షింపఁబడియె దానవవైరీ.

దామో—దేవమునీ! సంతుష్టుఁడ నయితిని నీ కిం కేమిప్రియ ముచేయుదును.

నార—క. హరి సంతోషించిన నా
పరిశ్రమం బెల్ల సఫలభావము నొందున్
సురలోకంబున కేగెద
గరుడోరగముఖ్యు లైనగంధర్వులతోన్.

దామో—సరే! నీవు పొమ్ము. పునర్దర్శనమగుఁగాక

నార—భగవానుఁ డగునారాయణుఁ డాజ్ఞాపించినట్లు జరుగుఁగాక!

భ ర త వా క్య ము.

క. జలనిధిపర్యంతంబై
వెలయుచు నేకాతపత్రవతిమై శీతా
చలవింధ్యకండలం బగు
నిల ధృతి మాారాజసింహుఁ డేలెడుఁగాతన్

(అందఱు నిష్క్రమించుచున్నారు)

స మా ప్త ము

# మధ్యమవ్యాయోగము.

## ఇందలి పాత్రములు

### పురుషులు.

1. సూత్రధారుఁడు—రూపకపరివర్తకుఁడు.
2. కేశవదాసుఁడు—ముసలి బ్రాహ్మణుఁడు
3. ప్రథముఁడు— కేశవదాసుని పెద్దకొడుకు
4. మధ్యముఁడు—రెండవకొడుకు
5. కనిష్ఠుఁడు—కడపటి కొడుకు
6. ఘటోత్కచుఁడు—భీమసేనునకు హిడింబవలనఁ గలిగిన పుత్రుఁడు
7. భీమసేనుఁడు—యుధిష్ఠిరునితమ్ముఁడు

### స్త్రీలు.

1. బ్రాహ్మణి—ముసలిబ్రాహ్మణునిభార్య
2. హిడింబ—భీమసేనునిభార్య, ఘటోత్కచునితల్లి, రాక్షసి.

# పీఠిక

మధ్యమవ్యాయోగ మను నీరూపకము సంస్కృతభాషయందు సుప్రసిద్ధనాటకప్రణేత యగు భాసుఁడు రచియించె నని నే నింతకు మున్ను తెలిఁగించిన స్వప్నవాసవదత్తానాటకపీఠికలో వ్రాసియుంటిని. భాసుఁ డీరూపకమును రచియించినట్లు గ్రంథములో నెచ్చటను జేర్పఁ బడకపోయినను బలవత్తరము లయిన కారణములచేత నిదియు, మఱి పండ్రెండు రూపకములు నతఁడు రచియించినట్లు నిశ్చయింపఁబడినది. వ్యాయోగ మనఁగా—మహావీరుఁ డొక్కనాఁడు చేసినవీరకర్మము వర్ణింపఁబడిన రూపకము. నరకాసురవిజయవ్యాయోగము, ధనంజయ విజయవ్యాయోగము మొదలగున వీజాతిలోఁ జేరినవి. కాని యీ రెండు నవీనములు. మధ్యమవ్యాయోగము మిక్కిలి ప్రాచీనము. ఇందలి యితివృత్తము మహాభారతాదిగ్రంథములలో నెక్కడఁ గానఁ బడదు. భాసుని స్వకపోలకల్పిత మని తోఁచుచున్నది. ఇందలికథ కొంతవఱకు రామాయణములోని శునశ్శేఫునిచరిత్రమును, కొంత వఱకు మహాభారతమందలి బకాసురవృత్తాంతమును బోలి యున్నది. ఆరెండుకథలు మనసులోఁ బెట్టికొని భాసుఁడు దీని రచియించె నని చెప్పవచ్చును. దీని కీపేరు గలుగుట కొక ముఖ్యకారణము గలదు. పాండవమధ్యముఁడైన భీమసేనుఁడు ముగ్గురుబ్రాహ్మణకుమారులలో మధ్యమునిప్రాణము రక్షించుటచేత దీని కీపేరు కలిగెను.

ఈరూపకము చూచునప్పుడు నా కొకసందేహము తోఁచినది. ఇందు భీమసేనుఁడు పాండవమధ్యముఁ డని కవి చెప్పియున్నాఁడు. అర్జునుఁడు పాండవమధ్యముఁ డగునుగాని భీమసేనుఁడు కాఁడు. భీమసేనుఁడు కుంతీపుత్రులలో మధ్యముఁడు. కుంతికొడుకులు ముగ్గురేపాండవులని మనము గ్రహించినపక్షమున భీమసేనుఁడు మధ్యముఁ డగును. అట్లు

గ్రహించుటకు వీలు లేదు. కుంతికొడుకులు మాద్రికొడుకులుఁ గలిసి పాండవు లగుదురు. తిక్కనసోమయాజికూడ నిటువంటిసందేహము గలిగించుశబ్ద మొకదానిని విరాటపర్వములోఁ బ్రయోగించి యున్నాఁడు. "వచ్చెం గుంతీసుతమధ్యముండు" అని యజ్ఞునవిషయమున సోమయాజి వ్రాసెను. అర్జునుఁడు పాండవమధ్యముఁడు కాని కుంతీసుతమధ్యముఁడు కాఁడు. మాద్రిమరణానంతరమున నందఱను గుంతియే పెంచి పెద్దవారిని జేసినకారణమునఁ బాండవు లందఱుఁ గుంతీతనయులే యని మనము గ్రహించినపక్షమునఁ గవిబ్రహ్మ ప్రయోగము సాధు వగును. అట్లే భాసకవిప్రయోగము సాధువని మనముసాధింపఁదలఁచుకొన్నపక్షమున ప్రధానపురుషు లైనకుంతీసుతులే పాండవులని మనమంగీకరింపవలెను. ఇంతకుమించినగతి వేఱొకటి లేదు. లేదా, పూర్వభారతములలో భీముఁడే మూఁడవకుమారుఁడుగాఁ జెప్పఁబడియున్నదేమో? ఈవిషయమై పండితులు విమర్శింతురు గాక!

ఈయాంధ్రీకరణములో నే నొకక్రొత్తపుంత ద్రొక్కితిని. సంస్కృతగ్రంథములలోని కొన్ని శ్లోకములభావము తెలిఁగింపఁబడునప్పుడు వృత్తములలో నిముడక పెద్ద దయి సీసమునకుఁజిన్నదై యాంధ్రీకరించువానికి గొప్ప మనస్సంకటమును గల్గించుచుండును. తెనిఁగించువా డట్టిసమయమున సీసపద్య మెత్తికొని భావము మొదటి నాల్గుపాదముల నిమిడిపోవుటచేత నెత్తుగీతముకు భావ మభావమవుటచేత నహంభావము కొంత బూని తనసొంతకవిత్వమును జెప్పియో పదము లనవసరముగా దీర్ఘములు చేసియో కవిత్వకన్యను లాగి లాగి యీడ్చియీడ్చి పూర్తిచేయును. అట్టిచిక్కు నాకును సంభవించినది. ఈవఱకు నేను నట్లు చేసినాఁడను కాని యిప్పుడట్టిపని సమంజసముగా లేదని తోఁచినందున శ్లోకభావము పెద్దదైనప్పుడు దానిని సీసపద్య

ములో నిమిడ్చి క్రింద నాటవెలఁదిఁగాని తేటగీతినిగాని చేర్చుటమాని తిని. ఇందువల్ల కవిభావము వ్యక్తపఱుచుట కెంతపద్య మవసరమో అంత పద్యమే యల్లఁబడుచున్నది. మూలకవిహృదయములో లేని నూతనభావము వచ్చుటకు వీలులేదు. నాయొనర్చినపని మిక్కిలి క్రొత్తమార్పుగాదు. నేను లక్షణ మతిక్రమింపలేదు. వ్యాకరణమును మీఱలేదు. సీసముకిందఁ జేర్పవలసినదని చెప్పినపద్యమును జేర్చ లేదు. ఇది యే నాయపరాధము. ఇందుకుఁ బండితాభిప్రాయమే ప్రమాణము. ఇది సహేతుక మని విద్వాంసు లంగీకరించిన పక్షమున సంతోషము. ఇది తప్పన్నపక్షమున వారి యభిప్రాయము శిరసా వహించి దిద్దుకొందును. సంస్కృతమున మధ్యమవ్యాయోగము కవిత్వమునందు భావమునందు మిక్కిలిరసవంతమై యున్నది. నాయొన ర్చిన యాంధ్రమధ్యమవ్యాయోగమునం దట్టిరసము కనఁబడకపోవు నేని నయ్యది నాలోపముగాని భాసమహాకవిలోపము గాదు. అన్ని వ్యాయోగములలో నుండునట్లే దీనియందుఁగూడ నొక్కటే యం కము కలదు. అందుచేత దీనిం బ్రయోగించుటకు రమారమి యొక గంట కాలము పట్టును. కథాచమత్కృతి ప్రేక్షకులకుఁ జదువరులకు నాహ్లాదముఁ గలిగించు నని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ఇట్లు,

చిలకమర్తి లక్ష్మీనృసింహం.

# మధ్యమవ్యాయోగము.

(అప్పుడు సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్రధారుఁడు—

సు. కమనీయోత్పలశుభ్రమై యమలఖడ్గశ్యామమై దానవ
ప్రమదామానసతాపసంజనకమై భాసిల్లి లోకత్రయా
క్రమణప్రోద్యతమై తనర్చె నెది యాకాశాబ్ధికిఁ దార్చు ను
త్తమవైడూర్యముభాతి నట్టి హరిపాదం బేలు మిమ్మెప్పుడున్.

ఆర్యమిశ్రులతో నే నీలాగున విజ్ఞాపనము చేసికొనుచున్నాఁడను. ఏమిది! నేను విజ్ఞాపనవ్యగ్రుఁడ నయియుండఁగా నేదో శబ్దము వినఁబడుచున్నట్లున్నది. కానీ! చూచెదను.

(తెరలో)

భోనాయన! ఎవఁడు వీఁడు?

సూత్ర—ఆహా, తెలిసినది.

తే. గీ. ఇతఁడు "భో" యటంచును మొఱలిడుటచేత
బ్రాహ్మణుం డనితోఁచెడు స్పష్టముగను
క్రూరచేతస్కుఁ డెవ్వఁడో గొంకు లేక
పట్టి యాతనిఁ గాఱియ వెట్టఁ బోలు.

(తెరలో)

అయ్యోనాయనా! యెవఁడు వీఁడు?

సూత్ర—హా దృఢముగాఁ దెలిసినది. ఈతఁడు పాండవమధ్యముని కుమారుఁడు. హిడింబారణిసంభూతుఁడు. రాక్షసాగ్ని. నిరపరాధమైనబ్రాహ్మణజనమును బాధించుచున్నాఁడు. కటకటా!

పుత్రికళత్రసమేతుఁ డయినబ్రాహ్మణునిప్రవృత్తాంతము కడుం గడుఁ గష్టము గా నున్నది కదా! ఇప్పుడు,

చ. అలసినచిన్నబిడ్డలు కులాంగనయుం దను వెంబడింప, ము
క్కలమున రక్కసుండు వెనుకం దఱుమంగను, బెద్దబ్రాహ్మణుం
డలపులిబారి కగ్గమయి యావును జంకినలేఁగదూడలుం
గలవృషభంబువోలె నధికవ్యథఁ జెందుచునున్నవాఁ డిటన్.

(నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది స్థాపన.

# మధ్యమవ్యాయోగము.

(అంతట ముగ్గురుకొడుకులు భార్యయు వెంట రాఁగఁ గేశవదాసను వృద్ధబ్రాహ్మణుఁడు, వెనుక ఘటోత్కచుఁడు ప్రవేశించుచున్నారు.)

వృద్ధబ్రాహ్మణుఁడు:—అయ్యో! ఎవఁడు వీఁడు?

సీ. అరుణార్కకిరణంబు లటు లెఱ్ఱనై చికి
బికిగాఁగ వ్రేలు వెండ్రుకలవాఁడు
బొమముడిమీఁద విస్ఫుటముగా వ్యాపించు
పచ్చని మిడిగుడ్లఁ బఱఁగువాఁడు
మెడసూత్రిమునఁ జేసి మెఱపుతోఁ గూడిన
మేఘంబుకై వడి మెఱయువాఁడు
ప్రళయకాలమునాఁటి ఫాలనేత్రుఁడు వోలెఁ
గడుభయదాకృతిఁ గల్గువాఁడు.

ప్రథముఁడు:—అయ్యో నాయనా! ఎవఁడు వీఁడు?

సీ. గ్రహయుగంబును బోలు కనుదోయి గలవాఁడు
కఠినవిశాలవక్షంబువాఁడు
తపనీయరుచి మించుతలవెండ్రుకలవాఁడు
పచ్చని పట్టుదువ్వలువవాఁడు,
కాఱుచీఁకటి మించుకాయంబుఁ గలవాఁడు
వెలువడ్డకోఱలవిభలచేతఁ
జందమామను దనచాటున దాఁచిన
కాఱుమబ్బట్టులు గ్రాలువాఁడు.

ద్వితీయుఁడు.—అయ్యో! వీఁ డెవఁడు?

 

సీ. కలభదంతములట్లు గ్రాలుకోఱలవాఁడు
మొనదేరునాగలిముక్కువాఁడు
కరితుండములు బోలు ఘనబాహువులవాఁడు
నీలమేఘచ్ఛాయ నెగడువాఁడు
జ్వాలదగ్నిఁ బోలెడు చండదీప్తులవాఁడు
భీమరూపంబును బెరయువాఁడు
పుంభావమును గొన్న పురవైరిరోషంబు
వలె దుర్నిరీక్ష్యుఁడై వఱలువాఁడు.

తృతీయుఁడు.—అయ్యోనాయన! ఎవఁడు వీఁడు? మనలను బాధించుచున్నాఁడు.

తే. గీ. అఖిలపర్వతములకు వజ్రాయుధంబు
సర్వపక్షిజాతములకు సాళువంబు
మృగతతికి నెల్ల సింగంబు మృత్యువట్లు
వీఁడు నరరూపమృత్యువై నాఁడు మనకు.

భార్య.—అయ్యో! మనలను బీడించుచున్నవీఁ డెవఁడు?

ఘటోత్కచుఁడు.—ఓ బ్రాహ్మణుఁడా! నిలు, నిలు.

చ. జడిసిన యాలుబిడ్డలను సాఁకసమర్థత లేనిపంద! నక్
బొడగని ధైర్యసారమును బూర్తిగఁ గోల్పడి పాఱఁ జూచెదే
యడలున దార్క్ష్యపక్షపవనాహతి మందితరోషవహ్నినై
పడఁతుకఁ గూడియార్తి మెయిఁ బాఱఁగఁ జూచెదుకోడె(?)తాఁ చటుల్.

బ్రాహ్మణుఁడా! వెళ్ళఁగూడదు. వెళ్ళఁగూడదు.

వృద్ధ—బ్రాహ్మణి! భయపడకు. కుమారులారా! భయపడనక్కఱలేదు. అతనిమాట సందిగ్ధముగ నున్నది.

ఘటో—అయ్యో! కష్టము.

చ. ఎఱుఁగుదు నెల్లతావులను నెల్లప్పుడున్ భువి బ్రాహ్మణోత్తముల్
మఱిమఱి పూజనీయు లనుమాట, పవిత్రులు సాధు లౌటచే
నెఱుఁగుదు నాయొనర్చ్పని యెన్నఁడుఁ జేయఁగ రానిదంచు, న
ల్లెఱిఁగియుఁ జేయఁగావలసె నీయది మాతృనియోగ మౌటచేన్.

వృద్ధ—బ్రాహ్మణి! "ఈవనము రాక్షసులు లేనిది కాదు. కావున మెలఁకువతోఁ బోవలయు" నని స్నానముఁ జేయుచున్న పూజ్యుఁడయిన యాబ్రాహ్మణుఁడు చెప్పినమాట మఱచితి వా? ఆయన చెప్పినట్లే రాక్షసభయము సంప్రాప్తమయినది.

భార్య—ఈయన మధ్యమపర్ణమువాఁడువలెఁ గనఁబడుచున్నాఁడేమి?

వృద్ధ—మందభాగ్యుఁడను. నే నేమిచేయఁగలను?

భార్య—గట్టిగా మొఱవెట్టుదము.

ప్రథముఁడు—అమ్మా! యెవరున్నారని మొఱవెట్టుదము!

తే. గీ. నిర్జనం బిది యరిక్టై నిఖిలదిశల
గిరులచాలును బోలెడు నిరుల గుంపు
అంతరము మృగపక్షి సమాకులంబు
ధైర్యవంతుల కిది నిల్వఁ దగినయడవిఁ.

వృద్ధ—బ్రాహ్మణి! భయపడకు భయపడకు. ఇది ధైర్యవంతులకు నివాసయోగ్య మనినతోడనే నాస్యంత్రాసము పోయినట్లే యున్నది. ఇక్కడకు సమీపమునఁ బాండవాశ్రమ ముండవ చ్చునని తోఁచుచున్నది. పాండవు లెట్టివా రనిన?

చ. అలఘుచరిత్రు లార్తశరణాగతవత్సలులున్ సమస్తదీ
నులయెడఁ బక్షపాతులు ఘనుల్ కృతసాహసులున్ రణప్రియుల్
బలిసి భయంకరాకృతులఁ బాపఁపుఁ జేష్టలు జేయుకూరిసులన్
జెలఁగి యథార్హదండితులఁ జేయ సమర్థులు నిశ్చయంబుగన్.

ప్రథ—నాయనా! పాండవు లక్కడ లే రని తలంచెదను.

వృద్ధ—పుత్రిక! నీ వెల్లెఱుఁగుదువు?

ప్రథ—ఆయాశ్రమమునుండి వచ్చినయొకానొక బ్రాహ్మణుఁడు చెప్పెను. శతకుంభ మనియెడు యజ్ఞ మనుభవించు నిమిత్తమువారు ధౌమ్యమహర్షి యాశ్రమమునకు వెళ్ళినారఁట.

వృద్ధ—హా! చచ్చితిమి.

ప్రథ—నాయనా! పాండవు లందఱు వెళ్ళలేదఁట. ఆశ్రమపరిపాలననిమిత్తము మధ్యముని విడిచి వెళ్ళినారఁట.

వృద్ధ—అతఁ డున్న యెడలఁ బాండవు లంద ఱున్నట్లే

ప్రథ—అతఁ డిట్టిసమయమందు సాముచేసికొనుటకు దూరప్రదేశమునకుఁ బోవునని వింటిని.

వృద్ధ—అయ్యో! మనయాశ లడుగంటినవి. కానీ. పుత్రిక! అతఁడున్న చోటికే పోయి యాశ్రయింతుమా?

ప్రథ—వద్దు. శ్రమపడవద్దు.

వృద్ధ—పుత్రి! ఇతనిని వేఁడుకొందమా. కానీ, చూతము ఓయీ పురుషుఁడ! మమ్ము విడిచిపెట్టెదవా?

ఘటో—ఒక నియమముమీఁద విడిచిపెట్టెదను.

వృద్ధ—ఏమినియమము?

ఘటో—నాకుఁ బూజ్యురా లయినతల్లి కలదు. ఆమె నన్ను బిలిచి "పుత్రిక! నాయుపవాసవిసర్గమునిమిత్త మీవనమునందు వెదకి యొక మనుష్యుని దీసికొనిరమ్ము" అని యాజ్ఞాపించినది. అందుచేత నేను నిన్నుఁ బట్టుకొంటిని.

తే. గీ. భవ్యచారిత్రవతియైన పత్నితోడఁ
గొడుకు లిద్దఱతో ముక్తిఁగోరెదేని
ప్రాజ్ఞమతితోడ మన బలాబలము లెఱిఁగి
కొడుకు నొక్కని నాకయి విడిచి పొమ్ము.

వృద్ధ—ఔర! రాక్షసాధమ!

తే. గీ. వేదవిద్యుఁడను మిక్కిలి పెద్దవాఁడ
గుణము శీలంబు గలిగినకొడుకుఁగుఱ్ఱ
నకట! దుష్టరాక్షసునకు నప్పగించి
యెట్లు పోవంగ మనసొప్పు నిపుడు నాకు.

ఘటో—తే. గీ. అవనిసురముఖ్య! నేనిప్పు డడిగినట్లు
తనయు నొక్కని నా కిచ్చి తరలవేని
నీవు సకుటుంబముగ నొక్కనిముసమందు
నాశ మొందెదవు నమ్ము నాదుమాట.

వృద్ధ—నా నిశ్చయ మిది.

తే. గీ. ధన్య మైనది, పరిణామ దశలచేత
శిథిలమైనది నా మేను చివికి చివికి,
వేదసంస్కృత మగుమేను వ్రేల్చువాఁడ
రాక్షసాగ్నిలోపల సుతాపేక్ష నగుచు. 15.

భార్య—ఆర్య! అట్లు వద్దు వద్దు. పతివ్రతయనఁగాఁ బతిమాత్ర ధర్మిణికదా? సంసారఫలము గ్రహింపఁబడినయీశరీరము చేత దేవరవారిని, వంశమును,రక్షింపఁ దలంచుకొనుచున్నాను

ఘటో—పూజ్యురాలయిన మాతల్లి స్త్రీజనము నంగీకరింపదు.

వృద్ధు—నన్నుఁ దీసికొనిపో. నేను వచ్చెద.

ఘటో—ఆ! ముసలివాఁడ! నీవు తొలఁగుము.

ప్రథ—ఓ నాయన! నే నొక్కమాట చెప్పెదను.

వృద్ధ—పుత్రక! చెప్పుము.

ప్రథ—తే. గీ. గురుని ప్రాణముల్ గావఁగఁ గోరుచుంటి
నాదుప్రాణంబు లిచ్చి దానవున కిపుడు

తండ్రి! యీకులరక్షణార్థంబు నీవు
నన్ను విడువం గదగుఁజుమీ! నయమెఱింగి

ద్వితీయుఁడు—అయ్యా! ఇట్లుచేయవలదు.

తే. గీ. జ్యేష్ఠుఁడే కులంబునకెల్ల శ్రేష్ఠుఁ డగును
దల్లిదండ్రుల కతఁడె సదాప్రియుండు
కాన నేనె పోవలతు రాక్షసుని కడకుఁ
దక్షణమె పంపు గురువృత్తిఁ దలఁచి నన్ను.

తృతీయుఁడు—అన్నలారా! అట్లు కాదు.

తే. గీ. అగ్రజుండు పితృసమానుఁడవరజునకు
నంచు బ్రహ్మవాదులు వచియించుచుంద్రు
గానఁ బెద్దలప్రాణరక్షణ మొనర్ప
నర్హుఁడను నేనె పోవనిండయ్య! నన్ను. 18.

ప్రిథ—వత్స ! అట్లుకాదు—

తే. గీ. తనకు నాపద గలుగుచోఁ దండ్రి నరగఁ
దానిఁ దఱియించు జ్యేష్ఠపుత్రికునిచేత
నందుచే నేనె పోయెద నసురకడకు
గురులప్రాణంబు రక్షించుకొఱకు నేఁడు. 19.

వృద్ధ—జ్యేష్ఠుఁడు నాకు మిక్కిలి యిష్టుఁడుగావున వానిని నేను విడువఁ జాల.

భార్య—జ్యేష్ఠుఁడు మీకెంతప్రియుఁడో కనిష్ఠుఁడు నాకంతప్రియుఁడు

ద్వితీ—తల్లిదండ్రుల కిద్దఱకు ననిష్టుఁడ నైననే నిప్పుడెవరికిఁ బ్రియుఁడను?

ఘటో—నీవు నాకుఁ బ్రియుఁ డవు, శీఘ్రముగ రమ్ము !

ద్వితీ— తే. గీ. నాయసువు లిచ్చి గురులప్రాణములఁ బ్రోవ
ననువుపడెఁ గాన ధన్యుఁడ నైతి నేను,

మహితమైనట్టిబాంధవమైత్రికంటె
దేహమైత్రి దుర్బల మని దెలిసికొంటి. 20.

ఘటో—ఆహాహా! ఏమియీబ్రాహ్మణకుమారుని స్వజనవాత్సల్యము.

ద్వితీ—ఓ నాయన ! నమస్కరించుచున్నాఁడను.

వృద్ధ—కుమార ! రమ్మ రమ్మ.

తే. గీ. నీదుప్రాణంబు లర్పించి నీగురువుల
ప్రాణములఁ గాచునోగురువత్సలుండ !
దుర్జనంబుల కెప్పుడు దుర్లభ మగు
బ్రహ్మలోకంబు శీఘ్రింబు బడయుమయ్య. 21.

ద్వితీ—అనుగ్రహింపఁ బడితిని. అమ్మ ! అభివాదను చేయు చున్నాఁడను.

భార్య—బిడ్డ! చిరంజీవివికమ్మ !

ద్వితీ—మహాప్రసాదము. అన్నయ్య! వందనము జేయుచున్నాఁడను.

ప్రథ—వత్స ! రమ్మ. రమ్మ.

తే. గీ. బిగ్గఁ గౌఁగిటఁ జేర్పుము ప్రీతి నన్ను
మంచిగుణములు నినుఁ గౌఁగిలించుకొనియె
నీవిశాలయశోలక్ష్మి నేఁడు మొదలు
మించి యీవసుంధరఁ గౌఁగిలించుఁ గాత ! 22.

ద్వితీ—మహాప్రసాదము.

తృతీ—అన్నయ్య ! నమస్కరించుచున్నాఁడను.

ద్వితీ—శుభ మగుఁగాక !

తృతీ—మహాప్రసాదము.

ద్వితీ—ఓపురుషుఁడ ! ఒక్కమాట చెప్పుచున్నాను.

ఘటో—చెప్పు ! త్వరగాఁ జెప్పు.

ద్వితీ—ఈవనమధ్యమందు సర స్సున్నట్లు కనఁబడుచున్నది. అందుఁ బ్రికల్పితపరలోకుఁడ నగునేను పిపాసాప్రతీకారార్థము నాకుఁ దర్పణము విడుచుకొని వచ్చెదను.

ఘటో—ఓ దృఢవ్యవసాయి ! వెళ్ళు. మాతల్లికి భోజనవేళ మించు చున్నది. త్వరగా రమ్మి !

ద్వితీ—ఓ, నాయనా ! ఇదె వెళ్ళుచున్నాఁడ.

(నిష్క్రమించును)

వృద్ధ—హా! హా, అయ్యో! వంచింపఁ బడితిమి వంచింపఁ బడితిమి.

తే. గీ. మున్ను శృంగత్రియముచేతఁ గన్నుఁగనకుఁ
బండు వానరించునావంశపర్వతంబు
మధ్యశృంగభంగముచేత మనసు నిప్పుడు
మిగులఁ దపియించుచున్నది మేర మీరి. 23.

హా ! పుత్ర ! పోయితివా తండ్రి !

ఉ. పాయఁపుజిన్నియన్న ! పరువంబునకుం దగు సౌరుటెంకి ! స్వా
ధ్యాయమునం బ్రిసక్తమగు సచ్ఛఁపుబుద్ధులతావలంబ ! పల్
కాయలఁ బువ్వులన్ దనరి కాలవశంబున దంతిదంతభ
గ్నాయతపాదపంబువలె నక్కట! నాశమునొందితే యిఁకల్ 24.

ఘటో—బ్రాహ్మణకుమారుఁ డాలస్యము చేయుచున్నాఁడు. మాయ మ్మకు భోజనవేళ మించుచున్నది. ఏమిచేయుదును? ఆ, తెలి సినది. ఓ బ్రాహ్మణుఁడ ! నీకుమారునిఁ బిలువుము.

వృద్ధ—నీమాట రాక్షసచర్యలను గూడ మించియున్నదిరా.

ఘటో—కోపము వచ్చినదా? క్షమింపుఁడు. క్షమింపుఁడు. అయ్యో! ఇది నాస్వభావదోషము. అట్లయిన మీకుమారునిపే రేమి ?

వృద్ధ—ఇదియును నేను వినఁజాలను.

ఘటో—సరే! ఓబ్రాహ్మణకుమార! నీసోదరునిపేరేమి?
ప్రథమ— పాపము! మధ్యముఁ డందుము.
ఘటో—మధ్యముఁ డనుపేరు వానికిఁ దగి యున్నది. నేనే వెళ్ళి పిలిచెదను. ఓహోహో! మధ్యమ! మధ్యమ! శీఘ్రముగా రమ్ము!

(అంతట భీమసేనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భీమ—అహో! యీస్వర మెవనిది చెపుమా?

చ. అనయ మనేకపక్షిరుతమై బహుళద్రుమవర్గసాంద్రమై
యనుపమసంకటం బగుమహాటవి నార్చెడుఁ గంఠమెత్తి కా
ననము ప్రతిధ్వనుల్ సిగుడ నామదికిం గడుఁ బీడసేయు నీ
ఘనభుజుగొంతు మావిజయుకంఠముపోలిక నున్న దారయన్. 25.

ఘటో—బ్రాహ్మణవటుఁడు మిక్కిలి మసలుచున్నాఁడు. మాయమ్మ కాహారకాల మతిక్రమించుచున్నది. ఏమిసేయుదును? ఆ తెలిసినది గట్టిగాఁ బిలచెదను. ఓమధ్యమ! శీఘ్రముగ రమ్ము.
భీమ—ఓరీ! యెవఁడురా? యీవనమధ్యమందు నాకు వ్యాయామ విఘ్నముఁ గలిగించి మధ్యమ! మధ్యమ! యని నన్ను బిలచుచున్నాఁడు. ఔఁగాక! యెవరో చూచెదను. (నడచి చూచి) అహో! యీ పురుషుఁ డెంతదర్శనీయుఁడు. ఇతఁడు,

సీ. సింగంపుమొగమును సింహదంష్ట్రిలు తేనె
కన్నులు గంభీరకంఠరవము
నాగంపుహనువులు డేగముక్కను బచ్చ
బొమలు చిక్కలువడ్డ పొడవుకురులు
వజ్రమధ్యము పీనవక్షమాజానుబా
హులు గజవృషగతు ల్గలుగునితఁడు
విపులదోర్బలుఁడంచు వీరనందనుఁ డంచు
నసురజాతుండంచు వ్యక్తమయ్యె 26

ఘటో—బ్రాహ్మణవటుఁ డాలస్యము చేయుచున్నాఁడు. మాతల్లి కాహారకాల మతిక్రమించుచున్నది. ఇప్పు డేమి చేయుదును? అగుఁగాక, గట్టిగాఁ బిలచెదను. ఓయిమధ్యమ! ఓమధ్యమ! శీఘ్రముగా రమ్ము!

భీమ—అయ్యా! యిదిగో వచ్చితి.

ఘటో—ఇతఁడు బ్రాహ్మణకుమారుఁడు కాఁడు. ఆహా! యీపురుషుఁ డెంతదర్శనీయుఁడై యున్నాఁడు.

తే. గీ. కనతాలబాహువులు సింగంపురూపు
గరుడబలము సన్ననడుము గలయితండు
వికసితాంభోజనేత్రుఁడా విష్ణుఁ డొక్కొ!
చూడఁ గనుపండు వొనరించుఁ జుట్టమట్లు. 27.

ఓమధ్యమ! నిన్నుగదా నేను పిలుచుచున్నది.

భీమ—అందుకేగదా నేను వచ్చినది.

ఘటో—ఏమి నీవును మధ్యముఁడవా?

భీమ—ఔను మఱియొకఁడను గాను.

కం. మధ్యముఁడ నవధ్యులలో
మధ్యముఁడను బాహుగర్వమదమత్తులలో
మధ్యముఁడను ధారుణికిన్
మధ్యముఁడను నాదుభ్రాతృమండలిలోనన్. 28.

ఘటో—కావచ్చును.

భీమ—మఱియు,

తే. గీ. మధ్యముఁడఁ బంచభూతసమాజమందు
మధ్యముఁడ మహీపాలకమండలమున
మధ్యమప్రపంచమునందు మధ్యముఁడను
నఖిలకార్యంబులందు మధ్యముఁడ నేను. 29.

వృద్ధ— తే. గీ. మధ్యముఁడ నంచు వచ్చు నీమానవుండు
మహితగుణుఁ డైన పాండవమధ్యముండు
పాటవంబున మృత్యువునోటనుండి
మనల విడిపింప నరుదెంచె నని తలంతు. 30.

(అప్పుడు మధ్యముఁడు-అనఁగా బ్రాహ్మణుని ద్వితీయపుత్రుఁడు పరివేశించుచున్నాఁడు.)

ద్వితీయుఁడు— తే. గీ. అమల మైన యీకొలఁకున నాచమించి
యూర్ధ్వలోకదుర్లభ మయి యుండునట్టి
పద్మపత్రవిభాసుర స్వచ్ఛజలము
నాకు నేనె యర్పించుకొన్నాఁడ నిపుడు 31.

(సమీపించి) ఓపురుషుఁడ ! ఇదుగో వచ్చితిని.

ఘటో— ఇప్పటికి వచ్చితివి. మధ్యమ! మధ్యమ! ఇటురా యిటురా!

వృద్ధ— (భీమునికడకుఁ బోయి) ఓమధ్యమ ! బ్రాహ్మణకులమును రక్షింపుము.

భీమ— భయపడకుఁడు. భయపడకుఁడు. మధ్యముఁడ నైన నే నభివాదనము జేయుచున్నాఁడను.

వృద్ధ— వాయుదేవుఁడువలె దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము !

భీమ— మహాప్రసాదము. దేవరకు భయమెందువల్ల ?

వృద్ధ— విను, నేను కురురాజయినయుధిష్ఠిరునిచేతఁబూర్వమధిష్ఠింపఁబఁడిన కురుజాంగలమునందలి యూపగ్రామవాస్తవ్యుఁడను. మాఠరసగోత్రుఁడను. కల్పశాఖాధ్వర్యుఁడను. కేశవదాసుఁడను. బ్రాహ్మణుఁడను. నాకు నుత్తరదిక్కునం దున్న యుద్యామక గ్రామవాస్తవ్యుఁడు కౌశికసగోత్రుఁడు యజ్ఞబంధుఁడను పేరుగల మేనమామ గలఁడు. ఆయనకుమారునియుపనయనోత్సవమునకు దారపుత్రసమేతముగఁ బయన మయి పోవుచుంటిని.

భీమ—మార్గములు నిర్బాధకములగుఁ గాక ! తర్వాత, తర్వాత.

వృద్ధ—తర్వాత, నీరాక్షసుఁడు నన్ను,

సీ. సజలమేఘమువోలు శ్యామగాత్రమువాఁడు
కమలపత్రాయతాక్షములవాఁడు
గంభీరమృగరాజగతివిలాసమువాఁడు
చండతరోగ్రదంష్ట్రములవాఁడు
అంతరంగమున నావంతశంకయు లేక
మహనీయు లగుమీసమక్షమందు
దారపుత్రికసమేతము గాఁగ నిర్దయఁ
బాలియింపఁ గా నేఁడు బూనినాఁడు. 32

భీమ—ఆలాగా, ఇతఁడు బ్రాహ్మణజనమునకు మార్గవిఘ్నము జేసినాఁడా? కాఁ, యతని నిప్పుడే నిగ్రహించెదను. ఓపురుషుఁడా ! నిలు ! నిలు !

ఘటో.—ఇదుగో ! నిలచి యున్నాఁడను.

భీమ.— ఎందుకు బ్రాహ్మణుని బాధించుచున్నాఁడవు?

తే. గీ. "పడఁతి యనుపండువెన్నెల పరిభలతోడఁ
గొడుకు లనియెడు చుక్కలనడుమ నున్న
బ్రాహ్మణుండను జంద్రునిపాలి కీవు
వచ్చినాఁడవు రాహువువలెనె పట్టి" 33

ఘటో—.ఔను ! రాహువనే.

భీమ-శా. ఏదోసంబును జేసినన్ మహీసురుఁ హింసింపరా దట్టిచో
నేదోసంబును లేక పుత్రతతితో నిల్లాలితోఁ బోవు నీ
భూదేవుఁ వ్యవహారతంత్రవిముఖున్ బుణ్యక్రియారంభు వ్యా
పాదింపన్ జనదన్న వే విమువుమీ పల్మారు ని న్వేఁడెదఁ. 34

ఘటో—విడువను.

భీమ—(తనలో) ఆహా! యితఁ డెవరికొమారుఁడై యుండునుచెప్పుమా

క. మాయేవురు భ్రాతలలో
నేయతనిని బోలు నొక్కొ! యీగుణచోరుం
డీయతిశౌర్యముఁ జూచిన
మాయభిమన్యుండు నాకు స్మరణకు వచ్చున్. 36.

(ప్రకాశముగ)

ఓపురుషుఁడ ! బ్రాహ్మణుని విడువుము.

ఘటో—విడువను.

తే. గీ. నేఁడు మాయబ్బయే వచ్చి నీవు వీని
విడువు మంచు నమ్మికమెయి నుడువుఁ గాక !
యితని మాయమ్మయాజ్ఞఁ బట్టితిని గాన
విడువఁ జాల ముమ్మాటికి విడువఁ జాల. 36

భీమ—(తనలో) ఏమీ ! తల్లియాజ్ఞ యనుచున్నాఁడు. ఇతఁడు గురు
శుశ్రూషాపరుఁ డగుతపస్వివలె నున్నాఁడు.

తే. గీ. తల్లి మానవులకునెల్ల తలఁచిచూడ
దైవతంబులలోపల దైవతంబు,
తల్లియానతి శిరమునఁ దాల్చి కాదె
యీదృశావస్థ నొందితి మేవురమును. 37.

(ప్రకాశముగా)

ఓపురుషుఁడా ! నినొ్నకటి యడుగ వలసియున్నది.

ఘటో—అడుగు ! శీఘ్రముగా నడుగు.

భీమ—మీతల్లిపే రేమి ?

ఘటో—హిడింబ యనురాక్షసి.

తే. గీ. పౌరవకులశ్రీదీప్తుండు పాండవుండు
మానితాత్ముండు దను నేలుమగఁడు గాఁగ
నిండునెలతోడ విలసిల్లు నింగివోలె
నామహాభాగ శోభిల్లు నతిశయముగ 38.

భీమ—(తనలో) ఆలాగా, ఇతఁడు హిడింబాపుత్రుఁడా. అట్లైన నత
నికీగర్వము తగియే యున్నది?

తే. గీ. రూపబలసత్త్వములచేత రూఢి నితఁడు
పోలియున్నాఁడు తండ్రిలఁ జాలవఱకు
గాని పరిజలపై నంతనిష్కరుణవృత్తి
హృదయమం దెట్లు దాల్చెనో యెఱుఁగరాదు. 39.

(ప్రకాశముగ) ఓయీ ! ఈయనను విడువుము.

ఘటో—విడువను.

భీమ—ఓబ్రాహ్మణుఁడ! నీకొమారుని దీసికొనిపొమ్ము. ఈతనివెంట
నేను వెళ్లుదును.

ద్వితీ—వద్దు. వద్దు. మీరిట్లు చేయవద్దు.

తే. గీ. మున్నె విడిచితి నాప్రాణములను నేను
గురులప్రాణముల్ రక్షించుకోర్కెతోడఁ
బడుచువాఁడవు మిగులరూపసివి గుణివి
వసుధపైఁ జిరకాలంబు బ్రదుకు మయ్య. 40.

భీమ—అయ్యా! యట్లు కాదు. నేను క్షత్రియకులసంభవుఁడను. బ్రా
హ్మణుఁడో—మిక్కిలిపూజ్యుఁడు అందువల్ల బ్రాహ్మణశరీ
రమునకు బదులుగ నాశరీరము సమర్పింపఁ దలఁచుచున్నాఁడను

ఘటో—ఆలాగా, ఇతఁడు క్షత్రియుఁడా: అందుచేతనే గర్వము,
అవుఁగాక; ఇతనిని నే జంపి తీసుకొనిపొయెదను. ఈబ్రా

హ్మణకుమారుఁడు నేను దీసికొని పోకుండ నెవరిచేత వారింపఁ బడెను?

భీమ—నాచేత.

ఘటో—నీచేతనా?

భీమ—ఔను.

ఘటో—అట్లైన నీవే నావెంట రమ్ము.

భీమ—సరె, నేను దుర్బలునివెంట స్వయముగా రాను. నీకుసామర్థ్య మున్నయెడల నన్ను బలాత్కారముగఁ దీసికొని పొమ్ము.

ఘటో—నే నెవరో నీవెఱుఁగవు కాఁబోలు?

భీమ—నీవు నాపుత్త్రుఁడ వని యెఱుఁగుదును.

ఘటో—ఎట్లు! నేను నీపుత్రుఁడ నెట్లు?

భీమ—కోపమువచ్చినదా? శాంతింపుము. శాంతింపుము. సమస్త ప్రజలు క్షత్రియులకుఁ బుత్రులని చెప్పఁబడుదురు. అందుచేత నే నట్లంటిని.

ఘటో—పిఱికివా రాయుధమును గ్రహింపవలెను. నీకాయుధ మేది?

భీమ—చ. శపథమువెట్టి చెప్పెదను సత్యము భీతి యెఱుంగ నెట్టిదో
యిప్పు డది నేర్చుకోవలఁతు నించుక నీకడ భద్ర! యొజ్జవై
కృపనెఱిఁగింపుమయ్య యది యేగతినుండునొ చెప్పు దేని నే
నపగతశంక వర్తిలెద నర్థిఁ బుఁ బక్కగుణాగుణజ్ఞతన్.

ఘటో—సరే! నీకు నేను భయ ముపదేశించెదను. ఆయుధము పట్టుకో!

భీమ—ఇదే నాయాయుధము. (అని బాహువుఁ జూపును)

ఘటో—అది యాయుధ మెట్లు?

భీమ—తే. గీ. కాంచనస్తంభసన్నిభాకార మూని
శత్రుమర్దనమందు దీక్షను వహించు
నాదుదక్షిణబాహుదండంబు నాకు
నాల మొనరింపఁ దగినట్టి యాయుధంబు 42

ఘటో—ఇదినాతండ్రి యైనభీమసేనునకుఁ దగి యుండును.

భీమ—భీముఁ డనునాతఁ డెవఁడు ?

క. శివుఁడుం బద్మజుఁడుం గే
శవుఁడున్ యమధర్మరాజు శక్తిధరుఁడు నా
దివిజులు గల రిందఱిలో
నెవనికి నీతండ్రి సముఁడో యేర్పడఁ జెపుమా.

ఘటో—అందఱకు సమానుఁడు.

భీమ—ఛీ! అది యబద్ధము.

ఘటో—ఏమేమి? అనృత మనుచున్నాఁడవా? నాతండ్రి నధిక్షేపించెదవా? కానీ, యీస్థూలవృక్షమును బెఱికి కొట్టెదను. (అని యట్లు చేయుచున్నాఁడు.) ఏమిది! దీనిచేత నితనిం జంప లేకపోతిని. ఏమిచేయుదును? సరే! తెలిసినది. ఈపర్వతశిఖరమును బెల్లగించి కొట్టెదను.

తే. గీ. ఏను విసరినపర్వతశృంగ మిపుడె
పుచ్చుకొని నీదుప్రాణముల్ పోవఁ గలదు.

భీమ— కోపగించియు నారణ్యకుంజరంబు
వనమునందలి బెబ్బులిఁ బట్టఁ గలదె 44

ఘటో—ఏమిది! దీనిచేతను జంపఁజాలనైతిని. ఇప్పు డేమి చేయుదును ? సరే, తెలిసినది.

తే. గీ. భీమసేనునితనయుండ భీమబలుఁడ
        ననిలదేవునిపౌత్రుండ నగుటఁ జేసి
        బాహుయుద్ధంబునకు సిద్ధపడుము నిలుము
        అందు నాకు సమానుఁ డీయవని లేఁడు.

(అని యిద్దఱు బాహుయుద్ధము జేయుచున్నారు.)

ఘటో—(భీమసేనుని బంధించి)

మ. భుజవీర్యంబుఁ దృణీకరించి యెటులం బోనేర్తు బాశాళిచే
    గజమట్టుల్ నిను మద్భుజద్వయముచే గాఢంబుగాఁ గట్టితిన్

భీమ—(తనలో) ఏమి! యితనిచేత నేను బట్టుపడితినిగదా! నాశత్రు
    పక్ష మిప్పుడు విజృంభింపవచ్చును. కాని, కాచుకొ (ప్రకాశ
    ముగ) ఓపురుషుఁడ! సావధానుఁడవు కమ్ము!

ఘటో—అవహితుఁడ నై యున్నాఁడను.

భీమ—(బంధమును దెంపి వైచి)

మ. త్యజియింపం దగు బాహుదర్పమిఁక వ్యక్తంబయ్యెనీసార మీ
    భుజయుద్ధంబున డయ్యలే దపజయంబుం బొందలే దేను సూ.

ఘటో—ఎట్టు! ఈబంధముచేతఁ గూడ నితనిని వధియింపఁ జాలనయి
    తిని. ఏమిచేయుదును? ఆహా! తెలిసినది. మాతృ ప్రసాదము
    చేత లబ్ధమయిన మాయాపాశము కలదుగదా! దానిచే నిత
    నిని బంధించి తీసికొనిపోయెదను. జల మెక్కడ దొరకును
    ఓపర్వతమా! జల మిమ్ము. అదిగో! నీరు స్రవించుచున్నది.
    (ఆచమించి మంత్రము జపించుచున్నాఁడు.)
    ఓపురుషుఁడ!

మ. అవలీలన్ నినుబట్టి కట్టితిని మాయాపాశవర్గమ్ములన్
    వివశుండై యిఁక పోవఁజాలవుసుమీ! వేమాఱు యత్నించియున్

సువిలాసంబునఁ ద్రాళ్ళఁ గట్టఁబడియున్ శోభిల్లుచున్నాఁడ వు
త్సవకాలంబున దర్శనీయ మగు నాశక్రధ్వజంబుం బలెన్.
(అని మాయచేత బంధించుచున్నాఁడు.)

భీమ—ఏమిది! మాయాపాశముచేతఁ గట్టువడితినే. ఇప్పు డేమిచేయు దును? మహేశ్వరప్రసాద లబ్ధమైనమాయాపాశ మోక్షకమంత్రము కలదుగదా! దానిని జపించెదను. జల మెక్కడ దొఱకును. కానీ, ఓబ్రాహ్మణకుమారా! కమండలుజలము తీసికొనిరమ్ము.

వృద్ధ—ఇదిగో! జలము.

(భీమసేనుఁ డాచమించి మంత్రము జపించి మాయను విడిపించుకొనుచున్నాఁడు.)

ఘటో—ఓహో! పాశము తెగి పడిపోయినదే! ఇప్పు డేమి చేయుదును ? అగుఁగాక, ఓపురుషుఁడ! పూర్వప్రతిజ్ఞను దలఁచుకొమ్ము!

భీమ—ప్రతిజ్ఞయా, సరే! జ్ఞప్తికివచ్చినది. నీవు ముందు నడువుము. నేను వెనుక వచ్చెదను. (ఇద్దఱు నడచుచున్నారు.)

వృద్ధు—పుత్రకులారా! ఏమిచేయుదము. ఈ వృకోదరుఁడు వెళ్ళుచున్నాఁడు.

మ. జ్వలదుగ్రాకృతియుం భయంకరమహాబాహుప్రతాపంబులుం
గల యీదాసవు నాక్రమించి చను లక్ష్యంబింతయున్ లేక వి
హ్వలచిత్తం బనుమాట లేకితఁడు తీవ్రాసారవర్షంబులోఁ
గలకం బాఱక లీలమై జనుమహోక్షుంబట్లు శీఘ్రింబుగన్ 48

ఘటో—అయ్యా! ఇక్కడఁ గూర్చుండుము. నీరాక మాయమ్మకెఱింగించెదను.

భీమ—మంచిది ! పొమ్ము.

ఘటో—(సమీపించి) అమ్మా! నమస్కారము. నేను ఘటోత్కచుఁడను. ఆహారమునిమిత్తము మనుష్యుఁడు కావలెనని చిఱకాలమునుండి యభిలషించు చుంటివి. ఇప్పు డొకమనుష్యుని దీసికొనివచ్చితిని.

హిడింబ—(పరివేశించి)

కుమార ! చిరంజీవివి కమ్మా! నీవు తీసికొని వచ్చినమనుష్యుఁ డెట్టివాఁడు?

ఘటో—పూజ్యురాలా ! మాటమాత్రముచేతనే మనుష్యుఁడు గాని, బలముచేతఁ గాడు.

హిడింబ—ఏమి! బ్రాహ్మణుఁడా?

ఘటో—బ్రాహ్మణుఁడు కాఁడు.

హిడింబ—కానియెడల ముసలివాఁడా .

ఘటో—ముసలివాఁడు కాఁడు.

హిడింబ—బాలుఁడా యేమి?

ఘటో—బాలుఁడు కాఁడు.

హిడింబ—అట్లైన నతనిం జూచెదను.

(ఇద్దఱు నడుచుచున్నారు.)

హిడింబ—ఏమిది! యీమనుష్యునా, నీవు తీసికొనివచ్చినది?

ఘటో—అమ్మ ! యీయన యెవరు ?

హిడింబ—వెఱ్ఱివాఁడ ! ఈయన దైవము.

ఘటో—ఆలాగా ! ఎవరికి దైవము ?

హిడింబ—నీకును.నాకును-

ఘటో—గురు తేమి ?

హిడింబ—ఇదిగో గుర్తు. అర్యపుత్ర ! జయము! జయము !

భీమ—(చూచి) ఎవ రీమె ? అహా! హిడింబాదేవియా.

తే. గీ. ప్రాజ్యసామ్రాజ్యపదపరిభ్రష్టుల మయి
యడవులందునఁ జరియించునట్టి మాకుఁ
గూర్మిదళుకొత్తునిన్నుఁ గన్గొనుటచేత
నంతరంగతాపంబు జల్లారె దేవి.

హిడింబ ! యిదేమిటి?

హిడింబ—(చెవిలో) ఇది యిట్టిది.

భీమ—దేవి ! నీవు జాతిచేతమాత్రమే రాక్షసివి, సదాచారము
చేతఁ గావు.

హిడింబ—పిచ్చివాఁడ! తండ్రికి నమస్కారము చేయుము.

ఘటో—తండ్రి ! ధార్తరాష్ట్రవనదవాగ్ని నగుఘటోత్కచుఁడను
నేను నమస్కరించుచున్నాఁడను. పుత్రచాపలమును క్షమింప
వలయును.

భీమ—కుమార ! రమ్ము! రమ్ము! నీవున్యతిరేకముగఁ జేసినదయినను
మనోహరముగా నున్నది. (అని కౌఁగలించును.)
కుమారా ! మాతండ్రులహృదయములు ధార్తరాష్ట్రవనదా
వాగ్నులగు పుత్రులచే యపేక్షించుచున్నవి మహాబలపరా
క్రముఁడవు కమ్ము.

ఘటో—మహాప్రసాదము.

వృద్ధ—ఆలాగా, ఈయన భీమసేనపుత్రుఁ డగుఘటోత్కచుఁడా ?

భీమ—పుత్రక ! పూజ్యుఁ డయిన యీకేశవదాసునకు నమస్కరిం
పుము.

ఘటో—దేవ ! నమస్కరించుచున్నాఁడను.

వృద్ధ—తండ్రివలె గుణకీర్తిసంపన్నుఁడవు కమ్ము !

ఘట—అనుగ్రహింపఁబడితిని.

వృద్ధ—ఓ వృకోదర ! నావంశము రక్షించి, నీకులము నుద్ధరించితివి
మే మిఁక వెళ్ళుదుము.

భీమ—తే. గీ. నీయనుగ్రహంబుకలిమి నీయఖిలము
శుభకరం బయివర్తిల్లెఁ జువ్వె యనఘ !
అనతిదూరానఁ గలదు మాయాశ్రమంబు
విశ్రమించి యచ్చట మీరు వెడలవచ్చు.

వృద్ధ—మాకుఁ బ్రాణపరివిదానము సేసి యిదివఱకే యాతిధ్యమిచ్చి యుంటివి. అందుచేత మేము వెళ్ళుదుము. సెలవొసంగుము.

భీమ—అట్లైన సకుటుంబముగ మీరు వెళ్ళుఁడు పునర్దర్శన మగుఁ గాక !

వృద్ధ—మంచిది ! అది మాపరిథమ సంకల్పమే.

(దారపుత్రసహితముగ వృద్ధబ్రాహ్మణుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

భీమ—హిడింబ! యిటురమ్ము. కుమార ! ఘటోత్కచ! నీవు నిటు రమ్ము పూజ్యుఁడైన కేశవదాసుని నాశ్రమపదద్వారమాత్ర మువఱకైన సాగనంపి సంభావింతము.

తే. గీ. అఖిలవాహినీపరితతికి నబ్ధివోలె
నాహుతులకెల్ల హవ్యవాహనుఁడు వోలె
మానవేంద్రియంబులకెల్ల మనసువోలె
మాకు భగవానుఁడైనవామనుఁడు ప్రభువు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

మధ్యమవ్యాయోగము, సమాప్తము.

# దూతవాక్యము

(అంతట నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్ర—

తే. గీ. కించిదరుణ మహా నఖకాంతి మించునట్టి
యేపదము నభంబున హరియించె నముచి
నఖిలలోకోత్సవం బగునయ్యుపేంద్రు
పదము మి మ్మనయంబుఁ గాపాడుఁగాత॥

ఆర్యమిశ్రుల నిట్లు వేఁడుకొనుచున్నాఁడను. ఏమిటి ! నేను విజ్ఞాపనవ్యగ్రుఁడ నై యుండఁగా నేదో శబ్దమువలె వినఁబడుచున్నది. ఇదె చూచెదను.

(తెరలో)

ఓహోహో ! ద్వారపాలకులారా ! దుర్యోధనమహారాజిట్లాజ్ఞాపించుచున్నాఁడు.

సూత్ర—అహా ! తెలిసినది.

తే. గీ. పాండురాజపుత్రులతోడఁ బ్రభవమయ్యె
ధార్తరాష్ట్రుల కతివిరోధంబు కాన
సేవకుఁడు మంత్రశాలను సిద్ధపఱచు
నధిపుఁడయిన దుర్యోధనునాజ్ఞచేత.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

---

ఇది స్థాపన

---

(అప్పుడు కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కాంచు—ఓహోహో ద్వారపాలకులారా! దుర్యోధనమహా రాజుగా రిట్లాజ్ఞాపించుచున్నారు. నేఁడు సకలరాజులతోఁ గలసి మంత్రాలోచనము చేయఁదలంచుచున్నారము- కావున రాజులనందఱను బిలుచుకొని రండు అని (నడచి చూచి; అహో! ఈదుర్యోధనమహా రాజుగారే వచ్చుచున్నారు.

శా. శ్రీమంతుండును లేతవాఁడు సితకౌశేయోత్తరీయుండు సు
శ్యామాంగుండు కృతాంగరాగుఁడు విభూషారత్న రాజిప్రభా
స్తోమాక్రాంతుఁడు ఛత్రిచామరసమేతుం డూర్జితుం డైన యీ
భూమీశాగ్రణి వొల్చు జుక్కలగమిన్ బూర్ణేందుఁ డెట్లట్లుగాన్

(అప్పుడు యథానిర్దిష్టముగ దుర్యోధనుఁడు ప్రవేశించుచున్నాఁడు)

దుర్యో—

తే. గీ. తలఁచుకొనక వచ్చిన రణోత్సవము నఱసి
యపగతాగ్రహ మైనట్టు లలరె మనసు
చేయవలతుఁ బాండవసేనఁ జేరుకరుల
మొగము లుత్క్రుత్తపటుదంతముసలములుగ.

కాంచు—మహారాజా! జయము. దేవరవారిశాసనములవల్ల సర్వరాజమండలమును దీసికొని వచ్చితిని.

దుర్యో—చక్కఁగాఁ జేసితివి. నీ వంతఃపురమునకుఁ బొమ్ము

కాంచు—మహారాజుగారి యాజ్ఞాపరికారము చేయుదును.

(నిష్క్రమించును)

దుర్యో—ఆర్యులారా! వైకర్ణవర్ష దేవులారా! నాకుఁ బదునొకండక్షౌహిణుల బలసముదయము కలదు గదా! దాని కెవరు సేనాపతి గా నర్హుఁడో చెప్పవలయును.

ఏమి! మీా రేమనుచున్నారు— ఈవిషయము మిక్కిలి గొప్పది. ఆలోచించి చెప్పవలయు ననియా

అదియుక్తమే. అట్లయిన రండు, మంత్రిశాలలోనికే పోవుదము. ఆచార్యా! నమస్కారము. మీరు మంత్రశాల కరుగుఁడు. తాత! నమస్కారము. మీరు మంత్రిశాల కరుగుఁడు. మామ! నమస్కారము. నీవు మంత్రిశాల కరుగుము. ఆర్యులారా! వైకర్ణవర్ష దేవులారా! మీరు మంత్రిశాలఁ బ్రవేశింపుఁడు. ఓహోహో సర్వక్షత్రియులారా! మీరు స్వేచ్ఛగా లోపలికి జనుఁడు. మిత్రుఁడ! కర్ణుఁడ! మనము లోపలఁ బ్రవేశింతము రమ్మా!

(ప్రవేశించి)

ఆచార్య! ఇది కూర్మాసనము. కూర్చుండుఁడు. పితామహా! యిదె సింహాసనము, కూర్చుండుఁడు. మామా ఇదె చర్మాసనము కూర్చుండుఁడు. ఆర్యులారా! వైకర్ణవర్ష దేవులారా! మీరు కూర్చుండుఁడు ఓహోహో సర్వక్షత్రియులారా! మీ రందఱు యథేచ్ఛముగా గూర్చుండుఁడు.

ఏమి! ఏమనుచున్నారు? మహారాజుగారు కూర్చుండలేదే యనుచున్నారా? ఆహా! సేవాధర్మము ఇదే కూర్చుండు చున్నాను మిత్రుఁడా? కర్ణ! నీవును కూర్చుండు! (కూర్చుండి) ఆర్యులారా! వైకర్ణవర్ష దేవులారా! నాకుఁ బదునొకం డక్షౌహిణుల బలసముదయము గలదు. దాని కెవరు సేనాపతి గాఁదగుదురో చెప్పవలయు.

ఏమనుచున్నారు మీరు—పూజ్యుఁ డయినగాంధార రాజు చెప్పు ననియా—సరే, మామయే చెప్పుఁ గాక.

మామ యేమనుచున్నాఁడు—మహానుభావుఁడయిన భీష్ముఁడుండఁగా సేనాపతి యగుటకు మఱియెవ్వఁ డర్హుఁడనియా?

మామ లెస్సగాఁ జెప్పినాఁడు. సరె సరె. పితామహుఁడే సేనాపతి యగుగాక మేము నిదే కోరుచున్నాము.

శా॥ ఘోరంబౌ విలయానిలక్షుభితపాథోరాశినాదం బటుల్
భేరీభాంకృతిశంఖసైన్యనదముల్ విన్నంటి పెల్ల్రమోయఁగా
నారాజోత్తమమౌళి రాలునభిషేకాంభఃకణశ్రేణితో
వైరివాత్రము గుండియల్ చెదరి భూభాగంబునందుం బడున్

కాంచు—(ప్రవేశించి)

మహారాజ! జయము! పాండవస్కన్ధావారమునుండి పురుషోత్తముఁ డయిన నారాయణుఁడు దూతగా వచ్చినాఁడు.

దుర్యో—ఓ బాదరాయణ! అట్లు కాదు. కంసదాసుఁ డైన దామోదరుఁడా నీపురుషోత్తముఁడు! ఆగోపాలకుఁడా నీపురుషోత్తముఁడు. జరాసంధునిచేత దేశము కీర్తిభోగము హరింపఁబడిన యాభీరుఁడా నీపురుషోత్తముఁడు. అహో! చిరకాలము రాజులకు సన్నిధానవర్తి యైన భృత్యజనున కింతమాత్రము సముదాచారము తెలియక పోయెనే. నీమాట గర్వముతోఁ గూడియున్నది ఆవలకుఁ బొమ్ము అపధ్వంసుఁడ!

కాంచు— మహారాజ! అనుగ్రహింపుఁడు తొట్రుపాటుచేత సముదాచారము మఱచితిని (కాళ్లమీఁదఁ బడుచున్నాఁడు)

దుర్యో—తొట్రుపాటా, ఔను! మనుష్యులకు తొట్రుపాటున్నదే! లెమ్ము! లెమ్ము!

కాంచు—అమ్మయ్యా! బ్రతికితిని.

దుర్యో—ఇప్పుడు ప్రసన్నుఁడనైతిని ఆదూతయెవఁడు?

కాంచు—వచ్చినదూత కేశవుఁడు

దుర్యో— కేశవుఁడా, ఇట్లనుట మాకిష్టమే. ఇదే సముదాచారము. ఓహోహోరాజులారా! దూతగా వచ్చిన కేశవున కెట్టిగౌరవము తగినది?—ఏమను చున్నారు మీరు— కేశవున కర్ఘ్యప్రదాన మిచ్చి పూజింపఁదగు ననియా? అది నా కిష్టము లేదు. అతనిం బట్టి బాధించుట మంచి దని నేను తలంచెదను.

తే, గీ. వాసుదేవుండు మనచేతఁ బట్టువడిన
గ్రుడ్డివారట్టు లుందురు కుంతిసుతులు
గతియు మతియుఁ బాండవుల కీకరణిఁ జెడిన
నేనె పాలింతు నిలయెల్ల నెదురు లేక.

వెండియు, నీసభలో నెవఁడు లేచి కేశవు నెదుర్కొనునో,య తనికిఁ బండ్రెండు కావళులబంగారము దండుగు విధించెదను. కాఁబట్టి మీరందఱు జాగరూకతతో నుండుఁడు. నే నేయుపాయముచేత వాసుదేవునకుఁ బ్రత్యుత్థానము జేయక యుండుదును? ఆహా! ఉపాయము కనఁబడినది. ఓయీ? బాదరాయణ? ద్రౌపదీ కేశాంబరాకర్షణము లిఖింపఁబడినయాచిత్తరువును దీసికొని రమ్మ! (అపవారించి) దానిం జూచుచుఁ గేశవునకుఁ బ్రత్యుత్థానము జేయకుండెదను.

కాంచు—మహారాజుగారి సెలవుప్రకారము చేసెదను. (నిష్క్రమించి మరల ప్రవేశించి) మహారాజా! జయము. ఆచిత్రపట మిదిగో!

దుర్యో—నాయెదుట విప్పుము.

కాంచు—చిత్తము మహారాజ! (అని విప్పుచున్నాఁడు)

దుర్యో—అహో! యీచిత్తరు వెంతదర్శనీయముగా నున్నది. ఈదుశ్శాసనుఁడు కొప్పుఁ బట్టి ద్రౌపదిని లాగుచున్నాఁడు.

తే. గీ. దుస్ససేనుండు తనుబట్ట ద్రుపదపుత్రి
సంభ్రమోత్ఫుల్లనేత్రయై సంచలించి
గ్రహణవేళను రాహువక్త్రంబునందు
జొచ్చుచంద్రరేఖయుఁబోలె సొబగుమీఱు.

ఇదిగో! దురాత్ముఁ డైనయీభీముఁడు సర్వరాజసమక్షము నందు పరాభవింపఁబడిన ద్రౌపదిని జూచి మహాకోపావిష్టుఁడై సభాస్తంభమును బెఱుక నుంకించుచున్నాఁడు. ఈయుధిష్ఠిరుఁడు,

తే. గీ. సత్యధర్మదయాగుణశాలి యయ్యు
ద్యూతకారణమున నష్టచేతనుఁ డయి
తనదు క్రేగంటిచూపులు తఱుచు బఱపి
యత్తరిని వృకోదరు శాంతచిత్తుఁ జేయు.

ఇప్పు డీయర్జునుఁడు,

శా. భావంబందున శత్రుమండలి తృణప్రాయంబుగా నెంచి రో
షావేశంబున సంచలింప నధరం బాఘూర్ణమానాక్షుఁ డై
యావేళన్ నృపజాతినంతను క్షయంబందించు నా గాండివ
జ్యావల్లిన్ స్పృశియించు మెల్లమెలఁగా సంభావింతచేతస్కుఁ డై.

ఈయుధిష్టిరుఁ డర్జునుని వారించుచున్నాఁడు. ఈ నకులసహదేవులు,

తే. గీ. కాశె బిగగట్టి యొరలూడ్చికత్తులు గొని
యాస్యరాగంబు లడుగంట నొడు గఱచి
మృత్యుభయమేది శింగంబుమీఁది కురుకు
జింకలటు నాసహోదరు లెనక నెంత్రు.

ఈయుధిష్ఠిరుఁడు నకులసహదేవులను సమీపించి వారి నిట్లు నివారిం చుచున్నాఁడు——

తే. గీ. నేనె నీచుఁడ దుర్మతి నేనె యిందు
విడువుఁడలుకను మీరు వివేకు లరయ
ద్యూతజనితావమానంబు నోర్వ కిట్లు
గెలుచువారిఁ దాకిన బలకీర్తి చెడదె.

ఇదిగో! గాంధారరాజు,

మ. అతిగర్వంబున నవ్వుఁ బాచికల నిట్టట్టుగా వెసం జిమ్ము స్వ
ప్రతిభన్ వైరులకీర్తి మాటికినిఁ గప్పంజూచు ద్యూతావమా
నితమై, దుఃఖితయైన ద్రౌపదిని దుర్నీతిప్రియుండైన యీ
కితవుం డెంతయుఁ గుత్సితంబైనజూడ్కిన్ మెల్లగాఁ జూచెడున్.

ఈద్రోణాచార్యపితామహులాదుద్రుపదపుత్రికం జూచి. లజ్జాయమానలయి మొగములమీఁద వస్త్రములువైచుకొని యున్నారు ఆహా! ఏమిదీనివర్ణాఢ్యత, ఏమిభావోపపన్నత, ఏమియీయుక్తలేఖత ఈచిత్రపటము మిక్కిలిలెస్సగా వ్రాయఁబడినది. సంతసించితిని ఎవఁడక్కడ?

కాంచు.—మహారాజ ! జయము !

దుర్యో.—బాదరాయణ! పక్షివాహనమాత్రముచేతనే విస్మితుఁడగునాదూతను దీసికొని రమ్ము.

కాంచు.—చిత్తము మహారాజ! (నిష్క్రమించుచున్నాఁడు.)

దుర్యో.—మిత్రుఁడ ! కర్ణుఁడ !

తే. గీ. పాండవులు పంప దూతయై వచ్చె నేఁడు
కృష్ణమతి యైనకృష్ణుండు భృత్యుఁడట్లు
చెవులు రెండును సిద్ధంబుఁ జేసికొనుము
మనయుధిష్ఠిరు నాడంగిమాటలు విన.

(అప్పుడు వాసుదేవుఁడు, కాంచుకీయుఁడుఁ బ్రవేశించుచున్నారు.)

వాసు.—ఇప్పుడు ధర్మరాజుశాసనముచేతను ధనంజయునియెడ నాకుఁ గల నిర్వ్యాజమైత్రిచేతను యుద్ధదర్పముగలవాఁడును జెప్పినమాట విననిపెంకెవాఁడు నగు దుర్యోధనునియొద్దకు నుచితమైనదూతభావమును వహించి నేను వచ్చినాఁడ.

చ. ద్రుపదతనూజ్మాధవపుత్రికాపరిభవోద్భూతంబు శత్రుక్షమాధిపసేనామదకుంభికుంభదళనోత్సేకంబు పార్థాస్త్రశస్త్రపటిష్ఠానిలచోదితంబు నగు నుద్యద్భీమకోపాగ్నిచే
విపులంబౌ కురువంశకానన మిఁకన్ వేగంబు దగ్ధం బగున్.

ఇదే సుయోధనుశిబిరము. ఇక్కడ,

సీ. క్షోణినాథులయిండ్లు సురపురంబులువోలె
మిగులరమ్యంబులై మెఱయుచుండు
నాయుధాగారంబు లతివిలాసంబు లై
నానాస్త్రశస్త్రసంతతుల వెలయు
కరిబృంహితంబులు తురగహేషలు గూడి
మందిరంబులయందు మారుమోఁయు
అధికశోభావంత మైయున్న దైశ్వర్య
మెంతవైభవ మున్న నేమిఫలము

తే. గీ. బంధుజననిరంతర పరాభవమువలన
నమ్మహాశోభయంతయు వ్యర్థమయ్యె
ప్రళయ మాసన్నమైన దీపార్థివులకు
గష్టుఁడై సదుర్యోధను కారణమున.

అహో !

ఆ. వె. శఠుఁడు దుష్టవాది సద్గుణద్వేషియు
స్వజననిర్దయుండు వంచకుండు
కార్యసాధకంబు దుర్యోధనుఁడు నన్ను
జూచి చేయఁడంచు తోఁచు మదిని.

ఓ బాదరాయణా ! రావచ్చునా !

కాంచు—ఆహా ! పద్మనాభుఁడు రావచ్చెను.

వాసు—(ప్రవేశించి) ఏమేమి ! నన్ను జూచి సర్వక్షత్రియులు సంభ్రమింతు లగుచున్నారు. సంభ్రమము వలదు. వలదు. మీరు స్వేచ్ఛగాఁ గూర్చుండుఁడు.

దుర్యో—ఏమిది ! ఏమిది ! కేశవునిజూచి సర్వక్షత్రియులు సంభ్రమింతులగుచున్నారా ? సంభ్రమము వద్దు. వద్దు. పూర్వము

నేను విధించినదండనమును జ్ఞప్తికిఁ దెచ్చికొనుఁడు. నే నాజ్ఞాపకుఁడను గానా ?

వాసు—ఓసు యోధనా ? కూర్చుంటివా ?

దుర్యో—(పీఠమునుండి క్రిందఁబడి తనలో) కేశవుఁడు వచ్చినట్లు స్పష్టమైనది.

తే. గీ. మతి నఖండితోత్సాహపూరితము జేసి
కొలువులో సమాహితుఁనై కూరుచుంటి
వాసుదేవునిమాయాపరిభావగరిమ
నాసనమునుండి చలియించి యవనిఁ బడితి.

అబ్బో ! యీదూత మహామాయుఁడు. (పరిహాసముగా) ఓ దూత ! ఆపీఠముమీఁదఁ గూర్చుండుము.

వాసు—ఆచార్య ! కూర్చుండుఁడు. గాంగేయప్రముఖులైన యోరాజులార ! మీరు యథేచ్ఛముగాఁ గూర్చుండుఁడు. మేమును గూర్చుండుదుము (కూర్చుండి) అహో ! యీచిత్రపటము దర్శనీయ మని తోఁచుచున్నది. కాదుకాదు, ద్రౌపదీకేశాకర్షణ మిందు వ్రాయఁబడినది. ఏమనవచ్చును—

మ. ఈదుర్యోధనుఁ డెంత బాలిశుఁడొకో యింతేని జెందందు ని
ర్వేదంబున్ స్వజనావమానము మహావిక్రాంతిగాఁ జూచెడున్
గాదే నెవ్వఁడు కొల్వులో స్వయమ యుద్ఘాటించు నేరీతి ల
జ్జాదూరుండయి యాత్మదోషములు పరిజ్ఞల్ వోలె నిశ్శంకతన్.

ఆ ! చాలు. ఈచిత్రపటము నిక్కడఁ దీసివేయుము.

దుర్యో—బాదరాయణ ! చిత్రపటముఁ దీసివేయుము.

కాంచు—చిత్తము. మహారాజ (అని దాఁచుచున్నాఁడు.)

దుర్యో—ఓదూత !

తే. గీ. ధర్మతనయుండు, వాయునందనుఁడు భీముఁ,
డమరపతిసూతి మాత్రమ్మఁ డర్జునుండు,
నతివినీతు లాయశ్వినీసుతులుకవలు
భృత్యతతితోడఁ గుశలు రే యెల్లవారు.

వాసు—ఇది గాంధారీనందనునకు యుక్తమే. ఆ! అందఱుఁ గుశలముగ నున్నారు. నీరాజ్యమందు శరీరమందు బాహ్యాభ్యంతరములయందు కుశలంబు నారోగ్యంబు నడిగి యుధిష్ఠిరాదు లైనపాండవు లిట్లు విజ్ఞాపనము చేయుచున్నారు—

ఆ. వె. అనుభవించినార మతిశయదుఃఖంబు
చెల్లిపోయెఁ బ్రతిన లెల్ల నేఁడు
ధర్మ్యమైనకరణి దాయభాగము మాకు
బంచిపెట్టుమయ్య పాడి యెఱిఁగి.

దుర్యో—ఎట్టెట్టూ! దాయభాగమా ?

ఉ. మాపినతండ్రి వేఁటఁ జని మౌనికి నెగ్గొనరించి కానలన్
శాపము వానిచేఁ బడసి శక్తిని గోల్పడె నాఁటనుండి యా
భూపతి కాంక్షమీఁద స్పృహ పోయెను బూర్తిగఁ, నే తెఱంగునన్
మాపినతండ్రి తండ్రియగు మాధవ ! యెవ్వరొ కన్నవారికిన్.

వాసు—పూర్వవృత్తాంత మెఱుఁగుదువు కావున నిన్నొక మాట యడిగెదను.

మ. క్షయరోగంబున మ్రిందినాఁడు విషయాసక్తిన్ బ్రవర్తించి భూ
దయితుం డయినవిచిత్రవీర్యుఁ డటమీఁదన్ వ్యాసమౌనీంద్రస
ద్దయచేతన్ ధృతరాష్ట్రుఁ డంబికకు మోదంబార జన్మించె నే
నయతన్ నీజనకుండు రాజ్యపదవిం బ్రాపింప నర్హుండగుఁ.

నీ వి ట్లనవద్దు,

తే. గీ. ఇట్టు లన్యోన్యవైరంబు వృద్ధి యైన
నామశేషమౌ కౌరవాన్వయము వేగ

గావున యుధిష్ఠి రాదు లేకరణిఁ గూర్మి
నడిపి రటు సేయఁ దగు రోష మడఁచి భూప!

దుర్యో—ఓదూత ! నీవు రాజ్యవ్యవహార మెఱుఁగవు.

మ. అరులన్ గెల్చి భుజింతురి రాట్సుతులు రాజ్యం, బెప్పుడున్ దానినె
వ్వరు యాచింపరు. వేఁడుయాచకున కెవ్వారిద్ది దానంబు సే
యరు,భూకాంక్షులెయున్నఁగెల్వుమనుమమ్మాలంబులోఁ,గానిచో
నరగం బొమ్మనుమా తపోవనులకున్ శాంతాత్ములై శుద్ధులై.

వాసు—ఓదుర్యోధన! బంధుజనులయెడల వాక్పారుష్యము జనదు.

ఆ. వె. పుణ్యవశముచేతఁ బొందంగఁ దగినట్టి
యధిక రాజ్యలక్ష్మి నధిగమించి
బంధుమిత్రజనుల వంచించు నెవ్వఁడు
వానిజీవనంబు వ్యర్థ మఱయ.

దుర్యో—

ఆ. వె. నృపుఁడు మేనమామ నీ కల్లకంసుండు
వానిమీఁదఁ గరుణ బూనవైతి
పాండుసుతులు మాకుఁ బరమాపకారులు
కరుణ వారియెడలఁ గలుగు టెట్లు.

వాసు—అది నాదోషమువల్ల కాదు.

తే. గీ. పరమసాధ్వి మాయమ్మను బాప మనక
పుత్రశోకార్తి వేమారు పొగులఁ జేసి
వృద్ధు జనకుఁ గారాగృహబద్ధుఁ జేసి
యతఁడు స్వయముగా మృత్యుచే హతము నొందె.

దుర్యో—నీవు కంసుని సర్వవిధముల వంచించితివి. ఆత్మస్తవ
మిఁక చాలును. అది శౌర్యము కాదు. చూడు,

తే. గీ. అల్లునిమృతికి దుఃఖసమాకులుఁ డయి
మండిపడి రోషవహ్నిచే మగధరాజు
వచ్చుతఱి భయాతురుఁడవై పాఱిపోతి
వీమహాశౌర్య మావేళ నెందుఁ బోయె.

వాసు—ఓసుయోధన ! నయమార్గప్రవర్తకులు దేశకాలావస్థలంబట్టి శౌర్యము నెఱపుదురు. మమ్ము పరిహసించుట నీ పటుండనిమ్ము. ప్రస్తుతకార్య మనుష్ఠింపుము.

తే. గీ. స్నేహ మన్నదమ్ములతోడఁ జేయవలయు
మఱువవలయు దోషంబులు మనుజనాథ !
బంధుసంబంధ మెపుడు శుభప్రదంబు
ఉభయలోకంబులం దిది యుక్తయంబు.

దుర్యో—

తే. గీ. దేవతలపుత్రికులతోడ నేనిధమున
గలియుఁ జుట్టఱికము మనుష్యులకు మాకు,
పిష్టపేషణ మైన దీవిషయ మింక
గ్రంథవిస్తరమును మాని కథ ముగింపు.

వాసు—(తనలో)

క. సామముచే బ్రతిమాలిన
నీమూర్ఖుఁడు నై జగుణము నించుక విడఁడీ
సామము విడి కఠినోక్తుల
తో మనసుఁ గలంచి వీనిఁ దొట్రిలఁ జేతున్.

(ప్రకాశముగ) ఓసుయోధన ! అర్జునునిబలపరాక్రమము నీ
కెఱుఁగవా ?

దుర్యో—ఎఱుఁగను.

వాసు—ఓహో! అటయిన వినుము,

సీ. మాయాకిరాతుఁడై మహికి వచ్చినశంభుఁ
బెనఁగి కయ్యమున మెప్పించినాఁడు
ఖాండవాశనుఁడైనచండ పావకునికై
యమ్ముల జడివాన నాఁగినాఁడు
వజ్రిశత్రివుల నివాతకవచులను జెల
రేఁగి మిత్త్రిపాల్ జేసినాఁడు
విరటుపట్టణమందు భీష్మాదులను నాఁడు
దురములో నొక్కఁడ తోలినాఁడు.

మఱియు నీవు ప్రత్యక్షముగా జూచిన మఱియొక వృత్తాంతముఁ జెప్పెదను.

తే. గీ. చిత్రసేనుండు నిను బట్టి చెఱనుబెట్టి
గగనవీథికిఁ గొంపోవఁ గావు మనుచు
నీవు మొఱపెట్ట గంధర్వ నిలిపి గెలిచి
కవ్వడియె ఘోషయాత్ర నిన్ గాచినాఁడు.

పలుమాట లేల, దుర్యోధన ?

క. నామాటలు విని యీఁ డగు
సామంబున రాజ్యమందు సగభాగము లే
దా మొఱసి సాగరాంతము
భూమండలమున్ హరింతురు వో పాండుసుతుల్.

దుర్యో—ఎట్టెట్టు ! పాండుసుతులు హరింతురా? ఓపరుషవచనదక్ష ! విను.

చ. అనిలుఁడు భీమరూపమున నయ్యనిఁ దాకెడుఁగాక పాకశా
సనుఁడె కిరీటిరూపమున సంగర మూనెడుఁ గాక పుచ్చకా
మ్మని యిడఁజుమ్మి గడ్డిపరకంతయు నీనుడిబట్టి పాండునం
దనులకు వీర్యగుప్తమును నాపితృభుక్తము నా స్వరాజ్యమున్.

వాసు—ఓకురుకులకలంకభూత దురాశాలుబ్ధ ! మేము గడ్డిపఱకలమాట లెత్తువారమా ?

దుర్యో—ఓగోపాలక ! నీవు గడ్డిపఱకలవాఁడవే.

తే. గీ. చంపఁ దగనట్టిస్త్రీని నశ్వమును జంపి
గోవులను మల్లుఱను నేలఁ గూలవేసి
చేరి భాషింప గోరెదు సిగ్గులేక
యవ్వర మావంటిపరమసాధువులతోడ.

వాసు—ఓసుయోధన ! న న్నధిక్షేపించెదవా ?

దుర్యో—ఆ ! నీవు మాటాడఁ దగినమనుష్యుఁడవు కావు.

మ. ధరణీనాయకలాంఛనంబైన స్వేతచ్ఛత్రిముం దాల్తు భూ
సురహస్తార్పితవారిసించితశిరస్కుండై నరారాజ నే
నరయన్ రాజ్యరమావిహీనుఁడవు నీవల్లాట మాతో నరా
సరి సంభాషణసేయఁగాఁదగవు కృష్ణా పొమ్ము వేవేగమే.

వాసు—అయ్యో ! దుర్యోధనుఁడు నాతో మాట లాడఁడా ?

తే. గీ. మూర్ఖ! బాంధవనిర్దయ ! మొండివాఁడ !
కాక ! కేకర ! పింగళ ! కలుషహృదయ !
కూళ వైననీకతమునఁ గురుకులంబు
అచిరకాలంబులోపల నంత మగును.

ఓహోహో ! రాజులారా ! వెళ్లుదము.

దుర్యో—ఏమి ! కేశవుఁడు పోవుచున్నాఁడా ? దుశ్శాసన ! దుర్మర్షణ ! దుర్ముఖ ! దుర్బుద్ధి ! దుష్టేశ్వర ! దూతమర్యాద నతిక్రమించిన కేశవునిఁ బట్టి బంధింపుఁడు. ఏమి మీరు పట్టుకొనఁజాలరా ? దుశ్శాసన ! నీవును సమర్థుఁడవు కావా ?

చ. కరిహయగోనిహంతయును గంసనిహంతయు నైననీఁడు సు
స్థిరముగ గొల్లయిండ్లుల వసించుట సేవకధర్మ మించుకే

నెఱుఁగడు దోర్బలంబు హరియించి నృపాలుసమక్షమం దిటుల్
పరుసము లాడినందునను బట్టుఁడు కట్టుఁడు కృష్ణు నందఱున్.

వీఁ డసమర్థుఁడు మామ ! నీ వీ కేశవుని బంధింపుము. ఏమి ! పెడమొగముతోఁ బడుచున్నాఁడు. కానీ, నేనే పాశములతోఁ గట్టెదను. (సమీపించుచున్నాఁడు)

వాసు—ఏమి ! బంధుపక్షపాతమున సంధి చేయఁ దలఁచి వచ్చిననన్ను సుయోధనుఁడు పట్టఁ దలఁచుకొన్నాఁడా ? కానీ, సుయోధనునిసామర్థ్యము చూచెదను. (విశ్వరూపమును ధరించుచున్నాఁడు)

దుర్యో—ఓ దూత !

మ. మఱిసారన్ బహుదేవమాయలును నీమాయల్ వినిర్మింతువో
యనివార్యంబగు దేవతాస్త్రసముదాయంబుం బ్రయోగింతువో
వనితాదంతితురంగగోహననలబ్ధఖ్యాతునిం భీరువున్
నిను భూపాలసమక్షమందుఁ ద్రుటిలోనే బట్టి బంధించెదన్.

ఆ! యిప్పుడు నిలునిలు. ఏమిది ? కేశవుఁడు కనుపడఁడు. ఇదుగో ! కేశవుఁడు. అహో ! కేశవుఁ డెంతఁబొట్టివాఁడు. ఆఁ దొఱకితివి. ఉండు. అయ్యో ! కేశవుఁడు మఱల కనుపడఁడేమి ? ఇదుగో ! కేశవుఁడు కేశవుఁ డింతపొడుగుగా నున్నాఁడేమి ? అయ్యో ! కేశవుఁడు కనుపడఁడేమి. ఏమైనాఁడు ? ఇదుగో కేశవుఁడు ఈమంత్రశాలలోఁ బ్రతిస్థలమందును కేశవుఁడె కనుపడుచున్నాఁడే? ఇప్పుడేమి చేయుదును. ఉపాయముకనుపడినది. ఓహోరాజులారా ! మీలో నొక్కొక రొక్క కేశవుని బట్టి బంధింపుఁడు. ఏ మిది? రాజులందఱు స్వయముగ పాశములచేఁ గట్టఁబడి నేలఁ బడుచున్నారే ? ఓరి ! మాయలమారి. మేలు ! మేలు !

శా. నావింటన్ వెలువడ్డకార్ముకతతుల్ నాటన్ మహాశోణిత
స్రావంబై తనువెల్ల నెఱ్ఱవడ చేష్టల్ దక్కి యుండంగ స్కం
ధావారంబును మెల్లఁ జేర్ప నిను భృత్యశ్రేణి యాపాండవుల్
నీవేసంబును జూచి యేడ్చెదరు సూ నిట్టూర్పులం బుచ్చుచున్.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

వాసు—ఔఁ గాక! పాండవుల కార్యము నేనే సాధించెదను. ఓసుదర్శనమ ఇటు రమ్ము.

(అంతట సుదర్శనచక్రము ప్రవేశించుచున్నది.)

సుదర్శ—ఇదుగో వచ్చితిని.

మ. వనజాతాక్షునిశాసనంబు విని తద్భవ్యప్రసాదంబునన్
ఘనమేఘంబులపజ్క్తి గెంటుకొని వేగన్ వచ్చి యున్నాఁడ నె
వ్వనిమీఁదం గమతోయలాక్షుఁ డిఁట గోపంబూని యున్నాఁడొకొ
వ్వనిమూర్ఘంబుపయిన్ విజృంభణ మొనర్పన్ నన్ను శాసించునో.

భగవంతుఁ డగునారాయణుఁ డెక్కడ నున్నాఁడో ?

తే. గీ. అచ్యుతుఁ డచింత్యుఁ డవ్యక్తుఁ డాదిపురుషుఁ
డఖిలలోకసంరక్షణోద్యతుఁడు నిత్యుఁ
డేకమూర్తియు మఱియు ననేకమూర్తి
వైరిబలనాశనుఁడు శ్రీనివాసుఁ డఱయ.

(చూచి) అహో ! యీభగవంతుఁడు హస్తినాపురద్వారము నందు దూతసముదాచారముచేత నిలిచి యున్నాఁడు.

నీ రెక్కడ దొరకును! నీరెక్కడ దొరకును భగవతీ ! ఆకాశ గంగ ! ఉదకమిమ్ము ? అదిగో స్రవించుచున్నది. (ఆచమించి సమీపించి) దేవ నారాయణ ! జయము జయము (నమస్కరించును)

వాసు—సుదర్శనమ! అప్రతిహతపరాక్రమము గలిగి వర్ధిల్లుదువుగాక!

సుద—అనుగ్రహింపఁ బడితిని.

వాసు—అదృష్టవశమున నీవు కార్యావసరమునకు వచ్చితివి.

సుద—ఏ మేమి కార్యావసరమా? దేవా! ఆజ్ఞాపింపుము. ఆజ్ఞాపింపుము.

తే. త్రిప్పుదును మేరుమందరోర్వీధరముల
గలచివై తును సకలసాగరచయంబు
రాల్తునో భువి నక్షత్రరాశినెల్ల
నీదుకృపగల్గ దుస్సాధ్య మేది నాకు. 44

వాసు—ఓసుదర్శనమ! యిటు రమ్మి. ఓదుర్యోధన!

మ. లవణాంభోనిధిఁ జొచ్చినన్ గిరిగుహల్ బ్రాపించినన్ జేరినన్
దివమందున్ గ్రహమార్గవాయుపథముల్ దివ్యప్రపంచంబు నా
హావదుర్వారమదీయబాహుబలయోగానంతశుంభజ్జవం
బవు నీచక్రము కాలచక్ర మయి నిన్నంతంబు నొందించుతన్.

సుద—ఓరోరి దుర్యోధనహతక! (అనితిరిగివిచారించి) నారాయణ! అనుగ్రహింపు మనుగ్రహింపుము!

క. అవనీభారము మాన్పఁగ
నవతారము దాల్చియుంటి యది సగము సగం
బవునటు లీగతిఁ జేసిన
నవతారశ్రమము వ్యర్థ మవుఁగాదె హరీ. 46

వాసు—సుదర్శనమ! రోషమువల్ల సముదాచారము చూడ లేదు. నీవు నీ నిలయమునకుఁ బొమ్మి!

సుద—భగవంతుఁ డగునారాయణుని యాజ్ఞాప్రకారము చేసెదను. ఎట్టెట్టు! త్రిచరణాతిక్రాంతత్రిలోకుఁ డైనయీనారాయణుఁడు గోపాలుఁడా? చాలు నాలు! మీ రందఱీతనిశరణము వేఁడుఁడు. నే నిఁకఁ బోయెదను. అహో! ఇదుగో భగవంతుని యాయుధశ్రేష్ఠమైన శార్ఙ్గ మిటు వచ్చినది.

చ. తనుమృదుసుందరాంగమయి దైత్యభయంకరమృత్యువై జనా
ర్దనకరధార్యమాణమగు రమ్యసుమధ్యము స్త్రీస్వభావమున్
గనకమయైకపృష్ఠమును గల్గినయీవిలు శార్ఙ్గమబ్బుపరి
క్కన విలసిల్లుశారిమ్మెఱుఁగుకై వడి కృష్ణునిపక్క నొప్పెడున్.

ఓహోహో! భగవానుఁడైన నారాయణుని రోషము పరిశాంతము జెందినది. నీవు నీనిలయముననకే బొమ్ము. ఆహా! మరలి పోవుచున్నది నేనును వెళ్ళెదను. అహో ఇదె కౌమోదకి వచ్చినదే! ఇయ్యది,

మ. అమలస్వర్ణమణీవినిర్మితముస్ఫాయచ్చితరిమాలోత్తరీ
యము, భూమీధరసానురూపము మహోద్యద్ధుర్నివారాతివీ
ర్యముయుద్ధంబులదైత్యనాశనమునందద్దాహమొంతేనగ
ణ్యముశీఘ్రింబుగనచ్చుచున్నదిది మేఘానీకసంయుక్తమై. 48

ఓకౌమోదకి! భగవానుఁడైన నారాయణునిరోషము పరిశాంతమైనది. అదేమరలి పోవుచున్నది. నేనునువెళ్లెదను. అహో! ఇదెపాంచజన్య మిటువచ్చినదే?

తే. గీ. హారచంద్రికుముద కుంద గౌరమగుచు
హరిముఖాబ్జపరిసాదంబు నందెడునిది
ప్రళయజలధిఘోషాభ మీపాంచిజన్య
రవము వినదైత్యసతుల గర్భంబులవియు. 49

ఓపాంచజన్యమ! భగవానుఁడైన నారాయణునిరోషము పరిశాంతమైనది. నీవు నీనిలయముననకే పొమ్ము. అదె మరలి పోవుచున్నది. అహో! నందకఖడ్గము వచ్చినదే.

తే. గీ. ఆలమునయందు స్త్రీరూప మవధరించి
యఖిలదానవలోకభయప్రద మగు
నీకృపాణి నభోవీథి నేగునపుడు
మెఱుపుఁదీవ తెఱంగున మెఱయుచుండు. 50

ఓనందకమ! భగవానుఁ డైననారాయణునిరోషము పరిశాంత మైనది. నీవు నీనిలయమునకుఁ బొమ్ము. అదే మరలి పోవుచున్నది నేనును వెళ్ళెదను. అహా! భగవంతుని యాయుధశ్రేష్ఠములు.

సీ. ఇది నందకకృపాణి యెక్కసక్కెము సేయు నిది,
నైజకాంతుల నినునిమూర్తి
ఇదియె కౌమోదకి యిది దైత్యకర్కశ
పీనవక్షంబులు పిండిసేయు
ఇది శార్ఙ్గచాపంబ యిద్దాసజ్యాధ్వని
ప్రళయాబ్దఘోషంబు పరిహరించు
ఇది పాంచజన్యంబ యిది శంబరాజంబు
గంభీరరవ మిందుకరధవళము.
తే. గీ. ప్రబలశార్ఙ్గ! కౌమోదకీ! పాంచజన్య!
దైత్యనాశనందక! శత్రుబావవహ్ని!
పరమపురుషుండు శాంతస్వభావుఁ డయ్యె
చనుఁడు మీరింక వేఁగ స్వస్థానములకు. 51

అన్నియు మరలి పోయినవి. నేనును వెళ్ళెదను. అహా! వాయువు మిక్కిలిగా వీఁచుచున్నది. సూర్యుఁడు మిక్కిలి వేఁడిగ నున్నాఁడు. పర్వతములు కదులు చున్నవి. సముద్రములు కలఁతఁ జెందుచున్నవి. వృక్షములు కూలుచున్నవి. మేఘములు పరుగెత్తు చున్నవి. వాసుకి ప్రముఖ భుజంగవల్లభులు క్రుంగిపోవు చున్నారు. ఇది యేమైయుండ వచ్చును? ఇదె! భగవంతుని వాహన మగుగరుడుఁడువచ్చుచున్నాఁడు.

తే. గీ. తల్లిదాస్యంబు విడిపింపఁ దలఁచి యితఁడు
దేవతల గెల్చి యమృతంబుఁ దెచ్చినాఁడు
నీకు వాహన మైయుండు నే నటంచు
దెచ్చి చక్రికి నొకవరం బిచ్చినాఁడు. 52

ఓ కాశ్యపప్రియపుత్ర! గరుడుఁడ! భగవంతుఁ డైన దేవదేవేశుఁడు ప్రశాంత రోషుఁడై నాఁడు. నీవు నీ నిలయమునకే పొమ్ము! ఆహా! మరలి పోయినాఁడు ఇంక నేను వెళ్ళెదను. నేనును బ్రికాశమాన మైన మేరుగుహను బ్రివేశించెదను

(నిష్క్రిమించుచున్నది)

వాసు—నేనును వెంటనే పాండవశిబిరము ప్రివేశించెద.

(తెరలో)

వెళ్ళవద్దు వెళ్ళవద్దు.

వాసు—అహో! వృద్ధరాజుస్వరము వలె నున్నది. ఓరాజ! నే నిక్కడ నున్నాఁడను.

(అంతట ధృతరాష్ట్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

ధృత—భగవంతుఁడైన నారాయణుఁ డెక్క డున్నాఁడు భగవంతుఁడైన పాండవశ్రేయస్కరుఁ డెక్కడున్నాఁడు. భగవంతుఁడైన బ్రాహ్మణ ప్రియుఁ డెక్కడున్నాఁడు? భగవంతుఁడైన దేవకీనందనుఁ డెక్కడున్నాఁడు.

క నాతనయుల యపరాధము
చేలను నీదుచరణసరసీరుహములపై
నాతలఁ జేరిచి మ్రొక్కెద
మాతప్పులు సైపఁ గదవె మానవసింహా! 53

(పడుచున్నాఁడు)

వాసు—హా! యెంతకష్టము పూజ్యుఁడీతఁడు నాపాదములపైఁ బడినాఁడె? రాజా! లెమ్ము లెమ్ము!

ధృత—దేవ! అనుగ్రహింపఁబడితిని. ఈ యర్ఘ్యపాద్యములు గ్రహింపుము.

వాసు—అంతయుఁ గ్రహించుచున్నాఁడను. వెండియు నీకేది ప్రియమో చెప్పుము ఇచ్చెదను.

ధృత—భగవంతుఁడు ప్రసన్నుఁ డగుచుండఁగా మఱియొక కోరిక యేమికావలెను?

వాసు—అట్లైన నీ వఱుఁగుము. పునర్దర్శన మయ్యెడుఁగాక!

ధృత—భగవంతుఁ డగునారాయణుఁడు సెల విచ్చినట్లే జరుగుఁ గాక!

(నిష్క్రమించుచున్నాఁడు.)

(భరతవాక్యము.)

క. జలనిధిపర్యంతంబై
వెలయుచు నేకాతపత్రభృత మై సీతా
చలవింధ్యకుండలం బగు
నిల ధృతి మా రాజసింహుఁడే లెడు గాతన్. 54

(అందఱు నిష్క్రమింతురు.)

# దూతఘటోత్కచము

(నాంద్యంతమందు సూత్రధారుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

సీ. త్రిభువనావన మహాదీక్షాప్రవీణుండు
ధర్మసంస్థాపనతత్పరుండు
అమిరవర్గంబులయాపద గడపుచో
నూర్జితసదుపాయయుక్తికరుఁడు
వరజగన్నాటకప్రస్తావనసమాపనంబులు
నేర్పుతో నడపునట్టి
సూత్రధారుఁడు మీకు శుభపరంపరఁ
గూర్చి రక్షించుఁగాక నారాయణుండు.

ఆర్యమిశ్రులతో నిట్లు విజ్ఞాపనము జేసికొను చున్నాఁడను. అహో! ఏమిది? నేను విజ్ఞాపనవ్యగ్రుఁడ నై యుండఁగా నేదో శబ్దము వలె వినఁబడుచున్నది. ఇదిగో చూచెదను.

(తెరలో)

ఓహోహో! ఈవిషయ మంతయు నివేదింపఁబడుఁగాక; నివేదింపఁబడుగాక!

సూత్ర—ఆహా! తెలిసినది. జనార్దనసహాయుఁడై ధనంజయుఁడు సంశప్తక సైన్యముమీఁదికి యుద్ధమునకుఁ బోయి యుండఁగా భీష్మవధామర్షితు లైనధార్త రాష్ట్రులచేత చుట్టుకొనఁబడి యభిమన్యుకుమారుఁడు వధియింపఁబడెను.

మ. అభిమన్యుప్రవిముక్త బాణవిశతుల్ స్వాంగంబుల న్నాట భూ
విభు లాదెబ్బల నష్టచేష్టు లయి యావివ్వచ్చుఁ డావేళ బ్ర
త్యభియానం బొనరించు నంచుఁ బలుమా ఱావంకఁ గన్గొంచుఁద
ద్గ భయం బందుచుఁ జొచ్చుచుండి రిదె స్వస్థానంబులన్ ఖిన్నులై. 2

(అని నిష్క్రమించు చున్నాఁడు.)

ఇది స్థాపన.

(అప్పుడు భటుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

భటుఁడు——పుత్రశతశ్లాఘ్యబాంధవుఁడును విజ్ఞాన విస్తారితవినయాచారదీర్ఘ చక్షుఁడును నగుధృతరాష్ట్ర మహారాజుగారి కీవృత్తాంతము నివేదింపఁబడుగాక! నివేదింపఁబడు గాక.

మ. ద్విరదస్యందనవాజియోధవధచే వేమారు కౌరవ్యదు
ర్భరసైన్యంబుఁ గలంచి బాలుఁ డగుసౌభద్రుండు దుర్వ్యూహసం
గరముం జేసి నృపాళి చుట్టుకొని తన్ గారింపఁగాఁ గూలి యా
యరు లానందము నొందఁ దాతతొడ పై నావీనుఁ డయ్యెం గటా!

అని నివేదింపఁబడు గాక!

(అప్పుడు ధృతరాష్ట్రుఁడు, గాంధారి, దుస్సల, ప్రతీహారి ప్రవేశించు చున్నారు.)

ధృత——ఓయీ ఓయీ! ఎట్టెటు.

తే. గీ. ఈశ్రుతిపథదూషణము నా కెవఁడు సలిపె
ప్రియ మనుచు నెవ్వఁ డింతయప్రియము దెలిపె
శిశువధాఖ్యమహాపాపచిహ్నితకురు
కుల వినాశంబు నెవఁ డిట్లు ఘోష చేసె. 4

గాంధారి——కులవిగ్రహము కేవలము పుత్రసంక్షయకారకముగాఁ గల దని మొదట తెలియలేదా?

ధృత——గాంధారీ! తెలుసును.

గాంధారి——ఎప్పుడు తెలిసినది?

ధృత——గాంధారీ! మొదటనే తెలిసినది. ఇప్పుడుజరుగునదివిను.

మ. హరి కేలన్ మునికోల పగ్గములు క్రోధావిష్టుఁ డై తాల్ప ఖే
చరులున్ బెగ్గిలఁగాఁ దనూభవవధాసం క్షుభ్యమానాత్ముఁ డై
వరగాండీవధనుస్సహాయుఁ డయి వివ్వచ్చుండు సల్పున్ భయం
కరకర్మం బటమీఁద నాశ మయి లోకంబెల్ల శాంతిం గనున్. 5

గాంధారి—హా! అభిమన్యుకుమారా! పౌత్రక! మాకు పలుమాఱు బాల భావనిమజ్జనము జేయు నీ విప్పు డెం దరిగితివి తండ్రీ. ఉత్తమపురుష క్షయకారకమైన యిట్టికులవిగ్రహము జరుగుచుండుటచే నిందు నిహతుఁడ వైతివా నాయనా!

దుస్సల—కోడ లైనయుత్తరకు వైధవ్యమహాదుఃఖ మిప్పు డెవ్వఁ డాపాదించెనో యతఁడు తనయునతీజనంబునకు వైధవ్యము స్వయముగాఁ గోరి తెచ్చుకొను చున్నాఁడు.

ధృత—ఈవ్యసనార్ణవమున కెవఁడు సేతువు గట్టును?

భటుఁడు—నేను.

ధృత—ఎవఁడవు నీవు?

భటుఁడు—నేను జయద్రథాతుఁడను గానా?

ధృత—జయద్రథా!

క. ఎవఁ డభిమన్యు గెడపె నా
హవమున నెవ్వనికిఁ బ్రాణ మప్రియ మయ్యెన్
ఎవఁ డీఁక దన దేహము పాం
డవపంచాగ్నులకు నింధనంబుగఁ జేయుఁన్.

భటుఁడు—మహారాజా! అభిమన్యుకుమారుని రణసమాగతు లైనరాజు లనేకులు చుట్టుముట్టి చంపిరి. కాని మనజయద్రథుఁడు నిమిత్తమాత్రుఁ డయ్యెను.

ధృత—ఏమేమీ! జయద్రథుఁడు నిమిత్తమాత్రుఁడయ్యెనా

భటుఁడు—మహారాజా! అట్లే.

ధృత—అయ్యో! జయద్రథుఁడు నిహతుఁ డైనాఁ డన్నమాటే.

దుస్సల—(విని యేడ్చు చున్నది.)

ధృత—ఎవ రాయేడ్చునది?

ప్రతీహారి — దేవా! అమ్మాయి దుస్సల.

ధృత — అమ్మాయీ! ఏడువకు మేడువకుము. చూడు.

క. నీమగఁ డిటు వైధవ్యము
నేమదిఁ గోరుకొని తెచ్చె నెంతో శ్రమతో
నేమన గాండివశరముల
కామూధుఁడు లక్ష్యమై స్వయముగా నిలిచెన్.

దుస్సల — నాయనా! కావున నాకిఁక సెలవిమ్ము. నేనిఁక మీఁద గోడలైన యుత్తరదగ్గరకు బోయెదను.

ధృత — బిడ్డా! ఏమినీతలంపు. ఎందుకు వెళ్ళెదవు.

దుస్సల — నాయనా! నాతలంపిది. ప్రస్తుతకాలోచిత మైన వేషమును ధరించుకొనియెదను.

గాంధారి — అయ్యో! కూఁతురా! అట్లమంగళము పలుకకే. నీభర్తబ్రతికి యున్నాఁడు.

దుస్సల — అమ్మా! అటువంటియదృష్టము నాకెట్లు బట్టునే. జనార్దన సహాయుఁ డైనధనంజయుని కప్రియము చేసి యెవఁడు బ్రతుకఁ గలఁడే.

ధృత — పాపము దుస్సల సత్యమేపలికినది. ఎందువల్లననఁగా

సీ. మృదుబాహు లనియెడు మెత్తలు దార్చిన
కృష్ణునంకమున వర్ధిల్లె నెవఁడు
మత్తుఁడౌ బలరాముచిత్తంబు నలరించు
రెండవమదమయి యుండు నెవఁడు
అమరవిక్రము లైన యలపాండవేయుల
ప్రణయంబునకు నెల్ల పాత్రమెవఁడు
అట్టి యాయభిమన్యు ననయంబున వధించు
ఖలుఁడింక జీవింపఁ గలుగునెవఁడు

జయతాశ్రిత! అట్టియవస్థలో నున్నకుమారునిం జూచి గాండీవధ్వని యేమిచేసెను?

భటుఁడు—మహారాజా! అది ధనంజయునియెదుట జరిగెనా?

ధృత—ఆసమయమున నర్జునుఁ డైన నచ్చట లేఁడా?

భటుఁడు—దేవా! అల్లే.

ధృత—సరే! అట్లయిన నది యెట్లు జరిగెనో చెప్పుము.

భటుఁడు—మహారాజా! అవధరింపుఁడు. జనార్దనసహాయుఁడైనధనంజయుఁడు సంశప్తకానీకంబులపై గవియఁబోవ నభిమన్యుండు బాలభావంబునఁ బరిమాదంబు గనిపెట్టలేక సంగరరంగముననుఱికెను.

ధృత—అట్లయిన నతనిచావు న్యాయమె. పులి యున్నగుహ పరివేశించి యెవఁడుబరితుకును? తక్కినపాండవులేమి చేయుచున్నారు

భటుఁడు—మహారాజా! వినుఁడు.

తే. గీ. ఏన్నృపాలకు లభిమన్యు నేసి రట్టె
యుర్విపులపేర్ళు జ్ఞాపకం బుంచుకొనుచు
తండ్రి యరుదెంచి చూచునందాక నతని
మేను చితిమీఁదఁ బెట్టుట మానినారు.

ధృత—గాంధారీ? సరేరమ్మా. గంగాకూలమునకు బోవుదము.

గాంధారి—మహారాజా! అందు స్నానము జేయుటకాయేమి?

ధృత—గాంధారీ! విను.

తే. గీ. స్వయముగాఁ జేసికొనినదోసమునఁ దెగిన
నీసుతులకు జలాంజలి నే నిడెదను.
సంగరంబును నే నాపజాల నున్న
నీజలపరిదానము జేసి తృప్తిఁగాంతు.

(అంతట దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, శకునియుఁ బ్రవేశించు చున్నారు.)

దుర్యో—వత్సా! దుశ్శాసన!

తే. గీ. పగ తీరం బయ్యె నభిమన్యువధముచేత
సంచలించిరి వైరులు జయము గలిగె,
వాసుదేవునకును గర్వభంగ మయ్యె
నభ్యుదయశబ్ద మిన్నాఁటి కమరెనాకు.

దుశ్శా—అహో!

మ. అరికట్టెం గద సింధురా జలుఁచి సైన్యంబెల్ల కౌంతేయులం;
బరఁగన్ రెండవఫల్గునుం డయినసౌభద్రుం బడం గూల్చి బం
ధుర మా శోకశరంబు నాటితిమి శత్రుక్షోణినాథాత్మలన్
సురవంద్యుం డగుభీష్ముఁ డీల్గిన మహాశోకంబు డిందెన్ మదిన్.

శకుని—

మ. ఘనకార్యంబొనరించె సైంధవుఁడు సంగ్రామంబునం దిప్పు డీ
తనిచో నింతటి తేజ మున్న దనుచున్ ధాత్రీశు లూహింపలే
దనుఁగుంబట్టి హరించెగా నిరుపమం బైనట్టి సత్కీర్తితో
నని కౌంతేయులకున్ జయప్రథుఁడుచేయన్ రాని దేముండెడున్.

దుర్యో—మామా!

శకుని—అబ్బాయీ! యెందుకు?

దుర్యో—మామా! యిటు రమ్ము. వత్స! దుశ్శాసన! యిటు రమ్ము. పూజ్యులైన తండ్రిగారికి నమస్కారము చేయుదము.

శకుని—వత్స! దురోధన! అట్లుచేయవద్దు. ఏలయన;

ఉ. ఈకులవిగ్రహం బితని కిష్టము కానిది పాండవప్రియుం
డీకురునాయకుం డగుట నెల్లర నింద యొనర్చు కోపి యై

యీకలహంబునన్ విజయ మేర్పడఁ గాంచి పరిహృష్టులైనమీ
రీకరణిం జనం దగునె యిష్టము లేనినృపాలుపాలికిన్.

దుర్యో—మామా! అట్లు కాదు. ఏది యెట్లైనను సరే పూ
జ్యులైన తండ్రిగారి కభివాదము సేయుదము.

(అని నడుచు చున్నారు.)

దుర్యో—తండ్రీ! నేను దుర్యోధనుఁడను అభివాదము సేయు
చున్నాఁడను.

దుశ్శా—తండ్రీ! నేను దుశ్శాసనుఁడను. అభివాదము సేయు
చున్నాను.

శకుని—నేను శకునిని. అభివాదము సేయుచున్నాను.

అందఱు—ఏమిది! ఆశీర్వాచన మనుగ్రహింప లేదు.

ధృత—కుమారా! ఏమి! ఆశీర్వాచనమా?

తే. గీ. కృష్ణపార్థులహృదయ మైవృద్ధిఁ గనిన
బాలుఁ డభిమన్యుఁ డనిలోనఁ బడినకతన
ప్రాణములమీఁద నాసలు వదలుకొన్న
చెనఁటులకు మీకు గురులయాశీస్సు లేల?

దుర్యో—నాయనా! నీ కీసంభ్రమ మెందుకు?

ధృత—ఈసంభ్రమ మెందుకా?

క. పలువురుకొడుకులు గలయీ
కులమున జనియించె నొక్కకూఁతు రది తనూ
జులకన్నన్ గుణవతి యా
మెలఁతకుఁ వైధవ్య మొదవె మీ దయచేతన్.

దుర్యో—ఇప్పుడు జయదర్థున కేమి?

ధృత—అనవిద్యునిచేత పాండవు లరికట్టఁబడినారు కదా?

దుర్యో—అతనిచేతనా అరికట్టఁబడుట? ఇతరు లనేకులచేత,

ధృత—హా! కష్టము.

తే. గీ. దండిమగ లైనపలువురు దయ దొలంగి
శూరుఁ బసివాని నొక్కని జుట్టుముట్టి
కటకటా! కొట్టి చంపి రా కలుషమతుల
పాడుచేతులు పడిపోవ వలదె చెపుమ.

దుర్యో—తండ్రీ !

తే. గీ. భీష్ము నతివృద్ధు మిషబెట్టి పిల్కుమార్చు
వారిచేతులు పడిపోవ వలదె చెపుమ
ఆతని సబాలవిక్రమ మాహవమున
బొడుచు మాచేతులే పడిపోవవలెనె.

ధృత—ఏమీ! భీష్మపతనముతో నభిమన్యువధ సమానమా?

దుర్యో—నాయనా! ఎందుకు సమానముకాదు.

ధృత—అబ్బాయీ! విను.

ఉ. తనకుం జావగురీతి శత్రువులకుం దానే యెఱింగించి యీ
లైను స్వచ్ఛందమృతుండు తుష్టుఁడయి గాంగేయుండుసత్కీర్తినం
దినయీబాలకుఁ డన్ననో కురుకులాధీశుండు దుర్వారుఁ డ
ర్జునభూజపరిఘ మపరివాళ మకటా! దుంపంబడెం గ్రూరతన్

దుశ్శా—తండ్రీ! అభిమన్యుఁడు బాలుఁడైనను విక్రమమున బాలుఁడు కాఁడు.

ధృత—ఆమాట లాడుచున్న వాఁడు దుశ్శాసనుఁడా?

దుశ్శా—అవును.

మ. కనులారం గనుఁగొంచు మేము రణముం గావించు చున్నప్పుడే
ఘనవజ్రాయుధతుల్య మైనవిలు నొక్కం డూని శత్రుప్రమ
ర్దనుఁడై భానుఁడు తీవ్రమౌ కిరణసంతానంబుతో మాడ్చులా
గున భూపాలుర నెల్ల వేఁచెఁ దనయల్లుల్ నాటి నెమ్మేనులన్.

ధృత—అహో! ఎంతకష్టము!

తే. గీ. బాలకుం డైన పట్టిసౌభద్రు( డాకడ
ఎంత లెంతలో వెఱ( గంద సింతచేసె
దారుణతనూజశోకసంతప్తు( డైన
యర్జునుం డేమి చేయునో యాజి మనల.

దుర్యో—ఏమి చేయును?

ధృత—ఏమిచేయునో యతనిచేత బడకుండ నాయుశ్శేష
ము గలిగి బ్రితికినవారు చూడ(గలరు.

దుర్యో—ఎవ( డాయర్జునుఁడు.

ధృత—అర్జునుని( గూడ నెఱు(గవా?

దుర్యో—ఎఱు(గను.

ధృత—అట్లయిన నేను నెఱు(గను. కాని యర్జునబలవీర్య
ముల నెఱి(గినవా రనేకులు కలరు. వారి నడుగుము.

దుర్యో—తండ్రీ! అర్జునబలపరాక్రమముల నెఱి(గినవారు నే
నడుగ(దగినవా రెవరున్నారు?

ధృత—కుమారా! వినుము.

సీ. త్రైలోక్యవిభు నివాతకవచపారిశోపహా
రార్చితుని వృత్రహంత నడుగు
బహువిధాస్త్రములచే( బరితోష మొందిన
దంభకిరాతుని శంభు నడుగు
ఖాండవ వనమందు( గడుపాఱ( బన్న
గాహుతులు మెక్కినవీతిహోత్రు నడుగు
నీనిమిత్తము పోర నిర్జింప(బడిన గంధర్వ
నాయకుని చిత్రరథు నడుగు.

దుర్యో—అర్జునపరాక్రమ మంతగొప్ప దైనపక్షమున నర్జు

నుసకుఁ బ్రతియోధుఁడై నిలుచువీరుఁడు మనబలంబున లేఁడా?

ధృత—కుమారా! అట్టివాఁ డెవ్వఁడు?

దుర్యో—అట్టివాఁడు కర్ణుఁ డొక్కఁడె.

ధృత—అహో! ఎంతనగుబాటు. కర్ణుఁడు వట్టినిర్భాగ్యుఁడు.

దుర్యో—ఎందుచేత ?

ధృత—విను.

మ. అమరేంద్రుండు హరించెజోడు కడుమాయన్నేర్పుటన్ నిష్ఫల
త్వము జెందెన్ విలుఁవిద్దె; యర్ధరథుఁ డత్యంతపరిమాదుండునుం
జుమి రాధేయుఁడు వాఁడు ఫల్గునునకున్ జోడౌనె యింద్రాగ్నిదే
వమహాదేవులు శస్త్రదానగురులై వర్తింతు రాక్రీడికిన్.

శకుని—మమ్ముమ్మ జీవాట్లు పెట్టుటకు మీరు సమర్థులు.

ధృత—ఓహో! ఆమాట లాడువాఁడు శకునియా?

క. ఓరోరీ! ద్యూతకళా
పారగ! నీవు దరిక్రొల్పు వైరానలమే
యూరక యీకులమునఁ బసి
వారలసయితంబుఁ గాల్చివైచెడుఁ జుమ్మీ.

దుర్యో—అహో! ఏమిది?

తే. గీ. ధరణి చలియించె గొప్పశబ్దంబు పుట్టె
గగనమండలి మండెడు కరణిఁ దోఁచె
పృథివి రాలెడునుల్కలపిండుచేత
నీనిమిత్తముల్ బొడముట కేమి కతము.

ధృత—కుమారా! నే నిట్లనుకొనియెద.

క. మనుమనిమృతికిన్ వగచెడు
ననిమిషనాయకునిలోచనాశ్రుకణంబుల్
పెనగొని యుల్కారూపం
బున నీగతి రాలఁదొడఁగె భూమండలిపై.

దుర్యో—జయతాత్రిత! పాండవశిబిర మందు శంఖపటహాసిం హనాదమిశ్రిత మైనశబ్దము వినఁబడు చున్నది. అందుకుఁ గారణ మేమో నీవు పోయి కనుఁగొనిరమ్ము.

భటుఁడు—దేవా! చిత్తము (అని నిష్క్రమించి మరల బ్రవేశించి) మహారాజ! సంశప్తకానీకము పై నరిగినధనంజయుండు మరలి వచ్చి రణనిహతుఁడై నకుమారుని నభిమన్యుఁ దొడమీఁద నిడుకొని కన్నీట నాతనిం దడుపుచు జనార్దనప్రేరితుండై మహాప్రతిజ్ఞఁ జేసెను. ఆశబ్దమిది.

దుర్యో—ఏమని యేమని!

భటుఁడు—

సీ. అతనియుత్సాహంబు నాతనివ్యవసాయమును
మెచ్చిముదముచే మోము లలర
విజయుఁడే గాంచును విజయంబు ననిపేర్చి
కోలాహల మొనర్పఁ గుతలపతులు
కొండలవ్రేఁగున గ్రుంగెనో యనధాత్రి
మూఁగినరాజులవ్రేఁగుచేత
సంభ్రమాగత మైనజవరాలుచెలువున
గంపింపఁదొడగె నాక్షణమునందె.

ధృత—

క. ధాత్రి చలించె ప్రతిజ్ఞా
మాత్రముచేత నిటు దండిమగఁ డగునాను
క్షత్రియుఁడు విల్లుఁ గొన లో
కత్రయమును వెఱఁగుఁ జెంది గడగడ వడఁకున్.

దుర్యో—అతఁ డేమని ప్రతిజ్ఞఁ జేసినాఁడు!

భటు—దేవా! ఇట్లు,

క. ఎవ్వఁడు నాసుతుఁ గూలిచె
నెవ్వరు నాకొడుకుమృతికి నెద మోదిలిరో
యవ్వారిం దునుమాడెదఁ
గ్రొవ్వడఁగఁగ రేపు ప్రొద్దు కుంకకమున్నే.

దుర్యో—అట్లయిన బ్రతిజ్ఞావ్యాఘాతనమునకై బ్రయత్నము జేసెదను.

ధృత—కుమారా! ఏమి చేసెదవు?

దుర్యో—అయ్యా! సర్వాక్షౌహిణీసందోహముచేతను జయద్రథుని గప్పి పుచ్చెదను. మఱియు,

తే. గీ. అరికి దుర్భేద్య మైనవ్యూహంబు నొకటి
గురుని యుపదేశబలమునఁ గూర్చువాఁడఁ
బ్రతిన నెఱవేర్చుకొనలేక పడుదు రగ్ని
భటులతోడ నేన్గులతోడఁ బాండుసుతులు.

ధృత—

తే. గీ. క్షోణిగర్భంబునందు దాఁగుదురు గాక
బెదిరి యానభోవీథి కెక్కుదురు గాక
కృష్ణలోచనుఁ డైనయాకిరీటి యేయు
శరము లెల్లెడఁ జొచ్చి నాశనముఁ జేయు.

భటుఁడు—

క. ఆరీతిని గ్రూరుం డగు
నీరాజును జాలి దలఁచి యెవ్వం డేనిన్
నేరక్షించెద నన నా
పూరుషునకుఁ గూడ లేదుపో బ్రతుకింకన్.

అనియు నతఁడు ప్రతిజ్ఞఁ జేసెను.

(అప్పుడు ఘటోత్కచుఁడు పరివేశించు చున్నాఁడు.)

ఘటో.—

మ. అని సౌభద్రవినాశచోదకు ననార్యకూరచేతస్కు దు
ర్జను నీక్షింపఁ దలంచి వచ్చితిని విశ్వాసంబుతో నే జనా
ర్దనునాజ్ఞన్ శిరసావహించి మదమాతంగంబు చిత్తంబునం
దనయం బంకుశభీతి జేరు గతి గమ్యస్థానమున్ శీఘ్రతోన్.

(క్రిందికిచూచి) ఇది యితరులు పరివేశింపఁ దగినద్వారముఖము. ఇక్క
డ దిగిమెద. (దిగి) నన్ను నేనె యెఱిఁగించుకొనియెదను.

మ. హరి నన్నంపె ఘటోత్కచుండ వినుఁడీ హైడింబుడన్ స్వీయదు
ష్కరకృత్యంబుల శతురైనగురులం గన్గొంటకున్ వచ్చితిన్-

దుర్యో.—

త్వరగా రమ్మ విరోధియిల్లిదె కడున్ సంతోష మా నాకు సు
స్థిరుఁ డైయుంటి సుయోధనుండ హరిసందేశం బెఱింగింపవే?

ఘటో.—(పరివేశించి) అహో! ఇదిగో పూజ్యుఁ డైనధృత
రాష్ట్రుఁడు. ఏమి యీయనలలితగంభీరాకృతివిశేషము?

మ. కడువృద్ధుం డయి యున్న లేవు ముడుతల్ గంభీర మాకారముం
గొడుకుల్ నూరుగు రుండుటన్ వెలసెడుం బుంభావధైర్యం బనం
గడిమిం గన్గొని వేలుపుల్ త్రిదివరత్నాశంకచే వీని నే
ర్పడ జాత్యంధుని జేసి యుందు రనుచుఁ భావించెదన్ నెమ్మదిన్.

పితామహా! అభివాదము చేయు చున్నాఁడు ఘటోత్క—
కాదు, కాదు. నాజనకు లైనయుధిష్ఠిరాదులు నీ కభివాదము సేయు
చున్నారు. పిమ్మట నేను ఘటోత్కచుఁడ నభివాదము సేయుచున్నాఁడ

ధృత—పౌత్ర ! రమ్మ రమ్మ.

తే. గీ. ఎదను భ్రాతృదుఃఖంబు నిన్నేచు చుంట
నిప్పు డిట్టిమర్యాద నా కింపు గాదు

నీవు వచ్చినపనియేమొ నే నెఱుఁగను
కృపణుఁడను నేను సుతులదుష్కృతము కతన.

ఘటో—అహో! పూజ్యులైనమీరు కళ్యాణవంతులు. భగవానుండైన చక్రాయుధుఁడు కళ్యాణపరంపరానిలయుఁడైనమా పితామహునితో నిట్లు చెప్పు మనియె.

ధృత—(ఆసనమునుండి లేచి) భగవానుఁడు చక్రాయుధుఁడే మని యాజ్ఞాపించు చున్నాఁడు?

ఘటో—వద్దు. లేవవద్దు. ఆసనమునుండి లేవకయే జనార్దన సందేశము విన వచ్చును.

ధృత—భగవానుఁడు చక్రాయుధుఁడాజ్ఞాపించినట్లేచేసెదను
(అని కూర్చుండును.)

ఘటో—తాతా! విను. హా! వత్స! అభిమన్యుఁడ! హా! కురుకులప్రదీప! హా! వత్స! యదుకులప్రవాళ! నీజననీసోదరుఁడైన జనార్దనుని నన్నును విడనాడి పితామహదర్శనాభిలాషచే స్వర్గమున కరిగితివా? తాతా! ఏకపుత్రవినాశమువలన నర్జునున కిటువంటియవస్థ సంభవించినదిగదా ఇకనీయవస్థయెట్లు కాఁగలదో. కావున బుత్రశోకసముద్భూతమహాగ్నిహారిణమయహవిస్సును దహింపకుండు నట్టు లాత్మబలాధానము జేసికొమ్ము.

ధృత—

క. కోపావిష్టమనంబున
నీపలుకులు పలికి యుండు కృష్ణుం డకటా
ఆపార్థుఁ డింక సర్వమ
హీపాలవధంబు సేయు టేఁ గనుఁగొందున్.

దుర్యో—ఈపలు కెంతహాస్యాస్పదముగ నున్నది.

ఘటో—ఇందు హాస్యాస్పద మే మున్నది?

దుర్యో—ఆమాటే హాస్యాస్పదము.

తే. గీ. పార్థుఁ డొక్కనిచేతనే పార్థివేంద్ర
కుల మశేషంబుగా నేలఁ గూలుటకును
మంతనము సేయఁబోలును మత్సరమున
దేవతలతోడ నావాసుదేవుఁ డిపుడు.

ఘటో—

క. పనిచినయాతఁడు కృష్ణుఁడు
వినిపించినవాఁడ నేను వినునది విశ్వ
చ్ఛనివిక్రియుంబు నిహిహీ
యని నవ్వెడువాఁడ వీవ యది తగు నీకే.

మఱియు, జనార్దనునిసందేశము నీవుఁ గూడ వినఁదగినది.

దుశ్శా—ఓక్షత్రియాపమానీ! వద్దు. చెప్పవద్దు.

తే. గీ. ఎవనిశాసనం బవనియం దెల్లనృపులు
మౌళిఁ ధరియించు చుందురు మా ల్వాలుకక
యట్టి. రారాజుసన్నిధి నన్యజనుల
వ్యర్థసందేశములు విన వలనుపడదు.

ఘటో—ఔరా! ఏమి! చక్రాయుధుఁడు మీకు రాజు కాఁడా!

సీ. అలజరాసంధుచే నవమానమును గన్న
నృపకోటి విడిపించెఁ గృప నెవండు
అవనిపుల్ గన భీష్మహస్తంబునుండి
యర్థాంగి రుక్మిణి నెవ్వఁ డాఁచుకొనియె
శ్రీవత్సశయ్యాగృహావాస మై లక్ష్మి
సుముఖి యై యెవనివక్షమున నిలుచు
నట్టిరాజులరాజు హరి చక్రపాణి
నారాయణుం డహా! నీకు రాజు గాఁడె.

దుర్యో—దుశ్శాసనా ! వివాదము వద్దు.

క. బలవంతుఁడో బలహీనుఁడో
యిలాపతియొ కాఁడొ కష్ణుఁ డెవఁడో యొకఁడా
పలుమాటలతో నేమిటి
పలుకుము నీపరిభవరుండు వలికినపలుకుల్.

ఘటో—ఔ నౌను. పూజ్యుఁ డైనయానారాయణుఁడు నిశ్చయముగఁ ద్రిలోకపరిభువు. విశేషించి మాకు పరిభువు. మఱియు,

తే. గీ. పరిశయ మాసన్న మైనది పార్థివులకు
వసుధ తేలిక యా క్షత్రభార మెడలి
యీశ్వరునిమీఁదనే ధను వెత్తినట్టి
క్రీడి కెదు రెవ్వఁ డిఁక పుతరిమృతికతమున.

శకుని—

క. పలుకులచేతనె యీభువి
గెలువంబడు నేని మనము కృతకృత్యుల మే
చులకనగ మాటమాటకు
పలువురు భూపతులు చచ్చి పడుదురు గాదే.

ఘటో—అరే! అరే? ఇదిగో శకుని మాట్లాడు చున్నాఁడే.

తే. గీ. పాచికల నింక నావలఁ బాఱవైచి
మేలియమ్ములు గొని రమ్మి యాలమునకు
దారహరణంబు రాజ్యతంత్రి మిట లేవు
పణము పాణింబు బాణలబ్ధములు సిరులు.

దుశ్శా—ఆహా! ఏమి యాపరిమోగకౌశలము. అరే! అరే యని శకుని విషయ మై వాడవచ్చునా?

ఉ. సీ! దనుజుండ పేరిలెదవు చేతులు బారలు చాపుకొంచు మ
ర్యాద నతికరిమించి యెదురం గలవారి గణింప వింతయున్

నీదెస మాతృభూత మగునిశ్చలరాక్షసదర్ప మున్నచో
మాదెసఁ గూడ నన్నవినుమా దనుజేంద్రులరౌద్రభావముల్.

ఘటో— పాపము శమించుఁగాక పాపము శమించుఁగాక!
మీరు రాక్షసులకన్నను మహాక్రూరులు. ఎందుచేత నన,

చ. దనుజులు సప్తసోదరుల దగ్ధము సేయరు లక్క యింటిలో;
దనుజులుఁ గూడ సోదరులదారల నీడ్వరు కొప్పుపట్టి యీ
దనుజులు సైతమున్ సుతవధం బొనరింపరు యుద్ధభూములన్
దనుజులు ఘోరకర్ము లయినన్ దయ మీవలె వీడ రెన్నఁడున్

దుర్యో—

క. దూత వయి నీవు వచ్చితి
మాతో బోరుటకు గాదు మాసందేశం
బీతరి గొని సరగం జను
దూతల వధియింపలేము దోసము గానన్.

ఘటో— ఏమేమి ? దూత యని నన్నసమానించు చున్నా
రా ? అట్లు చేయవద్దు. నేను దూతను కాను.

క. చాలింపుఁడు మీకోతలు
కోలలతో గొట్ట రండు గుమిగూడి నన్
బాలుం డభిమన్యుఁడు గాఁ
డాలములో నారిఁ ద్రెంచి హతుఁ జేయుటకున్.

మీతో బోర వలయు నని బాల్యచాపలప్రేరిత మైనమనోరథ
మెంతో గలదు. మఱియు

తే. గీ. అడరి పిడికిలి పై కెత్తి యీడు గలచి
యుత్కటముగ నున్నాఁడు ఘటోత్కచుండు
యమపురికి బోవునభిలాష యాత్మ గలుగు
దండిమగ లున్నయెడ వేగ రండు రండు.

ధృత—పౌత్రికా ! ఘటోత్కచా! శాంతింపుము. శాంతింపుము. నామాటవినుము.

ఘటో—ఈరోషము భరింపఁజాల కున్నాను. అయినను బితామహవచనమువలన దూతభావము ధరించుచున్నాను. ఆనారాయణునితో నేమని విన్నవింపుదును.

దుర్యో—ఆహా! ఎవనికోయి విన్నవించుట ! నాపలుకులుగ నతనితో నిట్లుచెప్పు.

సీ. వ్యర్థపరిలాపముల్ పలు సేయ నేటికి
పారుష్యమున జక్కఁబడము మేము
స్వల్పవాక్కుల కేల యధికప్రసంగముల్
జరుగ నున్నది గదా సంగరంబు
రాజన్యశతము ఛత్రములఁ జేతులఁ
దాల్చి వచ్చును వెంట నే బయలువెడల
పాండుపుత్త్రులఁ గూడి జవరంబునకు
రమ్మని పరిత్యుత్తరం బిత్తు బాణములను.

ఘటో—పితామహా ! ఇదిగో వెళ్ళుచున్నాము.

ధృత—నాయనా ! వెళ్ళు వెళ్ళు.

ఘటో—ఓహోహో ! రాజులారా ! మీ రందఱు వినుండు. జనార్దనునికడపటిసందేశ మిది.

మ. సుమతిః ధర్మము సేయుఁడీ విడువుఁడీ చుట్టాల పై నాస దేని మదిం జేయఁగ గాంక్ష యున్నదియొదానిం జేయుఁడీవేగఁరోసముతో బాండవరూపధారి యయి శస్త్రం బూనివచ్చుఁజుమీ శమనుం డెల్లి ప్రభాతకాలమునకున్ జాత్యోపదేశం బటుల్.

(అందఱు నిష్క్రమించు చున్నారు.)

సమాప్తము.

# ఊరుభంగము.

నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.

సూత్ర—

సీ. "కుంభజగాంగేయకూలంబు, సైంధవ
జలము, గాంధరరాజహ్రదంబు
కర్ణకృపద్రోణికల్లోలమకరంబు
స్ఫురితదుర్యోధనస్రోతసంబు
శరధనుస్సికత మా శత్రువాహిని,
బార్థుఁ డేయుడుపంబును నెక్కి దాటు
నాహరి శత్రుసందోహంబుఁదరియించు
నెడ మీకుఁదెప్పయైయొసఁగుఁగాక"

ఆర్యమిశ్రులతో నిట్లు విజ్ఞాపనము చేసికొను చున్నాఁడను. అహో! ఏమిది? నేను విజ్ఞాపనవ్యగ్రుఁడనై యుండఁగా నేదోశబ్దము వలె వినఁబడు చున్నది. చూచెదఁ గాక!

(తెరలో)

ఓహో! ఇదె మేము వచ్చితిమి; ఇదె మేము వచ్చితిమి.

సూత్ర—ఆ! తెలిసినది: తెలిసినది.

(అప్పుడు పారిపార్శ్వకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

పారి—బావా! ఏ రెక్కడనుంచి వచ్చు చున్నారు?

సీ. అమరలోకాసక్తి నాహవముఖమున
దేహహోమము సేయఁ దివురువారు
మహితనారాచతోమరశతంబులచేత
విషమీకృతాంగులై వెలయువారు

దృ_క్తదంతావళీదీ ర్ఘదంతములచే
నొరిసిన దేహంబు లొలయువారు
అన్యోన్యవీర్యశోధాయ_త్తనికషణుల్
తిరుగు చుండిరి వీరపురుషు లిందు.

సూత్రి—మారిషా ! తెలియలే దా ? ధృతరాష్ట్రపక్షము తనయశతశూన్యంబై దుర్యోధనావశేషం బగుటయు యుధిష్ఠిరపక్షము పాండవజనార్దనావశిష్టం బగుటయు సమంతపంచకము రాజశరీరసమాకీర్ణం బగుటయు

మ. అని దుర్యోధనభీమసేనులకు నేడా చుండుటం జేసి చ
చ్చినయేనుంగులు జోదులుల్ నృపులు తేజీల్ గల్గి భూపాలమా
రణగేహం బయి కీర్ణలేఖ్య మగుచిత్రింబట్లు భాసిల్లు నీ
ఘనసంగ్రామతలంబుజొచ్చెదరు వేడ్కన్ యోధులొక్కుమ్మడిన్.

(ఇద్దఱు నిష్క్రమించు చున్నారు.)

(ఇది స్థాపన)

(అప్పుడు ముప్వురుభటులు ప్రవేశించు చున్నారు)

అందఱు—ఓహో! ఇదె మేము వచ్చితిమి; ఇదె మేమువచ్చితిమి.

ప్రథముఁడు—

సీ. వైరంబు దెగుచోటు బీరంపునికషంబు
శౌర్యమానప్రతిష్ఠాగృహంబు
ప్రాణహోమము సేయు పరమయజ్ఞంబు
భూవిభుల పశ్చిమకాలవీరశయ్య
అప్సరోంగనలస్వయంవరభవనంబు

స్వర్గసంక్రమణంబు క్షత్రియులకు
సంగ్రామ మనెడునాశ్రమపదం బద్దాని
బ్రాపించినార మీపట్లమనము.

ద్వితీయుఁడు—నీవుచక్కఁగా జెప్పితివి చూడు.

సీ. దృప్తదంతావళదేహశైలంబులు విల
సిల్లు పృథుశిలావిషమములయి
రథకు లీల్గినశూన్యరథములు గ్రిద్దల
కిరవు లై యున్నవి యెల్లదెసల
నతిలోకమైనశౌర్యముజూపి తెగటార్చి
పగతుర నిహతులై పడిరినృపులు
అవనినాథులనెల్ల నమరలోకము జేర్చెగద
క్రియామరణ మహా కదన మిట్లు

తృతీయుఁడు—అది యట్లె.

మ. శరముల్ దర్భలు; మత్తభద్రగజహస్తంబుల్ మహాయూపముల్;
చిరవైరంబులు వహ్ని; లాహతగజశ్రేణుల్ కనద్వేదికల్ ;
ధరణీనాథులసింహనాదములు మంత్రింబుల్ ; గతప్రాణులౌ
నరు లెల్ల బశు లీగతిన్ జరిగె సంధాయజ్ఞ, మీతావునన్.

ప్రథముఁడు—మీ రిద్దఱిటు చూడుఁడు.

తే. గీ. ఒండొరులబాణములు దాఁకి యొడలు విడిచి
ప్రోలికలన గూలి యున్నయీభూమిపతుల
నగలు పిశితార్థిముఖము లౌఖగము లెల్ల
నవని బడ వైచుచుండె దేహములనుండి.

ద్వితీయుఁడు—

తే. గీ. విశిఖనిహత మై కవచంబు విడిచి పడిన
యీమదేభంబు ఘోరసంగ్రామమందు

శరశరాసనంబులు మోచి చాలసేపు
పతిమహాయుధాగారంబుగతి నశించె.

తృతీయుఁడు—మీ రీవంకఁ జూడుఁడు.

సీ. కేతనాగ్రమునుండి క్షితి జారువిరులదండలు
శిరస్రజము లై యలరు చుండ
సాయకం బొకటి హస్తమున దాలిచి
యున్న రాచపీనుఁగునుబట్టి రథమునుండి
యింతింత యన రానిసంతోసమును జెంది
నక్కలు దిగలాగు నక్కజముగ
బెండ్లికుమారుని పెద్దముత్తైదువుల్
తెరలి పల్లకినుండి దిగుచునట్లు.

అందఱు—అహో నిహతపతితగజతురగనరరుధిరకలిలభూమి ప్రదేశంబు వికీర్ణచర్మచర్మాతపత్రచామరతోమరశరకుంతకవచబంధాదిపర్యాకులంబుశక్తిప్రాసహాటకభిండివాలశూల ముసల ముద్గర వరాహకర్ణకణయకర్పణశంఖుతోమసిగదాద్యాయుధాకీర్ణంబు నగుసమంతపంచక మెంతభయంకరముగ నున్నది.

ప్రథముఁడు—ఇక్కడ

సీ. తెగిన యేనుఁగు లను తెప్పలనూది
రక్తపరీవాహంబులు దాటవచ్చు
రథికశూన్యములుసారథిశూన్యములు
నైనయరదంబు లీడ్చెడు హయగణంబు
తలదొలంగియుఁదొంటియలవాటుచేతను
మొండెముల్ విసవిసముందు నడచు
మావటుల్ తెగి యుంట మత్తనాగేందరముల్
తమయిచ్చవచ్చినదారి నేగు.

 

ద్వితీయుఁడు—ఇటు చూడుఁ డిటు చూడుఁడు.

తే. గీ. ఇప్పు మొగ్గల వోలెడు గొప్పకనులు
దుర్మదగజాంకుశములట్టితుండములును
గలుగుగ్రిద్దలు నింగి ఱెక్కలను విప్పి
యారఁ పగడంపు వీవనలట్లు తిరుగు.

తృతీయుఁడు—

తే. గీ. ఖండితద్విపహయ యోధగణముతోడ
చాపతోమరఖడ్గాదిసమితితోడ
నినువికాంతుల వ్యక్తమై యీధరిత్రి
తనరు రాలినచుక్కల దాల్చినట్లు.

ప్రథముఁడు—ఇటువంటియవస్థలో నయితము శోభనువిడు వక క్షత్రియులు విరాజిల్లు చున్నారు కదా.

సీ. కెంపారు మోవులు సొంపారు రేకులు
చమటదోగినకనుల్ భ్రమరగణము
కనుబొమ్మవిరుపులు కలితకింజల్కముల్,
కనకకోటీరముల్ కర్ణికలును
తీవ్రనారాచముల్ దీర్ఘనాళంబులు,
చేవయే వికసింపఁ జేయుపొద్దు
గాఁగ భూపతులమొగమ్ములు కదలని
మెట్టతామలట్లు మెఱయు చుండు.

ద్వితీయుఁడు—ఆహాహా. ఇటువంటిక్షత్రియులకుఁ గూడ మరణము కలుగుచున్నది కదా. విషమస్తులైనపురుషులు రాజున కెంతమాత్రము సాయము చేయ లేరు కదా.

తృతీయుఁడు—క్షత్రియులకు మాత్రము మరణము కలుగదా.

ప్రథముఁడు—సందియ మేమి.

ద్వితీయుఁడు—నీ వ ట్లనవద్దు.

సీ. ప్రబలఖాండవధూమరంజితవరమార్వ
చటులసంశత్వకోత్సాదకంబు
నాకలోకాక్రందనాశకంబు
నివాతకవచాసురప్రాణకర్షకంబు
నగుమహాకార్ముకం బాగాండివం బూని
దుర్జయబలుఁ డై యర్జునుండు
మృడుని పై సేయఁగా మిగిలియుండినయట్టి
క్రొవ్వాడియమ్ములు కొన్ని యేసి

గీ. రణముఖమ్మున నధికదర్పమ్ము పూని
వచ్చుభూపాలకుల నెల్లబట్టి చమరి
మృత్యుదేవికి బలి సమర్పించె గాని
యన్యుఁ డీవని సేయంగ నర్హుఁ డగునె.

అందఱు—అదిగో నేదో శబ్దము వినఁబడుచున్నది.

చ. ఉఱిమెడునాపరయోధరము లుర్విమహాశనిచేత వ్రీలె నా
గురుతరవజ్రపాతమునఁ గొండలపిండులు బిండి యయ్యె నా
యరయ మహానిలక్షుభిత మై విపులాంబుధి మందరాద్రికం
దరములు ఘోరు మంచుపరితినాదము సేయఁగ మ్రోయుచున్నదా.

సరే: చూచెదము గాక:

(అందఱు నడచు చున్నారు.)

ప్రథముఁడు—అహో అది ద్రౌపదీకేశధర్షణావమర్షితుండు ను పాండవమధ్యముఁడు నగుభీమసేనునకు, భ్రాతృశతవధక్రుద్ధుఁ డైన దుర్యోధనమహారాజునకును ద్వైపాయనహలాయుధకృష్ణవిదుర ప్రముఖు లగుకురుయదుకులదైవతములసమక్షమున జరుగు చున్న గదాయుద్ధము.

ద్వితీయుఁడు——

తే. గీ. పసిఁడిపలక వోలెడుభీమువక్షమందు
గజకరము వోలురారాజుభుజమునందు
నొండొరులు పరియోగించెడు చండగదల
దారుణాభిఘాతములశబ్దంబు సుమ్ము.

తృతీయుఁడు——ఈదుర్యోధనమహారాజు

సీ. మస్తకంపనమున మకుటంబు తూఁగాడ
క్రోధవిస్ఫారితాక్షుఁ డయి మించి
స్థలమాక్రమించుటఁ దనుపుహరిస్వము
గాఁగబాహువుపై కత్తి భయమెలర్ప
రిపుదేహశోణితార్ద్రీభూతమైనట్టి
దారుణగదను హస్తమునఁ బూన
కైలాసశైలశృంగముమీఁదఁ బడి
నట్టివజ్రమట్లాగద వరలు చుండు,

ప్రథముఁడు——ఇదిగో: సంప్రహారరుధిరసిక్తాంగుఁడైనపాండవుని జూడుఁడు.

తే. గీ. విరిగె మూపులు ప్రక్కనెత్తురులు నుదురు
రక్తసంక్లిన్నమయ్యె నురస్థలంబు
వర్ణగణములోడ భీముఁడు వరలు చుండె
ధాతువులతోడిమేరుభూధరము వోలె.

ద్వితీయుఁడు——.

మ. గదజిమ్ముమ్మన్వేస వల్గమానుఁ డగుచున్ గర్జించు తప్పించు నే
ర్పొనవన్ శత్రునిదెబ్బ లాగికొను దా నుంకించి హస్తంబు బి
ట్టుదరన్ ధారుణి యిట్టటుల్ దిరుగు నేయంజూచు గాటంబుగా
కదనప్రౌఢుఁడు రాజు భీముఁడు భుజాగర్వంబున న్మిన్న యా.

తృతీయుఁడు—

చ. అనిమోన నప్రేయబలుఁ డద్రిసమానుఁడు నైసవాయుసం
దనుఁడు శిరంబు వ్రియ్యఁగ గదాహతి; శోణితముల్ వొలంగమే
దిని బడె వజ్రిపాతమునఁ దీవ్రముగా దెగి ధాతుధారలం
బెనఁగొను హేమకూటపృథివీధరరాజము వోలె దీనుఁ డై

గాఢప్రహారశిథిలీకృతాంగుఁ డై నేల కొరగిన భీమసేనుని జూచి—.

సీ. ముక్కునవ్రేలిడి మిక్కిలియక్కజంపడి
యట్టె నిల్చె ద్వైపాయనుండు

ద్వితీయుఁడు—

ధర్మనందనుఁ డెంతొ దైన్యంబు నొందెను
విదురుండు బాష్పముల్ విడిచె కనుల

ప్రథముఁడు—

కలత మై తనవిల్లు గాండీవి స్పృశియించె
గగనంబు వీక్షించె కంసవైరి.

అందఱు—

శిష్యవత్సలతను జేతినాగలి దిప్పె
నాహవప్రేక్షకుం డైనబలుఁడు

ప్రథముఁడు—ఈమహారాజు.

చ. వివిధవిచిత్రరత్నగణవిస్ఫుటమౌళి ప్రతాపరాశి యా
హవతలసాహసుండు వినయాన్వితమూర్తి మహాభిమాని యి
ట్లవుటను నవ్వుచుం బలుకు నాబక వైరిని జూచి వీరుఁ డా
హవమున దీనుఁ జంపఁడు భయంపడ కుండుము భీమ నెమ్మదిన్.

ద్వితీయుఁడు—ఇదిగో నిత్తైఱంగున నపహాస్యమానుండగుభీమసేనునిజూచి జనార్దనుఁడు తనతొడ జరుచుకొని యేదోసన్న చేసెను.

తృతీయుఁడు—ఈసన్నచేతమారుతి సమాశ్వాసితుఁడయ్యెను.

మ. భ్రామదోయిన్ ముడి వైచి నెన్నుదుట భీముం డెంతొ భీమాస్యుఁడై
చమటం గేలను జిమ్మి దారుణగదం జేదోయి సంధించి ప్రే
మమెయిం దండ్రిమహాబలుం డొసంగుసామర్థ్యంబుచే నాఁగ, గ
ర్వముతో వెండియు లేచి నిల్చె బృథుగర్జల్ సేయుచుఁ గ్రిద్ధుఁడై.

ప్రథముఁడు—అన్నన్నా: గదాయుద్ధము మరల జరుగుచున్నదే.

మ. కరముల్ నేలను బామి, మున్ను భుజయుగ్మంబంతటంబూసి, దు
ర్భరకోపంబున నోష్ఠముం గఱచి గర్జల్ సేయుచుం బాసి సం
గరధర్మంబు; కృపం దొఱంగి హరిసంజ్ఞం బట్టి యేసెన్ వృకో
దరుఁ డాకౌరవనాథు నూరుల గదాదండంబు చండంబుగాన్.

అందఱు—హా! కష్టము, కష్టము. మహారాజుపడిపోయినాఁడు.

తృతీయుఁడు—అదిగో రుధిరపతనద్యోతితాంగుఁడై పడిపో
యిన కురురాజునుజూచి భగవానుఁడైనద్వైపాయనుఁడు గగనంబు
నకెగిరెను.

మ. హలి దుర్యోధనపక్షపాతమునఁ గ్రోధావిష్టుఁడై చేతులన్
హలముం ద్రిప్పుచు ఘూర్ణమాననయనుండై నభీమునింజూడ బె
గ్గిలి కౌంతేయులు పట్టి సందిటను నాకీమ్మారవైరిన్ రణ
స్థలికిన్ దవ్వుగఁ గొంచుపోయిరి హరిద్వైపాయన ప్రేరణన్.

ప్రథముడు—అహా! భగవానుఁడైనయీహలాయుధుఁడు
మహామర్షోన్మీలితలోచనుండై యాతీరున భీమసేనుఁడు గొనిపోవం
బడుటఁ జూచి యిటే వచ్చుచున్నాఁడు. ఈతఁడు—

తే. గీ. వాలి చలియింపఁ గ్రోధతామ్రనయనుఁ డయి
భ్రమరముఖదష్ట మగుదండ పయికి నెత్తి
నల్లవలువ తెల్లనిమేన మెల్లజార
వచ్చుపరివేషచంద్రునిభాతి బలుఁడు.

ద్వితీయుఁడు—అట్లైన రండు : రండు. మసమును మహా రాజు ననుసరించి యుందము.

ఉభయులు—మంచిది. అదే ప్రథమపక్షము.

(అందఱు నిష్క్రమించు చున్నారు.)

(ఇదివిష్కంభము.)

---

అప్పుడుబలదేవుఁడు ప్రవేశించుచున్నాఁడు)

బల—ఓహోహో ! రాజులారా ! ఇదియుక్తము కాదు.

చ. అరిబలమృత్యువై దనరునట్టి మదీయహాలంబు నైన సం
గరగతుఁడైనన న్నయన గన్గొని జంకక గర్వియై వృకో
దరుఁడు రణంబునం దిటు గదం బొడిసేసి సుయోధనోరువుల్
వరవినయాదిసద్గుణవిభాసితుఁ గూలిచి వైచె నక్కటా.

ఓదుర్యోధనా? నీప్రాణ మొక్కనిముషము నిలుపుము.

సీ. సాంభకోచ్చిష్టభీషణతీవ్రవికరింబు
యమునాజలంబున కాదిగురువు
భయదదానవనాథపట్టణప్రాకార
కూటాంకుశము మహాకునిశనిభము
యసురప్రాణాపహారార్చితంబు నై
యలరునాగలిబూని యదయవృత్తి
భండనంబున మేనినిండఁ గమ్మినయట్టి
చెమ్మటనీళులచేత దడసి

గీ. పదును దేఱినభీమునివక్ష మనెడు
వరిపొలము దున్నివైచెద భయదలీల
బంధువర్గంబుతోడ నాపాండుసుతులు
మారుతిని జూచి మిగుల నుమ్మలిక జెంద,

(తెరలో)

భగవానుఁడా! హలాయుధుఁడా; అనుగ్రహింపు మనుగ్రహింపుము.

బల——పాపము దుర్యోధనుఁడిట్లు నేలం గూలియు న న్ననుసరించి వచ్చుచున్నాఁడే. ఇతఁడు.

సీ. రణచందనం బైనరక్తంబు మెయి గప్ప
శ్రీమంతుఁ డైనయీాక్షితిధరుండు
మహిని దొర్లుట నెట్లమ న్నంట నెమ్మేని
శిశుభావమును గొన్న చెలువు గల్గి
యమృతమంధన మైనయవుల శైలమునుండి
వేల్పులు దైత్యులు విడిచిపుచ్చ
గలఁత తీరుచుకొంచు నబ్ధిపైఁ
బ్రాకెడువాసుకిలాగున వరలు చుండె.

(అప్పుడు తొడలు విరిగినదుర్యోధనుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

దుర్యో——

తే. గీ. దారుణరణంబులోన నాయూరుయుగము
భీమసేనగదాఘాతభిన్న మగుడు
నేల చేతులతోఁ బ్రాఁకి నిసువువోలె
సగము జచ్చినమేను నీసరణిఁ దాల్తు.

భగవానుఁడా హలాయుధుఁడా! అనుగ్రహింపు మనుగ్రహింపుము. పాండవులజోలికి బోకుము.

మ. అవని న్నేబడినప్డు నాతల మహాత్మా! నీదుపాదంబుచెంత వెసం ద్రెళ్ళెను వేఁడుకొందునినుక్రోధంబెల్లవర్జింపు కౌరవసద్వంశనినాపమేఘములు వారల్వారి జీవింపని మ్ముమ్మ విరోధంబులువైరహేతువులు మేముంబోవుచున్నామిటుల్.

బల—ఓదుర్యోధనా! క్షణమాత్రమునీవు ప్రాణములు నిలుపుము.

దుర్యో—నీ వేమి చేయుదువు?

బల—విను.

చ. హలమున జించి చుట్టములయంగములన్ ముసలప్రహారని
ర్దళితులఁ జేసి గాత్రముల రక్తనదుల్ ప్రవహింప నాజిలో
బాలియఁగఁ జేసి నాగరథపుంజన మేతముగా మహావిశ్వం
ఖల గతి స్వర్గయాత్రికులుగా నొనరించెద పాండుపుత్రులన్.

దుర్యో—మహాత్మా! అట్లు చేయవద్దు.

తే. గీ. ప్రతిన నెఱవేర్చుకొనె మహాబలసుతుండు
అనుజశోకము స్వర్గమ్మునకరిగియుండె
నాయవస్థయు నిటులయ్యె నాకు సంక
నైర మేల సంకర్షణ వ్యర్థముగను.

బల—నాయెట్టయెదుట నీవు వంచింపబడితి వని నాకు రోష
ముపుట్టినది.

దుర్యో—నేను వంచింపఁబడితి నని మీరు తలంచుచున్నారా?

బల—సంశయ మేమి.

దుర్యో—అయ్యో! నాప్రాణములకు విలువకలిగినది. ఎందు
చేత నన

సీ. తీక్షణంబుగ మండులాక్షాగృహమునుండి
బలియుఁడై యెవ్వాఁడుబయటపడియె
తగిలి వైరివను యుద్ధమునందు నెవ్వాఁడు
శిల వోలె నిల్చి నిర్జించెరిపుల
నని హిడింబాసురులు ప్రాణంబులు హరించి
చిరకీర్తి నెవ్వాఁడు చెంది యుండె
నట్టిభీముఁడు నన్ను నొట్టైనా వంచించి నే
నోడిపోలేదు నిశ్చయముగ.

బల—భీమసేనా! వంచనచేత నీవు బ్రతికిపోతివి.

దుర్యో—నేను భీమసేనునిచేతనె వంచింపఁబడితినా:

బల—అట్లైన నీ వీవిధముగ నెవనిచేత వంచింపఁబడితివి.

దుర్యో—వినుఁడు.

సీ. ఎవ్వాఁడు హరియించె నింద్రుని వంచించి
పారిజాతముతోడ పరువునెల్ల
ఎవ్వాఁడు శయనించె నెన్నోనె వేలేఁడులు
యోగనిద్రారూఢి నుదధియందు
ఎవ్వాఁడు చోరబడె నెంతయుఁ గులుకుచు
మారుతాత్మజుగదామధ్యమందు
ఎవ్వాఁడు ముదమొందు నేవేళఁ బెంచుచు
గారణంబులు లేనికయ్యములను
అట్టిలోకప్రియుం డైనియతనిచేత
దానవాంతకుచే జనార్దనునిచేత
మృత్యుదేవికి బలిగ నర్పింపఁబడితి
చెప్పితి నిజంబు భీమునిచేత గాదు.

(తెరలో)

అయ్యో! తొలగుఁడు; తొలఁగుఁడు.

బల—(చూచి) అయ్యో; పాపము పూజ్యుఁ డైనధృతరాష్ట్రుఁడు గాంధారీసమేతుఁ డై దుర్జయుఁడు తనకు దారిఁజూప శోకాభిభూతహృదయుఁ డై యంతఃపురానుబంధుఁ డై యిటవచ్చుచున్నాడు. ఇతఁడు—

తే. గీ. సుతశతపరిభక్తచక్షుఁడు జలనిధి
కనకయూపవిలంబి దీర్ఘతరభుజుఁడు

స్వర్గరక్షణసంజాతశంక నితని
వేలుపులు గుర్తింపని గావించి యుండురి.

(అప్పుడు ధృతరాష్ట్రుడు గాంధారియు దుర్యోధనునిభార్య లగుదేవు
లిద్దఱు దుర్జయుఁడు పరివేశించు చున్నారు.)

ధృత—కుమారా ఎక్కడ నున్నావు?

గాంధా—కొడుకా ఎక్కడనున్నావు?

దేవు లిద్దఱు—మహారాజా! ఎక్కడనున్నావు?

ధృత—అహో ఎంతకష్టము.

తే. గీ. వంచనముచేత తనయుండు భండనమున
బడియె ననుమాట విన గుండెపగిలిపోయె
నశ్రుపూరనేత్రి మగునాయంధముఖము
కటకటా యంధతర మయి కలుష మయ్యె.

గాంధారీ? బ్రతికియున్నావా?

గాంధారి—ఆ. మందభాగ్యరాలను జీవించియేయున్నాను.

దేవులు—హా! మహారాజా! మహారాజా!

రాజు—ఆహా! ఎంతకష్టము! నాయంతఃపురస్త్రీలుకూడ నిట
వచ్చి రోదనము చేయుచున్నారే.

తే. గీ. తతగదాఘాతరుజ యింతదనుక నెఱుఁగ
తలలు విరియఁబోసికొని యంతఃపురంబు
విడిచి యువిదలు వచ్చి వావిడిచి యేడ్వ
నమ్మహాబాధ యనుభవ మయ్యె నిపుడు.

ధృత—గాంధారీ! కులాభిమానియైనదుర్యోధననామ ధేయుం
డు కనఁబడినాఁడా?

గాంధారి—మహారాజా! కనఁబడ లేదు.

ధృత—ఏమి, కనఁబడ లేదా? పుత్రుని వెదకికొనవలసినకాల

మున యాతనిం జూడఁజాలక పోతినికదా! ఓరోరీకృతాంతవతక!

మ. అతిధీరాత్ముల శత్రుమర్దనుల వీర్యశ్రీపరిదీప్తాంగులన్
సుతులన్ నూర్వురఁ గన్నయట్టిధృతరాష్ట్రుం డొక్కమారైననా
సుతు లర్పించునినాపవారి గడుతుష్టుం డౌచు ద్రావంగ మో
గ్యతలేనట్టిదరిద్రుఁ డయ్యెనొకో కట్టా యెట్టినిర్భాగ్యుఁడో

గాంధారి——బిడ్డా! సుయోధన! నాకుఁ బ్రత్యుత్తరమిమ్ము.
పుత్రశతవినాశ దుఃఖితుఁడు, మందభాగ్యుఁడు నగు మీతండ్రికిఁగూడ
ప్రతివచన మిమ్ము.

బలదేవుఁడు——అహో! పూజ్యురాలైనయీగాంధారి

చ. జనకునొని పుత్రపౌత్రుల మొగంబులు ముచ్చటనొందకుండ వే
డ్కను బతిధర్మచిహ్నముగ గంతులు దాలిచె కన్నులన్ సుయో
ధనుఁడిటుల స్తమించుటను ధైర్యముగోల్పడియీమె యెంతయుం
బనవుట నేత్రబంధముల బాష్పజలంబుల నార్ద్రమయ్యెడిన్.

ధృత——పుత్రా! దుర్యోధన! అష్టాదశాక్షౌహిణీమహారాజా!
ఎక్కడనున్నావు.

రాజు——(తనలో)అష్టాదశాక్షౌహిణీ మహారాజునిప్పుడైనాను.

ధృత——పుత్రశతజ్యేష్ఠా! నాకుఁ బ్రతివచన మిమ్ము.

రాజు——(తనలో) అన్యవృత్తాంతము స్ఫురింప జేయుచున్నా
నే. ఈవృత్తాంతమువలన నాకు సిగ్గగుచున్నది.

ధృత——కుమారా! రమ్ము. నాకభివాదము సేయుము.

రాజు——ఇదె, యిదెవచ్చుచున్నాఁడను. (లేఁబోయి పడుచు
న్నాఁడు.) హా!హా!ఎంతకష్టము!ఇదినాకు రెండవదెబ్బ. కష్టముకష్టము

తే. గీ. భీమసేనుండు గదతోడ బిట్టుగొట్టి
చెలఁగి నాకచగ్రహణము చేసినప్పుడె

భగ్నమయ్యెను దొడలతోఁబాటు నేఁడు
గురుపదాభివందనశక్తికూడ నాకు.

గాంధారి—(కోడండ్రినుఁ జూచి) బిడ్డలారా! ఇటురండు

దేవులు—అమ్మా! ఇదిగో వచ్చితిమి.

గాంధారి—భర్తను వెదకికొనుఁడు

దేవులు—మందభాగలము. వెళ్ళుచున్నాము.

ధృత—ఎవఁడు వీఁడు; నాబట్టుకొంగు పట్టుకొని మార్గము చూపుచున్నాఁడు?

దుర్జయుఁడు—తాతా! నేను దుర్జయుఁడను

ధృత—పౌత్రా! దుర్జయ! నీతండ్రిని వెదకుము.

దుర్జ—నే నలసిపోయినాను.

ధృత—వెళ్ళురా నాయనా! తండ్రితొడమీఁదఁ గూర్చుండి యలసట తీర్చుకొందువు గాని.

దుర్జ—తాతా! ఇదిగో వెళ్లుచున్నాను. (సమీపించి) నాయనా! ఎందున్నావు?

రాజు—అయ్యో! ఈకుఱ్ఱవాఁడుకూడ వచ్చెనే. సర్వావస్థల యందును హృదయసన్నిహితమైనపుత్రప్రేమ నన్ను దహించు చున్నది. ఎందుచేత నఁగా

క. ఎఱుఁగఁడు దుఃఖం బెన్నఁడు
తఱుచుగ నాదొడలమీఁదఁ దానుండును సం
గరజితుఁ డగునన్నుఁ గనుఁగొని
యరయఁగ వీఁ డేమిసేయ యత్నించునొకో.

దుర్జ—ఇదిగో దుర్యోధనుమహారాజు నేలఁ గూర్చున్నాఁడు.

రాజు—కుమారా? ఏలవచ్చితివి?

దుర్జ—నీవు రాక జాగుచేసితి వని.

రాజు—అహో! ఇటువంటియవస్థలో సైతము పుత్రస్నేహము హృదయము దహించుచున్నది.

దుర్జ—నేను నీతొడమీఁదఁ గూర్చుండెదను.

(అని తొడ నెక్కఁబోవు చున్నాఁడు.)

రాజు—(నివారించి) దుర్జయ!దుర్జయ! ఎంతకష్టమెంతకష్టము

తే. గీ. ఎవఁడు నేత్రోత్సవం బయి యొసఁగునాకు
హృదయసంప్రీతికారుఁడై యెవ్వఁడుండు
నతఁడె కాలవిపర్యాస మైనకతన
నన్యుడయ్యెను చందురుఁ డగ్ని యయ్యె.

దుర్జ—తొడమీఁద నన్నెందుకుఁ గూర్చుండనీయవు?

రాజు—

తే. గీ పరిచితం బగుతావు పై భరిమలు విడిచి
కొడుక! యెక్కడో యొకచోటఁ గూరుచుండు
నేఁడు మొదలుగ లభియింపనేల దన్న!
పూర్వభుక్తాసనము నీకుఁ బొగల వలదు.

దుర్జ—దుర్యోధనమహారాజిప్పు డెక్కడికిఁ బోవును?

రాజు—నూఱుగురుతమ్ముల ననుసరించి పోయెదను

దుర్జ—అక్కడికి నన్నుగూడఁ దీసికొనిపో.

రాజు—కుమారా! నీవుపోయి యీమాట వృకోదరునితోఁ జెప్పుము

దుర్జ—మహారాజా! రమ్ము నీకొఱకు వెదకు చున్నారు

రాజు—కుమారా! ఎవరు వెదకుచున్నారు ?

దుర్జ—మీ నాయనయు, మీ యమ్మయు వీరువారననేల, అంతఃపురజన మంతయు వెదకు చున్నది

రాజు—కుమారా! నీవువెళ్లు వచ్చుటకు నాకు శక్తిలేదు

దుర్జ—నేను నిన్ను తీసికొని వెళ్ళెదను

రాజు—కుమారా! నీవు బాలుఁడవు.

దుర్జ—(నడచి) అయ్యా! ఇదిగో మహారాజు.

దేవులు—హా! హా! మహారాజ!

ధృత—ఏడి, మహారా జెక్కడున్నాఁడు?

గాంధారి—ఏడి, నా కొడుకెక్కడ?

దుర్జ—అదిగో మహారాజు నేలఁ గూర్చున్నాఁడు.

ధృత—అయ్యయో! ఈమహారాజున కేమి మూఁడినది?

తే. గీ. మహితకాంచన స్తంభ ప్రమాణమూర్తి
సకలలోకైకవందితసార్వభౌముఁ
డానితఁడు దీనుఁడై కూల నవనిమీఁద
మేను ద్వారేంద్రకీలార్ధమేయ మయ్యె

గాంధారి—బిడ్డా! సుయోధన! అలసిపోయితివా?

రాజు—అమ్మా! నేను నీపుత్రుఁడను కదా!

ధృత—ఈమె యెవరు?

గాంధారి—మహారాజా! జడు పెఱుంగనికొడుకులఁ గన్న గాంధారిని.

రాజు—నే నిప్పుడు తల్లికడుపున బుట్టినట్లుతలఁచుచున్నాను ఓతండ్రి యిప్పుడు దుఃఖములో బని యేమి.

ధృత—కుమారా నే నెట్లు దుఃఖింప కుందును?

తే. గీ. సంగరాధ్వరదీక్షితుల్ శౌర్యనిలయు
లైన నీదుతమ్ములునూఁర్వు రాజిఁ దెగిరి.
నీ వొకఁడ వుంట వాగున్న తేవ తోఁచె
నిపుడుపోయిరి వా రెల్ల నీవుపోవ.

(ధృతరాష్ట్రుఁడు నేల బడు చున్నాఁడు.

రాజు—హా కష్టము. ఈయన పడిపోయినాఁడే. తండ్రి పూజ్యురాలైన మాయమ్మ నూరడింపుము.

ధృత—ఏ మని యూరడింపను.

రాజు—యుద్ధమున వెన్నిచ్చి పాఱిపోవక పోరి నిహతుఁడై నాఁడని. తండ్రి న్యాయం దనుగ్రహించి శోకము మానుము.

మ. నతి యేనెన్నఁడొనర్ప నగ్నులకు నైనన్ మాళి నేవంచి క్రమ్మొ
క్కితి నీపాదయుగంబు మాత్రమున నత్యేకైకసద్భక్తి నీ
గతి నేనేయభిమానపూర్వముగ నీగర్భంబునన్ జన్మ మొం
దితినో యాయభిమాన మెల్లఁ గొనుచు న్నే నాకముం జేరెదన్.

ధృత—

మ. అతివృద్ధుండను జీవితంబుపయి లేదావంతయు నాశ పు
ట్టితి సమ్మీలితలోచలుండ నయి కాఠిన్యంబునుం బూన నా
తతధైర్యంబు గొల్లవెట్టి యతిపుత్రస్నేహ మీపట్ల నా
మతి నొక్కమ్మడి నాక్రమించెడును నేమాడ్కిన్ వగన్ సైతునో

బల—అహా ! కష్టము.

తే. గీ. ఈసుయోధనునెడ నాస లెల్ల విడిచి
యన్నివిధములఁ జెడినయీయంధరాజు
ఖేదపడుచుంట నాత్మనివేదనంబు
జేసికొనఁ జాల నే చాలసేపు నుండి

రాజు—అమ్మతో నే నొక్కవిజ్ఞాపనము జేయు చున్నాను

గాంధారి—బిడ్డా చెప్పు.

రాజు—

తే. గీ. అమ్మరో మ్రొక్కి చెప్పెద నాలకింపు
పున్నె మేదేని నే జేసికొన్నయెడల
ముందు నే నెత్తుజన్మంబులందుఁ గూడ
నీదుగర్భంబునందె జన్మింప వలతు.

గాంధా—నామనసులో నున్నమాటే నీవును జెప్పితివి.

రాజు—మాళవీ ! నీవుగూడ వినుము.

సీ. ద్వంద్వయుద్ధమున గదాఘాతమునజేసి
భిన్నమై యుండె నాభ్రుకుటితలము
ఉరమునం దొలఁగెడునురురక్తధారచే
హారావకాశ మింకైన లేదు.
అతిశోభమై యొప్పునాజానుబాహుల
వర్ణము లంగము లై వరలు జూడు
అపరాఙ్ముఖుం డయి యాజి నీమగఁ డీల్గె
క్షత్రియాంగన వేడ్వ జనునె నీకు

మాళవి—చిన్నదాన నగుటచేతను సహధర్మచారిణి నగుట చేతను నే నేడ్చు చున్నాను.

రాజు—పౌరవీ నీవుగూడ విను.

సీ. వేదోక్తయాగముల్ వివిధముల్ చేసితి
పాలించితిని సర్వబంధుగణము
శిష్ఠుల మెప్పించితి ప్రియశతంబులుచేసి
మర్దించితిని శత్రుమండలముల
సమరంబునందు నష్టాదశాక్షౌహిణీ
నృపుల గారించితి నిగ్రహించి
నావంటివానికి దేవేరు లై యుండి
యిటువంటియంగన లేడ్వ జనునె?

పౌరవి—అగ్నిప్రవేశకృతనిశ్చయురాల నగుటచేత నే నేడ్చుట లేదు.

రాజు—దుర్జయా ; నీవు గూడ విను.

ధృత—ఏమిచెప్పునోగదా.

గాంధారి—నేను నడే యనుకొను చున్నాను.

రాజు—దుర్జయా! నాకు చేసినట్లే నీవు పాండవులకుగూడ శుశ్రూష జేయుము. మాయమ్మ యగుగాంధారియెడవలెనె కుంతీమహాదేవియెడగూడ భక్తి గలిగి వర్తింపుము. అభిమన్యునితల్లి యైన సుభద్రయు ద్రౌపదియు మాతృదేవతలుగ భావింపుము. కుమారా చూడు.

మ. అనవద్యుం డభిమానదీప్తమతి శ్లాఘ్యశ్రీసమేతుండు నా
జనకుం డైనసుయోధనుండు తెగియెన్ సంగ్రామమందున్ సమా
నునితోఁ బోరి యటంచు వీడు పగ; నేనుం బోవుదుర్ ధర్మపు
త్రుని ప్రక్కం జని తర్పణంబు లిడి సంతోషంబుఁ గావింపుమా.

బలదేవుఁడు—అహో వైరము పశ్చాత్తాప మైనదేఁ పదోశబ్దమువలె నున్నది.

మ. రణసన్నాహముఁ దెల్పుదుందుభిమహారావంబు లే దిందు ను
ల్బణబాణవ్యజనాతపత్రతతిక్షిప్తం బయ్యె సూతుల్ భటుల్
రణమందుం దెగి రట్టిచో నెవఁడొ యుద్భ్రాంతంబు లై నింగి భీ
షణలీలం జరియింపఁగాకులు, ధనుష్టంకారముం జేసెడిన్.

(తెరలో)

తే. గీ. ఉగ్రకార్ముక మూని దుర్యోధనుండు
చొచ్చె నేరణయజ్ఞంబు శూరుఁ డగుచు
నమ్మహాసంగరాశ్వమేధమ్ము నిపుడు
చొచ్చి యాధ్వర్యమును బూన వచ్చినాఁడ.

బలదేవుఁడు—అహో గురుపుత్రుఁ డైనయశ్వత్థామ యిటె వచ్చు చున్నాఁడు. ఇతఁడు;

మ. వికచాంభోరుహపత్రసన్నిభలసద్విస్తీర్ణనేత్రుండు కా
నకయూపోపమలంబమానపృథుపీనస్ఫారబాహుండు కా

ర్ముక ముగ్రిమ్మగ నెక్కువెట్టి యిటుచేరున్ శృంగలగ్నేందరికా
ర్ముక మై పావకయుక్త మై వెలయుమేరుక్ష్మాధరంబో యనన్.

(అశ్వద్థామ ప్రవేశించు చున్నాఁడు.)

అశ్వ—(వెనుకటిపద్యమును జదివి) ఓహో ! సమరసంరంభో భయబలజలధిసంగమసమయసముద్ధితశస్త్రనక్రకృత్తవిగ్రహులారా ! స్తోకావశేషులారా ! శ్వాసానుబద్ధ మందప్రాణులారా ! సమరశ్లాఘులారా ! ఓరాజులారా ! మీరంకఱు వినుండు వినుండు.

సీ. మాయాబలంబునఁదాయచే నూరువుల్
తునిసి కూలిన సుయోధనుఁడఁ గాను
పనికిమాలినయట్టిప్రాంతకైదువు లూని
తుళ్లెడుసూతపుత్రుఁడను గాను
విజయరంగం బయి వెలయు నీసంగ
రక్షోణి నింకొకసారి చూడఁగోరి

యుద్యతాస్త్రుండ నై యొక్కడ వచ్చితి ద్రోణపుత్రుఁడను శూరుఁడను నేను. అప్రతిలాభవిజయశ్లాఘమైన సమరాంక్ష్యా నా కేమిపని ? (నడచి) కాదు. కాదు. నేను రాజసకునకుఁ [illegible] ర్పణంబులు విడుచుచున్నపుడు కురుతిలక మైన మరరాజువంచి[illegible] బడి యెను. ఈమాట నెవఁడు నమ్మను ? ఎందుచేతనన

సీ. గజరథారూఢు లౌ కార్ముకహస్తులు నృపతు
లేనికి మొగ్గి లిడుచు నుండు
రెవనియానతి మాళి నిడుదు రేకాదశాక్షౌ
హిణీనాధులౌ క్ష్మాధిపతులు
భృగురామశస్త్రముల్ వేమారు చవిఁగొన్న
కవచంబుగలుగు గంగాసుతుండు

నాతండ్రి ద్రోణుండు ప్రీతులై యెవ్వాని
జోదు లై పోరాడి క్షోణిఁ బడిరొ
తే. గీ. యట్టిదుర్యోధనమహీశుఁ డతిరథుండు
ప్రథితవిక్రమనిలయుండు రాజరాజు
కాలవశమున రణమునఁ గూలిపోయె
నేమి యనవచ్చు విధిచెయ్ది మిట్టు లగునె?

ఆహా ! ఇపుడు గాంధారీనందనుఁ డెక్కడున్నాఁడో? (నడచి చూచి) ఇదిగో అభిహతగజరథతురగనరప్రాకారమధ్యగతుండును, సమస్తయోధపారగుఁడును నై కురు రా జిక్కడనే యున్నాఁడు. ఇతఁడు.

సీ. మణికిరీటం బూడి మహిజారఁజలియించు
తలవెండ్రుకలు భానుతతులు గాఁగ
గాఢగదాఘాతగళితశోణితకాంతి
స్ఫురితసంధ్యారాగశోభ గాఁగ
చరమాచలేంద్రమస్తకసన్నివిష్టుఁ డౌ
పశ్చిమకాలవిభాకరుఁ డనఁ
గౌరవుల్ శోకాంధకారమగ్నులు గాఁగ
నస్తమించెడు మానవాధిపుండు.

(సమీపించి) కురురాజ ! ఏమిది ?

రాజు — గురుపుత్త్ర ! ఇది యసంతుష్టిఫలము.

అశ్వ — ఓకురురాజ! నాకు మీరు చేసినయుపకారపుఋణము నేఁడు తీర్చికొనవచ్చితి.

రాజు — నీ వేమి చేయుదు ?

అశ్వ — విను.

తే. గీ. ఆహవోద్యతు గరుడవాహననివిష్టు
చక్రిధరుఁ జతుర్బాహు సన్తమితదైత్యు
కృష్ణుని సపాండవంబు మర్దించి కూల్తు
ధరణిసంకీర్ణ లేఖ్యచిత్రపటమట్లు.

రాజు—వద్దు. వద్దు. అట్లు చేయ వలదు.

చ. భువి నభిషిక్తులైన నృపపుంగవులెల్ల గతించినారటుల్
దివమున కేగెఁ గర్ణుఁడు నదీతనయుండును నేలఁ గూలె నా
హవమున నేను చూడ హత మయ్యెను భ్రాతృశతంబు నున్న దీ
హవణున నాయవస్థ యిఁక నాయుధమున్ గురుపుత్ర! వీడవే?

అశ్వ—ఓకురురాజా!

తే. గీ. భీమసేనుండు గదతోడ బిట్టుగొట్టి
చెలఁగి నీకచగ్రహణంబు చేసినపుడె
తొడలతోఁబాటుగానె నీతొంటికడిమి
యపహృతం బయి పోయిన దని తలంతు.

రాజు—అట్లు కాదు, కాదు. రాజులు మానశరీరులు కదా! మానమునిమిత్తమే కదా నే నీవిరోధము తెచ్చికొంటిని. ఆచార్య పుత్రా! చూడుు.

సీ. తలవెంట్రుకలు బట్టి ద్రౌపదిఁగొలువులో
నీడిపించితి నృపుల్ జూడ నాఁడు
అతిబాలు బుత్రికు నభిమన్యు ననిలోనఁ
గొట్టి చంపితిఁ గ్రోధమతిని
నెత్తమందున వాని నిర్జించి యంపితి
మృగములతోఁగూడి మెలఁగ వనికి
నిన్ని జేసిన నాకు నేమిచేసిరి వార
లల్పదర్పము గొంచు నరిగి రంతె

అశ్వ—సర్వదా కృతప్రతిజ్ఞుఁడ నగు చున్నాను.

కం. నామీఁదను నీమీఁదను
నామీఁదను వీరలోక మంతటిమీఁదన్
భూమీశ! యొట్టుసుమి! సం
గ్రామము నిశిఁ జేసి కూల్తు గౌంతేయతతిన్

బల—గురుపుత్త్రుఁడే మనెనో యది తప్పక జరుగగలదు.

అశ్వ—ఓహో! పూజ్యుఁడైనబలదేవుఁడా?

ధృత—అమ్మయ్యా! వంచనాయుద్ధమునకు సాక్షు లున్నారు

అశ్వ—దుర్జయా! ఇటురా.

తే. గీ. పితృపితామహభుజబలవిక్రమసము
పార్జిత మగుదాయాద్యరాజ్యమున కెల్ల
నీకుఁ బట్టాభిషేకంబు లేకయున్న
విప్రవాక్కులరాజ వై వెలయు మన్న!

రాజు—అమ్మయ్య! నామనసులో నున్నమాట జరిగినది. ఇప్పుడు నాప్రాణములు పోవుచున్నవి. వీరె పూజ్యులైనశంతనుప్రభృతు లగునాపితృపితామహులు. అదిగో, నాభ్రాతృశతము. కర్ణుని ముందు పెట్టుకొని నాకొఱకెదురుచూచు చున్నది. వీఁడె కాకపక్షధరుఁడైనమన్యుఁడు, ఐరావతకుంభస్థలముపైఁ గూర్చుండి మహేంద్రునిహస్తముపట్టుకొని కోపముతో నాతోమాటలాడనుంకించుచున్నాఁడు. వీరె యూర్వశిప్రముఖ లైనయచ్చరలు నన్నుకలసికొన్నారు. ఇదిగో మూర్తిమంతములైనమహాసముద్రములు. ఇవె గంగాప్రముఖము లగుమహానదులు. సహస్రహంసలు లాగుచున్నవీరవాహి యగువిమానము. నానిమిత్తమిది యముఁడు పంపినాఁడు. ఇదిగో, యిదిగో వచ్చుచున్నాను (స్వర్గమున కరిగెను)

ధృత—

చం. తనయులులేమి నిష్ఫలము ధారుణిరాజ్యము నా కదేల. స
జ్జనులధనంబు లై వెలయుశాంతతపోవను లాశ్రయించెదన్

అశ్వ—

చనియెద శస్త్రపాణి నయి సౌప్తికసంహరణంబు సేయఁగా

భరతవాక్యము.

మని చెడుగాత మానృపతి క్ష్మాతలమునన్ సమితారిపక్షుఁడై!

శుభ మగుఁగాక

(అందఱు నిష్క్రమించు చున్నారు.)

ఊరుభంగము సంపూర్ణము.

శ్రీరస్తు.

# పంచరాత్రము

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్ర—

తే. గీ. ద్రోణుఁ డర్జునభీములదూత కర్ణ
ధారుఁడు శకునీశ్వరునకు దానవాంత
కుఁడు యుధిష్ఠిరుఁ డుత్తరగోభిమన్యుఁ
డోము మిము విరాణ్మూర్తి దుర్యోధనుండు. 1

(నడచి) ఆర్యమిత్రులతో నిట్లు విజ్ఞాపనము చేసికొనుచున్నవాఁడ. ఆహా! ఏమిది! నేను విజ్ఞాపనవ్యగ్రుఁడనై యుండఁగా నేదో శబ్దమువలె వినఁబడుచున్నది. హా! తెలిసినది.

(తెరలో)

ఆహా! కౌరవేశ్వరునియజ్ఞసమృద్ధి.

సూత్ర—కానీ, తెలిసినది.

తే. గీ. అంతిపురిజనంబులతోడ నవనిఁగలుగు
రాజు లందఱుఁ జనుదేరఁ గ్రమముతోడఁ
గౌరవేంద్రునియజ్ఞంబు కన్నుఁగవకుఁ
బండువగునట్లు వర్తిల్లుచుండె నహహా! 2

(సూత్రధారుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది స్థాపన

# పంచరాత్రము

## ప్రథమాంకము.

(అప్పుడు ముప్పురు బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు.)

అందఱు.—ఏమి ! కౌరవేంద్రునియజ్ఞసమృద్ధి.

ప్రథముఁడు.—ఇప్పు డిక్కడ

సీ. అవనీసురోచ్ఛిష్టమగునన్నమున దెసల్
పూచినతెల్లులపోల్కిఁ దనరె
హోమధూమములచే నుర్వీరుహము లెల్లఁ
గుసుమగంధంబులఁ గోలుపోయె
వధ మాని సింగముల్ వసియించె గిరులలోఁ
బులులు లేడులయట్లు మెలఁగఁజొచ్చె
జనపతి దీక్షఁ గైకొన జగం బంతయు
దీక్షఁ బూనినయట్లఁ దేజరిల్లె.

ద్వితీయుఁడు.—నీవు చక్కఁగాఁ జెప్పితివి.

సీ. అగ్నిహోత్రుఁడు తృప్తుఁ డయ్యె హవిస్సుల
ధనముల బ్రాహ్మణుల్ తనివిఁ గనిరి
పశుసమూహంబులుఁ బక్షిగణంబులుఁ
బ్రజలును సంతుష్టిఁ బడసి రెంతొ
నృపునిసద్గుణపుంజ మెల్ల నుతించుచు
నానందమునఁ దేలె నఖిలజగము
వేమేల రారాజువితరణంబున భూమి
యమరలోకము మించె నద్భుతముగ. 4

స్మృతీ—ఇదిగో! పూజ్యులైనబ్రాహ్మణులు.

సీ. రాజవేష్టనపట్టరాజితచరణులై
శ్లాఘ్యప్రభూతయశస్కు లగుచు
ముదిమినేనియు నేమములు వృద్ధిఁ బొందించి
స్వాధ్యాయముఖరితాస్యములు గలిగి
కాలంబు చెల్లినకతమునఁ బాటవం
బెడలినయంగముల్ వడఁకుచుండఁ
గరమున నూతగాఁ గైకొన్నకఱ్ఱయె
మూఁడవకాలయి తోడుపడఁగ

తే. గీ. శిష్యభుజములమీఁదను జేతుల నిడి
జీర్ణగజరాజములతేవఁ జేవఁ దొఱఁగి
తనువుఁ దాలిచి వచ్చువేదములపోల్కిఁ
బోవుచున్నవా రిండ్లకు భూమిసురలు. 5

అందఱు.—ఓహో, మాణవకులారా! ఓహో, మాణవలారా! అవభృథస్నానము కాకముందు యజ్ఞశాలకు మీరు నిప్పంటింపవద్దు.

ప్రథమ—అయ్యో! ఆవటువులు తమచాపలములు చూపినారు.

సీ. దగ్ధయూపం బగుధారుణీమండలి
కనకహస్తయుఁబోలెఁ గ్రాలుచుండె
వైదికవహ్ని సైఁపదు లౌకికాగ్ని ని
విస్ఫురించు తనచెంతవృషలునట్లుఁ
బచ్చిదర్భలు పైనిఁబఱచియుండుట వేది
కాలదు మంట పైఁగవియుచున్నఁ

దామరక్షాలనిలో దంతికై వడిఁ జొచ్చె
దుర్వారమై పొగ తూర్పుసాల. 6

ద్వితీయ—అది యట్లె

తే. గీ. అగ్నిభయమున భీతిల్లి యవనిదేవు
లార్పుచున్నారు వెస వైదికాగ్నిఁ గూడ
విమలవంశంబు చెడిపోవువేళలందు
జ్ఞాతిభీతి విడువఁబడుజ్ఞాతివోలె. 7

తృతీయ—

తే. గీ. నీటిలో నెంత తడిపిన నేతిబండి
కాలుచున్నది మిక్కిలి జ్వాల లెగయ
నకట ! సంతానసష్టంబు నందినట్టి
మగువ బిడ్డపైఁ బ్రేమచే మఱుఁగునట్లు. 8

ప్రథమ—నీవు లెస్సగాఁ జెప్పితివి.

తే. గీ. ఇపుడు రారాజురథము దహింపఁ దలఁచి
యగ్నిహోత్రిండు గాలిసాయమున మండి
నేమిమండలమును నాక్రమించి గుండ్రి
నయి వెలుంగుచునున్నవాఁ డర్కుఁడట్లు. 9

ద్వితీయ—ఈప్రక్కఁ జూడుము.

తే. గీ. పావకభయంబునను సర్పపంచకంబు
పుట్టలోనుండి బయటికిఁ బోవుచుండె
నతివిపన్నుఁడౌనరుని దేహంబునుండి
క్రమత వెడలునింద్రియపంచకంబు వోలె. 10

తృ—మీా రిద్దఱటువంకఁ జూడుఁడు.

తే. గీ. సానిలం బయి మండుమఖాగ్నివలన
భూరుహంబు దగ్ధంబయిపోవుచుంటఁ

గోటరమునుండి పిట్టలు బయటి కెగిరె
నవనిజమునుండి వెడలెడు నసువులట్లు

పరిభవ—అదియట్లె

తే. గీ. ఎండిపోయినచెట్టొక్క టుండఁబట్టి
పూలచెట్లున్నవన మెల్లఁ గాలిపోయె
మలినవర్తనుఁడగు నొక్కమనుజువలన
నరుల మగువంగసము భ్రష్టమైనయట్లు.

తే. గీ. బహులతావృక్షగుల్మాదిసహితమైన
యడవి నంతయు నాహారమట్ల మెసవి
యాచమించుటకో యన నగ్ని యిప్డు
దిగుచునున్నవాఁ డదె నదీతీరమునకు. 13

ద్వితీయ—

సీ. ఒకచెట్టునుండి వేఱొకచెట్టునకు దర్భ
లాధారముగఁ జేసి యరిగె నగ్ని
పరిణామదశయందుఁబలె నీయనఁటినుండి
పడెఁ బండ్లగొల కాలి పుడమిమీఁద
నెట్టయెదుట నున్నయీ తాళవృక్షంబు
మూలంబు కాలఁగఁ జాలసేపు
పెను తేనెపెరళోడఁ బృథ్విపైఁ బడియెను
ఫాలనేత్రుని మహాపరశువట్లు. 14

తృతీయ—అమ్మయ్య! సత్పురుషునిరోషమువలె భగవానుఁడు హుతాశనుఁడు ప్రశాంతుఁ డైనాఁడు.

తే. గీ. క్షయమునొందె నింధనపరిక్షయముచేత
నగ్నిహోత్రునిబలమెల్ల నక్కజముగ

సకలవైభవంబులును నాశనము నొంద
క్షయమునొందుసజ్జనదానశక్తివోలె. 15

ప్రథమ—

తే. గీ. అరణి దర్భలు సృగ్భాండమాదిగాఁగ
నన్నివస్తువులను వహ్ని యాగించె
వ్యసనములఁ దగులొ్కని భ్రష్టుఁడైనమనుజుఁ
డున్నయిల్లును సమ్మకతిన్నయట్లు. 16

ద్వితీ—

తే. గీ. అవనతవిటప మయినట్టి యానదీప
లాశ మనిలచలితపర్ణలలితహస్త
మున జలాంజలి యొసఁగెడిపోల్కి నుండె
దవదహనగతాసువులైన తరుల కెల్ల. 17

తృతీ—అట్లైన రండు పోదము. మనముగూడ నాచమింతము

ఇద్దఱు—మంచిది.

అందఱు—(ఆచమించి)

ప్రథమ—ఓయీ! పూజ్యుఁడైన కౌరవేశ్వరుఁడగు దుర్యోధనమహారాజు భీష్మద్రోణపురస్సరుఁడై సకలరాజమండలముతన్ను సేవింప నిటు వచ్చుచున్నాఁడు. ఈపౌరులు.

సీ. "జన్నముల్ గావించి యన్నంబు వెట్టుము
క్షితిఁ బరాక్రమముచే గెలిచితొమ్మ
దోషకారణ మైనరోషంబు విడువుము
స్వజనంబుపై దయావంతుఁ డగుము"
ననుచు నీరీతిగ నతిమధురంబు లౌ
వాక్యముల్ పెక్కు లుపన్యసించి

కౌరవేంద్రునికడఁ గావించుచున్నారు
కరుణఁ బాండవపరిగ్రహము నిపుడు. 18

కావున రండు. మనముగూడ కురురాజు నెల్లి సంభావింతము.

ఇద్దఱు—మంచిది!

అందఱు—మహారాజా! జయము. జయము.

(అనిముగ్గురు నిష్క్రమించుచున్నారు.)

ఇదివిష్కంభకము.

---

(అప్పుడు భీష్మద్రోణులు ప్రవేశించుచున్నారు.)

ద్రోణ—ధర్మావలంబకుఁడైన దుర్యోధనమహారాజుచేత నేనే యనుగ్రహింపఁబడితిని. ఏలయన.

తే. గీ. బంధువుల దాఁటి మిత్రులఁ బరిహరించి
శిష్యదోష మాచార్యునిఁ జేరికొనును
తల్లిదండ్రులఁ జెంద దాతనయుతప్పు
పిన్ననాఁడె గురునిచేతఁ బెట్టియుంట. 19

భీష్మ—ఈదుర్యోధనుఁడు.

తే. గీ. అతిధనగ్రహణమున నున్నతిని బడసి
సమరకాంక్షచే మును దుర్యశంబుఁ గాంచి
పుణ్యభాజనం బగుధర్మమును గ్రహించి
తనరుచుండె సురూపంబు దాల్చి నేఁడు. 20

(అప్పుడు దుర్యోధనుఁడు, కర్ణుఁడు, శకునియుఁ బ్రవేశించుచున్నారు.)

దుర్యో—

సీ. ఆత్మ మిక్కిలి శుద్ధ మైయున్న దిప్పుడు
గురుజన మానందభరితమయ్యె

జగము నాయందు విశ్వాసముంచెను దుర్య
శము పోయె నిలిచెను సద్గుణములు
చచ్చినవారికి స్వర్గంబు చేకూరు
ననునట్టిపలు కసత్యంబు సుమ్మ
స్వర్గమన్నది పరోక్షమున లేదది యుండె
యెల్లఫలంబుల నిచ్చుచుండు. 21

కర్ణు—గాంధారీనందన! న్యాయముగా నార్జించినధన మంత యు నీవు న్యాయముగా వినియోగించితివి. ఏలయన,

తే. గీ. రాచపేర్మి ప్రాణాధీనమై చెలంగు,
సుతులకని సొమ్ము దాఁచెడునతఁడు లోభి
ద్రవ్యమంతయు బ్రాహ్మణోత్తముల కిచ్చి
విభుఁడు సుతుల కీఁదగినది విల్లొకండె. 22

శకుని—అంగరాజు గంగోపస్పర్శనమువలన ధౌతకల్మషుఁడై నాఁడు. గనుకనే యిట్లు పలుకుచున్నాఁడు.

కర్ణ—

మ. ధర శర్యాతియయాతిరామసృగమాంధాతాంబరీషాదులున్
భరతేక్ష్వాకులఖండవైభవముతోఁ బాలించి వేంచేయరే
సిరులన్ రాష్ట్రములన్ ద్యజించి దివికిన్ జీవంబులం బాసినన్
జిరజీవుల్గద వార లెల్లఁ గ్రతువుల్ నేమంబునం జేయుటన్. 23

అందఱు—గాంధారీనందనా! యజ్ఞము సమాప్తముచేసి యదృష్టవశమున వర్ధిల్లుచున్నాఁడవు.

దుర్యోధ—మీయనుగ్రహమువలన. ఆచార్య! నమస్కరించు చున్నాఁడను.

ద్రోణ—కుమారా! రమ్మ. రమ్మ. నీ వొనర్చిన దక్షిణ ము సుఖా

దుర్యో—అశ్లైన నేది క్రమము?

ద్రోణ—ఏమి! తెలియలేదా?

క. మనుజాకృతిఁ గొను దైవం
బనఘుఁడు భీష్ముండు మ్రొక్క బతనికి ముందా
యనకు న్మ్రొక్కకమును ప
న్యన కెఱఁగుట తలఁతు నే నయుక్త మటంచున్. 24

భీష్మ—నీ వాలా గనఁగూడదు. అనేక కారణములచేత నేను నీకంటె నపకృష్టుఁడను. ఎట్లన

సీ. మాతృగర్భమున జన్మము నొందితిమి మేము
జనన మొందితి వీవు స్వయముగానె
విలు దాల్చియుండుట కులవృత్తి యగు మాకు
చాపధారణము వ్యాజంబు నీకు
జాలిమాలినయట్టిక్షత్రియులము మేము
మహనీయుఁ డైనబ్రాహ్మణుఁడ వీవు
అఖిలలోకమునకు నాచార్యులరు మీర
లూర్జితు లైనశిష్యులము మేము. 25

ద్రోణ—మహాత్ములు తమ్ముఁ బొగడుకొనుట కుత్సహింపరు. కుమారా! రమ్ము. నాకు నమస్కరింపుము.

దుర్యో—ఆచార్య! అభివాదము సేయుచున్నాఁడను.

ద్రోణ—కుమారా! రమ్ము. రమ్ము. ఈలాగుననే యవబృథస్నానక్లేశముల ననుభవింపుచుండుము.

దుర్యో—అనుగ్రహింపఁబడితిని. తాతా! నీకునమస్కారము.

భీష్మ—పౌత్ర! రమ్ము రమ్ము. ఈలాగుననే నీబుద్ధి ప్రసన్నమగుఁగాక!

దుర్యో—అనుగ్రహింపఁబడితిని. మామా! నీకునమస్కారము.

శకుని—వత్స !

తే. గీ. తగినదక్షిణ ల్గలుగునధ్వరము లెన్నొ
యీవిధంబునఁ గావించి మెసకమెసఁగి
యవనిపతులను రాజసూయమున గెల్చి
సరగఁ జెఱబెట్టుమాజరాసంధుఁడట్లు. 26

ద్రోణ—ఓహో ! ఆశీర్వచనమందుఁగూడ శకుని యుద్యోగముఁ గల్పించుచున్నాఁడే. ఈక్షత్త్రియకుమారుఁడు కలహప్రియుఁడు.

దుర్యో—మిత్త్రుఁడా ! కర్ణుఁడా ! గురుజననమస్కారానంతరమున మిత్త్రసల్లాపసుఖ మనుభవించుసమయము వచ్చినది.

కర్ణ—గాంధారీనందన !

తే. గీ. ఈక్రతువ్రతములఁ గృశియించినాఁడ
వైన నీ కిట్టిపీడ యెల్లప్పు డగుటఁ
గోరుచుందును రాజర్షి ధీరమైన
నీపలుకుపు భయంబునుగొల్పె నిజము నాకు. 27

దుర్యో—నీదయ యిట్లె యుండుఁ గాక !

ద్రోణ—కుమార, దుర్యోధన ! ఇతఁడు మహేంద్రప్రియసఖుఁ డైనభీష్మకుఁడు. నిన్ను గౌరవించుచున్నాఁడు.

దుర్యో—అయ్యా ! మీకు స్వాగతము.

భీష్ముఁడు—పౌత్త్ర ! దుర్యోధనా ! ఇతఁడు దక్షిణాపథపరిఘభూతుఁ డైనభూరిశ్రవసుఁరు నిన్ను గౌరవించుచున్నాఁడు.

దుర్యో—అయ్యా ! మీకు స్వాగతము.

ద్రోణ—పుత్త్ర ! దుర్యోధనా యజ్ఞసమాప్తము జేసిననిన్ను గౌరవించుటకై వాసుభద్రునిచేతఁ బంపఁబడినయభిమన్యుఁడు నీకు నమస్కరించుచున్నాఁడు.

శకుని—వత్స ! దుర్యోధన ! ఇతఁడు బలాఢ్యపుత్త్రుఁ డైన

సహదేవుఁడు. నీ కభివాదము సేయుచున్నాఁడు.

దుర్యో—కుమారా! రమ్ము. రమ్ము. పరాక్రమమున మీ తండ్రియంతటివాఁడ వగుదువుగాక-

అంద ఱు—ఇదె సర్వరాజమండలము నీకు విధేయమై గౌర వించుచున్నది.

దుర్యో—మీ యనుగ్రహమువలన అహో! ఏమిది సకల రాజమండలము వచ్చినది గాని, విరాటుఁడు రాలే దేమి?

శకుని—నే నతనియొద్దకు దూత నంపితిని. వచ్చుచుండు నని తలంచెదను.

దుర్యో—ఓయాచార్య! మీరు ధనువునందే గాక ధర్మము నందుఁ గూడ మాకు గురువులరు కావున దక్షిణ గ్రహింపుఁడు.

ద్రోణ—ఏమి! దక్షిణ గ్రహింపవలెనా? సరె సరె అట్లైన నిన్ను శ్రమపెట్టెదను.

దుర్యో—ఏమి! ఆచార్యులవారుగూడ శిష్యునిశ్రమపెట్టెదరా

భీష్ముఁడు—ఏమిపరి యోజనము?

సీ. పినన్నాఁటఁ జేసితి ఛేర్మితో సోమపా
నము నీయనఘుని యోగమునఁ జేసి
జగతి నేకచ్ఛత్రముగ నేలుచుంటివి
కలిగె విఖ్యాతి యీఘనునివలన
బ్రాహ్మణోత్తముఁడు క్షత్రగురుండు నీరాజ్య
మందు నిర్వేదమై కుందుచుండ
నేటికి నీదివ్య మేటికి సంపద
యేమివిశేష మం దేమిఫలము. 28

దుర్యో—దేవా! మీ కేమి కావలెనో నే నేమి చేయవలెనో యాజ్ఞాపించుఁడు.

ద్రోణ—కుమార! దుర్యోధన చెప్పుచున్నాను.

దుర్యో—ఇప్పుడు మీ రేమి విచారించుచున్నారు?

సీ. నన్ను నీప్రాణంబుకన్న నెక్కుడుగఁ జూ
చెద వుపదేశంబుఁ జేసి తీవ
గణనమొందితిని నీకతన. శూరులలోన
సాహసంబులు పెక్కు సలిపియుంటి
నేమి గావలయు నే నేమి యీవలయు న
య్యది యథేచ్ఛముగ నీ వానతిమ్ము
ఈగద యొక్కటియే నాది తక్కిన
దెల్ల నీయధీన మింత. నిజము. 29

ద్రోణ—కుమారా! చెప్పుచున్నాను. బాష్పవేగము నన్ను బాధించుచున్నది.

అందఱు—ఏమిది! ఆచార్యులుగూడ బాష్పములు విడుచుచున్నారు.

భీష్మ—పౌత్రి! దుర్యోధన నీపరిశ్రమము, నిష్ఫలము.

దుర్యో—ఓరీ! యెవఁడురా, అక్కడ.

భటుఁడు—(ప్రవేశించి) జయము జయము మహారాజ!

దుర్యో—ఉదకము దీసికొని రా.

భటుఁడు—చిత్తము దేవా! (అనినిష్క్రమించి మరలఁ బ్రవేశించి) మహారాజా! జయము జయము ఇదె యుదకము.

దుర్యో—తే. (అని కలశముఁ బుచ్చుకొని) ఓయాచార్య! కన్నీరు గడిగికొనుము

ద్రోణ—సరె సరె కార్యాచరణమె నాకు ముఖోదక మగుఁగాక!

దుర్యో—హా!

తే. గీ. ఎదను నాపూర్వకౌటిల్య మెంతువేని
దాన మీనని సందియ మూనుదేని
శరశతకలిన మయినహస్తంబు చాఁపు
ముదకమున ధారవోతు నీయుల్ల మలర. 30

ద్రోణ—నామనస్సున కిప్పుడు విశ్వాసము గలిగినది. కుమారా! వినుము.

తే. గీ. పదియురెండేండ్లనుండి యెవ్వారిజాడ
యైన మన మెఱుంగమొ యానిరాశ్రియులకుఁ
బాండవుల కర్ధభాగంబు పంచిపెట్టు
మదియె దక్షిణ భిక్షయు నదియె నాకు. 31

శకుని—(ఉద్వేగముతో) ఓయీ! వద్దువద్దు ఓయాచార్య!

తే. గీ. గౌరంబు నీయెడఁ జాలఁ గలుగువాఁడు
నమ్మినాఁడు శిష్యుఁడు వినయంబుఁ గలఁడు
నిట్టివీని నపస్తుత మేదొ దెచ్చి
ధర్మవంచన సేయుట తగును నీకు. 32

ద్రోణ—ఎట్టెట్టు! ఇది ధర్మవంచనయా? ఓయీ! శకుని! గాంధారవిషయవిస్మిత! చాలు చాలు. నీయనార్యభావముచేత సర్వలోక మనార్య మని నీవు తలఁచుచున్నావు. అయ్యో!

తే. గీ. పైతృకం బగురాజ్యంబు భ్రాతలకును
బంచి యిమ్మను టొక ధర్మవంచనంబె?
యడ్డసాళులు వైచి మాయలను బన్ని
యవని బలిమిచేఁ గొనుట యేమగునో జెపుమ. 33

అందఱు—జూదపుమాట యెందుకు?

భీష్మ—పౌత్రి! దుర్యోధన! ఇది యవభృథస్నానసమయము గదా! మిత్రముఖశత్రువగు శకునిమాట వినఁదగినది గాదు. కుమారా! చూడు.

తే. గీ. కుంతికొడుకులు ద్రౌపదిఁగూడి విపిన
రేణుపరుషభూముల సంచరించుటకును
మీరువారును బగతురై మెలఁగుటకును
గారణం బీశకునిమహాకైతవంబె. 34

దుర్యో—కావచ్చును. కాని, యాచార్య! నే నొక్కమా టడిగెదను.

ద్రోణ—కుమార! అడుగుము.

దుర్యో—

క. నిండుసభలోన నాఁడా
పాండుసుతులు మానరాజ్యభంగము పడియున్
దండిమగ లయ్యు నేటికిఁ
జండపరాభవము సట్లు సహియింపవలెన్.

ద్రోణ—ధర్మవ్యాజమున వంచింపఁబడి ద్యూతవృత్తి నాశ్రయించినయుధిష్ఠిరుని నీవిషయమునఁ బ్రశ్నింపవలెను.

తే. గీ. నాఁ డటులు సభాస్తంభంబు నూడఁబెఱుకఁ
దలఁచుభీముని వారించె ధర్మజుండు
వడముదిని నాఁడు మనమీఁద విడిచియున్న
శకుని మనల నాక్షేపింపఁ జాలునె యిటు. 36

భీష్మ—ప్రస్తుతవిషయ మొకటె వచ్చిపడినవిషయము మఱి యొకటి. ఓ యాచార్య! యిప్పుడు చేయవలసినకార్యము గొప్పది. కలహముగాదు.

ద్రోణ—ఇప్పుడు కలహమె కావలెను. ఇతరకార్య మక్కర లేదు.

భీష్మ—ఆచార్య! ప్రసన్నుఁడవుగమ్ము. కుమార! యిటు జూడుము.

సీ. పాండునందనులు దుర్బలులయి కృపణులై
యడవులఁ జేరి నిరాశ్రయు లయి
గర్వంబు దక్కి యిక్కట్టు లెన్నొ గుడిచి నీ
వలన సౌఖ్యము నొందఁ దలఁచినారు
నీవు జ్యేష్ఠుండవు నీయెడ వారలు
ప్రేమంబు గలిగి వర్తింతు రెపుడు
భరియింతువో కుటుంబమునఁ జేరిచి లేక
మృగములతోఁ గూడి మెలఁగుమనెదొ. 37

శకుని—మెలఁగుమనుము. మెలఁగుమనుము.

కర్ణ—ఓయాచార్య! ఆగ్రహింపకుము. దుర్యోధనుఁడు

మ. హితమైనన్ బరుషార్థము న్వినినచో నెంతేనిఁ గోపించు న
ర్థతుఁడై యెంతటివాని నైనఁ దనయొద్ద న్మెచ్చఁగానీఁడు స
మ్మతిమై గావు గతావసాన మగు. యుష్మచ్ఛిష్యకార్యం బిటన్
బతిమాలించుక గాకె మత్తకరి గర్వం బేది వాహ్యం బగున్.

ద్రోణ—వత్స! కర్ణ! బ్రాహ్మణ్యము తేజస్స్వంతము. తగిన కాలమందు నన్ను నీవు ప్రబోధించితివి. నేను నీచెప్పినట్లు వర్తించె దను. కుమారా! దుర్యోధన! నేను నీకు శాసకుఁడనుగదా!

భీష్మ—(తనలో) ఇతఁ డిప్పుడు మంచిదారి ద్రొక్కినాఁడు దుర్వినీతులపట్ల బతిమాలుటయే మంచిమందు.

దుర్యో—నా కే కాదు. నాకులమంతకు మీరు శాసకులే.

ద్రోణ—ఇది నీకే తగును అందుచేతఁ గుమారా!

సీ. నేను ని న్వంచింపఁ బూనితినా యటఁ
దప్పు నీయది గాదు ధరణినాథ
యేను పీడించితినేని ని న్నొకయింత
యయ్యది లాభమే యగును నీకు

మహనీయు లైనట్టిమానవులకు నభి
ప్రాయభేదంబులు వచ్చునేని
దప్పక యయ్యవి ధర్మాధికారవా
క్యములందు శమియించు నాక్షణంబ. 39

దుర్యో—అట్లైన నే నాలోచించి మనవిచేసెదను.

ద్రోణ—కుమారా! ఎవరితో నాలోచింపఁ గోరుచున్నావు?

తే. గీ. కర్ణుఁడో మఱి కృపుఁడో గంగాసుతుండో
నాతనూజుఁడో సింధుభూనాయకుండో
తండ్రియో విదురుండో మీతల్లియొక్కొ
యెవరితోడ నాలోచింతు విపుడు చెపుమ. 40

దుర్యో—వారెవ్వరితోడను గాదు, నామేనమామతో.

ద్రోణ—శకునితోడనా? (తనలో) అయ్యో! కార్యము భగ్నమైనది.

దుర్యో—మామా! యిటు రా. మిత్రుఁడా! కర్ణుఁడా! యిటు రమ్ము.

ద్రోణు—(తనలో) కాని, యిట్లు చేసెద. (ప్రకాశముగ) వత్స! గాంధారరాజ! యిటు రమ్ము.

శకుని—ఇదిగో వచ్చితిని.

ద్రోణు—వత్స!

తే. గీ. అల్లకును నెలవైనవయస్సు చెల్లెఁ
దలఁప బాల్యచాపలము క్షంతవ్య మగును
వసుమతీనాథ! యీరూక్షవచనములకుఁ
గ్రాఁగిలించుటయే శాంతికర్మ సుమ్ము. 41

భీష్మ—(తనలో)

తే. గీ. శిష్యవాత్సల్య మెంచి యాచింపఁ దొడఁగె
గురుఁడు గాంధారరాజును గొంకులేక

వేఁడుకొన్న ఫలం బేమి వీఁడు తనదు
సహజకౌటిల్యమును బాసి చక్కఁబడఁడు. 42

శకుని—(తనలో) ఓహో! ఆచార్యుఁడు మూర్ఖుఁడు గదా! తనకార్యలోభమున నన్ను బ్రతిమాలుచున్నాఁడు.

అందఱు—(నడిచి కూర్చుందురు.)

దుర్యో—మామ! పాండవులకు రాజ్యమును బంచియిచ్చుటనుగుఱించి యేమినిశ్చయింతము?

శకుని—ఇయ్యఁగూడదు. ఇది నానిశ్చయము.

దుర్యో—మామా! ఇయ్యవలసిన దని నీవు చెప్పఁ దగుదువు.

శకుని—ఇయ్యఁదలఁచుకొన్న పక్షమున నాతో నేల యాలోచింపవలెను? అంతయు నిచ్చివేయుము.

దుర్యో—వయస్య! అంగరాజ! ఈవిషయమున నీ వేమియు జెప్పలేదేమి?

కర్ణ—ఇప్పుడు నే నేమిచెప్పుదును.

శా. రామక్ష్మాపతి తా భుజించి మును సౌభ్రాత్రంబు పాలించె నే
నామైత్రిం జెఱుపం బ్రయత్నములు సేయంజాల నొక్కప్పు డే
దేమైనన్ సరె ధారుణీభరణమం దీవే ప్రమాణంబు సం
గ్రామక్షోణిని నీకు సాయపడుటే రాజేంద్ర! మావంతగున్.

దుర్యో—(జనాంతికముగ) మామ! చుట్టుపక్కల బలవచ్ఛత్రువులుగలదియు, నివాసమునకు యోగ్యముకానిదియు నగు పాడుదేశ మేదైన నున్నదేమో విచారింపుము. అది పాండవుల కిచ్చెదను.

శకుని—అయ్యో!

తే. గీ. పాడుదేశ మియ్యదియంచుఁ బలుకఁ గలమె
పాండవులకన్న జగతిలో బలియుఁ డెవఁడు

ఆయుధిష్ఠిరుఁ డుండెడునట్టిచోటు
పట్టమైనను రత్నగర్భ యయి పండు. 44

దుర్యో—అట్లైన నిప్పుడు కర్తవ్య మేమి?

తే. గీ. ధారవోసితి గురునిహస్తమున నేను
వినిరి నాప్రతిజ్ఞలు కురువృద్ధు లెల్ల
వంచనముననో మఱి యేయుపాయముననొ
ధార సత్యంబుచేయంగఁ దలఁతు నిపుడు. 45

శకుని—ఔను! అనృతవచనమునుండి నీవు రక్షింపఁబడవలెను

దుర్యో—ఔను.

శకుని—అట్లైన నిటురమ్ము. (దగ్గఱకుఁబోయి) ఓయాచార్య ఇదిగో పూజ్యుఁడైన కౌరవేశ్వరుఁడు మీకొక విజ్ఞాపనము చేసికొను చున్నాఁడు.

ద్రోణ—వత్స! గాంధారరాజ! చెప్పవచ్చును.

శకుని—పంచరాత్రములలో నాపాండవులయునికిపట్టు దెలిసి కొందురేని వారికి దుర్యోధనుఁడు రాజ్యమున నర్ధభాగ మిచ్చు నఁట. ఇప్పుడు మీ రది తెలిసికొందురుగాక!

ద్రోణ—వద్దు వద్దు.

తే. గీ. పదియురెండేండ్లనుండియు వారిజాడఁ
దెలియ శ్రమపడి తుద కీరు దెలియరైరి
పంచరాత్రముల నెఱుంగ వశమె నాకు
నంతకన్న స్పష్టముగ నీననుట మేలు. 46

భీష్మ—పౌత్ర! దుర్యోధన! ధర్మము నిర్వ్యాజముగా నుండ వలెను. ఈవిషయమున మేముగూడ సంప్రీతుల మగుదుము. చూడు!

తే. గీ. ఏకవర్షమందైన నూఱేండ్లకైనఁ
బాండుసుతులనుటకుఁ బాలు పంచియిమ్ము

సత్యమయినప్రతిన నట్లు సలుపుమయ్య
ధరణి సత్యప్రతిజ్ఞులు కురుకులజులు. 47

దుర్యో—ఇదే నానిశ్చయము.

ద్రోణ—(తనలో)

తే. గీ. కార్యలోభంబుచేఁ గడుఁ గలఁగి బుద్ధి
యొక్కమొగి హానూమత్వంబు నొందవలసె
వనధి లంఘించి నష్టసీతను నతండు
దెచ్చినటు పాండుసుతుల నేఁ దేవలయును. 48

పాండవులయునికిపట్టు నెట్లు తెలిసికొనవచ్చును?

(అప్పుడు భటుఁడు ప్రవేశించును.)

భటుఁడు—మహారాజ! జయము జయము. విరాటనగరము నుండి దూత వచ్చినాఁడు.

అందఱు—శీఘ్రముగాఁ బ్రవేశపెట్టుము.

భటుఁడు—చిత్తము. దేవా! (అనినిష్క్రమించును.)

దూత—(ప్రవేశించి) మహారాజా! జయము జయము.

అందఱు—విరాటేశ్వరుఁడు వచ్చెనా?

దూత—విషాదాకులచిత్తుఁడై రాలేదు. ఏలయన సన్నిహిత బాంధవులైన నూర్వురుకీచకులను

తే. గీ. ఎవ్వఁడో రేయి నెవ్వార రెఱుఁగకుండ
బాహువులచేతనే చంపి పాఱవైచె
నరసి చూచిన వారిదేహములయందు
శస్త్రమరణచిహ్నములు స్పష్టముగఁ దెలియు. 49

ఇందుచేత రాలేదు.

భీష్మ—ఎట్టెట్టు! అశస్త్రమరణమా? (రహస్యముగా) ఓయాచార్య! పంచరాత్ర మంగీకరింపుము.

ద్రోణు—(రహస్యముగ) ఎందుకని?

భీష్మ—(రహస్యముగ) ఆచార్య!

తే. గీ. బల్లిదుండైన భీముని బాహులీల
యగుఁ జుమీ యిది యిందు సువ్యక్తమయ్యెఁ
దాలుత నీభ్రాతృశతముపైఁ గలుగునలుక
కీచకశతముపైఁ బ్రయోగింపఁబడియె. 50

ద్రోణ—నీ కెట్లు తెలిసినది?

భీష్మ—(రహస్యముగ) నదీకూలములను శృంగస్థానములతోఁ బొడిచి యాడెడుదూడలలీలలు గోవృషభము లెఱుఁగకపోవునా?

ద్రోణ—(రహస్యముగ) దూడలలీలలు గోవృషభము లెఱిఁగినట్లా? కార్యసిద్ధి యైనది. (ప్రకాశముగా)

కుమార! దుర్యోధన పంచరాత్రము నేనంగీకరించితిని.

దుర్యో—అటులయిన మంచిదె.

ద్రోణ—ఓహో! యజ్ఞమునిమిత్తము వచ్చినరాజులారా! మీ రందఱు వినుండు వినుండు. ఇప్పుడు పూజ్యుఁడైన కౌరవేశ్వరుఁడు మాతులసహితుఁడై పాండవులయునికిపట్టు పంచరాత్రములలోఁ దెలిసికొనఁబడునేని రాజ్యమందర్ధభాగము వారికిచ్చునట్లు ప్రతిజ్ఞచేసినాఁడు ఓయీకుమార! అట్లేకదా?

దుర్యో—అట్లె

ద్రోణ—ఇది రెండుమూఁడుసారులు స్పష్టముగఁ జాటబడుఁగాక!

శకుని—కాలమువచ్చినప్పు డట్లె చేయవచ్చును.

ద్రోణ—గాంగేయ! అట్లెకదా?

భీష్మ—(తనలో)

తే. గీ. ధైర్యము నతిక్రమించి యాచార్యుఁ డిపుడు
హర్షమును బ్రకటించినయందువలన
వంచితుండైన కౌరవేశ్వరుఁడు నిశ్చ
యముగ నీతని వంచించునని తలంతు. 51

(ప్రకాశముగ) పౌత్ర! దుర్యోధన నాకు విరాటునితోఁ జిరకాల మునుండి యపరిహార్యమగు వైరము కలదు. అదిగాక నీయజ్ఞ మనుభ వించుట కతఁడు రాలేదుగదా! కావున, నతనిగోవులనుబట్టుకొందము

(రహస్యముగ ద్రోణునితో) ఓ బ్రాహ్మణోత్తమా!

క. మనయరదంబులచప్పుడు
విని రోసము దాల్చి పాండవేయు లలవిరా
టునియెడఁ గృతజ్ఞు లటుగా
వున గోగ్రహణంబుమీఁదబుద్ధి నిలిచెడున్. 52

భటుఁడు—(ప్రవేశించి) రథములు సిద్ధముచేయఁబడినవి. వాహనములు ప్రయాణాభిముఖము లైనవి.

దుర్యో—

తే. గీ. సత్వరంబ యీస్యందనచయముచేత
వానిగోవులఁ బట్టంగవచ్చు మనము
యజ్ఞవేళఁ బ్రశాంతమైనట్టిగదయు
వెండియును నాకరంబున నుండుఁగాక! 53

ద్రోణ—సీ. శీఘ్ర మాయత్తంబు సేయుఁడీ యరదంబు
శకుని— వేగఁ దోడ్కొనిరండు నాగజంబు
కర్ణ— భారంబు వహియించువారువంబులఁ గట్టి
నాయరదంబు పన్నంగవలయు

భీష్మ— నాబుద్ధి మత్స్యభూనాధునిపురి కేగఁ
ద్వరపడు వేగంబ ధనువు తెండు

అందఱు— చాపంబు విడిచి యిచ్చుట నుండు మీవు నీ
యాజ్ఞావిధేయులమయ్య మేము. 54

ద్రోణ— కుమార! దుర్యోధన! యుద్ధమందు మేము నీపరాక్రమముఁజూడఁ గుతూహలపడుచున్నారము.

దుర్యో— మీకిష్టమెట్లో యట్లె.

ద్రోణ— వత్స! గాంధారరాజ! ఈగోగ్రహణమందు నీదే ప్రథమరథమై యుండవలెను.

శకుని— మంచిదె ఇది మొదటికల్పము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.

శ్రీరస్తు.

# పంచరాత్రము

## ద్వితీయాంకము.

(అంతట వృద్ధగోపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

వృద్ధగోపాలుఁడు.—నాయావులు దూడలతో వర్ధిల్లుఁగాక! మా గొల్లపడఁతులు సదా ముత్తైదువులై యుందురుగాక! మావిరాట మహారాజుగారు భూమినంతను నేకచ్ఛత్రముగ నేలుదురుగాక. విరాటమహారాజుగారి వర్షవర్ధనగోప్రదాననిమిత్త మీనగరోపవనవీథిని మంగళవేషములు దాల్చి మాగోపబాలకులు, బాలికలు సర్వగోధనమును దీసికొని వత్తురుగాక! పెద్దవాఁడ నగుటచే నేను బోయి పెత్తనము జేసెదను.

ఏమిది! యీకాకి యెండిపోయినచెట్టెక్కి యెండుకొమ్మను దనముక్కుతోఁ బొడుచుచు సూర్యుని కెదురుగాఁ గూర్చుండి విస్వరముగా నఱచుచున్నది. మాగోధనమునకు శాంతి యగుఁగాక! శాన్తియగుఁగాక! పెద్దవాఁడనుగనుక పెత్తనము మీఁద వైచికొని గోపాలకులకు బాలికలకు నీవార్తఁ జెప్పెదను. అరే గోమిత్రక! గోమిత్రక!

గోమిత్రకుఁడు.—(ప్రవేశించి) మామా! దండము.

వృద్ధగో.—మనగోధనమునకు శాంతి యగుఁగాక! శాంతి యగుఁగాక! అరే! గోమిత్రక! విరాటమహారాజుగారివర్షవర్ధనగోప్రదాననిమిత్త మీనగరోపవనవీథిని మంగళవేషములు దాల్చి మన

గోపబాలకులు, బాలికలు సర్వగోధనమును దీసికొని రండు. ఓరీ, గోమిత్రిక! ఈవార్త గోపబాలకులకు బాలికలకుఁగూడ జెప్పుము.

గోమిత్రి—మామ చెప్పినట్లు జేసెదను. గోరక్షణికా! ఘృతపిండా! స్వామిని! వృషభదత్త! కుంభదత్త! మహిషదత్త! త్వరగా రండు రండు.

(అప్పు డందఱుఁ బ్రవేశించుచున్నారు.)

అందఱు—మామా! దండము.

వృద్ధగో—మనగోపబాలకులకు బాలికలకు శుభమగుఁగాక! విరాటమహారాజుగారివర్షవర్ధనగోప్రదాననిమిత్తమీనగరోపవనవీథిని గోధనమును దీసికొని రండు. ఈలోపున మనమాడుదము పాడుదము

అందఱు—మామ చెప్పినట్లు చేయుదుము. (అని యాడి పాడుచున్నారు.)

వృద్ధగో—హీహీ! ఆట బాగున్నది. పాట బాగున్నది. నేనుగూడ నాడెదను పాడెదను.

అందఱు—మామా! నీయాటవలన నెంతోదుమ్ము రేగినది.

వృద్ధగో—దుమ్ము రేఁగుటే కాదు. శంఖదుందుభిఘోషము గూడఁ బుట్టినది.

అందఱు—సూర్యుఁడు పగటిచంద్రునివెలుఁగువలెఁ దెల్లనైన కాంతిచేతఁ గప్పఁబడి కలఁడో లేఁడో యన్నట్లున్నాఁడు.

గోమిత్రి—ఆహా! మామా! వీరెవరో కొందఱుమనుష్యులు పెరుఁగుముద్దలవలెఁ దెల్లనైనగోడుగులతో గుఱ్ఱపుబండ్లనెక్కి గొల్లపల్లె కుపద్రవముఁ గలిగించుచున్నారు. దొంగలు కాఁబోలు!

వృద్ధగో—ఓహో! బాణములుగూడ పడుచున్నవి. బాలకులారా! బాలికలారా! పట్టణము వెంటనే ప్రవేశింపుఁడు.

అందఱు—మామ సెలవిచ్చినట్లుఁ జేసెదము.

వృద్ధగో—ఉండుండి? ఉండుండి! కొట్టండి. కొట్టండి పట్టుకొనుండు పట్టుకొనుండు. ఈవార్త విరాటమహారాజుగారికి నివేదింతము రండు,

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

(అప్పుడు భటుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భటుఁడు—ఓహో! దొంగపోటుగా వచ్చి విక్రమించుచున్న ధార్తరాష్ట్రులు, ఈమనగోవులను బట్టుకొని పోవుచున్నా రని విరాటమహారాజుగారికి విన్నవింపుఁడు. విన్నవింపుఁడు. అక్కడ,

సీ. బెదరి పాఱెడు లేఁగ పెయ్యలగమితోడఁ
గారింపఁబఱెడుగోగణముతోడ
మొగములయందుఁ జూపులయందు భయము గ
న్పడ నార్చుగోవృషభములతోడ
హాహారవంబులు నార్తనాదంబులు
మిక్కిలి దెసలందుఁ బిక్కటిల్ల
గొల్లపల్లియ నేఁడు గురుశోకనిలయమై
సంతాపమును గొల్పె స్వాంతమందు. 1

(తెరలో)

ఏమి! ధార్తరాష్ట్రులచేతనా?

భటుఁడు—ఔనయ్యా!

(కాంచుకీయుఁడు ప్రవేశించి)

కాంచు—అన్నదమ్ములయెడలఁగూడ ద్రోహము చేసిన దురాత్ముల కీపని తగినదే.

సీ. గుణము సంధించినకోదండములు దాల్చి
యంగుళీత్రాణంబు లమరఁ గట్టి
కవచము ల్మేనులు గప్పంగ ధరియించి
తీర్చి యమర్చినతేరు లెక్కి
యుద్ధసన్నద్ధులై యుత్సాహ మెదఁ గల్గి
నానాయుధంబులు పూని కేలఁ
కౌరవుల్ విరటుపైఁ గలుగు వైరమునెల్ల
గోవులపై దీర్చికొనిరి నేఁడు. 2

జయసేన! జన్మనక్షత్రక్రియావ్యాపృతుఁడై నమహారాజునకు నసమయమం దీవార్త విన్నవించినయెడలఁ గోపము వచ్చును. కనుక నీపుణ్యకార్య మైనవెనుక విన్నవింతము.

భటుఁడు—ఇదితొందరపని. కావునవెంటనేసివేదింపవలయును

కాంచు—అట్లయిన నిప్పుడే నివేదించెదను.

(అప్పుడు విరటరాజు ప్రవేశించుచున్నాఁడు.)

రాజు—

సీ. ఎదిరిహింసలఁ బడి చెదరినకోడెలు
గలుగునాయావులు కలఁతఁ జెంది
యరిరథధ్వనులు నాయరదంపుటులి వని
భ్రమసిపోయెను గాక వారివెంట
బలిసినయంసముల్ బంగారుకడియముల్
గందపుంబూతలు గలకరమునఁ
బసులఁ గావఁగ లేక పరమాన్నములను భ
క్షించుచుంటిని గదా సిగ్గు లేక. 3

జయసేన! జయసేన!

భటుఁడు—(ప్రవేశించి) మహారాజా! జయము జయము.

రాజు—మహారాజశబ్ద మింకఁ జాలు. నాక్షత్రియత్వము పరాభవముఁ జెందినది. యుద్ధము విస్తరించి చెప్పుము.

భట—అప్రియములు విస్తరించి చెప్పఁగూడదు. ఇదె సంగ్రహముగాఁ జెప్పుచున్నాను,

తే. గీ. మొతట స్యందనధూళిచే మొదవులెల్ల
నొక్కవర్ణంబె కలిగిన ట్లుండె నధిప!
చండతరకశాఘాతసంచయముచేతఁ
గానఁబడుఁ బెక్కురంగులు గలిగినట్లు. 4

రాజు—అట్లైన

మ. అరదంబున్ వెసఁ బన్ని తెమ్ము, గొనిరమ్ము నాదుచాపంబు నె
వ్వరు నాకుం గడుఁ గూర్తు రానరులు నాపక్షంబునన్ రండు, సం
గర మాగోవులకై ప్రవర్తిలు నమోఘంబై రణక్షోణిలో
మరణంబైన యశంబె చేకురెడు ధర్మంబైనకర్మంబునన్. 5

భటు—మహారాజుగారు సెలవిచ్చినట్లు చేసెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—దుర్యోధనునకు నామీఁద వైరమెందుకు? హా! తెలిసినది. అతనియజ్ఞమునకు నేను బోవనైతిని. ఎట్లు పోఁగలను? కీచకులచావుచేత మహాసంతాపావిష్టమనస్కుఁడ నైతినిగదా! అయినను నేను రహస్యముగాఁ బాండవుల కిష్టుఁడ ననియైన నతఁడు నాతో యుద్ధము చేయకమానఁడు. భగవానుఁడు కంకభట్టు కొంతకాలము హస్తినపురవాసి యగుటచే దుర్యోధనునిస్వభావ మెఱుఁగును.

తే. గీ. ఎట్టిఁననునేమి వచియింపఁ డీమహాత్ముఁ
డాసుయోధనుదోషంబులన్ని నాకుఁ
గక్కురితిచేత నడుగునే గాని కార్య
వాది యొరులరహస్యముల్ బయలుపడునె.

ఎవఁడురా, అక్కడ.

భటుఁడు—(ప్రవేశించి) మహారాజా! జయము. జయము.

రాజు—ఓరి! భగవానునిఁ బిలుచుకొనిరమ్ము.

భటు—దేవరవారు సెలవిచ్చినట్లు చేసెదను.

(అనినిష్క్రమించును.)

(అప్పుడు భగవానుఁడు కంకుభట్టు ప్రవేశించుచున్నాఁడు.)

భగవాను—(అంతటఁజూచి) ఔరా! ఏమిది?

సీ. గజములు సిద్ధంబుగా వింపఁబడెఁ దురం
గములకుఁ దొడిగిరి కవచములను
దేరులన్నిఁటిఁ బన్ని తెచ్చిరి యోధు లా
యుధములు వహియించియున్నవారు
అననుభూతభయంబు నను నావహించిన
దీసముద్యోగంబునెల్లఁ జూడఁ
గృతమతినౌట నా కేజంకు లేదు నా
యనుజులు చపలాత్ములగుట వెఱతు. 7

రాజు—భగవానుఁడా! జయము జయము. విరాటుఁడు దేవర వారికి నమస్కరించుచున్నాఁడు.

భగవానుఁడు—శుభమగుఁగాక!

రాజు—మహాత్మా! ఈయాసనమున దయసేయుఁడు.

భగవానుఁడు—(కూర్చుండి) ఓరాజా!

తే. గీ ఈసముద్యోగ మంతయు నెందువలన
సిరికి సంతుష్టియుండుట యరుదుగాదె!
పీడ గలిగించుచుండు గర్వితులకెల్లఁ
బ్రీక్షిపుల ముక్తులను జేయు భీతి నడఁచి. 8

రాజు—భగవానుఁడా! గోగ్రహణము వలనఁ బరాభవింపఁబడితిని.

భగవాను—ఎవరిచేత?

రాజు—ధార్తరాష్ట్రులచేత.

భగవాను—(తనలో) అహో! యెంతకష్టము.

తే. గీ. మానధనులచిత్తములఁ గంపంబునొందఁ
జేయు జ్ఞాతిత్వమనునది చిత్రముగను
కౌరవులు పౌనర్భవయీయకార్య మేము
చేసినట్లె నామన సెంతొ సిగ్గుపడెడు. 9

రాజు—మహాత్మా! యిప్పుడు దేనినిగురించి మీరు విచారించుచున్నారు!

భగవాను—ఏమిలేదు. వారియుత్సాహమునుగురించి.

రాజు—ఇఁకమీఁద వారిపొగ రడఁగునులే. ఏలయన చెల్లియుండి వారియాగడములు యుధిష్ఠిరుఁడు సైరించెను గాని నేను సైరింపను.

భగవాను—(తనలో)

తే. గీ. రాజ్యవిచ్యుతి కృష్ణాపరాభవంబు
నాశ్రితగృహనివాసంబు నన్యవేష
మాకు సెజ్జయు నేఁడు శ్లాఘ్యంబులయ్యె
నవని నాకునాఁగుణము సువ్యక్తమగుట. 10

భటుఁడు—(ప్రవేశించి) మహారాజ! జయము జయము.

రాజు—ఓరీ! యిప్పుడు దుర్యోధనుఁ డేమి చేయుచున్నాఁడు?

భట—దుర్యోధనుఁ డొక్కఁడే కాఁడు. పృథివిలోనున్న రాజులందఱు వచ్చినారు.

తే. గీ కలశజుఁడు జయద్రథుఁడు గంగాసుతుండు,
శకుని కర్ణ శల్యులు వచ్చి రకట! యనికి

తదరిథచలనచలితపతాకము లగు
ధ్వజములే గెల్చె మము బాణతతులు గావు. 11

రాజు—(లేచి యంజలిపట్టి) ఏమి! మహానుభావులైనభీష్ములు గూడ విజయఁచేసిరా?

భగవాను—(తనలో) ఈతఁ డవమానితుఁడయ్యు సముదాచారము నతిక్రమింపలేదే. బాగుబాగు.

తే. గీ. ఆమహానుభావుఁడు కౌరవాగ్రగణ్యుఁ
డేల యేతెంచియుండునో యిట్టిపనికి
మాప్రతిజ్ఞ దాఁటినదనుమాట మాకుఁ
దెలియఁజేయంగ నిటకుఁ దోతెంచియుండు. 12

రాజు—ఎవఁడురా, అక్కడ.

భటుఁ—(ప్రవేశించి) మహారాజా! జయము జయము.

రాజు—ఓరీ! సూతునిఁ బిలుచుకొనిరమ్ము.

భటు—చిత్తము దేవా! (అని నిష్క్రమించును.)

సూతుఁడు—(ప్రవేశించి)ఆయుష్మంతుఁడా? జయముజయము

రాజు—

తే. గీ. శ్లాఘ్యుఁ డగురణాతిథి యదృష్టమున వచ్చె
రథముఁ దోడ్కొనిరమ్ము శీఘ్రింబ పన్ని
అతని గెలువంగఁగల ననునాస లేదు.
బాణముల నేసి సంతోషపఱుపఁగలను. 13

సూత—ఆయుష్మంతుఁడా! చిత్తము.

తే. గీ. పగఱసైన్యభేదములందుఁ బరిచితమయి
శ్లాఘ్యమై యున్ననీజయస్యందనంబు
నటికి రథచర్యఁ దెలుపంగ నరిగెనయ్య
యుత్తరకుమారకుం డెక్కి యుద్ధమునకు. 14

రాజు—ఎట్టెట్టు! కుమారుఁడు వెళ్ళెనా?

భగవాను—ఓరాజా! కుమారుని వారింపుము వారింపుము.

సీ. ఎలబ్రాయమున నాతఁ డెన్నఁజాలక గుణ
దోషంబు లుగ్రుఁడై దుముకు ననికి
సన్నిది యగునేని సమరాగ్ని యది యిది
యనక యన్నిఁటిఁ గాల్చు నాక్షణంబ
ధార్తరాష్ట్రులు సముద్ధతి నెట్టిదుర్మార్గ
మైనను విడువక యాచరింతు
యుద్ధదోషంబుల నుగ్గడించితిఁ గాని
కాదు నీయెడఁ దిరస్కారబుద్ధి. 15

రాజు—అట్లయిన వేగముగా మఱియొకరథముఁ గొని తెమ్ము.

సూతు—ఆయుష్మంతుఁడా! అట్లే చేసెదను.

రాజు—కాదు. కాదు. ఇటురా.

సూతు—ఆయుష్మంతుఁడా! ఇదిగో వచ్చితిని.

రాజు—

తే. గీ. నాకుమారునియరదంబునకు నదేల
సారథివి గాక నిల్చితిచ్చటను నీవు?
అతఁడు తనవెంట రావల దనెనో నిన్ను
సారథివి గావో ధారుణీశ్వరుల కీవు? 16

సూతు—ఆయుష్మంతుఁడా! ఆగ్రహింవకుము నే నెప్పటి యట్ల రథము నాయత్తముచేసిసూతసముదాచారపరికారముసిద్ధముగ నుంటిని. అప్పుడు.

కం. పరిహాసమునకో కాదే
నరదము నడపుటకు శక్తియలవడుటనో, యు
త్తరుఁడు నను విడచి చేకొనె
ధరణీశ! బృహన్నలనఁట తనసారథిగాన్. 17

భగవాను—రాజా! తొందరపడకు. తొందరపడకు.

తే. గీ. తొడరి చక్రనిర్గత రేణుదుర్దిన మగు
నరద మెక్కి బృహన్నల యరిగెనేని
నేమిరవముచేత నె శత్రునృపుల నడఁచి
రథమె జయముఁ గాంచును శరపఙ్క్తి యేల? 18

రాజు—అట్లయిన శీఘ్రముగా మఱియొకరథము తెమ్ము.

సూతుఁడు—ఆయుష్మంతుఁ డాజ్ఞాపించినట్లు చేసెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

భటుఁడు—(ప్రవేశించి) అయ్యో! ఉత్తరకుమారునిరథము భగ్నమైనది.

రాజు—ఎట్లు భగ్నమైనదిరా?

భటుఁడు—మహారాజా! చిత్తగింపుఁడు.

కం. సమరాభిజ్ఞులు పెక్కం
డ్రమితోత్సాహమున మార్గ మరికట్టఁగ, గు
ఱ్ఱము లంత నిలువక శ్మశా
నమునకుఁ గొనిపోయె స్యందనము భగ్నముగాన్ 19

భగవానుఁడు—(తనలో) అహో! అక్కడ గాండీవ మున్నది గదా. (ప్రకాశముగ) ఓ రాజా!

క. అరదము శ్మశానభూమికి
నరుగుట మంచిశకున మెటు లన గౌరవు లెం
దరిగిన నయ్యది తప్పక
యురుశ్మశాన మగునంచు నూహ జనించెన్. 20

రాజు—భగవానుఁడా? అకాలమందు స్వస్థవాక్యము కోప
ముఁ బుట్టించును జుమీ.

భగవాను.—కోపము వద్దు. ఇదివఱ కెన్నఁడు నే ననృతముఁ జెప్పలేదు.

రాజు.—ఆహా! అది నిజమే.

(భటునిఁజూచి) ఓరీ! నీవు వెండియు నరిగి వృత్తాంతముఁ దెలిసికొనిరమ్ము.

భటు.—మహారాజుగారు సెలవిచ్చినట్లు చేసెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు)

రాజు.—

తే. గీ. ధారుణీమండలంబెల్ల తల్లడిల్లి
కడు భయంకరలీలలఁ గంపమొంద
ధ్వని యొకటి ప్రవాహమువోలె వినఁగవచ్చె
హోరుమని యది యేమయి యుండునొక్కొ! 21

ఆశబ్ద మేమో తెలిసికొనుఁడు.

భటుఁడు.—(ప్రవేశించి) మహారాజా! జయము జయము అట్లు గుఱ్ఱములు శ్మశానమునకుఁబోయి క్షణము విశ్రమించినపిదప నుత్తర కుమారుఁడు—

భగవాను.—(తనలో) వీఁడు నామాట నసత్యముఁ జేయక పోవుఁగాక!

భటుఁడు.—

సీ. నల్లనియేన్గులు నారాచశతపాత
మునఁ గన్బడుఁ గపిలంబు లయి నేఁడు
నల్గులు నూఱేసియయిన హైనాటని
హాయములే దచట జోడైన లేఁడు
పరికరయుతముకా నరదంబు లెల్ల స్తం
భితము లయ్యెను శరప్రతతిచేత

శరముల మార్గముల్ ఛన్నంబు లయ్యెను,
వెడలెను శరనదుల్ వింటినుండి. 22

భగవా—(తనలో)

తే. గీ. అదియె యక్షయతూణీర, మదియె గాండి
ఖాండవవనంబు దహియించుకాలమందు
నిందురిఁ డెందాఁకఁ గురియించె సాంద్రధార
లంతదాఁకను శరధార లవనిఁ గురిసె. 23

రాజు—తరువాత నిప్పుడు శత్రువులవృత్తాంత మేమి?

భటు—అది నేనుచూడలేదు. వార్తాహరు లిట్లుచెప్పుచున్నారు

సీ. కోదండనాదంబుఁ గుంభజుఁ డాలించి
యది యిదే యని మెంచి యనికిఁ దొలఁగెఁ
దనవానికడ బాణమును జూచి భీష్ముండు
శరము లేయుట మానెఁ జాలు ననుచుఁ
గర్ణుండుఁగూడ భగ్నమునొందె, నే మిది
యనుచుఁ దక్కినరాజు లడరి చనిరి
బాల్యంబుచేతను భయమున్న దెఱుఁగక
యభిమన్యుఁ డొక్కఁడే యచట నిలచె. 24

భగవా—ఏమి? అభిమన్యుఁడుగూడ వచ్చెనా? ఓరాజా!

తే. గీ. ఉభయవంశములకును దేజోగ్నియైన
యాసుభద్రాత్మజుండు పోరాడునేని
మనబృహన్నల వైక్లబ్యమును వహించుఁ
బనుపు మఱియొకసూతుని, ద్వరితగతిని. 25

రాజు—నీ వట్లనవద్దు.

సీ. భృగురామశరముల భిన్నమైపోవ దె

మందాకినీసుతు, షంతాత్రియుధుం డగు
ద్రోణుని, నరిలోన ద్రుంగఁజేసి
కర్ణసైంధవులను గారించి, విముఖులఁ
గావించి తక్కిననరపతులను
నాహవరంగమం దవలీలఁ దలపడి
యోడించినట్టి మాయుత్తరుండు.
తే. గీ. క్రీడికిని జంక సౌభద్రు గెలువలేఁడె
నిశితశరములచే నొక్కనిముసమందు?
నట్లు కాదేని తుల్యవయస్కుఁ డగుటఁ
గరుణపెంపున వానిని గావవచ్చు. 26

భటు—ఆయుత్తరకుమారునిరథము,
సీ. పగ్గముల్ బిగఁబట్ట భ్రమియించు నిట్టటు
సడలింపఁ బరువెత్తు, సరభసమున
నభిమన్యు డాసియు నతనిజోలికిఁ బోవ,
దపకార మొనరింప దంతమైనఁ,
జపలమైయుండి యాసన్నభూములయందుఁ
బరివర్తమానమౌ బలు తెఱఁగుల,
స్వార్థమౌనుపదేశ మాతని కొనరించు
నదివోలె నున్న దేమంచు నహహా! 27

రాజు—ఓరీ! నీవుపోయి మరల వృత్తాంతముఁ దెలిసికొనిరమ్ము
భటు—చిత్తము దేవా!

(అని నిష్క్రమించి మరలఁబ్రవేశించి)

మహారాజా! జయము జయము. దేవరవారికిఁ బ్రియము నివేదించెదను. గోగ్రహణము నివారింపఁబడినది. ధార్తరాష్ట్రులు మరలిపోయిరి.

భగవా—రాజా! అదృష్టవశమున నీవు వర్ధిల్లుచున్నాఁడవు.

రాజు—కాదు కాదు. దేవరవారియనుగ్రహమువల్లనే యీ యభివృద్ధి కుమారుఁ డిప్పు డెక్కడున్నాఁడు?

భట—ఉత్కృష్టకార్యములఁ జేసిన యోధపురుషులకర్మల నిప్పుడు కుమారుఁడు పుస్తకములో వ్రాయుచున్నాఁడు.

రాజు—అట్లయిన నిప్పుడు కుమారుఁడు శ్లాఘనీయవ్యాపారముఁ జేయుచున్నాఁడు.

తే. గీ. శ్లాఘనీయకర్మంబులు సలిపి, యాజి
గాయపడినయోధునకును క్ష్మావిభుండు
మెచ్చి తగినట్టిబహుమాన మిచ్చెనేని
నతనివేదన శమియించు నందువలన. 28

ఇప్పుడు బృహన్నల యెక్కడ నున్నది?

భట—ఈప్రియవార్త దెలుపుట కభ్యంతరమందిరముఁ బ్రవేశించెను.

రాజు—అట్లయిన బృహన్నలను బిలుచుకొనిరండు.

భట—మహారాజుగారు సెలవిచ్చినట్లు జేసెదను.

(అంతట బృహన్నల ప్రవేశించును.)

బృహన్నల—(నిరూపించి విమర్శముతో)

సీ. ఆతతగుణమైన యాండీవముతో ము
హూర్తకాలం బయ్యె యుద్ధమట్లు
నారాచపరివర్తనంబులపిడికిలి
నిముసంబు తిన్నగా నిలువదయ్యె
చటులగోధాస్థానపటిమమైనను లేద
యినశత్రుసౌష్టవం బెల్లఁ జెడియె
స్త్రీభావమున మున్ను శిథిలమయ్యెను నాత్మ
యవ్వాల నెప్పటియట్టు లయ్యె

తే. గీ. వీరిఁ గలిగించునట్టియీవేసముననె
నేను విల్గొని యేసితి నృపులయెదుట
నాదుశరవర్షముల నిమగ్నమయి పోయె
రణసముద్ధితకలుషపరాగ మెల్ల. 30

అహో!

తే. గీ. గ్రోగ్రిహణ మాపి జయముఁ గైకొంటిఁగాని
హర్ష ముదయింపదయ్యె నా కందువలనఁ
బవరమున దుస్ససేనునిఁ బట్టి కట్టి
విరటుపురిఁ జేర్పనందున విక్రమించి. 31

ఉత్తర ప్రీతితో నాకొసఁగినయలంకారములను మేన సింగారించుకొని యీమహారాజుం జూచుటకు నాకు సిగ్గగుచున్నది. ఎట్లయిన విరాటేశ్వరుం జూచెదను. ఓహో! పూజ్యుఁడైనయుధిష్ఠిరుఁడిదిగో!

సీ. యౌవనయుతుఁడయ్యు ననయంబు శ్రోత్రియ
పోవనాసక్తిచేఁ బొలుచుచుండు
ధారుణీనాథుఁడై దనుచుండియును బ్రా
హ్మణవృత్తి నీతఁ డాశ్రియముఁ జేసె,
పారిజ్యసామ్రాజ్య విరహితుఁ డై యుండియు
భాసిల్లుచుండు సంపదలుతోడ
ధరణీశు దండంబు ధరియింప కుండియు
ధరియించినాఁడు త్రిదంత మౌర ! 32

(సమీపించి) భగవానుఁడా ! నమస్కారము.

భగవా—శుభ మగుఁగాక !

బృహన్న—రాజా ! జయము. జయము.

రాజు :—

ఉ. కాదు కులంబు కారణము, కాదు సురూపముకారణంబు మ
ర్యాదకు, నీచులందు ఘనులందు సుకర్మమె తేజరిల్లు, ము
న్నేది పరాభవంబునకు హేతువొ యావికృతస్వరూపమే
యాదరపాత్రమైనది బృహన్నలయం దిపు డద్భుతంబుగన్. 33

బృహన్నలా ! నీవు మిక్కిలి యలసియుండినను వెండియు నిన్నాయాసపెట్టఁ గోరుచున్నాను. రణవృత్తాంతము విస్తరించి చెప్పుము.

బృహన్న—దేవా ! ఆకర్ణింపుఁడు.

రాజు :—చేసినకార్యము గొప్పది. గంభీరభాషణములఁ జెప్పుము.

బృహన్నల—మహారాజా ! చిత్తగింపుఁడు.

భటుఁడు—(ప్రవేశించి) మహారాజా ! జయము. జయము.

రాజు :— తే. గీ. నీదుహర్ష మపూర్వమై నెగడుచున్న
దిట్టి విస్మయంబునకును హేతు వేమి?

భటు— దేవ ! మిక్కిలి ప్రియము ప్రాప్తించె నిపుడు
పట్టుబడిమె సౌభద్రుిండు బవరమందు. 34

బృహ—(పైకి) ఏమి ! పట్టుబడినాఁడా ? (తనలో)

చం. అరిబలమున్ గణించితి రణావనిఁ దోలితి విక్రమంబునన్.
గురుశతమధ్యమందుఁ గనుఁగొంటిని మాయభిమన్యు దూరమం
దరయ విరాటుసైన్యమున నాతని కెవ్వఁడు లేఁడు తుల్యుఁ, డె
వ్వరు గొని తెచ్చియుందురొకో బాలుని ? చచ్చిరిగాదె! కీచకుల్. 35

భగవా—బృహన్నలా ! అది యెట్లు ?

బృహ—మహాత్మా !

తే. గీ. ఎవఁడు వానిని బట్టెనో యెఱుఁగఁజాల
నాతఁడు సుశిక్షితుండు శస్త్రాస్త్రవిద్య

జనకులేవురిభాగ్యదోషమునఁ జేసి
బాలకుం డిప్పుఁడెట్టులోఁ బట్టువడియె. 36

రాజు:—అతఁ డిప్పు డెట్లు పట్టుబడినాఁడు.

భటు— తే. గీ. సందియము నొందకే జేరి స్యందనంబు
దెంపి చేతులతోడఁ గ్రిందికి నెవండొ.

రాజు.—ఎవడు ?

భటు— వంటవాఁడుగ దేవరవారిచేత
నెవఁడు నియమింపఁబడెనొ వాఁడే యతండు. 37

బృహన్న—(తనలో) అట్లైన బాలకుఁడు భీమునిచేత నాలింగనముచేయఁబడెఁ గాని పట్టుబడలేదు.

తే. గీ. దూరమందునె జూచి సంతోషమొందు
నట్టిభాగ్యంబు మాత్రమే యబ్బె మాకు,
నురుబలాఢ్యుఁడైనట్టివృకోదరుండె
యనుభవించెఁ బుత్త్రప్రేమ తనివిదీర. 38

రాజు:—అట్లైన నభిమన్యుని సత్కరించి తీసికొనిరండు.

భగవా—ఓరాజా ! వృష్ణిపాండవనాథుఁడైనయభిమన్యునకు నీవు సేయుసత్కారము భయపడిచేసితివని లోకము తలంగును. కావున నతనికిఁ బరాభవమే కర్తవ్యము.

రాజు:—యాదవీపుత్త్రుఁడు పరాభవమునకుఁ దగఁడు. ఏలయన,

సీ. అతఁడు యుధిష్ఠిరునాత్మజుం డది గాక
వాఁడు, నాకొడుకొక్కయీడువాఁడు
పాంచాలరాజసంబంధంబుచే నభి
మన్యుండు మాకు ముమ్మనుమఁ డగును

ఆఁ॥ పిల్లలు గలవాఁడ నౌటను నాకు
నల్లుఁడు గావచ్చు నచిరముననె
అవి యట్టులుండఁ బూజార్హుఁడౌనతిథిగా
వచ్చు, నిష్టులు నాకుఁ బాండుసుతులు. 39

భగవా—అది యాలాగున సమర్థింపనువచ్చును. పరిహసింపను వచ్చును.

రాజు—అట్లైన నాతని నిప్పుడెవ్వరు పరివేశపెట్టెదరు?

భగవా—బృహన్నలయే పరివేశపెట్టవచ్చును.

రాజు—బృహన్నలా! అభిమన్యునిఁ దీసికొనిరమ్ము.

బృహ—మహారాజుగారియాజ్ఞపరికారముచేసెదను. (తనలో) ఈపనికి న న్నెప్పుడు నియోగింతురా యని చాలాసేపటినుండి యువ్విళులూరుచుంటి. ఇప్పుడు లబ్ధమైనది.

భగవా—(తనలో)

సీ. శ్వేతవాహనుఁ డిప్డు స్వేచ్ఛగాఁ దనప్రియ
సూనునిఁ గనులారఁ జూడవచ్చుఁ
నొంటిపాటున వాఁడు కంటఁబడినయెడఁ
జెచ్చెరఁ గౌఁగిటఁ జేర్పవచ్చు
నానందబాష్పంబు లభిషేక మొనరింప
నతనిమూర్ధంబు ముద్దాడవచ్చు
నా యెట్టయెదుటనె నందను నీరీతిఁ
జేయంగ నీతండు సిగ్గుపడును 40

రాజు—నాకుమారుని విక్రమముఁ జూడు!

తే. గీ. భగ్నులైరి భీష్మాదులౌ పార్థివేంద్రు,
లిట్టె సౌభద్రుఁడును నేఁడు పట్టు బడియె.
నుత్తరునిచేత నవలీల, నుర్వి లోన
నగము నిర్జింపఁబడియెను సగమింత, 41

(అప్పుడు భీమసేనుఁడు ప్రవేశించును.)

భీమ—

చ. అలజతుగేహదాహసమయంబునఁ దల్లిని నన్నదమ్ములన్
నిలిపి భుజద్వయంబుపయి నే నవలీలను మోసినాఁడఁ గో
మలతనుఁ డైనబాలు నభిమన్యు, రథంబుననుండి దింపుచోఁ
గలిగిన యీశ్రమం బపుడు గల్గదునా కని నేఁ దలంచెదన్. 42

కుమారా! యిటుయిటు

(అప్పుడు డభిమన్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

అభిమ—అహో! యెవఁ డితఁడు?

తే. గీ. అతివిశాలవక్షుఁడు నున్నతాంసయుతుఁడు
సన్ననినడుమువాఁ డురుకటిస్థలమువాఁడు
బాహుయంత్రితుఁ జేసి నన్బట్టుకొన్న
గలుగ దించుక పీడయు గాత్రమునకు. 42

బృహన్న—కుమారా! యిటు. ఇటు.

అభి—ఈరెండవయతఁ డెవఁడు?

మ. ప్రమద ల్వెట్టినయుజ్యమానమణిదీవ్యద్భూషలం దాల్చి వే
సమునం దెంతయు నల్పుఁడయ్యు నురుతేజస్స్ఫూర్తిఁగొన్నట్టిగా
త్రమహత్వంబున నాఁడుయేనుఁగులయందంబును మత్తేభమ,
ట్లుమహారూపంబును దాల్చుశంభుఁడటులెంతో దర్శనీయుండగున్ 44

బృహ—(అపవారించి) ఇతని నిక్కడకుఁ మాయన్నగా రెం
దుకుఁ దీసికొనివచ్చెను?

తే. గీ. ఓటిమాట పుట్టును నాజి నోడె ననుచు
వగచును సుభద్ర ప్రియపుత్త్రుఁ బాయుకతన
వాసుభద్రుఁ డల్కనుబూను వానిమీఁద
బాహుసారంబు చెడెఁ బలుపలుకులేల? 4:

భీమ—అర్జున!

బృహ—ఔ నేను ఇతఁ డర్జునపుత్త్రుఁడే

భీమ—(అపవారించి)

చ. ఎఱుఁగుదు నిన్ని దోసములు నీతనివానని నిగ్రహంబుచే
నటవశమందు నెవ్వఁడు నిజాత్మజుఁ డుండఁగఁ జూచి సైఁచు, ని
త్తఱి తనయానురాగయగు ద్రౌపది దుఃఖనిమగ్నయౌట నా
గరిత కుమారుఁ జూచి కడుకౌతుక మూనునటంచుఁదెచ్చితిన్. 4

బృహ—(అపవారించి) అయ్యో! యాతనిమాటలు వినవలె
నని నా కెంతో కుతూహలమగుచున్నది. మీ రాతినిఁ బలుకరింపుఁడు.

భీమ—మంచిది అభిమన్యుఁడా!

అభిమ—అభిమన్యుఁడా?

భీమ—నామాట కితఁడు కోపించుచున్నాఁడు. నీవ వలుక
రింపుము.

బృహ—అభిమన్యుఁడా!

అభిమ—ఎట్టెట్టు! ఓయీ! నే నభిమన్యుఁడనా?

తే. గీ. క్షత్రియుల నేర! నీచులు సైత మిట్లు
పిలుచుచున్నారుగద వట్టిపేళ్లు బెట్టి
ఇదియ మర్యాదగాఁబోలు! నీస్థలమునఁ
బట్టుపడియుంట నీపరాభవము గల్గె. 47

బృహ—అభిమన్యుఁడా! నీతల్లికి క్షేమమా?

అభి—ఏమేమి! మాతల్లియా?

క. పడఁతులవార్తల సైతం
బడిగెదు మాయయ్యయట్ల, యడుగుట కీ వె
వ్వఁడ,ఃవాయుధిష్ఠిరుండవా?
వడముడివా? ధనంజయుఁడవా? వడిఁ దెల్పఁగదే. 48

బృహ.—అభిమన్యుఁడా! దేవకీనందనుఁ డగు కేశవుఁడు సుఖముగా నున్నాఁడా?

అభి.—ఏమిది! మహానుభావుఁడైన యాయననుగూడ వట్టిపేరుపెట్టి యడుగుచున్నావా? సరే సరే. నీయనుగ్రహముచేత సుఖముగా నున్నాఁడు.

(ఉభయులు నొండొరులఁ జూచుచున్నారు.)

అభి.—ఏమిది! నన్నుఁ జూచి మీరు నవ్వుచున్నారు.

బృహ.—మఱేమియు లేదు.

తే. గీ. సమరవిజయుండు విజయుండు జనకుఁడంట
మానధనుఁడైనమధువైరి మామయంట
బిన్నవాఁడు కృతాస్త్రుఁడై యున్నవాఁడు
ఆలమందు బరాజితుం డయ్యె భళిర! 49

అభి.—

తే. గీ. సుగుణమున్నను దన్నుఁ దాఁ బొగడుకొనుట
మాకులమ్మున కుచితకర్మమ్ము గాదు
కూలినభటులమీఁది యల్గులను జూడు
వానిమీఁదను నాపేరె గానఁబడెడు. 50

బృహ.—(ఆత్మగతము) కుమారుఁడు చక్కఁగాఁ జెప్పినాఁడు.

తే. గీ. స్యందనతురంగ గజయుతసైన్యమందు
నితనిచే దెబ్బదిననివాఁ డెవఁడు లేఁడు
రథ మితనిబాఱినుండి మరల్పకున్న
నేను దినియుందు దెబ్బ లీనిపుణువలన. 51

పరిహాసముగా) ఈ గర్వోక్తులతోఁ బ్రయోజనమేమి? ఆపదాతిచేతఁ బట్టువడితివిగదా?

అభి—

తే. గీ. అత( డశస్త్రుఁడై నాపాలి.కరుగుదెంచెఁ
బట్టువడినాఁడ నప్పుడు భీమునుజెంది
శస్త్రహీనుని నెవ్వాఁడు చంపఁగలఁడు?
తండ్రియైనధనంజయుఁ దలఁచుకొన్న. 52

భీమ—

తే. గీ. అర్జునుఁడు నేఁడు కృతకృత్యుఁ డైనవాఁడు
వినఁదగినయట్టి రెండును విన్నకతనఁ
దనయురణపరాక్రమమును దనయునోటఁ
దనదుగుణకీర్తనంబును దనివి దీర.53

రాజు—అభిమన్యుని వేగముగాఁ దీసుకొనిరండు.

బృహ—కుమారా! యిటురమ్మిటురమ్ము. ఆయనయే మహారాజుగారు. కుమారా! సన్నిధికిఁ బొమ్ము.

అభి—ఓహో! ఎవరికి మహారాజు?

బృహ—కాదు. కాదు. ఆయన బ్రాహ్మణునితోఁ గలిసియున్నాడు.

అభి—బ్రాహ్మణునితోఁ గలిసియున్నాఁడా? మహాత్మా! నమస్కరించుచున్నాను.

భగవా—కుమారా! రమ్ము. రమ్ము.

తే. గీ. ధైర్యమును వినయంబు శౌండీర్య మాత్మ
పక్షదయ చాపనైపుణి పౌరుషంబుఁ
బడయుమయ్య నీజనకునివలనఁ గొనుము
తక్కుగొనములు తక్కినతండ్రులకడ. 54

రాజు—కుమారా! రమ్ము. రమ్ము. నాకేల నమస్కరింపవు? (తనలో,) క్షత్రియకుమారుఁడు గర్విగదా! నేను వీనిదర్ప మడఁచె

దను. (పైకి) ఇతఁ డెవరిచేతఁ బట్టుపడెను?

భీమ—మహారాజా! నాచేత.

అభి—"అశస్త్రుఁడనైన నాచేత" నని చెప్పుము.

భీమ—పాపము శమించుఁగాక! శమించుఁగాక!

తే. గీ. గురుతరంబులు పీనాంసకోమలములు
నైనయట్టిబాహువులె నా కాయుధములు
అవియ యాధారములుగ నే నని యొనర్తు
దుర్బలులె సుమి చేతఁ దాల్తురు ధనుస్సు.

అభి—ఓయీ! కాదు, కాదు.

తే. గీ. బాహు లెవని కక్షౌహిణీబలమొ, యెవని
విక్రమంబు నిర్వ్యాజమై వెలయు నవని
నట్టిమధ్యమజనకుండ వగుదువో కా!
యతనికే జెల్లు నీమాట లరసి చూడ.

భగవా—కుమారా! ఆమధ్యముఁ డెవ్వఁడు ?

అభి—వినుఁడు! అయ్యా! మేము బ్రాహ్మణుల కుత్తరముఁ జెప్పము. మఱి యెవ్వరేని నడుగవచ్చు.

రాజు—సరె! సరె! నే నడుగుచున్నాను చెప్పు! ఆమధ్యముఁ డెవఁడు ?

అభి—వినుఁడు!

తే. గీ. గట్టిగా బాహువులు మెడఁ జుట్టివైచి
యాజరాసంధుఁ బట్టి యిట్టట్టు లూఁపి
దారుణవధంబుఁ గావించి తద్యశంబు
నెతఁడు కృష్ణుని కిచ్చెనో యతఁడె సుండి.

రాజు—

తే. గీ. కుఱ్ఱ! నీదుత్క్షేపముల కేఁ గోపగింప
నలరుచుందును మదిని నీ వలుక బూన,

నిప్పుడే నేమనిన నది తప్పె యయ్యె
నతిథివై యున్న నిన్నుఁ బొమ్మనుట యెట్లు?

అభి—నేను మీయనుగ్రహంబునకుఁ బాత్రి మగుదునేని-

తే. గీ. నిగ్రహోచితమర్యాద నెఱపుమయ్య
నాదు పాదయుగ్మమునకు మేదినీశ!
బాహువులతోనె నను మీరు బట్టియుంటి
బాహువులతోనె విడిపించు సడముడి నను.

(అప్పు డుత్తరుఁడు ప్రవేశించును.)

ఉత్తర—

తే. గీ. అప్రశస్తంబుగాదె! మిథ్యాప్రశంస,
యనృతవచనంబులను నెవ్వ రాదరింతురు?
సమర మేనె గెల్చితి నంచు జనము లిపుడు
చెప్పుకొనుటచె మదిలోన సిగ్గు గలిగె.

(సమీపించి) మహాత్మా! నమస్కరించుచున్నాఁడను.

భగవా—శుభమగుఁగాక!

ఉత్తర—తండ్రీ! నమస్కరించుచున్నాఁడను.

రాజు—కుమారా! రమ్ము రమ్ము. ఆయుష్మంతుఁడవు గమ్ము. అబ్బాయీ! విక్రమము నెఱపిన యోధపురుషులను బూజించితివా?

ఉత్తర—పూజించినాను. కాని, పూజ్యతమున కిప్పుడు పూజ చేయవలయును.

రాజు—కుమారా! ఎవరికి?

ఉత్త—పూజ్యుఁడైన ధనంజయునకు

రాజు—ధనంజయుఁడ వనెద వేమి?

ఉత్తర—ఔను! అతనికొఱకే.

తే. గీ. ఆశ్మశానమునుండి శరాసనంబు
నక్షయశరతూణీరంబు నతఁడు తెచ్చి
భగ్న మొనరించి భీష్మాదిపార్థివులను
మమ్ము సైతము రక్షించె మానవేంద్ర!

బృహ.—మహారాజా! అనుగ్రహింపు మనుగ్రహింపుము.

తే. గీ. చిన్నవాఁడౌట సంభ్రాంతచిత్తుఁ డగుచు
నిట్లు భాషించుచున్నవాఁ డెఱుక లేక,
సలిపి యుత్కృష్టకర్మలు స్వయముగానె
పరుల కారోపణముసేయు వాఁటి నహహ.

ఉత్త.—ఒకయానవా లున్నది. అది మీశంక నివారింపఁ గలదు.

తే. గీ. గూఢమైయున్న దితనిప్రకోష్ఠమందు
ననఘ! గాండీవగుణహతలబ్ధి నకిణము
కడచియున్నఁ బండ్రెండేండ్లకాల మహహ!
మాయలేదు తద్వర్ణ మేమాత్ర మైన.

బృహ.—

తే. గీ. కంకణంబులు రాపాడుకతనఁ గాయ
కాఁచియున్నది నామణికట్టుమీఁద
నేఁడు గోధను ధరియించినాఁడ గాన
నూతనంబుగఁ గనఁబడుఁ బ్రాఁతకిణము. 64

రాజు.—చూతములే

బృహ.—

తే. గీ. కాలకంఠశరావిద్ధగాత్రుఁ డైన
భారతార్జునుఁ డేనైన పక్షమందు

భీమ బలశాలి యైనట్టి భీముఁ డితఁడు
భరతకులదీపకుఁడు యుధిష్ఠిరుఁ డితఁడు. 65

రాజు.—ఓధర్మరాజా! వృకోదరా! ధనంజయా! నన్ను మీ రెందుకు నమ్మలేదు. ప్రాప్తకాలము వచ్చువఱ కూరకుంటిరా? బృహన్నలా! నీ వభ్యంతరమందిరముఁ బ్రవేశింపుము.

బృహ.—మహారాజుగారు సెలవిచ్చినట్లు సేసెదను.

భగవా.—అర్జునా! ప్రవేశింపవద్దు. మనప్రతిన చెల్లిపోయినది.

అర్జునుఁడు.—అన్నయ్యా! మీరు సెలవిచ్చినట్లు చేసెదను.

రాజు.—

తే. గీ. సత్యసంధులు శూరులు శాంతమతులు
పావనులు ప్రతిజ్ఞాపరిపాలకు లగు
పాండుపుత్త్రులు మాయింట నుండఁబట్టి
మాకులం బయ్యె విగతకల్మషము నేఁడు. 66

అభిమ.—ఓహో! పూజ్యులయిన నాతండ్రులా వీరు. అందుచేతనే గదా వారు,

తే. గీ. నేను వారి నాక్షేపింపఁ బూన రల్క
దేటనవ్వులతో నన్ను దెప్పినారు
ఆహా! గోగ్రహణంబు శుభాంతమయ్యె
దానివలన నాజనకులు గానఁబడిరి. 67

(భీమసేనునిఁ జూచి)

క. మును నజ్ఞానముచే వం
దన మే నొనరింపనైతిఁ దండ్రీ! నీకుఁ
దనయునియపరాధంబును
గినియక క్షమియింపవయ్య కృపఁబూని మదిన్. 68

భీమ—కుమారా! రమ్ము. రమ్ము. పితృసదృశ పరాక్రముఁడవు గమ్ము. నీతండ్రికి నమస్కరింపుము.

అభి—ఓతండ్రీ! నమస్కరించుచున్నాఁడను.

అర్జునుఁడు—కుమారా! రమ్ము. రమ్ము.

తే. గీ. ఆహాహా! యీపుత్రగాత్రసమాగమంబు
సహృదయాహ్లాది యై వివశంబుఁ జేయుఁ
బదియు రెండేండ్ల యెడబాటుపిదప మరల
సంభవించుటనే హెచ్చు సంతసంబు. 69

పుత్రా! విరాటేశ్వరునకు వందనంబు సేయుము.

అభి—అయ్యా! నమస్కరించుచున్నాఁడను.

రాజు—వత్సా రమ్ము. రమ్ము.

ఆ. వె. ధర్మతనయు విపులధైర్యసారంబును
భీముబలముఁ బార్థు విక్రమంబుఁ
గవలచక్కఁదనముఁ గాంతిసంపదయును
గృష్ణుయశముఁ గలిగి యెసఁగుమన్న 70

(తనలో) అర్జునుఁ డుత్తరతోఁ గలసియుండుట నన్ను బాధించుచున్నది. ఇప్పుడేమి సేయుదును? ఆఁ! తెలసినది. (పైకి) ఎవఁడక్కడ?

భటుఁడు—(ప్రవేశించి) మహారాజా! జయము. జయము.

రాజు—జలముఁ దీసికొనిరమ్ము.

భటుఁడు—చిత్తము (అనినిష్క్రమించి తిరిగి ప్రవేశించి) ఇదిగో! జలము.

రాజు—అర్జునా! గోగ్రహణ విజయశుల్కముగా మాయుత్తరను నీవు పరిగ్రహింపుము.

భగవాను—తల వంచుకొనుచున్నాఁడను.

అర్జును—ఓ రాజా! నాచరిత్రము మలినమగుచున్నది.

తే. గీ. మాతృభావంబు నెఱపుచు మనినవాఁడ
రాణివాసంబునెడ మహారాజ! నేను
నా కొసంగినయుత్తర నాకుఁ గాక
నాకుమారునికొఱ కేను స్వీకరింతు 71

భగవా—ఇప్పుడు తలయెత్తుకొనఁ గలిగితిని.

రాజు—సరే! పితామహుని సన్నిధికి మనయుత్తర కుమారునిఁ బంపుదము. ధర్మరాజా! వృకోదరా! ధనంజయా! మీరందఱిటురండు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము.

శ్రీరస్తు.

# పంచరాత్రము

## తృతీయాంకము.

(అంతట భటుఁడు ప్రవేశించును.)

భటు—ఓహో! సకలక్షత్రాచార్యపురస్సరులగు క్షత్రియుల కీవార్త నివేదింపుఁడు. నివేదింపుఁడు. శత్రువులు,

తే. గీ. విష్ణుచక్రభయంబును విడిపెట్టి
బంధులఁ జిరప్రనష్టులఁ బరిభవించి
కౌరవులు విండ్లుఁ బూనియుఁ గావరేమిఁ
బట్టి రభిమన్యు నీసిగ్గుఁ బాపుకొనుఁడు.

(అంతట భీష్మద్రోణులు ప్రవేశింతురు)

ద్రోణ—సూతుఁడా! చెప్పు చెప్పు.

తే. గీ. ఎవఁడు నాశిష్యపుత్త్రు హరించె, నెవఁడు
ప్రతిఘటించు నాదివ్యాస్త్రపంక్తి నిప్పు
డయ్యది పురుషసారమో యస్త్రబలమొ
చెప్పు, దూత నంపెద వానిచెంత కిపుడు 1

భీష్మ—సూతుఁడా! చెప్పుచెప్పు.

తే. గీ. సంగరపరాజయముల దోషము లెఱుఁగక
జన్వాసపుఁగర్వమున వాఁడు జాగు సేసె
నిల్లయూథంబు సనఁ జిక్కు నేనుపిల్ల
గాఢముగ గజగ్రహణైకకుశలుచేత 2

(అప్పుడు దుర్యోధనుఁడు, శకుని, కర్ణుఁడు ప్రవేశింతురు.)

దుర్యో—సూతుఁడా! చెప్పు చెప్పు. అభిమన్యుఁ డెవ్వనిచేఁ బట్టువడెను? నేనే యాతని విడిపించెదను. ఎందుచేత నన?

తే. గీ. వానితండ్రిలతో నాకువైర మగుట
నవని జనులు నాదోసమేయందురి మొదట
నాసుతుఁడు వాఁడు పిదపఁ బాండవులకొడుకు
పగగలుగుఁగాక! బాధ్యులే బాలురందు. 4

కర్ణ—గాంధారీనందనా! అతిస్నిగ్ధముగాను ననురూపముగాను జెప్పితివి.

మ. అభిమన్యుం డలభావుభావమునఁ గాఁ డాపన్నుఁ డీవేళఁ దా
నభిమానంబున వచ్చె నాపనికిఁగా వ్యాపన్నుఁ డయ్యెం జుమీ!
రభసం బేర్పడ వాని నాహవమునన్ రక్షింపలేనైతి, మీ
ప్రభువుల్ శస్త్రము లుజ్జగించి యిఁక నారల్గట్టుటొప్పు న్గడున్

శకుని—సౌభద్రుఁడు బహుసాధుఁడు గదా! విడిచిపెట్టఁబడి నట్లే యెంచుకొనవచ్చును. ఎందుచేత నన!

చ. హరినిఁ దలంచియైన, నతఁ డర్జుననందనుఁడంచు నైన, దు
ర్భరహలధారియైన బలరామునకు న్భయమొందియైన, న
వ్విరటుఁడె వానినిన్ విడిచిపెట్టఁగవచ్చును, కానిచో వృకో
దరుఁ డసహాయుఁడై గెలిచిదాయల, నయ్యభిమన్యుఁదెచ్చెడున్ 6

ద్రోణ—సూతుఁడా! చెప్పుచెప్పు. ఎట్లు పట్టుబడెను?

సీ. భగ్నమైనదొ తేరు, పాఱెనో హయములు
చక్రముల్ గ్రుంగెనో క్ష్మాతలమున,
క్షీణశరంబయి చెడినొ తూణీరంబు
జ్యావల్లి తెగి విల్లు జాఱి పడెనొ

యిట్టియాపదలె ప్రాయికముగాఁ బ్రాప్తించు
రథికుల కెప్పుడు రణములందుఁ
పరులబాణములచే భంజింపఁబడువాఁడె
దక్షుండు, వాఁడె సుశిక్షితుండు.

సూతుఁడు—ఆయుష్మంతుఁడా! ధనుర్వేదము పరుషమయము మీకుఁ దెలియదా?

తే. గీ. ఈవు చెప్పినదోసంబు లెవ్వి లేవు
అతఁడు బాణౌఘసహితమహారథుండు
ఆరథ మ్మాతచక్రిసమాన మయ్యె
యెవ్వఁడో పదాతిపైఁ బడి యిట్టె పట్టె

అందరు—ఏమి! పదాతిచేతనా? ఆపదాతి యెట్టివాఁడు?

సూతుఁ—చెప్పవలసిన దేది? అతని రూపమా? పరాక్రమమా?

భీష్మ—రూపముచేత స్త్రీలు వర్ణింపఁబడుదురు. పురుషులు పరాక్రమముచేతనే కావున నతనిపరాక్రమమే వర్ణింపుము.

సూతుఁ—ఆయుష్మంతుఁడా!

దుర్యోధ—

తే. గీ. ఎవనినో మెచ్చి పొగడంగ నేల? యిట్టు
లమితగర్వాక్షరంబుల హద్దు లేక,
యతఁడు జవమందుఁ బవమానుఁ డైనను సరె
భయము నా కించుకయు లేదు వడిగఁ జెప్పు.

సూతు—మహారాజా! వినుండు,

తే. గీ. రభసమున నాపదాతి గుఱ్ఱముల దాఁటె,
కూబరము మీఁదఁ జెయివైచి కొంకు లేక
మెడలు సాచి గుఱ్ఱంబులు మెదలవయ్యెఁ
గట్టఁబడినట్టు లరదంబు గదలదయ్యె.

భీష్మ—అట్లయిన నాయుధములు విడిచిపెట్టవలసినదే!

అందఱు—ఎందుకు?

భీష్మ—

తే. గీ. స్యందనజవంబు హృతమైన నన్యమైన
నతఁడు భీమునితోడ నెక్కనని తలంతు,
ద్రుపదపుత్త్రిని సైంధవుం డపహరింప
మును పదాతియై గద వాఁ డతని జయించె.

ద్రోణ—గాంగేయుఁడు చక్కఁగా జెప్పెను. బాల్యమునం దుపదేశకాలము మొదలుకొని నే నాతనిజవసత్త్వము లెఱుఁగుదును. శస్త్రాస్త్రశాలయందును,

తే. గీ. అమ్ము చెవియంటఁ దిగిచి యయ్యనిలపుత్త్రుఁ
డేయఁ దల యూఁచి నే సన్నఁ జేయ నతఁడు
నమ్ము వెంటనె బరువెత్తి యందుకొనును
లక్ష్యమును జేరకయమున్న లావు మెఱసి.

శకుని—ఆహా! మీమాట హాస్యాస్పదముగా నున్నది.

తే. గీ. అన్యులగుబల్లిదులు లేరె యవనిలోన,
నిష్ఠులైనచోఁ బాగడుదు రెంతయేని,
నెఱుఁగుదుము పాండుపుత్త్రుల నెల్లవారు
వారిఁ జూచినవారలు మీరె కారు!

భీష్మ—గాంధారరాజా! నీ వనుమానపడి పల్కుచున్నావు.

తే. గీ. స్యందనము లెక్కి విండ్లను శస్త్రములను
నూని మన మేగుచుందుము యుద్ధములకు,
భుజములను నమ్మి యిద్దతే పోదు రనికి
నమ్మహాబలసుతుఁడు, హలాయుధుండు.

శకుని—

తే. గీ. అమితసాహసప్రియుల మైనట్టిమనము
భగ్న మైతి మొక్కనిచేతఁ బవరమందు
నాతఁ డుత్తరుఁ డైనను నర్జునుఁ డని
పల్కుచున్నారు కొందఱు పాడి దప్పి.

ద్రోణ—గాంధారరాజా! ఈవిషయమునఁ గూడ నీకు సందేహము గలదా?

తే. గీ. పిడుగు పడినట్లుఁ జప్పుడు వెడలఁజేయు
నాధనువు నుత్తరుఁడు వంప నలవి యగునె?
యమ్ములను నేసి వాఁ డెంత నడపఁగలఁడె,
యస్తమింపఁ జేయఁగలండె, యంశుమంతు

భీష్మ—గాంధారీనందనా! విస్పష్టముగాఁ దెలియుచున్నది. నీకుఁ దెలియ లేదా?

తే. గీ. తనదునామాక్షరంబులు దనరుబాణ
సమితి జ్యాజిహ్వనుండి జివ్వుమని వెడల
వింటి నాకర్షణము జేసి విజయుఁ డేసె
సుబలనందన నీచెవి సోఁకలేదె?

సూతుఁడు—(ప్రవేశించి) ఆయుష్మంతుఁడా జయము. జయము., శాంతికర్మ జేయవలయు.

భీష్మ—ఎందుకు?

సూతుఁ—

తే. గీ. బాణజాలంబుచేఁ గొట్టఁబడిననీదు
ధ్వజమునకు శాంతికర్తము దగును జేయ
బాణ మెవనిదో దెలియంగవచ్చు నివుడు
వ్రాయఁబడియె పుంఖముమీఁద వానిపేరు.

భీష్మ—తీసుకొని రా.

సూత—(తెచ్చి యిచ్చుచున్నాఁడు.)

భీష్మ—(పుచ్చుకొని చూచి) వత్సా! గాంధారరాజా! ముస లితనముచే నాకన్ను గనఁబడుట లేదు. ఈబాణముమీఁద నున్న దేమో జదువుము.

శకుని—(పుచ్చుకొని చదివి) ఇది యర్జునునిది. (అని పాఱ వైచును.

(అది ద్రోణునిపాదములపైఁ బడుచున్నది.)

ద్రోణ—(బాణమునుబుచ్చుకొని) వత్సా! రమ్మా. రమ్మా.

తే. గీ. భక్తి గాంగేయునకు మున్ను బ్రణుతి సేయ
విడువఁబడిన యీబాణంబు పిదప నాకుఁ
గ్రమము గా నమస్కృతి సేయఁగడఁగినట్లుఁ
బడియె నాపాదములయొద్దఁ బుడమిమీఁద. 19

శకుని—

తే. గీ. ఉండవచ్చు నర్జునుఁ డనుయోధుఁ, డతఁడు
సాయకము నేసియుండును సాహసమున
నుత్తరుం డైన నది వ్రాసియుండవచ్చు
వాచియాదార్థ్య మంతయుఁ దరచవలయు. 20

దుర్యో—

తే. గీ. వారలకు రాజ్య మిప్పింప వలయు ననుచు
మీ రసత్యంబు భాషింపఁ గోరినయెడ.
నర్ధరాజ్యంబు నిత్తు నే నన్నయట్లుఁ
బాండవాగ్రజుఁ డిటఁ గానఁబడినయెడల. 21

భటుఁడు—(ప్రవేశించి) మహారాజా! జయము. జయము. విరాటనగరమునుండి దూత వచ్చినాఁడు.

దుర్యో—తీసికొని రమ్ము.

భటు— దేవా! చిత్తము. (అని నిష్క్రమించును.)

(అప్పు డుత్తరుఁడు ప్రవేశించును.)

ఉత్తర—

చ. తురగములన్ గడు న్వడిగఁ దోలిన దూరము తక్కు వైన నా
యరదము వచ్చిచేరుటకు నయ్యె విలంబము, పార్థఖండిత
ద్విరదవితాన మద్ధముగఁ, దేరు మహావిషమప్రదేశమం
దరుగుట, వారువంబులు ప్రయాసముచేతను జేరె, నీస్థలిన్. 22

(అంజలిజేసి) ఓయాచార్య! పితామహప్రముఖసకలరాజమండలము
నకు నీకు నమస్కారముఁ జేయుఁచున్నాఁడను.

అందఱు—ఆయుష్మంతుఁడవు గమ్ము!

ద్రోణ—పూజ్యుఁడైనవిరాటేశ్వరుఁ డేమి చెప్పుమన్నాఁడు?

ఉత్తర—ఆయన నన్నుఁ బంపలేదు.

ద్రోణ—అట్లయిన ని న్నెవ్వరు బంపినారు?

ఉత్తర—పూజ్యుఁడైనయుధిష్ఠిరుఁడు.

ద్రోణ—ధర్మరా జేమనెను?

ఉత్తర—వినుఁడు—

తే. గీ. "కోడలయ్యె నా కుత్తర కూర్మిఁగోడ
రాజమండలి దానికై రావలయును
అక్కడా యిక్కడా వివాహంబు జరుగు
టెక్కడో? మీర లది నిర్ణయింపవలయు." 33

అని చెప్పుమన్నాఁడు.

శకుని—అక్కడే. అక్కడే.

ద్రోణ—

తే. గీ. ఇందుకే వచ్చియున్నార మిటకు మనము
పంచరాత్రింబు లింకను మించలేదు

ధర్మమతితోడ నిచ్చినతద్వారంబు
ధర్మమతితోడఁ జెల్లింపఁ దగును గాదె? 24

దుర్యో—

తే. గీ. పూర్వ మే నన్న తెఱఁగునఁ బోరు లేక
బాండవుల కిచ్చితిని రాజ్యభాగ మిపుడు
మరణ మొందక మానరు మనుజులెల్ల
సత్య మాశ్రయించినవారు చావకుండ్రు. 25

ద్రోణ—

తే. గీ. అహహా! మేము బ్రసన్నులమైతి మింక
నెల్లకులసంగ్రహములు వర్ధిల్లఁ జేసి
యీమహీమండలం బెల్ల నేలుఁ గాత!
జిరతరంబుగ మారాజసింహన్నృపుడు. 26

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

పంచరాత్రము సంపూర్ణము.

శ్రీరస్తు.

# ప్రతిమా నాటకము

## ప్రథమాంకము.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్రధారుఁడు—

తే. గీ. అప్రతిముఁడు రావణవైరి యావిభీష
ణాత్మ సీతాభవుఁడు లక్ష్మణాన్వితుండు
భరతుఁడు సుమంత్రతుష్టుఁడు పడఁతిఁ గూడి
ప్రాచు సుగ్రీవరాముండు ప్రతియుగంబు.

(తెరవంకఁజూచి) ఓసీ! యిటు రా.

నటి—(ప్రవేశించి) అయ్యా! ఇదిగో వచ్చితిని.

సూత్ర—ఓసీ! ఇప్పు డీశరత్కాలమునుగుఱించి నీవుపాడుము.

నటి—అయ్యా! అట్లే. (అని పాడుచున్నది.)

సూత్ర—ఈకాలమందు,

ఆ. వె. కాశవసన యగుచుఁ గలహంసి విహరించుఁ
బులినతలములందు ముదము గదుర

(తెరలో) అయ్యా! అయ్యా!

సూత్ర—(విని) సరే! తెలిసినది.

రాచనగరునందుఁ బ్రముదితమై త్వర
పడెఁడు ద్వారరక్షిపగిది నహహా.

(ఇద్దఱు నిష్క్రమింతురు).

ఇది స్థాపన.

(అప్పుడు ప్రతీహారి ప్రవేశించుచున్నది.)

ప్రతీ—అయ్యా! కంచుకులలో నెవ్వఁ డిక్క డున్నాఁడు?

(కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కాంచు—అమ్మా! ఇదిగో వచ్చితిని. ఏమి చేయవలయును?

ప్రతీ—అయ్యా! దేవాసురసంగ్రామములయం దప్రతిహత మహారథులగు దశరథమహారాజుగా రిట్లాజ్ఞాపించుచున్నారు. "కుమారుఁడైన రామునిపట్టాభిషేకమహోత్సవమునకు వలసినసంభారముల ను శీఘ్రముగా సమకూర్పవలసినది." అని

కాంచు—అమ్మా! మహారాజుగా రాజ్ఞాపించినట్లు సర్వము సిద్ధమైనది. చూడు!

సీ. ఛత్త్రచామరములు సమకూర్పఁబడె, నంది
పటహంబుగలగద్దె ఘటితమయ్యె
దర్భలు బూలు తీర్థజలంబుఁ గల్గిన
పసిఁడికుండలు సిద్ధపఱుపఁబడియె
నాయత్తమయ్యెఁ బుష్యరథంబు మంత్రిస
హితులయి పౌరులు నేఁగుదెంచి
రంతయు మంగళం బయ్యె వసిష్ఠుఁడు
వేది నధిష్ఠించె వేడ్క మీఱ.

ప్రతీ—అట్లయిన నంతయు శుభావహ మైనది.

కాంచు—ఓహో!

తే. గీ. రాముఁ డనియెడుచంద్రుని భూమి మీఁదఁ
గనులు చల్లగ నిల్పినకారణమున
దశరథక్షితిపాలవతంస మిప్పుడు
ప్రజలఁ గృతకృత్యులను జేసె బడసెఁ గీర్తి.

ప్రతీ—అయ్యా! త్వరపడుఁడు. త్వరపడుఁడు.

కాంచు—అమ్మా! ఇదిగో త్వరపడుచున్నాఁడ.
(అని నిష్క్రమించును.)

ప్రతీ—(నడచి చూచి) అయ్యా! సంభవక! సంభవక! మహారాజుగారియాజ్ఞాప్రకారము నీవును వెళ్ళి పూజ్యుఁడైనపురోహితుని యథోపచారములచేతఁ ద్వరపెట్టుము (మఱొకచోటికిఁ బోయి) సారసిక! సారసిక! సంగీతశాలకుఁ బోయి "కాలోచితమైననాటకమును బ్రయోగించుటకు మీరు సిద్ధముగా నుండుఁ"డని నాటకీయులతోఁ జెప్పుము. ఇంతలో సర్వము సిద్ధమైన దని నేను మహారాజుగారితో విన్నవించెదను. (అని నిష్క్రమించుచున్నది.)

(అప్పుడు వల్కలము చేతబట్టుకొని యవదాతిక ప్రవేశించుచున్నది)

అవదా—అయ్యో! అతికష్టము. ఈవల్కలమును నేను పరిహాసమునకుఁ దెచ్చుచున్నను నా కింతభయము గలుగుచున్న దే! ఇంక లోభముచేఁ బరధనముహరించువారిమాట యేమి? నా కిప్పుడు నవ్వవలెననియున్నది. ఒక్కతె తనలో నవ్వుకొన నేమిప్రయోజనము?

(అప్పుడు సపరివారయై సీత ప్రవేశించుచున్నది.)

సీత—ఓసీ! అవదాతికా! ఏదో యనుమానము గలదానివలెఁ గనఁబడుచున్నావు. అది యేమి?

చేటి—దేవీ—! పరిజనము సులభముగా నపరాధములు చేయుచుండునుగదా! ఏదో తప్పు చేసియుండును.

సీత—కాదు. కాదు. దీనివైఖరి నవ్వులాటగా నున్నది.

అవ—(సమీపించి) దేవీ! జయము జయము అమ్మా! నే నపరాధురాలను గాను.

సీత—ని న్నెవరడిగినారు? అవదాతిక! నీయెడమచేతిలో నున్న దేమి ఓ?

అవ—అమ్మా! ఇది వల్కలము.

సీత—వల్కల మెవరియొద్దనుండి తెచ్చితివి?

అవ—అమ్మా! వినుము నేపథ్యపాలినియైన మనరేవనునివృత్త రంగప్రయోజన మగునశోకవృక్షకిసలయమును నా కిమ్మని నేనడిగితిని. ఆమె యది యిచ్చినదికాదు. అందుచే దాని కిదే శాస్తి యని యీవల్కలముఁ దెచ్చితిని.

సీత—అయ్యో! పాపము చేసితివి. వెంటనే పోయి యిచ్చి వేయుము.

అవ—అమ్మా! ఎగతాళికై నేను దీనిని దెచ్చితిని.

సీత—పిచ్చిదానా అట్లైనను దోషమె. వెళ్ళి యిచ్చివేయు మిచ్చివేయుము.

అవ—దేవి యాజ్ఞాపించినట్లు చేసెదను.

సీత—ఓసీ! యిటు రా.

అవ—అమ్మా! ఇదిగో వచ్చితిని.

సీత—ఓసీ! ఇది నా కందముగా నుండునేమో?

అవ—అమ్మా! చక్కనివారి కన్నియుఁ జక్కఁగానే యుం డును. మీరు దీనిని ధరింపుఁడు.

సీత—తెమ్మా! (అని పుచ్చుకొని కట్టుకొని) ఓసీ చూడు ఇది యందముగా నున్నదా?

అవ—నీ కిది యెంతో బాగున్నదమ్మా! నారబట్ట నేమేనఁ బడి బంగారుచీర యైనదమ్మా.

సీత—ఓసీ—! చేటీ! నీ వేమియుఁ బలుకవేమి?

చేటి—మాటలలో నేమిప్రయోజనము ఆనందముచే నామేన బొడమినపులకలే చెప్పుచున్నవి. (అని పులకలుచూపుచున్నది)

సీత—ఓసీ! అద్దము దీసికొనిరా.

చేటి—అమ్మా! చిత్తము. అద్ద మిదిగో.

సీత.—(చేటిమొగము జూచి) అర్ధ మక్కడఁ బెట్టు నీ వేదో చెప్పఁదలఁచుకొన్న ట్లున్నావు.

చేటి.—అమ్మా! నే నొకమాట వింటిని. కంచుకియైన యార్య బాలాకి "అభిషేక మభిషేక" మని చెప్పుచున్నాఁడు.

సీత.—ఎవరో రాజయ్యెదరు.

(మఱియొక చేటి ప్రవేశించుచున్నది.)

చేటి.—భట్టిని! ప్రియవార్త. ప్రియవార్త.

సీత.—ఏమి టేమిటి! ఉత్సాహముతోఁ జెప్పుచున్నావు.

చేటి.—భర్తృదారకుఁ డైన రాముఁడే యభిషేకింపఁ బడును.

సీత.—మామగారు సుఖముగా నున్నారా?

చేటి.—మహారాజుగారే యభిషేకము చేయుచున్నారు.

సీత.—అట్లైన నేను రెండవప్రియము వింటిని. నీయొడి పెద్దది, చేసి పట్టు.

చేటి.—అమ్మా! అట్లె చేసితి.

సీత.—(నగలు తీసి యిచ్చుచున్నది.)

చేటి.—భట్టిని! పటహధ్వనివలె వినఁబడుచున్నది.

సీత.—అదె!

చేటి.—ఒక్కమాఱు మ్రోఁగి పటహశబ్దము వెంటనే యాగి పోయినది.

సీత.—అభిషేకము నెవ్వఁడు ప్రతిఘటించును? కేవల మిట్ల నఁగూడదు. రాజాంతఃపురములు బహువృత్తాంతసమేతములు గదా!

చేటి.—భట్టినీ! కుమారునకుఁ బట్టాభిషేకము జేసి మహారాజుగారు తపోవనమునకుఁ బోవుదు రని నేను వింటిని.

సీత.—అట్లైన నది యభిషేకము గాదు. కన్నీరు తుడుచుటకై,

(అప్పుడు రాముఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రాముఁడు—అయ్యో!

సీ. దుందుభుల్ మ్రోఁగ సద్గురు లెల్లఁ గూర్చుండ
హేమపీఠంబు నే నెక్కియుండఁ
గనకకుంభంబుల స్కంధంబులను వంచి
పుణ్యోదకముఁ దలఁ బోయుచుండ
మాతండ్రి నను బిల్చి మాన్పించెఁ బట్టాభి
షేకోత్సవం బెల్లఁ జిత్రముగను
నచ్చటఁ జేరినయఖిలబాంధవులును
మానవేంద్రులును విస్మయము పడిరి,

తే. గీ. ఇంతమాత్రపుంబనికయి యెల్లవారు
నంత యచ్చెరుపాటును నందనేల
తండ్రియానతిఁ దనయుఁ డాదలను దాల్చి
చేయు టది మేటియే యిందుఁ జిత్రమేమి ? 6.

"కుమారా ! నీవు విశ్రమింపు" మని మహారాజుగారు స్వయముగాఁ జెప్పి నన్ను విడిచిపుచ్చుటచే నామనస్సు గొప్పబరువు దిగినట్లు సుఖముగా నున్నది. అదృష్టవశమున నేను మునుపటి రాముఁడనే. మహారాజుగారు మహారాజుగారే. ఇప్పుడు సీతను జూచెదను.

అవ—భట్టిని ! భర్తృదారకుఁడు వచ్చుచున్నాఁడు. నారచీర విడువవైతివి.

రామ:—మైథిలి ! ఇక్కడున్నావా ?

సీత—అహో ! ఆర్యపుత్త్రిలా. ఆర్యపుత్రా ! జయము. జయము.

రామ:—మైథిలి! కూర్చుండుము. (అని తాను కూర్చుండును.)

సీత—ఆర్యపుత్రా ! చిత్తము. (కూర్చుండును.)

అవ___ కట్టెని! భర్తృదారకుని వేషము మునుపటిదె. అది యబద్ధమై యుండునమ్మా.

సీత___ అటువంటివా రబద్ధమాడుదురా ? అయినను రాజాంతఃపురములు బహువృత్తాంతములు గలవికదా !

రామ:___ మైథిలి! ఏమిటి చెప్పుకొనుచున్నారు ?

సీత___ మఱేమియు లేదు. ఈపిల్ల "యభిషేక మభిషేక"మని చెప్పుచున్నది.

రామ:___ నీకుతూహలమును నే నెఱుఁగుదును. అభిషేకము కొంత నిజము. విను. నేఁడు మహారాజుగారుమంత్రిపురోహితప్రకృతిజన సమక్షమందు నీకోసలరాజ్యము నేకప్రకారసంక్షిప్తముచేసి చిన్ననాఁటనుండి నాకుఁ బరిచితమైన తనతొడమీఁదనన్నుఁ గూర్చుండబెట్టు కొని స్నిగ్ధమైననామాతృగోత్రమును స్మరించి "కుమారా ! రామ ! నీవు రాజ్యము స్వీకరింపు"మని పలికెను.

సీత___ అప్పుడు మీ రేమంటిరి?

రామ:___ మైథిలి! నే నేమందునని నీవూహించితివి ?

సీత___ మీ రేమియు బదులు చెప్పక నిట్టూర్పు విడిచి మహారాజుగారిపాదములపైఁ బడియుందు రని నే నూహించుచున్నాను.

రామ___ లెస్సగా నూహించితివి. తుల్యసీలురగు దంపతులు మిక్కిలి యరుదుగా నుందురు. ఔ నప్పుడు నే నాయనపాదముల మీఁదఁ బడితిని.

తే. గీ ఒక్కమాటె వై మాకు బాష్పోద్గమంబు
మొదట నతనిపై, నాపయిఁ బిదపఁ బడియె
నాదుకన్నీట నాయనపాదయుగము
నతనిబాష్పాళి నామూర్ధ మపుడు తడిసె.

సీత___ తరువాతఁ దరువాత

రామ—అప్పు డాయన న న్నెంతబ్రతిమాలినను నేను సమ్మతింపనందున, నాసన్న జరాదోషములైన తనపాదములమీఁద నతఁ డొట్టుపెట్టికొనెను.

సీత—తరువాత దరువాత?

రామ—అప్పుడు నే నభిషేకమునకు సమ్మతించితిని.

మ. అట శత్రుఘ్నుఁడు లక్ష్మణుండు నభిషేకార్థంబు హస్తంబులన్
ఘటముల్ దాల్చిరి, పట్టె గుబ్బగొడుగు న్మాతండ్రి దుఃఖించి యం
తట నామాయలమారిమంథర వెసన్ రాజేంద్రుకర్ణంబునన్
కట! యేమో వచియించె మెల్ల నభిషేకంబెల్ల దానంజెడెన్.

అందుచే నే రాజును గాలేదు.

సీత—నాఁకిది ప్రియమె. మహారాజుగారు మహారాజుగా, నార్యపుత్రులు నార్యపుత్రులుగా నున్నారు.

రామ—మైథిలి! నీవు నగ లెందుచేతఁ దీసివైచితివి?

సీత—లేదు. లేదు. ధరించెదను.

రామ—కాదు. కాదు. ఇప్పుడే నగలు తీసివైచిన ట్లున్నావు. అట్లె,

సీ. త్వరగ భూషలు దీసి వైవ వంగినపాళ
మ్ములతోడ వెలవెలఁ బోయెఁ జెవులు
కంకణంబులు దీయుకతమున నెంతయు
గౌరవర్ణంబయ్యెఁ గరయుగంబు
నగలభారముచేత నళినాక్షి! నీమేన
సొక్కు నొక్కులువడ్డచోటు లెల్ల
సమతఁ బొందఁగలేదు సుమి యిప్పటికి నైన
నిది సత్యమో కాదొ యీవె చూడు.

సీత—మీరు లేనిదైన నన్నట్లు సమర్థింపఁగలరు.

రామ—అట్లైన నలంకారములు దాల్పుము. నే నద్దము పట్టుకొనియెదను. (అట్లుచేసి నిరూపించి) చూడు.

తే. గీ. అద్దమున నారచీరల ట్లగపడియెడు
భానుకిరణంబులా యివి పద్మగంధి!
యిది విలాసార్థమయి ధరియించితివొకొ,
నియమమో. పరిహాసమో నిజముఁ దెలుపు.

అవతాదికా! ఇది యేమి?

అవదా—దేవా! ఇది తన కందముగా నుండునో యుండదో చూడవలెనని యీామె కట్టుకొన్నది.

రామ—మైథిలీ! ఇక్ష్వాకువంశస్థులకు వృద్ధాలంకార మైన నారచీరను నీ విప్పుడే కట్టితివేమి? దీనిపై నాకును బ్రీతికలదు. దీసికొనిరా.

సీత—వద్దు. వద్దు. ఆర్యపుత్రు లమంగళమువచింపఁగూడదు.

రామ—మైథిలి ఎందుకు నన్ను వారించుచున్నావు?

సీత—మీాకుఁ బట్టాభిషేకభంగమైనది గనుక నిది యమంగళమని నాకుఁ దోఁచుచున్నది.

రామ—

తే. గీ. అలుకఁ దాల్చుట కిందు లే దవసరంబు
మాటలాడుచుంటిమి నవ్వులాటల కిటు
ఎప్పుడు నీమేనఁ దాల్చితో యపుడె నేను
నాశరీరార్ధమునఁ దాల్చినాఁడఁ గాదె? 10

(తెరలో)

హా! హా! మహారాజ!

సీత—అయ్యో! అది యేమి?

రామ—(విని)

తే. గీ. ఆఁడువా రైన మగవార లైన నెవుడు
హద్దు మీఱి యాక్రందన మాచరింతు
రపుడె నిశ్చయంబుగఁ దెలియంగవచ్చు
దైవమే వారిఁ జెఱుపంగఁ దలఁచె ననుచు. 11

ఆశబ్ద మేమొ పూర్తిగాఁ దెలసికొనుఁడు.

(కాంచుకీయుఁడు ప్రవేశించును.)

కాంచు—కుమారా! రక్షింపుము. రక్షింపుము.

రామ—అయ్యా! రక్షింపఁబడవలసినవా రెవరు?

కాంచు—మహారాజుగారు.

రామ—మహారాజుగారా! అట్లైన నేకశరీరసంక్షిప్తమైన పృథివీమండలమే రక్షింపఁబడవలసిన దని చెప్పుము. సరె! ఈదోష మెవరివలనఁ బుట్టినది?

కాంచు—స్వజనమువలన.

రామ—స్వజనమువల్లనా? అయ్యో! ప్రతీకారము లేదుగదా దీనికి—

తే. గీ. పగతుఁ డగువాఁడు దేహంబుపైనఁ గొట్టు
హృదయమును గొట్టు స్వజనుండు కృప దొరంగి
యీస్వజనశబ్ద మెవరికో యెఱుఁగకున్న
సిగ్గుఁ గలిగించుచున్నది చిత్తమందు

కాంచు—పూజ్యురాలైన కైకకు

రామ—ఏమి! తల్లిగారికా? అట్లయిన దీనిలో నుత్తరకాలఫలముగల గుణమేదో యుండవచ్చును.

కాంచు—ఎట్లు?

రామ—విను.

తే. గీ. ఏమహాదేవిభర్త మహేంద్రసముఁడో
యెవతె గారాబుతల్లియై యెసఁగు నాకు
నట్టిపడఁతి కేఫలమందు నాస యుండు
నామె యేటికి కార్యంబు నాచరించు.

కాంచు—కుమారా! చాలు. చాలు. గర్హ్యములైన స్త్రీబుద్ధులయందు నీబుజుభావము నారోపింపకుము. ఆమెమాటవల్లనే నీయభిషేక మాఁగిపోయినది.

రామ—అయ్యా! అందులో సుగుణములు లేకపోలేదు.

కాంచు—ఎటువలె?

రామ—విను,

తే. గీ. వారితంబగుభూనాథు వనగమనము
తండ్రిచాటుబిడ్డ యయి నేఁ దనరుచుండుఁ
గొత్తరాజని కలుగదు గొంకు ప్రజకు
నవరజులు వెలిగారు భోగ్యముల కింక.

కాంచు—తరువాత నామె పిలువఁబడకయే మహారాజుసన్నిధి కరిగి భరతుని రాజ్యాభిషేకము జేయవలె నని కోరెను. ఇందులోను లోపము లేదా?

రాము—అమ్మా! నీవు నావలనిపక్షపాతమున విషయ మెఱుఁగక మాటలాడుచున్నావు. ఎందుచేత నని,

తే. గీ. ఆది నిది శుల్కవిపణీతంబైన రాజ్య
మామె పుత్రార్థ మగుట యాశ్యమైన
భ్రాతృరాజ్యాప హరణతత్పరుల మైన
మనప్రయత్నము లోభమై చనదె చెప్పుమ. 15

కాంచు—తరువాత?

రామ—ఇఁకమీఁద మాతృనింద విన నిష్టము లేదు. మహా

రాజుగారి వృత్తాంతము జెప్పుము.

కాంచు—తరువాత నప్పుడు

తే. గీ. శోకవశమున మాటాడలేక నృపుఁడు
నన్నుఁ బంచెను వేగఁ జేసన్నఁ జేసి
యభిమతం బేదొ యున్నదటంచుఁ దలఁతు
నొడలు దెలియక మూర్ఛిల్లియున్నవాఁడు. 16

రాము—ఎట్టెట్టూ! మూర్ఛనొందెనా?

(తెరలో)

ఎట్టెట్టూ! మూర్ఛ నొందెనా?

సీ. జనకునిమూర్ఛను సైరింపలేనిచో
దయ మాని తాల్పుము ధనువు నీవు

రాము—(విని ముందు చూచి)

తే. గీ. ధైర్యజలధి: యక్షోభ్యచిత్తంబు వాఁడు
లక్ష్మణుఁడు వాని కెవ్వ రల్కను జనింపఁ
జేసిరోగదా! యీకృద్ధచిత్తుఁ జూడ
నెదుట సూర్యుఁరు తిరిగినట్లే కనఁబడు. 17

(అప్పుడు ధనుర్బాణపాణియై లక్ష్మణుఁడు ప్రవేశించు చున్నాఁడు.)

లక్ష్మణ—(క్రోధముతో) ఎట్టెట్టూ! మూర్ఛనొందినాఁడా?

సీ. జనకునిమూర్ఛను సైరింపలేనిచో
దయమాని తాల్పుము ధనువు నీవు
స్వజనుల నమ్మిన సర్వజనంబులు
మెత్తనివారిని మొత్తుచుండ్రి
నీ కిది యిష్టంబు లేకున్న విడువుమీ
నను, మన నిట్లు చేసినకతాన
స్త్రీశూన్యముగఁ జేతు క్షితిమండలం బెల్లఁ
గృతనిశ్చయుఁడ నైతి నిందు నేను. 18

సీత — ఆర్యపుత్రా! దుఃఖింపవలసిన కాలమున సౌమిత్రి విల్లు దాల్చుచున్నాఁడు. అతనియాయాస మపూర్వము గదా!

రామ — సుమిత్రానందన! ఏమిది?

లక్ష్మణ — ఎట్టెట్టూ ఏమిది యని యడుగుచున్నారా?

తే. గీ. అపహరింపఁగఁబడెఁ గ్రమప్రాప్తరాజ్య
మవనిఁ బడియుండె దయనీయుఁ డై నృపుండు
నట్టియెడఁగూడ సందేహ మగునె నీకు?
నిరభిమానమో శాంతమో నే నెఱుంగ.

రామ — సుమిత్రానందనా! నారాజ్యభ్రంశముగూడ నీకుఁ బని గల్పించుచున్నదా? అయ్యో! అపండితుఁడవుగదా నీవు.

ఆ. వె. నృపుఁడు భరతుఁడైన నేనైనఁ దమ్ముఁడా
యది సమంబె సుమ్ము! యరయ నాకు
వింటియందు నీవు వెరపరి వైనచోఁ
గొలిచియుండి కావు మెలమి నతని.

లక్ష్మణ — రోషమును భరింపఁజాలను. సరే సరే. మేముభి వెళ్లెదము. (అని వెళ్ళఁబోవుచున్నాఁడు)

రాము —

ఆ. వె. లక్ష్మణుని లలాటలక్షితం బైన యా
భ్రుకుటి సర్వలోకభీకర మయి
ముజ్జగములఁ గాల్పఁ బూనినయటు లుండె
నిశ్చలమయి కాలనియతి వోలె.

సుమిత్రానందనా ! ఇటు రమ్మ,

లక్ష్మ — అయ్యా! ఇదిగో వచ్చితిని.

రామ — నీకు స్థైర్యము గలిగించుటకు నే నట్లంటిని. ఇప్పుడు వెళ్లెందుకో చెప్పుము!

చ. ధరణిని సత్యసంధుఁడగుతండ్రిపయిన్ ధను వీవు వంచెదో
స్థిరమతి నాత్మవిత్తమును జేకొనుతల్లి శరాగ్ని నొంతువో,
యరయక దోషహీనుఁడగు నాసుగుణున్ భరతు న్వధింతువో
యరయఁగ మూఁడుపాతకములం దెదియుక్తము చెప్పుమిత్తఱిన్.

లక్ష్మ—(కన్నీటితో) హా! నాబతుకేల కాల్పనా? నామాటఁ దెలిసికొనకయే నన్ను నిందించుచున్నారు.

తే. గీ. అమితకష్టపరంపర కాస్పద మగు
రాజ్యమందున నామనోరథము లేదు,
అడవిఁ బదునాలుగేండ్లు నీ వధివసింప
వలయునఁట! దానికయి చాల వగచుచుంటి.

రాము—అందుకుఁ గాఁబోలు నాయనగారు మూర్ఛిల్లినది. అయ్యో! అసామర్థ్యము వ్యక్తమయినది. మైథిలీ!

తే. గీ. ఈమె మంగళార్థంబుగా నిచ్చినట్టి
వల్కలంబులు గొనితెమ్ము త్వరిత మీవు!
అన్యనృపు లింతవఱ కెవ్వ రాచరించి
యెఱుఁగనట్టిధర్మము నేన నెఱపువాఁడ.

సీత—ఇదె! తీసికొనుఁడు.

రామ—మైథిలీ! నీప్రయత్న మేమి?

సీత—నేను మీకు సహధర్మచారిణిని గదా!

రామ—నే నొక్కఁడనే వెళ్ళఁదగుదును.

సీత—అందుచేతనే నేను మీవెంట వచ్చెదను.

రామ—ఉండవలసిన దడవిలో

సీత—అదియే నాకు మేడ యగును.

రాము—అత్తమామలసేవ నీవు చేయవలసినదే కదా!

సీత—వారి నుద్దేశించి దేవతలకొక్కప్రణామము చేసెదను

రాము—లక్ష్మణా! ఈమెను వారింపుము.

లక్ష్మణ—ఈపూజ్యురాలిని శ్లాఘనీయకార్యమునుండి మరల్చుటకు నామన సుత్సహింపకున్నది. ఏలయన,

తే. గీ. విడదు తార చంద్రుని రాహుపీడనైనఁ
జెట్టు కూలినఁ దీఁగయు క్షితిని బడును
బురదఁ జిక్కినపతిఁ బాసిపోదు కరిణి
నెలఁతరానిమ్ము, ధర్మమ్మునెఱపనిమ్ము
భర్తృనాథలు గారొకో పడఁతు లెందు.

చేటి—(ప్రవేశించి) భట్టినీ! జయము జయము. నేపథ్యపాలిని యగు రేవ నమస్కరించి యిట్లు చెప్పుమన్నది. "అవదాతిక సంగీతశాలనుండి వల్కలములు తెచ్చినది. ఈవలఁ కివి యెవ్వరు నుపయోగించినవి కావు. అవియుపయోగించుకొనఁబడుఁగాక!" అని.

రాము—కళ్యాణి! తీసికొని రమ్ము. ఈమె తనివి గాంచును. మేమును గోరుచున్నాము.

చేటి—దేవా! తీసికొనుఁడు (ఇచ్చి పోవుచున్నది.)

రాము—(తీసికొని ధరించుచున్నాఁడు.)

లక్ష్మణ—అయ్యా! నన్ననుగ్రహింపుము.

తే. గీ. తొడవులందు మాల్యాదివస్తువులయందుఁ
గరుణ నాకిచ్చి తర్థభాగంబు నీవు
కట్టుకొంటి వొక్కఁడవె వల్కలము నేఁడు
తగునె నారగుడ్డకును మాత్సర్య మింత. 26

రాము—మైథిలీ! ఇతని నివారింపుము.

సీత—సౌమిత్రీ! నీయుద్యమము మానుకొనుము.

లక్ష్మణ—

తే. గీ తల్లి! మాయన్న పాదపద్మముల సేవ
నీ వొకర్తవె సేయంగ నెంతువేమొ

కాదు సుమి! యట్లు, లాకుడికాలు నీది
యెడమకాలు నాయది, పలునుడువు లేల?

సీత—ఆర్యపుత్రా! అతని కది యిందు. సౌమిత్రి విచారించుచున్నాఁడు.

రాము—సౌమిత్రీ! విను. వల్కల మెట్టిదో చెప్పెదను.

తే. గీ. వల్కలము తపస్సంగ్రామవజ్రకవచ
మఖిలనియమాఖ్యదంతావళాంకుశంబు
ఇంద్రియాశ్వసంచయమున కినుపకళ్లె
మరయ ధర్మసారథి గొనుమయ్య దీని. 28

లక్ష్మణ—అనుగ్రహింపఁబడితిని. (గ్రహించి ధరించుచున్నాఁడు

రామ—ఈవృత్తాంతము విని పురజనులు మార్గమరికట్టిరి. జనులను దొలఁగింపుఁడు. తొలఁగింపుఁడు.

లక్ష్మణ—అయ్యా! నేను ముందుగా వెళ్ళెదను. తొలఁగుఁడు తొలఁగుఁడు.

రామ—మైథిలీ! మేలిముసుఁగుఁ దీసివేయుము.

సీత—అయ్యా! అట్లే చేసెదను. (తీయుచున్నది.)

రాము—ఓహో! పౌరులారా! మీరందఱు వినుండు, వినుండు

తే. గీ. అశ్రుపూర్ణాక్షములగు నాస్యములతోడఁ
బౌరులార! కన్గొనుఁడు నాపత్ని మీరు
అతిప నిర్దోషదృశ్యయౌ నడవియందు
యజ్ఞమందుఁ బెండిలియందు వ్యసనమందు.

కాంచు—(ప్రవేశించి) కుమారా! వెళ్ళఁదగదు. వెళ్ళఁదగదు. ఇదిగో! మహారాజుగారు.

శా. భ్రాతృప్రేమను వెంటవచ్చెడుసుమిత్రానందన జ్యేష్ఠునిన్
సీతాదేవినిఁగూడి ప్రీ వడవికిన్ వెంచేయు ట్లాలించి చిం

తాత ప్రుండయి ధూళిధూసరితగాత్రిం బూఁగులాడంగ ని
శ్లేతెంచున్ మిము జూడ జీర్ణవసనాగేంద్రింబు చందంబునన్

లక్ష్మణ—అయ్యా!

తే. గీ. చీరమాత్రోత్తరీయులై యూరు విడచి
జనెడువనవాసులను గనుంగొనుట యేల?

రామ—

కనుఁగొనెడుఁగాక! మే మిటు చనినపిదప
మానవేంద్రింవు మాశిరస్థానములను.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.

శ్రీరస్తు.

# ప్రతిమానాకము

## ద్వితీయాంకము.

(అప్పుడు కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కాంచు—ఓహో హో! ప్రతీహారవ్యాపృతులారా! మీరు మీమీస్థానములలో నప్రమత్తులై యుందురుగాక!

(ప్రతీహారి ప్రవేశించును.)

ప్రతీహారి—అయ్యా! ఏమిది?

కాంచు—మహారాజుగారు సత్యవచనపరులై యరణ్యమునకుఁ బోవుచున్న రాముని వెనుకకు మరలింపఁజాలక పుత్రవిరహశోకాగ్నిచేత దగ్ధహృదయులై పిచ్చివానివలె నేమేమొ ప్రేలుచు సముద్రగృహమందు శయనించియున్నారు.

తే. గీ. ప్రళయమునఁ జలించెడు మేరుపర్వతమటు
నాది శేషుఁ గూడినయపారాబ్ధివోలె
బింబమాత్రదృశ్యుండయి పృథివిఁ బడెడు
నినుఁడటులు రాజె శిథిలదేహేంద్రియుండు.

ప్రతీ—మహారాజుగారిట్లైపోయిరి గదా!

కాంచు—అమ్మా! నీవు పొమ్ము.

ప్రతీ—అయ్యా! అట్లే చేసెద. (అని నిష్క్రమించుచున్నది)

కాంచు—(అంతటఁ జూచి) అహో! రాముఁడు వెళ్ళినదినము మొదలుకొని యయోధ్యానగరము శూన్యమైనదివలెఁ గనబడుచున్నది. ఏలనన—

సీ. గడ్డి మేయుట మానె గజములు. గుఱ్ఱముల్
సకిలింపులను మాని జవము లుడిగి
కన్నీరు విడుచుచు గాఢశోకము నొందు,
వృద్ధులౌ కాంతలు, పిన్నవాండ్రు,
మున్నుగాఁ గలిగినపురజను లాహార
ములు మాని దీనులై, మున్ను రాముఁ
డేదెస నేగెనో యాదెసఁ జూచుచు
నాక్రిందనము సేతు రనదలట్లు.

నేనును మహారాజుగారిసమీపవర్తినై యుండెదను. (నడచి చూచి) అహో! మహాదేవియగు కౌసల్యయు, సుమిత్రయుఁ బుత్రవిరహసముద్భవమగు దుస్సహశోకమును దిగమ్రింగి తన్ననుసరించి యూఱడింప మహారాజుగా రచ్చటఁ గూర్చున్నారు. మిక్కిలి కష్టమైనయవస్థ సంభవించినదిగదా! ఇదిగో! మహారాజుగారు.

తే. గీ. పడును లేచును వెండియుఁ బడును లేచు
హా! తనయ! హా! యనుచు మాటి కఱచుచుండు
రఘుకులోద్వహుఁ డగుకుమారకుఁడు చన్న
యాదెసనె జూచుచుండు నత్యాదరమున.

ఇది విష్కంభకము.

(మీఁదఁ జెప్పఁబడినచొప్పున దశరథమహారాజును, భార్య లిద్దఱును బ్రవేశించుచున్నారు.)

రాజు—

తే. గీ. హా! తనయ! రామ! జనసయనాభిరామ!
లక్ష్మణా! సర్వశోభలక్షణాంగ!
హా! జనకకన్య! సాధ్వి! పత్యర్పితాత్మ!
అకట! వని కేగి రే బిడ్డలార! మీరు.

అహో! ఇది చిత్రముగదా! భ్రాతృస్నేహమునఁ దండ్రియం దలిప్రేమ విడచి వెళ్ళినలక్ష్మణునిఁ జూడఁగోరుచున్నాను. కోడలా! వైదేహీ!

తే. గీ. ప్రియసుతుండు రామునిచేత విడువఁబడితిఁ
గరము నిందింపఁబడితి లక్ష్మణునిచేత
జగతి నపయశంబునకు భాజనము నైతి
విడిచిచే నన్ను నీవును బిడ్డ! నేఁడు.

కుమార! రామ! వత్స లక్ష్మణా! కోడలా వైదేహీ! బిడ్డలా రా! నాకుఁ బ్రతివచనమిండు. అయ్యో! ఇది శూన్యముగదా? నా కెవ్వరును బ్రతివచన మియ్యకున్నారు. కౌసల్యానందనా! ఎక్క డున్నావు?

తే. గీ. సత్యసంధ! జితక్రోధ! సాధుశీల!
సర్వలోకప్రియా! విమత్సరమనస్క!
రామ! గురుజనసేవాపరాయణాత్మ!
ప్రతివచన మీయవయ్య! నాపల్కులకును.

హా! సర్వజనహృదయాభిరాముఁడగు రాముఁ డెక్కడ? నా యందలిపరమభక్తుఁ డెక్కడ! శోకార్తులయెడ దయాశాలి యెక్కడ? రాజ్యైశ్వర్యమును గడ్డిపఱకవలె విడిచినయతఁ డెక్కడ? కుమార! రామ! ముసలివాఁడనగు తండ్రిని నన్నువిడచి యసంబద్ధమైనధర్మము ననుసరించి నీ వెంతచేసితివోయి? హా! ఎంత కష్టము.

తే. గీ. అరిగె రామభద్రుఁడు దివాకరుఁడువోలె
ననుసరించె లక్ష్మణుఁ డర్కు దినముపగిది
నర్కదివసావసానంబు లగుడుఁ బిదప
ఛాయవలెఁ గానఁబడదయ్యె జనకతనయ

(పైకిఁ జూచి) ఓకృతాంతహంత క

తే. గీ. దీనుఁడగునన్ను సంతానహీనుఁ జేసి
రాము నన్యభూపాలపుత్త్రికునిఁ జేసి
కైక నడవిలో బెబ్బులిగాఁగఁ జేసి
యున్న మేలౌను, నటు సేయకుంటి వేల?

కౌసల్య—(ఏడ్చుచు)మహారాజా! అతివిస్తారము దుఃఖించిమీరు పరవశులు కావలదు. ఆకుమారు లిరువురను మీరు ప్రతిజ్ఞావసానమునఁ జూడఁగలరు.

రాజ—ఓసీ! నీ వెవ్వరు ?

కౌసల్య—దిక్కులేనికుమారునిఁ గన్నతల్లిని నేను.

రాజు—సర్వజననయనాభిరాముఁ డగు రామునిఁగన్నతల్లివి కౌసల్యవు గావా నీవు?

కౌసల్య—మహారాజా! ఆమందభాగ్యరాలను నేనే.

రాజు—కౌసల్యా! నీవు! సారవంతురాలవు సుమీ ఏలయన, నీవు రాముని గర్భమున ధరించితిని.

తే. గీ. దుస్సహంబయి పావకతుల్యమైన
యీమహాదుఃఖమును నోకయించు కేని
నడఁచుకొౌన నైన, సైఁపఁగ నైనఁజాల
నింద్రియంబు లన్నియు హరియింపఁబడుట
(సుమిత్రినుజూచి) ఈరెండవ దెవ్వతె?

కౌసల్య—మహారాజా! లక్ష్మణకుమారుని

రాజు—(తొందరతోలేచి) ఏడీ! లక్ష్మణుఁ డేఁడీ అయ్యో లేఁడే. అయ్యో ఎంతకష్టము!

(భార్యలిద్దఱు, తొట్రుపాటుతో రాజును బట్టుకొనుచున్నారు.)

కౌసల్య—మహారాజా! లక్ష్మణకుమారుతల్లి యీామె యని చెప్పుట కుపక్రమించితిని.

రాజు—ఓ, సుమిత్రా!

క. నీపుత్త్రుఁడె సత్పుత్త్రుం
డోపికతో సేయఁబవలు నొగి రఘుకులసం
దీపకుఁడగు రామున కే
యాపద రాకుండ నీడయటు చను వెంటన్.

కాంచు—(ప్రవేశించి) మహారాజా జయము పూజ్యుఁడైన సుమంత్రుఁడు వచ్చినాఁడు.

రాజు—(తొందరతో లేచి సంతోషముతో) రామునితోఁగూడ వచ్చెనా?

కాంచు—కాదు రథముతో

రాజు—ఎట్టెట్టూ! కేవలము రథముతోడనా?

(అనిమూర్ఛిల్లుచున్నాఁడు.)

దేవులిద్దఱు—మహారాజా ఊఱడిల్లు మూరడిల్లుము.

(శరీరమును నిమురుచున్నారు.)

కాంచు—అయ్యో కష్టము. ఇటువంటిపురుషవిశేషు లిటువంటి మహాపదను బొందుచుండుటచేత విధి యనతిక్రమణీయుఁడు గదా! మహారాజా ఊఱడిల్లుమూఱడిల్లుము.

రాజు—(కొంచె మూఱడిల్లి) బాలాకీ సుమంత్రుఁ డొక్కఁడే వచ్చినాఁడా?

కాంచు—మహారాజా ఔను.

రాజు—అయ్యో! కష్టము.

తే. గీ. రథము శూన్యమై యిపుడు సంప్రాప్తమైన
నామనోరథ మెల్ల భగ్నమయినట్లె
దశరథునిఁ దోడితేరంగ దండధరుఁడు
రథము సంపించు నిఁక సత్వరంబె నిజము.

సుమంతుని వేగఁ బ్రవేశపెట్టుము.

కాంచు—చిత్తము. దేవా! (నిష్క్రమించును.)

రాజు—

తే. గీ. విపినముల సరస్సులమీఁద వీచునట్టి
యనిలపోతముల్ ధన్యంబులగును సుమ్మి!
వనులఁ జరియించుతఱి రామభద్రుమేను
కడుసుఖంబుగ స్పృశియింపఁగలవు గాన. 12

(అప్పుడు సుమంత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సుమం—(అంతటను జూచి శోకముతో)

తే. గీ. సేవకులు తమకృత్యముల్ సేయు టుడిగి
మిగుల దీనులై రామునిమీఁదిప్రేమ
శోకదగ్ధులై కనుల నశ్రువులు దొరఁగఁ
దెగడుచున్నారు సుతునికై వగచునృపుని. 13

(సమీపించి) మహారాజా! జయము. జయము.

రాజు—అన్నా! సుమంత్రా!

సీ. నాజ్యేష్ఠతనయుండు నారాముఁ డెక్కడ?
కాదు కాదు నేను సరిగాఁ జెప్పలేదు.

సీ. నీజేష్ఠతనయుండు నీరాముఁ డెక్కడ
యోపుత్రవత్సల యోసుమంత్రి
గురుజనంబులయెడ గురుభక్తి గల్గిన
జనకభూపాలునితనయ యేది
యేఁడి మాలక్ష్మణుం డెక్కడనున్నవాఁ
డాసన్నమరణుండ నైననాకు
నతిశోకకరమైనయట్టివార్తను వార
లేదేనిఁ జెప్పిరో యెఱుఁగఁ దెల్పు.

సుమంత్రి—మహారాజా! ఈలాగున మీరమంగళవచనములు పలుకఁగూడదు. కొంఁదికాలములో నే వారినిఁ జూడఁగలరు.

రాజు—నిజమే! నే నయుక్తము బలికితిని. ఈప్రశ్న తాపసులగుఱించి యడుగఁ దగినది గాదు. ఇది చెప్పు. తాపసులతపస్సు వర్ధిల్లుచున్నదా? అరణ్యములు స్వాధీనములై యున్నవా? అడవులఁ జరించుచున్నవైదేహి ఖేదపడుట లేదుగదా?

సుమిత్రి—సుమంత్ర! వల్కలాలంకృతశరీరయు బాలయయ్యు నబాలచరిత్రయు భర్తృసహధర్మచారిణియునైన వైదేహి మహారాజుగారికిని, మాకును నేమియుఁ జెప్పలేదా!

సుమంత్రి—అందఱు మహారాజుగారిని దలఁచిరి.

రాజు—అందఱనుట గాదు,కర్ణరసాయనములై, నాకు హృదయౌషధములైన వారినామధేయములను వేర్వేఱు వినిపింపుము.

సుమంత్రి—చిత్తము మహారాజా! ఆయుష్మంతుఁ డైనరాముఁడు.

రాజు—రాముఁడా! ఇతఁడు రాముఁడు. అతనినామశ్రవణము వలన నన్నతఁడు స్పృశించినట్లేయున్నది. తరువాతతరువాత?

సుమంత్రి—ఆయుష్మంతుఁడు లక్ష్మణుఁడు.

రాజు—ఇతఁడు లక్ష్మణుఁడు. తరువాత.

సుమం—జనకరాజపుత్రియైన యాయుష్మతి సీత.

రాజు—అది వైదేహి. రాముఁడు,లక్ష్మణుఁడు,వైదేహి యని చెప్పుట యక్రమము.

సుమం—అట్లైన నేది క్రమము?

రాజు—రాముఁడు వైదేహి లక్ష్మణుఁడునని చెప్పవలయును

తే. గీ. జనకనందన రామలక్ష్మణులనడుమ

నుగ్రవనములలోపల నుండుఁ గాన

గహనము లనేకదోషయుక్తంబు లగుట
నది సురక్షితమైయుండు నట్టులైన.

సుమం.—చిత్తము దేవా! ఆయుష్మంతుఁడు రాముఁడు.

రాజు.—ఇతఁడు రాముఁడు.

సుమం.—ఆయుష్మతియైన జనకరాజపుత్రి.

రాజు.—ఆమె వైదేహి.

సుమం.—ఆయుష్మంతుఁడు లక్ష్మణుఁడు.

రాజు.—వాఁడు లక్ష్మణుఁడు ఓరామ! ఓవైదేహి! ఓలక్ష్మణా! బిడ్డలారా! నన్నుఁ గౌఁగలింపుఁడు.

ఉ. ఏ నొకసారి రాము స్పృశియింపఁగఁ గల్గుదునేనిఁ గానిచో
వానిని గన్నులారఁ గనుభాగ్యము నాకు లభించునేని నా
ప్రాణము పోయినన్ మరల నాకుణమే యమృతంబుచేబలెన్
నే నసువుల్ ధరింతు నని నిక్కముగా మదిఁ దోఁచె నిత్తఱిన్.

సుమం.—శృంగిబేరపురమందు రథము డిగి వా రయోధ్యాభిముఖులై యుండి యందఱు మహారాజునకు శిరసు వంచి నమస్కరించి విజ్ఞాపనచేయుట కారంభించిరి.

తే. గీ. స్వాంతముల నేదో ధ్యానించి కొంతసేపు
పలుక నుద్యుక్తులై పెదవులు గదల్చి
... బాష్పరోధమున గళంబు వశము గామిఁ
బలుకకయ వారు పోయిరి. వనములకును.

రాజు.—ఏమి! పలుకకయే వనమునకుఁ బోయిరా? (అని మూర్ఛిల్లుచున్నాఁడు.)

సుమం.—(తొట్రుపాటుతో) బాలాకా! మహారాజుగారు ప్రతీకారశూన్యమైనయవస్థను బొందినా రని యమాత్యులతోఁ జెప్పుము.

కాంచుకి—అట్లె (అని నిష్క్రమించును.)

దేవులిద్దఱు—మహారాజా ! ఊఱడిల్లుఁ డూఱడిల్లుఁడు.

రాజు:—(కొంచెము మూరడిల్లి)

తే. గీ. అట ! కౌసల్య ! నామేన హస్త మిడుము
చూపు చెడిపోయె నిను నేను చూడఁజాల
బుద్ధి రామునియొద్దకుఁ బోయియుండి
యింతవఱకును రాదయ్యె నేమి సేతు. 18

కుమార ! రామ ! ఏది నేను సంతతముఁ జింతించితినో యది జరుగలేదు.

మ. ధరణిన్ బట్టముగట్ట నీ, కవల సదాశీర్జన్య లాభంబునన్
గరమున్ ధన్యులఁ జేసి భూప్రజల, వేడ్కం జెంది, నీతమ్ములన్
సరిగాఁ జూడుమటంచుఁ జేసియుపదేశంబున్, దపోరణ్య మే
నరుగం జూచితిఁ గైకచేఁ జెడియెఁ గార్యంబంతయున్ మాటలోన్.

సుమంత్రి ! కైకేయి కిట్లు చెప్పుము.

తే. గీ. అడవి కేగె రాముఁడు ప్రియమయ్యె నీకు,
నసురులను బాసి పోవుచునుంటి నేను
వేగమే నీకుమారునిఁ బిలువ నంపు
పాప మంతయు వెంటనే పంపుఁ గాక !

సుమం—చిత్తము. మహారాజా !

రాజు:—(పైకిఁజూచి) అహో ! రామకథాశ్రవణసందగ్ధహృదయుఁడ నైన నన్నూఱడించుటకు నాపితృదేవతలు వచ్చిరి. ఎవఁడక్కడ !

(కాంచుకీయుఁడు ప్రవేశించును.)

కాంచు—(ప్రవేశించి) మహారాజా ! జయము.

రాజు:—ఏదకము దెమ్ముఁ

కాంచు.—చిత్తము. దేవా! (నిష్క్రమించి మరలఁబ్రవేశించి) ఉదక మిదిగో ?

రాజు:—(ఆచమించి చూచి)

తే. గీ. ఈతఁడు దిలీపనృపుఁడు మహేంద్రసఖుఁ, డి
తండు రఘునృపుం, డితఁడు నాతండ్రి యజుఁడు,
ఏల వచ్చిరి మీరందఱిటకు నేఁను
వారిఁ గలసెడుసమయంబు వచ్చియుండు.

రామ ! వైదేహి ! లక్ష్మణ! నేనిప్పుడు పితృదేవతల సన్నిధి కరుగుచున్నాఁడను. ఓపితరులారా ! ఇదె యిదె వచ్చుచున్నాఁడను.

(మూర్ఛిల్లుచున్నాఁడు.)

కాంచు.—(తెర నేలఁ బఱచుచున్నాఁడు.

అందఱు.—హా ! హా ! మహారాజ !

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము.

శ్రీరస్తు.

# ప్రతిమా నాటకము

## తృతీయాంకము.

(అప్పుడు సుధాకారుఁడు ప్రవేశించుచున్నాఁడు.

సుధా—(తుడుచుట మొదలగునవి చేసి) సరే! ఆర్యసంభవకుఁడాజ్ఞాపించినట్లు కార్యమంతయుఁ జేసితినిగదా. కొంచముసేపు నిద్రబోయెదను. (అని నిద్రించును.)

భటుఁడు—(ప్రవేశించి నిద్రించుచున్నచేటునిఁ గొట్టి) ఓరీ! తొత్తుకొడుకా! చెప్పినపని సేయవేమీ? (అనికొట్టుచున్నాఁడు.)

సుధా—(మేలుకొని) కొట్టు. ఇంకను గొట్టు.

భటుఁడు—కొట్టిన నేమి చేసెదవురా?

సుధా—నిర్భాగ్యుఁడ నగునాకుఁ గార్తవీర్యార్జునునకున్నట్లు వేయిచేతులు లేవు.

భట—బాహుసహస్రమున్న నేమి చేయుదువు?

సుధా—నిన్ను జంపుదును.

భటు—రారా తొత్తుకొడుకా! నిన్నుఁ జంపివిడిచిపెట్టెదను. (తిరిగి కొట్టుచున్నాఁడు)

సుధా—(ఏడ్చి) బాబూ! నాతప్పేమో తెలిసికొనుఁడు

భట—అవును! పాపము నీవల్లఁ దప్పు లేదు. భర్తృదారకుఁడైన రాముని రాజ్యవిభ్రష్ట జనితదుఃఖముచేత స్వర్గస్థులైన దశరథమహారాజుగారియొక్క ప్రతిమాగేహమును జూచుటకు నేఁడు కౌసల్యమొదలగురాణివాసపుస్త్రీలంద ఱెక్కడికి వత్తురనియు మందిర మలం

కరింపు మనియు నీనేను కాజ్ఞాపించితినిగదా! ఇప్పుడు నీవేమిచేసితివి?

సుధా—అయ్యా! చూడుఁడు. గర్భగృహము పావురపుగూళ్లు లేకుండఁ జేసితిని. వెల్లగోడలమీఁద నైదువ్రేళ్లతో మంచిగంధపు ముద్రలు వేసితిని. ద్వారములలోఁ బూలదండలు తోరణములు గట్టితిని. ఇసుక చల్లితిని. ఇప్పుడు నే నేమిచేయలేదు?

భటు—అట్లైన సుఖముగాఁ బొమ్ము. ఇంతలో నేనును సర్వము సిద్ధమైన దని మంత్రితో విన్నవించెదను.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రవేశకము.

---

(అప్పుడు రథముతో భరతుఁడును, సూతుఁడును, బ్రవేశించుచున్నారు.)

భరతుఁడు—(విచారముతో) సూతుఁడా! ఈనడుమ మేనమామయింట నుండుటచేత నాకు వృత్తాంతము లేవియుఁ దెలియలేదు. మహారాజుగారు శరీరముం దస్వస్థులై యున్నారని వింటిని. అది యేమో చెప్పు.

సీ. ఏమిరుగ్మత గల్గె నిపుడు నాతండ్రికి?

సూత— దారుణహృదయ సంతాపమయ్య

భరత— వైద్యులేమనిరి యావ్యాధినిగూరిచి?

సూత— వైద్యులు దాన నేర్పరులు గారు

భరత— ఎచ్చోటఁ బవళించు? నేమి యాహారంబు?

సూత— శయనించు నేల భోజనము లేదు

భర— ఆశ యున్నదె యించుకైన?

సూత— దైవవశంబు

భరత— నాగుండె జల్లను, నడపు తేరు,

సూతు—ఆయుష్మంతుఁడా! అట్లే చేసెదను.

(రథము దోలుచున్నాఁడు)

భర—(రథ వేగమునిరూపించి) ఆహా! ఏమి యీరథ వేగము!

సీ. అరదంబు ద్రుతగతి నడుగుట వృక్షముల్
పరువెత్తునట్లుఁ గన్పడుచునుండె
నుద్వృత్తజలమైన నురునదంబునుబోలె
నేమివివరమందు భూమి పడెడు
నాకులు సువ్యక్తమయి కానఁబడకుండెఁ
గదలన ట్లుండెఁ జక్రవలయంబు
ఇపుడు రేఁగినధూళి యెదుటనే బడుఁ గాని
యరదంబు వెన్కకు నరుగకుండు.

సూత—ఆయుష్మంతుఁడా! దట్టముగ నల్లుకొనినచెట్లలోఁపున కెదుటనున్న దేయయోధ్యాపురమై యుండవచ్చును.

భరత—ఓహో! స్వజనమును జూడ వేడుకపడుచున్ననామనస్సుయొక్క తొందర నేచునవచ్చును! ఇప్పుడు,

సీ. తండ్రియడుగులను నా తలఁ జేర్చినట్లు, నన్
గృపతో నతఁడు లేవనెత్తినట్లు,
నన్నదమ్ములు వేగ నరుదెంచినట్లు నన్
దల్లులు గన్నీటఁ దడపినట్లు,
మేటివంచును నోరుల్ సాటిలేరంచును
దగ నన్ను భృత్యులు పొగడినట్లు,
సౌమిత్రి వేషభాషలకు నన్నెగతాళి
గావించినటు లాత్మఁ గాంచుచుంటి.

సూతు—(తనలో) అయ్యో! కష్టము. ఈతఁడు మహారాజవినాశ మెఱుఁగక నిష్ఫలమైనయాశను ముందుబెట్టుకొని యయో

ధ్యాపురముఁ బ్రవేశించుచున్నాఁడు. నే నెఱిఁగినను దానినిఁ జెప్పఁ దలఁచుకొనలేదు. ఏలయన—

తే. గీ. తల్లియైశ్వర్యలోభంబుఁ, దండ్రిచావు
వసుమతీకన్యతో రామువనగమనము
ననెడు మూఁడుదుర్వార్తల నక్క టకట!
యీకుమారున కెఱిఁగింప నెవ్వఁడోపు.

భట—(ప్రవేశించి) కుమారా! జయము జయము.

భరత—భద్రా! ఏమి శత్రుఘ్నుఁడు నాకడకు వచ్చినాఁడా

భటుఁడు—శత్రుఘ్నకుమారుఁడు వచ్చెను. ఉపాధ్యాయులిట్లు మీతో మనవిసేయుమన్నారు.

భరత—ఏమని యేమని?

భటుఁడు—"కృత్తికానక్షత్రమున నింక నొక్కగడియమాత్రమున్నది. కాఁబట్టి రోహిణీ ప్రవేశమైనతర్వాత నీ వయోధ్యఁ బ్రవేశింపఁదగును." అని.

భరత—మంచిది! అలాగే! నే నిదివఱ కెన్నఁడు గురువచనము నతిక్రమింపలేదు. నీవు వెళ్ళు.

భటుఁడు—చిత్తము కుమారా!

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

భరత—ఇఁక నే నేప్రదేశమందు విశ్రమింతును? సరే! కనఁబడినది. ఆచెట్లనడుమఁ గనఁబడుచున్న దేవాలయమందుముహూర్తము విశ్రమించెదను. అందువలన దైవతపూజయు, విశ్రమము రెండుఁ గూడ గాఁగలవు. ఊరిబయటఁ గొంచెముసేపు గూర్చుండి పిమ్మట నగరమును బ్రవేశింపవలయును నని పెద్దలయాచారము గదా! అందుచేత రథమును నిలుపుము.

సూతుఁడు—ఆయుష్మంతుఁ డాజ్ఞాపించినట్లు చేసెదను.

(రథము నిలుపుచున్నాఁడు.)

భరత.—(రథముదిగి) సూతుఁడా! అశ్వముల నేకాంతస్థలమున విశ్రమింపఁజేయుము.

సూతు.—ఆయుష్మంతుఁడా! చిత్తము.

(అని నిష్క్రమించును.)

భరత.—(కొంచెము వెళ్లి చూచి) పుష్పలాజాక్షతలచేతఁ జక్కఁగాఁ జేయఁబడినపూజలు వ్యక్తమగుచున్నవి. గోడలమీఁద నైదువ్రేళ్ళతో మంచిగంధపుముద్రలు వేయఁబడియున్నవి. ద్వారములకుఁ బుష్పదామములు, తోరణములు గట్టఁబడియున్నవి. ఇసుక చల్లఁబడినది. నేఁ డేదైనవిశేషపర్వమై యుండునా? లేక, యాస్తిక్యబుద్ధితోఁ జేసిననిత్యకృత్యమైయుండునా ? ఇదియే దేవునిస్థానమై యుండవచ్చును? బాహ్యచిహ్నమైన యాయుధముగాని, ధ్వజస్తంబముగాని, యిచ్చటఁగనఁబడుటలేదు. కానీ! ప్రవేశించి తెలిసికొనెదను.

(ప్రవేశించి చూచి) ఓహో! ఏమి యీపాషాణములయందలి శిల్పనైపుణ్యము! ఏమి యీయాకారములభావగతి! ఓహో! ఈప్రతిమలు దేవతోద్దిష్టములైనను వీనియందు మనుష్యవిశ్వాసత గల్గుచున్నది. ఈసమూహము నలుగురుదిక్పాలకులదా? ఏవో కొన్ని యగుఁగాక! ఏవైన నేమి? నామనసునందు హర్షమున్నది.

తే. గీ. దైవతం బనుబుద్ధితోఁ దప్పకుండ
వందన మొనర్చుటిపుడు సంభావ్య మగును
దైవతారాధనం బమంత్రికము గాఁగఁ
. జేసిన నది శూద్రులనమస్కృతియటండ్రు.

దేవకులికుఁడు.—(ప్రవేశించి) ఆహా! తన్యకృత్యము దీర్చిన పిమ్మట నేను ప్రాణిధర్మ మనుష్ఠింప నించుమించుగా నీప్రతిమలబోలిన యాకారముఁ గలపురుషుఁ డెవ్వఁడో ప్రతిమాగృహముఁ బ్రవేశించినాఁడు కానీ! లోపలికిఁ బోయి తెలిసికొందును.

(లోపలికిఁ బోవుచున్నాఁడు.)

భరత—నమస్కారము.

దేవకులిక—వద్దు. వద్దు. నమస్కరింపఁ గూడదు.

భరత—ఓయీ! అట్లనకుము.

తే. గీ. మాకు నేదేని జెప్పంగ మనసు కలదొ,
ఉన్నదే విశిష్టాచార మొక్క టిచట?
లేక నియమాధికారంబు నీకుఁ గలదొ,
యేల! వారించుచున్నాఁడ విల్లు నన్ను.

దేవకు—ఈకారణములచేత నేను నిన్నుఁ బ్రతిషేధించుట లేదు. ఇవి దేవతావిగ్రహము లనుకొనుచాప్రహ్మణముయొక్క నమస్కారమును బరిహరించుచున్నాఁడను.

భరత—అలాగా! ఈపూజ్యులు క్షత్రియులా। అట్లయిన వారిపేళ్లు చెప్పుము?

దేవకు—ఇక్ష్వాకువంశస్థులు.

భరత—(సంతోషముతో)ఇక్ష్వాకులవంశస్థులా?వీర యోధ్యాపురాధీశ్వరులు.

సీ. అసురసంహారంబునందు వీరల కాదె!
యమరసంతతికి సహాయములైరి
తనుచేయుపుణ్యకర్మముల వీరలె గదా!
స్వజనంబుతోఁగూడఁ జనిరి దివికి
క్షితిమండలం బెల్లఁ జెలఁగి వీరలె కదా!
భుజబలంబునఁ గెల్చి పుచ్చుకొనిరి
మృత్యుదేవత ధిక్కరించి వీరలెకదా!
చిరకాలజీవులై చెన్నఁ గనిరి.

తల్లపవిత్రంపుగా నేనునేఁడు గొప్పఫలమును బడసితిని. ఆమహనీయుఁ డెవఁడో చెప్పుము?

దేవకు—ఇతఁడు సర్వరత్నములను సమకూర్చి విశ్వజిద్యాగము జేసిన ప్రజ్వలిత ధర్మప్రదీపుఁడు, దిలీపుఁడు.

భరత—ఈధర్మపరాయణునకు నమస్కారము. ఆమహానీయుఁ డెవఁడో చెప్పుము.

దేవకు—ఇతఁడు పవ్వళించునప్పుడును, మేల్కొనునప్పుడును, వేలకొలఁది బ్రాహ్మణులపుణ్యాహారవంబుల ధన్యుఁడైన రఘుమహారాజు.

భరత—అహో! మృత్యు వెంతబలమైనదో! అట్టిరక్షకునుగూడ లెక్కసేయ లేదు. రాజ్యఫలమంతయు బ్రాహ్మణజనుల కర్పించిన మహానుభావునకు నమస్కారము. ఇఁక నామహానీయుఁ డెవఁడో చెప్పుము.

దేవకు—ఇతఁడు కళత్రవియోగమున రాజ్యభారమును విడిచి నిత్యావబృథస్నానములచేత రజస్సు నడఁచినయజుఁడు.

భరత—శ్లాఘనీయపశ్చాత్తాపుఁడైన యీమహాత్మునకు నమస్కారము. (దశరథునివిగ్రహముఁజూచి విచారపడి) మనస్సు గౌరవమందునిమగ్నమై యుండుటచే సరిగాఁ దెలిసికొనలేనైతిని. ఆయనయెవ్వరో మరలఁ జెప్పుము.

దేవకు—ఇతఁడు దిలీపుఁడు.

భరత—ఈయన దశరథమహారాజుగారికి ముత్తాత.

దేవ—ఆయన రఘువు.

భరత—ఆయన మహారాజుగారితాత. తరువాత తరువాత?

దేవ—ఆయన యజుఁడు.

భరత—ఆయన మాతండ్రి తండ్రి. ఎట్టెట్టు! మరలఁ జెప్పు?

దేవ—ఇతఁడు దిలీపుఁడు. ఇతఁడు రఘువు. ఇతఁ డజుఁడు.

భరత—ని న్నొకచిన్నమాట యడిగెదను. బ్రతికియున్నవారి

బొమ్మలుగూడ నిక్కడఁ బెట్టుదురా?

దేవక—లేదు. మృత్యులైనవారివె.

భరత—అట్లయిన నిన్నొకమాటడిగెదను.

దేవ—ఉండు!

తే. గీ. ఎవఁడు స్త్రీశుల్కమునకయి యిచ్చివైచెఁ
బ్రాణమును, రాజ్యమును, దృణప్రాయముగను?
నట్టి దశరథేశ్వరువిగ్రహమును గూర్చి
యడుగకున్నాఁడ వేటికో యానతిమ్మ.

భరత—హా! తండ్రీ! (మూర్ఛిల్లి లేచి)

తే. గీ. హృదయమా! యేది శంకించి తదియె జరగె
వినుము తండ్రిచావును, ధృతిం గొనుచు నీచ
శుల్కపదము నా కన్వయించునది యేనిఁ
దనువు నే శుద్ధిజేసికోఁ దగును నిజము.

దేవకు—అయ్యో! యనునది యిక్ష్వాకువంశస్థులమాటగదా! నీవు కైకేయీపుత్త్రుఁడవైన భరతుఁడవా?

భర—అవునవును! కైకేయీపుత్రుఁడను గాను, దశరథపుత్రుఁడైన భరతుఁడను.

దేవ—అట్లైన నిన్నొకమాట యడిగెదను.

భర—ఉండు. ఉండు. మిగిలినదిగూడ జెప్పుము?

దేవ—ఏమిగతి! విను. పూజ్యుఁడైనదశరథమహారాజుగారు మృతినొందినారు. సీతాలక్ష్మణసమేతుఁడై రాముఁడు వనమున కెందుకరిగెనో నే నెఱుంగను.

భరత—ఎట్టెట్టు! అన్నగారడవికి వెళ్ళినారా (మరలమూర్ఛపడుచున్నాఁడు.

దేవా—కుమారా! ఊరడిల్లుము. ఊరడిల్లుము.

భరత—(ఊరడిల్లి)

తే. గీ. అన్నయును, దండ్రియును బాసి యరుగుకతన
నడవియైనట్టి యాయయోధ్యాపురమున
కరుగవలయుఁ, బిపాసార్తుఁ డైనవాఁడు
నీరములు లేనివాహినిఁ జేరునట్లు.

అయ్యా ! విస్తరకథనము వినుటచేత నామనస్సునకు ధైర్యము గలుగును. కాఁబట్టి కొఱంతలేకుండ నంతయుఁ జెప్పుము.

దేవక—వినుఁ ! మహారాజుగారు పూజ్యుఁడైనరామున కభిషేకము చేయుచుండ మీయమ్మ యడ్డు చెప్పినది.

భరత—ఉండు.

సీ. స్మరియించి శుల్కదోషము 'నాసుతుఁడు నృపుం
డగుఁగాక' యనుచు మాయమ్మ యనును
ఆధైర్యమున నామె యడవి కేగుమటంచు
నప్పుడె యన్నతోఁ జెప్పియుండు
నారచీరలు గట్టినకుమారుఁ గన్గొని
మాతండ్రియును ఘోరమరణమొందెఁ
బ్రకృతిజనంబు నాపైఁ బాడునిందల
నెన్నెని మోపెడు నింక మీఁద.

(అని మూర్ఛిల్లుచున్నవాఁడు.)

(తెరలో)

అయ్యా! తొలఁగుఁడు. తొలఁగుఁడు.

దేవకు—(చూచి) అహో!

తే. గీ. సరగ వచ్చిరి రాణులు సమయమునకుఁ
గొడుకు మూర్ఛితుం డయ్యెను నొడలుమఱచి
మాతృహస్తసంస్పర్శన మాతనయున
కజలమైనజలాంజలి యగును గాక.

(అప్పుడు దేవులు, సుమంత్రుఁడు ప్రవేశించుచున్నారు.)

సుమం——అమ్మలారా! ఇటు. ఇటు.

తే. గీ. ప్రతిమరూపుఁ దాల్చినరాజుభవన మిద్ది
దీనియున్నతి మేడలకేని లేదు
ద్వారపాలురచే నాపఁబడక పథిక
జన ముపాసించు దీని వందనము లిడక

(ప్రవేశించి చూచి) అమ్మలారా! రాఁగూడదు. రాఁగూడదు.

తే. గీ. ప్రాయమందున్న మనమహారాజుఁ బోలి
యెవ్వఁడో పడియున్నవాఁ డిప్పు డిచట

దేవకు——

పరుఁ డనెడుశంక వలవదు భావమందు
నితఁడు భరతుండు వాని గ్రహింపుఁడయ్య.

(నిష్క్రమించుచున్నాఁడు.)

దేవులు——(తొందరతో సమీపించి) హా! కుమార! భరతా!

భరత——(కొంచెముగాఁ జడిల్లి) అయ్యా!

సుమం——జయము! మహా——(అనిసగముచెప్పి విషాదములో) అహో! ఏమి యీస్వరసాదృశ్యము! ప్రతిమారూపుఁడైన మహారాజే పలుకుచున్నాఁడని తలంచుచుంటిని.

భరత——మాతల్లులయవస్థ యిప్పు డెట్లున్నది.

దేవులు——బిడ్డా! మాయవస్థ యిటులున్నది.

(అని ముసుఁగులు తీసివైచుచున్నారు.)

సుమం——అమ్మలారా! దుఃఖమడఁచుకొనుఁడు.

భరత——(సుమంత్రునిఁ జూచి) 'సర్వసముదాచారసన్నికర్షము నన్ను సూచించుచున్నది. అయ్యా! నీవు పూజ్యుఁడైన సుమంత్రుఁడవా!

సుమం——కుమారా! అవును సుమంత్రుఁడనే.

తే. గీ. ఆమహారాజు పోయిన నతనితోడఁ
జనక నే కృతఘ్నుఁడ నయి జాగు చేసి
బ్రతికియుంటి సూర్యరథసారథిగ నకట!
యధికవార్ధక్యదోషము లనుసరింప.

భరత—హా! తండ్రీ! (లేచి) తండ్రీ! తల్లుల కెట్లభివాదనము సేయవలయునో యాక్రమము దెల్పుము.

సుమం——మంచిది! ఈమె పూజ్యురాలైన రామునితల్లి కౌసల్యాదేవి.

భరత——అమ్మా! నిరపరాధినైన నే నభివాదనము సేయుచున్నాను.

కౌసల్య——బిడ్డా! సంతాపము లేనివాఁడవు గమ్ము.

భరత——(తనలో) ఈమాట నన్నాక్షేపించుచున్నది. (ప్రకాశముగాఁ) అనుగ్రహింపఁబడితిని. తరువాత. తరువాత.

సుమం——ఈమె పూజ్యురాలైన లక్ష్మణునితల్లి సుమిత్రాదేవి.

భరత——అమ్మా! లక్ష్మణసహచరుఁడనైననేను నమస్కరింపుచున్నాను.

సుమిత్ర——కుమారా! యశోభాగివి గమ్ము.

భరత——అమ్మా! దాని నిమిత్తము ప్రయత్నించెదను అనుగ్రహింపఁబడితిని. తరువాత తరువాత.

సుమం——ఈమె నీతల్లి.

భరత——(రోషముతో లేచి) హా! పాపీ!

క. ఓయమ్మా! యీయమ్మకు
నీయమ్మకు నడుమనుండ నీవు దగవు ౧౦
గాయమునలకునడుమ నే
దోయొక పాడునది చేరియుండం దగునే!

కైకేయి—బిడ్డా! నే నేమిచేసితిని?

భరత—ఏమిచేసితి ననుచున్నావా?

సీ. నా కపకీర్తి యన్నకు నారచీరలు,
క్షితిపాలవరునకు గృహమరణ మ
యోధ్యకు రోదన, ముగ్రమృగావళు
లను గూడి మెలగుట లక్ష్మణునకు
తనప్రియలగు మాతలకు శోకంబును
ధారుణీసుతకు నధ్వశ్రమంబు
నీకు ఛీఛీయను నిందావచనములు
నీవల్లఁ గలిగెను నిక్కముగను.

కౌసల్య—బిడ్డా! సర్వసముదాచారమధ్యమున నుండియుఁ ద ల్లికి నమస్కరింపవేమి?

భరత—తల్లి కా! అమ్మా! నీవే నాతల్లివి. అమ్మా! నమస్క రించుచున్నాఁడను.

కౌసల్య—కాదు. కాదు. ఈమెయే నీతల్లి.

భరత—పూర్వము. ఇప్పుడు గాదు. అమ్మా! చూడు.

తే. గీ శీలసంక్రాంతదోషంబుచేతఁ బ్రేమ
దాఱఁగి నీవు పుత్రుల నపుత్రుల నొనర్చి
తేను స్థాపింతు నీధర్మ మీజగమునఁ
దల్లియయ్యు భర్తృద్రోహ తల్లి గాదు.

కైకేయి—బిడ్డా! మహారాజుగారి సత్యవచనము రక్షించుట కై నే నట్లు చెప్పితిని.

భరత—ఏమని ఏమని?

కైకేయి—నాకొడుకు రాజుకావలె నని.

భరత—అట్లయిన రాముఁడు నీకేమగును? కొడుకు కాఁడా!

తే. గీ. అతఁడు మాతండ్రి కౌరసపుత్రుఁడు గాఁడె
క్రమముగా నభిషేకంబు గావలదఁటె
భ్రాత లతనికిఁ గూర్చెడువారు గారె,
ప్రకృతిజనుల కిష్టములేదె వానిమీఁద?

కైకేయి — బిడ్డా! ఆప్రశ్న శుల్కమం దాసక్తిగల కేకయ రాజుల నడుగవలసినది.

భర — తే. గీ. రాజ్యలక్ష్మిని విడచి, భార్యాయుతముగ
నారలను గట్టుకొని, కాలినడక నడవి
కేగవలె రాముఁడని యానతిచ్చి తీవు!
అదియు శుల్కమం దున్నవే యరసిచూడ.

కైకేయి — బిడ్డా! దానిసమయము వచ్చినపుడు తగినచోటఁ జెప్పెదను.

భరత —

చ. అపయశ మీవు గోరునెడ నచ్చట నఁ దలపెట్టనేటికిన్
నృపఫల మాసజేయునెడ నీ కది భూపతి యీయకుండునే
నృపతికిఁ దల్లిఁ గావలయు నే నని కోరిక నీకుఁ గల్గినన్
జెపుమ యథార్థమౌపలుకు నీకుఁ గుమారుఁడుగాఁడె రాముడున్.

నీవు ఘోరకృత్యము చేసితివి.

చ. క్షితిపతిప్రాణముల్ సరకుసేయకపోతివి రాజ్యకాంక్ష, పం
చితి వనభూములం దిరుగ జ్యేష్ఠకుమారుని రాము వల్కలా
న్వితయగు భూతనూజఁ గని నీయెద వ్రక్కలుగాకపోయె హా!
హతవిధి వజ్రమట్టులు మహాకఠినంబుగఁ జేసె దానినిన్.

సుమం — కుమారా? ఈవసిష్ఠవామదేవులు ప్రకృతిజనంబులు బురస్కరించుకొని నీ కభిషేకముసేయ నిన్నెదుర్కొని యిల్లు విజ్ఞాపనము సేయు[illegible]

క. గోపాలుఁడు లేనిపసులు
 కాఁపాడెడువారు లేక క్షయమగురీతిన్
 భూపాలుఁడు లేనిప్రజలు
 వ్యాపాదితు లగుదు రెల్లభంగులఁ బెనుచున్

భరత—ప్రకృతిజనులు నన్ననుసరింతురు గాక!

సుమం—అభిషేకమును మాని నీ వెక్కడికిఁ బోవుదువు?

భరత—అభిషేకమా! అది యామె కొసఁగుఁడు.

సుమం—నీ వెక్కడికిఁ బోవుదువు?

భరత—

తే. గీ. లక్ష్మణప్రియుఁడైన యాలలితమూర్తి
 యెట వసించునో పోదు నే నటకె రాముఁ
 డుండనట్టి యయోధ్య యయోధ్య గాదు
 అతఁ డెటనుండు నదె యయోధ్యాపురంబు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

——:o:——

శ్రీరస్తు.

# ప్రతిమా నాటకము

## చతుర్థాంకము.

(అప్పు డిద్దఱుచేటులు విజయా. నందినికలు ప్రవేశించుచున్నారు.)

విజయ—సఖీ ! నందినికా ! చెప్పు. చెప్పు. నేఁడు కౌసల్య మొదలగు సకలాంతఃపురజనులు, ప్రతిమాగేహముఁ జూచుటకు వెళ్ళి నప్పుడు భరతకుమారుఁడు వారికిఁ గనఁబడెనఁటగాదూ ! మందభాగ్యురాలను నేను ద్వారమందే యుంటిని.

నందినిక—సఖీ ! నేను మిక్కిలి కుతూహలముతో రాజకుమారుని భరతునిఁ జూచితిని.

విజ—కుమారుఁడు తల్లితో నేమనెను ?

నందిని—ఏమి చెప్పను ! ఆమెను జూచుటకే కుమారుఁ డిష్టపడ లేదు.

విజ—అహో ! మహాకష్టము. రాజ్యలోభముచేత నామె రాజకుమారుఁ డైనరామునకు రాజ్యభ్రంశముఁ గల్పించి తనకు వైధవ్యముఁ దెచ్చికొనుటయే గాక లోకమునకు నాశనముగూడ గావించెను. ఈమె జాలిమాలినది. పాపము చేసినది.

నందిని—సఖీ ! విను. ప్రకృతిజనులు పట్టాభిషేకము సేయ రాఁగా దానిని నిరాకరించి భరతుఁడు రాముని తపోవనమున కరిగెను.

విజయ—(విషాదముతో) అయ్యో ! అలాగా ? కుమారుఁడు వెళ్ళిపోయెనా ? నందినికా ! రా. మనము కైకను జూతము.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశము.

(అప్పుడు రథముతో భరతుఁడును, సుమంత్రుఁడును బ్రవేశించుచున్నారు.

భరత— తే. గీ. స్వసుకృతము వెంట రారాజు చనియె దివికి
సఖిలపౌరాశ్రుజలము న న్ననుసరింప
వచ్చినాఁడఁ, బావనతపోవనులయందు
రామనామకచంద్రదర్శనముఁ జేయ.

సుమం—ఆయుష్మంతుఁ డైనయీభరతుఁడు,

చం. తనయుఁడు దానవేంద్రపృథుదర్పహరుండగు రాజమౌళికిన్,
మనమఁడు సర్వరార్థము పమస్తవిభూతుల నిచ్చుతేనికిన్,
గనుఁడు పితృప్రియుండును జగత్త్రియవర్తనుఁ డైనరామచం
ద్రునియనుజుండు రామవిభుత్రోవనె త్రొక్కినవాఁడు సన్మతిన్.

భరత—తండ్రీ !

సుమం—కుమారా ! ఇది యేమి ?

భరత—ఏఁడీ ! మాయన్న రాముఁడు ? ఏఁడీ ! మహారాజప్రతినిధి ? ఏఁడీ ! జ్ఞానవంతుఁడగు సన్నిదర్శుఁడు ? ఏఁడీ ! రాజ్యలుబ్ధయైనకైకేయిచేతఁ దిరస్కరింపఁబడ్డయాతఁడు ? ఏఁడీ ! యశోభాజనుఁడు ? ఏఁడీ ! మహారాజపుత్త్రుఁడు ? ఏఁడీ ! సత్యానువ్రతుఁడు ?

క. మాయమ్మకుఁ గడుఁబ్రియమును
సేయఁగ నెవ్వాఁడు విడిచె సిరులెల్లను, నే
నాయనఘుఁ జూడఁగోరెద,
నాయన నాపరమదైవమని భావింతున్.

సుమం—కుమారా ! ఈయాశ్రమపథమందు.

తే. గీ. మహితయశులైన రామలక్ష్మణులు, జనక
రాజపుత్త్రియు నున్నారు తేజమలర

సత్యమును భక్తి, శీలంబు, జగతిలోన
విగ్రహంబులు దాలిచి వెలయునట్లు

భరత—అట్లయిన రథము నిలుపుము.

సూత—ఆయుష్మంతుఁడా! (అని యట్లు చేయుచున్నాఁడు)

భరత—(రథముదిగి) సూతుఁడా ఏకాంతస్థలమున గుఱ్ఱములను విశ్రమింపఁ జేయుము.

సూత—ఆయుష్మంతుఁడా! చిత్తము.

(అని నిష్క్రమించును)

భరత—ఓతండ్రీ! నివేదింపుము నివేదింపుము.

సుమం—కుమారా! ఏమని నివేదింతును?

భరత—రాజ్యలుబ్ధమైన కైకేయిపుత్రుఁడు భరతుఁడు వచ్చినాడని.

సుమ—కుమారా! పెద్దలయపవాదము జెప్పఁగూడదు.

భరత—మంచిది పరులదోషముఁ బేర్కొనుట న్యాయము గాదు అట్లయిన నిక్ష్వాకుకులకళంకభూతుఁడైన భరతుఁడు దర్శన మభిలషించుచున్నవాఁడని చెప్పుము.

సుమం—కుమారా! నే నట్లు చెప్పఁజాలను. కాని, భరతుఁడు వచ్చినాడఁని చెప్పెదను.

భరత—వద్దువద్దు. నామమాత్రమును జెప్పుట ప్రాయశ్చిత్తమును జేసికొనకపోవుటయని నేఁ దలంచెదను ,బ్రహ్మహత్యా మహాపాతకులనుగూడ మఱియొకరు తెలియఁబఱచుటా? కాఁబట్టి తండ్రీ! నీ వూఁగుము నన్ను నేనే తెలియఁబఱచు కొందును.

ఓహోహో! పితృవాక్యపరిపాలకుఁడగు రాఘవునికి విన్నవింపుఁడు విన్నవింపుఁడు.

తే. గీ. "నిర్దయుండు, కృతఘ్నుండు, నీచబుద్ధి
సాహసప్రియుండును, యథాజాతుఁడైన
భక్తిమంతుఁ డొక్కఁడు చూడ వచ్చినాఁడు
ఉండుమందువో పొమ్మందువో వచింపు"

అని

(అప్పుడు సీతాలక్ష్మణులతోఁగూడి రాముఁడు ప్రవేశించుచున్నాఁడు)

రాముఁడు—(విని సంతోషముతో) సౌమిత్రీ! వినుచున్నావా? ఓ విదేహరాజపుత్రీ! నీవును వినుచున్నావా? ఓవిదేహరాజపుత్రీ! నీవును వినుచున్నావా?

మ. ఇది మాతండ్రిస్వరంబువోలెదు సహా! యెవ్వానిదోగాని। యం
బుదనాదంబును ధిక్కరించు ననయంబున్ నైజగాంభీర్యతన్
మదిలో నియ్యది బంధుశంక జనియింపం జేసి యీవేళ నా
హృదయంబు న్వెసఁజొచ్చుచున్నయదియెంతేస్నేహభావంబునన్

లక్ష్మ—అయ్యా! నాకుఁగూడ నీస్వరసంయోగము బంధుజనబహుమానమును గూర్చుచున్నది మఱియు నిది.

సీ. ఘనమయి స్పష్టమై గంభీరమై సాంద్ర
మదవృషభస్నిగ్ధమధుర మగుచు
గళమందు శ్రావ్యమై ఘనవక్షమం దను
పహతసంచారరభసము గల్గి
మానుగా నది యథాస్థానంబు బ్రాపించి
స్ఫుటతరాక్షరములస్ఫురణ గల్గి
నాల్గువర్ణములకు నయమొప్ప నభయప్రదానంబు సేయునా దనరుచుండె

రామ—ఇదియన్నివిధములచేతబంధువుఁడుకానివానిస్వరసంయోగముకాదు నాహృదయము నది ద్రవింపఁజేయుచున్నట్లున్నది. వత్సా లక్ష్మణా వెళ్ళిచూడుము.

లక్ష్మ—అన్నయ్యా! చిత్తము.

(నడచుచున్నాఁడు.)

భరత—ఏమిది నా కెవరుఁ బ్రత్యుత్తరమీయకున్నారు. కైకేయీపుత్రుఁడు భరతుఁడు వచ్చియున్నాఁడని వారు తెలిసికొన్నారాయేమి?

లక్ష్మ—(చూచి) అహో! ఇతఁడు రాముఁడే కాదు కాదు. రూపసాదృశ్యము.

సీ. నిండుచందురుఁ డట్లు నెమ్మొగం బతిమనో
హరము మాయన్నయాస్యమునుఁబో లె
నేసురబాణక్షతం బైనమజ్జనకుని
వెడఁదఱొమ్మునుఁబోలు వీనియురము
కాంతిమంతుండు సఖండ తేజోరాశి
తలఁప జగత్ప్రియదర్శనుండు
ఈనృపాలకుఁడు దేవేంద్రుఁడో లేక యా
మధువైరియో యని మదినిఁ దోఁచె.

(సుమంత్రునిఁజూచి) అహో! తండ్రి సుమంత్రుఁడు.

సుమం—ఓహో! లక్ష్మణకుమారుఁడు.

భర—ఆలాగే! ఇతఁడు మాయన్న అన్నయ్యా! నమస్కారము.

లక్ష్మ—రమ్మా రమ్మా. ఆయుష్మంతుఁడవు గమ్మా. (సుమంత్రునిఁజూచి) ఈయనెవరు?

సుమం—కుమార!

తే. రఘునకుఁ జతుర్థుఁ డజమహారాజునకు దృ
తీయుఁడు దశథునకు ద్వితీయుఁ డితఁడు
స్వకులకేతువా మెవని కవరజుఁడ వైతొ
యతనితమ్ముఁడె యితఁడు భరతుఁడు సుమ్ము.

లక్ష్మ—ఇక్ష్వాకుకుమారా! రమ్మి రమ్మి. వత్స! శుభమగుఁగాక! ఆయుష్మంతుఁడవుగమ్మి.

చ. అనుపమబాహువీర్యులు మహాసురసంగరదక్షు లుగ్రవ
జ్రినిభశరాసుతా స్వకులజాతనృపాలురవిక్రమంబునన్
మను మిల కోశజాతము సమస్తము జన్నములన్ వ్యయంబు చే
సినరఘువట్టు లుండుము విశిష్టగుణంబుల భాజనంబవై.

భరత—అనుగ్రహింపఁబడితిని.

లక్ష్మ—కుమార! ఇక్కడుండుము. నీవు వచ్చిన ట్లన్నగారి కెఱిఁగించెదను.

భరత—అన్నయ్యా! ఇప్పుడు నన్నగారికిఁ ద్వరగా నమస్కరింపవలెనని కోరుచున్నాను. శీఘ్రముగా విన్నవింపుము.

లక్ష్మ—మంచిది. (రామునికడకుఁబోయి) అన్నయ్యా! జయము అయ్యా!

తే. గీ. ఇతఁడు నీప్రియసోదరుం డినకులేంద్ర
భ్రాతృవత్సలుఁ డైనట్టిభరతుఁడయ్య
స్వచ్ఛమైన నీరూపంబు సంక్రమించి
యతనియందు నద్దమునందునట్ల వెలయు.

రామ—వత్స! లక్ష్మణ! భరతుఁ డీలాగు వచ్చెనా?

లక్ష్మ—అన్నయ్యా! అవును.

రామ—మైథిలీ! భరతునిఁజూచుటకు నీకన్నులు విశాలముజేసికొనుము.

సీత—ఆర్యపుత్ర! భరతుఁడు వచ్చెనా?

రాము—మైథిలి! అవును

తే. గీ. భ్రాతృవాత్సల్య మీరీతి వ్యక్తమయ్యెఁ
బుత్త్రవాత్సల్య మెట్టిదో పొగడఁదరమె

నన్ను నెడఁబాయఁజాలక నాదుజనకుఁ
డెంతపరితాప మొందెనో యిపుడు తెలిసె.

లక్ష్మ—అన్నయ్యా! భరతుఁడు రావచ్చునా?

రామ—ఈవిషయమునఁగూడ నాయభిప్రాయము నడుగఁ దలఁచుచున్నావా? వెళ్ళు కుమారుని సత్కరించి శీఘ్రమెదిసికొనిరా

లక్ష్మ—అన్నయ్యా! చిత్తము.

రాము—పోనీ! నీవుండు.

తే. గీ. మాతృభావంబుతోడఁ గుమారుఁజూచి
యాదరింప నీజానకి యరుగుఁగాక
నవతుషారపూర్ణోత్పలనయన యగుచు
నశ్రువర్షంబు జడివానయట్లఁ గురిసి.

సీత—ఆర్యపుత్రా! మీరు సెలవిచ్చినట్లు చేసెదను. (లేచి నడచి భరతుఁ జూచి) అహో! ఆర్యపుత్రులు పర్ణశాల విడిచి యిటు వచ్చిరా? కాదు కాదు. ఇది రూపసాదృశ్యము.

సుమం—ఓహో! కోడలు సీత.

భరత—ఆహా! ఈమె పూజ్యురాలైన జనకరాజనందినగదా!

తే. గీ. అతివ క్షేత్రోదరమునుండి హలమువలన
నవతరించినశ్రీమయం బైన తేజ
మఖిలజనవంద్యమానుఁ డైనట్టిజనక
పార్థివేశ్వరుని మహాతపఃఫలంబు.

అమ్మా! అభివాదము సేయుచున్నాఁడను నేను భరతుఁడను.

సీత—(తనలో) రూపమే గాదు స్వరయోగముగూడ నదే. (ప్రకాశముగా) వత్సా! చిరంజీవివిగమ్ము!

భరత—అనుగ్రహింపఁబడితిని.

సీత—కుమారా! రమ్ము. మీయన్నగారిమనోరథము సిద్ధింపఁజేయుము.

సుమం—కుమార! నీవు వెళ్లుము.

భరత—తండ్రీ! ఇప్పుడు నీ వేమిచేసెదవు?

సుమం—

తే. గీ. నీవు ముందేగు నీవెన్క నేను వత్తు
నవనినాథుండు స్వర్గస్థుఁ డైనపిదప
శోకతప్తుఁడ రాముని జూడలేదు
మొదటిచూపిది యాట మోమోటవడుదు.

భరత—సరె! అట్లే యగుఁగాక! (రాముని సమీపించి) అన్నయ్యా! భరతుఁడను నమస్కరించుచున్నాఁడను.

రాము—(సంతోషముతో) ఇక్ష్వాకుకుమారా! రమ్ము. రమ్ము. శుభమగుఁగాక ఆయుష్మంతుఁడవు గమ్ము.

తే. గీ. ఘనకవాటపరిమాణవక్షము నొసంగి
నీగురుభుజద్వయమున నన్ గౌఁగిలింపు,
మెత్తు శరదిందుకల్పమై యెసఁగు మోము
వ్యసనదగ్ధమౌ మేను నాహ్లాదపఱుపు.

భరత—అనుగ్రహింపఁబడితిని.

సుమం—(సమీపించి) ఆయుష్మంతుఁడా! జయము.

రామ—హా! తండ్రీ!

సీ. గగనమంతటిమెత్తుగల విమానములలో
నేసలఁ బెక్కుఁ దీసికొనిపోయి
యలసురాసురయుద్ధముల దండయాత్రల
నిరుపమశౌర్యంబు నెఱపి నెఱపి

యతఁడె యాతఁడెయంచు నమరులు తనుఁజూపి
కైవార మొనరించి గౌరవింప
ఖ్యాతిఁ గాంచినయట్టిమాతండ్రి యక్కటా!
దైవవశంబునఁ దనువు విడిచి

తే. గీ. స్నేహవంతుఁ బ్రాణసమాను నిన్నుఁ గూడ
విడిచి, స్వర్గలోకంబున విశిసి నేఁడు
తనదుపితృదేవతలఁ గూడి ధన్యుఁడగుచు
నూర్జితంబుగఁ గ్రీడించుచున్నవాఁడె!

సుమం—(శోకముతో)

తే. గీ. నీప్రవాసంబు దశరథనృపతియుఁ
గుల మనాథమౌట భరతుకొందలంబు
ననేకబలుబాము లనుభవించిన కతానఁ
జేటునకె యయ్యె నాచిరజీవనంబు.

సీత—దుఃఖించుచున్న యార్యపుత్రుని నీయన మఱింతదుఃఖపెట్టుచున్నారు.

రాము—మైథిలీ! నేమూర్ఛిల్లెదను. లక్ష్మణా! ఉదకము దెమ్ము.

లక్ష్మ—అన్నయ్యా! చిత్తము.

భరత—అన్నయ్యా! న్యాయము కాదు. క్రమప్రకారము శుశ్రూష జేసెదను. నేనే వెళ్ళి తెచ్చెదను. (కలశమునుబుచ్చుకొని వెళ్ళి మరల వచ్చి) ఉదక మిదిగో!

రామ—(ఆచమించి) మైథిలీ! ఇప్పుడు లక్ష్మణునకుఁ గొంత పని తగ్గినది.

సీత—మీ కితఁడుకూడ శుశ్రూష జేయవలసినదే.

రామ—ఇక్కడ లక్ష్మణుఁడు శుశ్రూష చేయుఁగాక! అక్కడ భరతుఁడు చేయుఁగాక!

భరత—అన్నయ్యా! అనుగ్రహింపుము.

ఆ. వె. మేనిచేత నందు మీసమ్ముఖముననె
యుందుఁ గర్మచేత నందు నేను
రాజ్యమంతయును సురక్షితంబగును మీ
నామమాత్రముననె నరవరేణ్య!

రాము—వత్సా! కైకేయీనందనా! అట్లుకాదు.

తే. గీ. జనకునానతి వచ్చితి వనికి నేను
కాదు దర్పంబుచేతను గాదు భీతి
మనకులము సత్యధనమనుమాట వినవె
నీచుపథమున నడతువె నీవు వత్స!

సుమం—ఇప్పు డభిషేకజల మెవరిమీఁదఁ బడవలెను.

రాము—ఏవరిమీఁద బడవలయునని మాతల్లి చెప్పెనో య
క్కడఁబడుఁగాక!

భరత—అన్నయ్యా! అనుగ్రహింపుము. పుండుమీఁద మర
లఁ గొట్టవద్దు.

తే. గీ. నీకులంబె నాకులమయి నెగడునేని,
నీజనకుఁడే నాజనకుఁడై నెగడునేని;
దల్లిదోసంబు దోషమై చెల్లదేని,
నార్తుఁడగునన్ను మునుపటియట్ల జూడు.

సీత—ఆర్యపుత్రా! భరతుఁడు మిక్కిలి జాలిగఁ బలుకుచు
న్నాఁడు. మీ రిప్పు డేమాలోచించుచున్నారు?

రాము—మైథిలీ!

తే. గీ. సుతుని యీయుత్తమగుణంబుఁ జూడకుండ
సురపురికిఁ జన్నతండ్రికై శోకపడుదుఁ,

బుత్త్రుఁ డిట్టివానినిఁ గన్నపురుషులకును
మరణమైన, ఛీ! విధిశక్తి మాన్యమగునె?
వత్సా! కైకేయీనందనా!

సీ. పరితోషమందితి వత్స! నీచేతను
నిష్కల్మషుం డగు నీవు చూడ
నీదువాక్యములకు నే వశమయితిని
నిర్జింపఁబడితిని నీగుణముల
నా రాజుమాటల నన్నృతంబుసేయుట
తగదు నీబోఁటినందనుని కన్న!
నీవొప్పుకొనకున్న నినువంటిసుతుఁ గని
తండ్రి తా మిథ్యాభిధాయి యగును

భరత— తే. గీ. నీవ్రతము పూర్తియగుదాఁక నిర్మలాత్మ!
నీదుపాదమూలంబున నే వసింతు

రాము— వలదు తండ్రి సిద్ధినిగాంచవలె స్వసుకృతి,
నొట్టుపెట్టెద రాజ్యంబు నూనవేని.

భరత—అయ్యో! ప్రత్యుత్తర మిచ్చుటకు వీలులేనట్లు బలి
...రి., సరే! సమయ మొక్కటి చేసి నీరాజ్యము పాలించెద.

రాము—ఆసమయ మెట్టిది?

భరత—నాహస్తముననున్న నీరాజ్యమును బదునాలుగేండ్లు
...డచినపిదప వెండియు మీరు గ్రహింపవలయు నని కోరుచున్నాను.

రాము—అట్లే యగుఁగాక!

భరత—అన్నయ్యా! లక్ష్మణా! మీరు వింటిరా? అమ్మా!
...వు వింటివా? తండ్రీ సుమంత్రా! నీవును వింటివా?

అందఱు—మేమును వింటిమి.

భరత—అన్నయ్యా! మఱియొకవరముఁ బడయఁగోరెదను.

రాము-వత్సా! ఏమికోరెదవు? ఏమినీకిత్తును? ఏమి సేయుదును!

భరత—

తే. గీ. అనఘ! నీ పదుగులిడఁ బావనములైన
పాదుకల నిమ్ము, తలఁదాల్చి ప్రణుతిఁ జేతుఁ
గార్యసిద్ధిని నీవును గాంచువఱకు
నేను సువిధేయుఁ డయియుందు వాని కెపుడు.

రాము—(తనలో) అయ్యో!

క. చిరకాలము నే శ్రమపడి
యరుదుగ నార్జించినాఁడ నల్పయశంబున్
భరతుఁడు సంపాదించె న
చిరకాలంబుననె దా విశేషసుకీర్తిన్.

సీత—ఆర్యపుత్రా! భరతుని యీప్రథమయాచనము మీరు సఫలము జేయుదురా?

రాము—అట్లే యగుఁగాక! వత్సా గ్రహింపుము.

భరత—అనుగ్రహింపఁబడితిని. (పుచ్చుకొని) అన్నయ్యా! దీని కభిషేకము సేయఁగోరుచున్నాఁడను.

రాము—తండ్రీ! సుమంత్రుఁడా! భరతున కేది యిష్టమో యదియెల్లఁ జేయుము.

సుమం—ఆయుష్మంతుఁడా! నీసెలవుప్రకారము జేసెదను.

భరత—(తనలో) ఆహాహా! నే నిప్పుడు-

సీ. స్వజనసమ్మతుఁడనై జనుల కిష్టుండనై
దర్శనీయుఁడనయి ధరణిప్రజకు
స్వర్గస్థుఁడైనట్టి జనకున కుత్తమ
గుణములుగలిగినకొమరుఁడ నయి

యన్నదమ్ములకు నత్యంతప్రియుండనై
ప్రవిమలకీర్తికి భాజనమయి
సజ్జనగోష్ఠిలో సత్కథాశ్రియుఁడనై
ప్రియజనప్రియుఁడనై పేర్మిఁగంటి.

రాము—వత్సా! కైకేయీనందనా! రాజ్యమనునది ముహూర్తమయిన వదలిపెట్టఁ దగినదికాదు. అందుచేత నీవు నేఁడే మరలి పొమ్ము.

సీత--అయ్యో! కుమారభరతుఁడు నేఁడే పోవునా?

రాము--అతిప్రేమ వలదు. కుమారుఁడు నేఁడే పోవుఁగాక.

భరత—అన్నయ్యా! నేను నేఁడే పోయెదను.

తే. గీ. పట్టణంబున నినుఁ జూడవలయు ననుచుఁ
బట్టెడాసతో నుందురు పురజనంబు
దయనొసంగిననీప్రసాదంబుఁ జూపి
వారి కొడఁగూర్తు ప్రీతి నవ్వారిగాఁగ.

సుమం—ఆయుష్మంతుఁడా! నేనిప్పు డేమిసేయవలయును?

రాము—తండ్రీ! మహారాజుగారివలెనే నీ వీకుమారునిఁ గని పెట్టుము.

సుమంత్రు-బ్రతికియుంటినా యట్లుసేయఁ బ్రయత్నించెదను.

రాము—వత్సా కైకేయీనందనా! నీవు రథము నాయెదుటనే యెక్కుము.

భరత—అన్నయ్యా! చిత్తము.

(భరతసుమంత్రులు రథము నెక్కుచున్నారు.)

రాము—మైథిలీ! ఇటురా. వత్సా లక్ష్మణా! ఇటురా. ఆశ్రమపథద్వారమువఱకు వెళ్ళి భరతుని సాగనంపుము.

(అందఱు నిష్క్రమించుచున్నారు).

ఇది చతుర్థాంకము.

శ్రీరస్తు.

# ప్రతిమా నాటకము

## పంచమాంకము.

(అప్పుడు సీతయు, నొకతాపసియుఁబ్రవేశించుచున్నారు.)

సీత—అమ్మా ! ఆశ్రమమునిండఁ బూజాపుష్పములు బడి యుండుటచేతఁ దుడిచివైచితిని ఆశ్రమమందు లభించినపదార్థముల తోనే దేవపూజ జరిపితిని. ఇఁక నార్యపుత్రులు వచ్చువఱకు నీలేత మొక్కలను నీటితోఁ దడుపుము.

తాపసి—అది నిర్విఘ్నముగా సాగుఁగాక !

(అప్పుడు రాముఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రాము—(శోకముతో)

మ. జనకుం, డేనును లేనికారణమునన్ సాకేతముం బాసి, భ
క్తిని నాకే యభిషేకమున్ సలుపఁ గై కేయీతనూజుండు వ
చ్చెను, నే వెండియు రాజ్యరక్షకొఱకై శీఘ్రంబునం బంచినాఁ
డను, భూభార మొకఁడె దాల్చు టతికష్టంబైన కార్యం బహో!

(విమర్శించి) అది యట్టిదే. ఇప్పు డిటువంటిశోకము నపన యించుటకు నాకవస్థాకుటుంబిని యైనవైదేహిం జూచెదను. వైదేహి యెక్కడ నున్నదో ? (నడచిచూచి) అహో ! క్రొత్తగాఁ దడుపఁ బడినయీచెట్లమొదళ్ళు మైథిలి దూరముగ లేదని సూచించుచున్నవి. అట్లే కదా !

చ. సలిలము వృక్షమూలముల సంచలియించెడు నుర్విఁతోడఁ బు
ల్గులు తృషగల్గియున్ జలముఁ గ్రోలవు, పంకిలమాటఁ గీటకం

బులు వెస మెట్టఁ జేరు బిలముల్ జలపూర్ణములౌటఁ జక్రిముల్
బలె వలయంబు లేర్పడె జలక్షయమైన మొదళ్ళఁ జెట్లకున్.

(చూచి) అహో ! ఇదిగో వైదేహి. అహో ! కష్టము.

తే. గీ. అర్ఘమును దాల్ప నలసెడునామె చేయి
కలశమూనియు నించుక యలయ దిపుడు
స్త్రీలసౌకుమార్యంబును దీఁగలపస
యడవియందు మిక్కిలి మోట యగునుగాదె !

(సమీపించి) మైథిలీ ! తపస్సు వర్థిల్లుచున్నదా ?

సీత—అహో ! ఆర్యపుత్రులా ! ఆర్యపుత్రా ! జయము.

రామ:—వైదేహీ ! నీకు ధర్మవిఘ్నము లేనియెడల నిటఁ గూర్చుండుము.

సీత—ఆర్యపుత్రా ! చిత్తము. (కూర్చుండును)

రామ:—జానకి ! నావలన నేదో వినఁగోరుచున్నదానివలె నీవు కనఁబడుచున్నావు. ఏమిది !

సీత—శోకముచేతశూన్యహృదయులై నమీముఖులై వర్ణ్యము నకు హేతువు వినఁగోరుచున్నాను.

రామ:—జానకి ! చింతయున్నమాట నిజమే.

తే. గీ. నాఁడు విధిశల్యహతమయ్యె నాశరీర
మావ్రణము నేఁటికిని మాన కట్లెయుండె
శోకశరఘాతములు పడుఁ జుఱ్ఱుమనుచు
దానిమీఁదఁనె బహుఫలదంబు లగుచు.

సీత—ఇప్పుడు మీసంతాప మెట్టిది ?

రామ:—రేపు పూజ్యులైనమాతండ్రిగారి ప్రతిసంవత్సరశ్రాద్ధవిధి. పితృదేవతలు కల్పవిశేషముచేతఁ దర్పణము నపేక్షించుచుందురు. అది యెట్లు నిర్వర్తింతునని విచారించుచున్నాను. కాదేని,

తే. గీ. దేనిచేతనో పితలు సంతృప్తిఁ గాంతు
కొలుఁగుదురు వారు నాదగునీయవస్థ,
నైనఁ బూజలు సేయంగనభిలషింతు
నాయనకు నాకు ననురూపమైనసరణి.

సీత—ఆర్యపుత్ర! భరతుఁడు సమృద్ధిగా శ్రాద్ధము నిర్వర్తించును. మీరు మీయవస్థానురూపముగా నిప్పుడు ఫలోదకములచేత నిర్వర్తింతురుగాక ! అదియె మీతండ్రిగారికి మిక్కిలిప్రీతిని గలిగించును.

రాము—జానకి !

ఆ. వె. వన్యఫలములఁగొని నాచేతితో నేనె
దర్భలపయిఁ బెట్ట దానిఁ జూచి
నాయరణ్యవాస మాయన స్మరియించి
నాదుతండ్రి మిగుల ఖేదపడును.

(అప్పుడు పరివ్రాజకవేషముతో రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రావణుఁడు—(తనలో) అహో! నేను.

మ. నియతాత్ముండను గాకయున్న, నియతాస్వీతాకృతిం దాల్చి, దు
ర్జయుఁడై మాఖరుఁ జంపియుండుటఁ బగన్ సాధించి యీరాము నె
ట్లయిన న్వంచన సేయ వచ్చితి, విదేహాధీశపుత్రిన్ స్వర
క్షయమౌనప్పుడు హవ్యధారబలె నిశ్శంకన్ హరింతున్ దుష్టిన్.

(నడచి క్రిందజూచి) ఇది రామునియాశ్రమపదద్వారము. ప్రవేశించెదను. నేనును నతిథిసముదాచారము నధిష్ఠించెదను. (ప్రకాశము) నేనతిథిని. ఎవరక్కడ ?

రాము—(విని) అతిథికి స్వాగతము.

రావణ—బాగు! స్వరముచేత రూపము విశేషముగా శోభించుచున్నది.

రాము—(చూచి) అహో! భగవానుఁడు. మహాత్మా! నమస్కరించుచున్నాఁడను.

రావణ—శుభమగుఁగాక !

రాము—భగవానుఁడా! ఆయాసనముమీఁదఁగూర్చుండుము.

రావణ—(తనలో) ఏమిది! ఇతఁడు నన్నాజ్ఞాపించుచున్నట్లున్నాఁడు. (పైకి) మంచిది! (కూర్చుండును.)

రాము—మైథిలి! మహాత్మునినిమిత్తము పాద్యముఁ దెమ్ము.

సీత—ఆర్యపుత్రి! చిత్తము. (నిష్క్రమించి ప్రవేశించి) ఉదక మిదిగో.

రామ—భగవానునకు శుశ్రూష సేయుము.

సీత—ఆర్యపుత్ర ! చిత్తము.

రావణ—(మాయ బయల్పడునని భయపడి) సరె, సరె.

తే. గీ. మానవాంగనలందు సీమగువ యొకత
యయ్యరుంధతి యైయున్న దవనిలోన,
నామెకును భర్తవంచు నిన్నతివ లెల్ల
నుగ్గడించుటచేత ధన్యుఁడవు నీవు.

రాము—అట్లయిన నేనే శుశ్రూషచేసెదను. పాద్య మిటు దెమ్ము.

రావణ—ఓయీ! ఛాయను బరిహరించి శరీరమును లంఘింపను. అతిథిసత్కారము మాటలోనే యున్నది. నన్ను మీరు పూజించినారు. కూర్చుండుఁడు.

రామ—మంచిది. (అనికూర్చుండును).

రావణ—(తనలో) నే నిప్పుడు బ్రాహ్మణసముదాచారము ననుష్ఠించెదను. (పైకి) అయ్యా! నేను కాశ్యపగోత్రుఁడను., వేదము సాంగోపాంగముగాఁ జదివితిని, అదిగాక మనుధర్మశాస్త్రము, మా

హేశ్వరయోగశాస్త్రము, బృహస్పతి రచితమైన యర్థశాస్త్రము, మేధాతిథిప్రణీతన్యాయశాస్త్రము, ప్రాచేతసశ్రాద్ధకల్పమునుగూడఁ జదివితిని.

రాము—ఎట్లెట్లు! శ్రాద్ధకల్పమా?

రావణ—సర్వశ్రుతులను విడిచి నీమనస్సు శ్రాద్ధకల్పము మీఁదికిఁ బోయిన దేమి?

రాము—భగవానుఁడా! చంద్రిచనిపోయినప్పు డీయాగమ మవసరముగదా?

రావణ—కాదనక నీవడుగుము.

రాము—భగవానుఁడా! పిండప్రదానకాలమునందు దేనిచేత నేను పితృదేవతలను దృప్తులను జేయుదును?

రావణ—శ్రద్ధతోఁ జేసినదంతయు శ్రాద్ధమగును.

రాము—భగవానుఁడా! అనాదరమునఁ జేసినది చేయనిదియె యగును. ఇప్పుడు విశేషార్థ మడుగుచున్నాఁడు.

రావణ—విను ఉద్భిజ్జములలోఁ దర్భలు, నోషధులలో నువ్వులు, కూరలలోఁజిక్కుఁడు, మేఁపలలో వాలుగులు, పక్షులలో వార్ధ్రాణసములు, పశువులలో గోవులు, ఖడ్గమృగముగాని, ననునవి మనుష్యులకు విధింపఁబడినవి.

రాము—భగవానుఁడా! కాని యనుటచేత మఱియొకటి యున్నదని తోఁచుచున్నది.

రావణ—ప్రభావముచేత సంపాదింపఁదగినది యొకటి యున్నది.

రాము—భగవానుఁడా! అట్లయిన నదే నానిశ్చయము.

తే. గీ. దాని సాధించుపొంకె నోతాపసేంద్ర!
యుభయమును సన్నిహితమయి యున్న దిచటఁ

దపసుశాంతమైయుండిన ధనువు గలదు,
ధనువు శాంతమై పోయినఁ దపసు గలదు.

రావణ—అవి కలవుగాని హిమవత్పర్వతము మీఁదనుండును.

రాము—హిమవంతము మీఁదనా! తర్వాత తర్వాత?

రావణ—హిమవంతుని సప్తమశృంగమునందు మహేశ్వర శిరస్సునుండి ప్రత్యక్షముగాఁ బడునట్టిజలంబుఁ ద్రాగునవియు వైడూర్యములవలె శ్యామములైన పృష్ఠములు గలవియు, గాలివంటివేగము గలవియు, నగు కాంచనపార్శ్వములనుమృగములు గలవు. వైఖానస వాలఖిల్యనైమిశీయాదిమహర్షులు తలఁచుకొన్నమాత్రమునసే యా మృగములు మృతినొంద వానితో శ్రాద్ధములు చేయుచుందురు.

చ. పితరులు దానఁ దృప్తులయి ప్రీతిని బుత్రఫలంబు గాంతుఁ, రం
చితగతి వార్ధకంబెడలి స్వేచ్ఛఁ జరింతురు, నింగిమీఁద దే
వతలవలెన్ విమానములపై వసియించుచునుందు, రింద్రియ
ప్రతతియు నీడ్వఁజాల, దిఁక వారిని బల్మిని నన్యులంబలెౕ.

రాము—మైథిలి!

సీ. సెలవు గైకొనుము బిడ్డలయట్లఁ బెరిగిన
జంకలయొద్దను, జెట్లయొద్ద
వింధ్యవాటికయొద్దఁ బ్రియసఖీజనమైన
రమణీయతరులతారాజియొద్ద
నోషధీలతలచే నుపరంజితంబులై
యతిమనోహరములై యలరుచుండు
తుహినభూధరమహాగహనసీమలయందు
వసియింపఁబోదము వనజనయన!

సీత—ఆర్యపుత్ర మీరు సెలవిచ్చినట్లు చేసెదను.

రావణ—కౌసల్యానందన! అతిమనోరథము గూడదు. అవి మనుష్యుల కగపడవు.

రామ—భగవానుఁడ! హిమవంతముమీఁద వసించునా?

రావణ—ఔను.

రామ—అట్లయిన మీరు చూడుఁడు-

తే. గీ. ఆహిరణ్మయమృగముల నాహిమాద్రి
నాకుఁ జూపంగవలయును, లేకయున్న
నాదుబాణవేగమున భిన్నమయిపోయి
యతఁడు క్రౌంచత్వమైనను నందవలయు.

రావణ—(తనలో) ఇతనిగర్వ మసహ్యముగా నున్నది.

రాము—(దిక్కులుజూచి) అహో! ఏమిది? మెఱపు మెఱసి నట్లున్నది.

రావణ—కౌసల్యానందన! హిమవానుఁడు నిన్నిక్కడనుండఁగానే గౌరవించుచున్నాఁడు. ఇదే కాంచనపార్శ్వమను మృగము.

రాము—ఈయభ్యుదయము మీవల్లనే.

సీత—అదృష్టవశమున నార్యపుత్రులు ధన్యులైరి.

రాము—కాదు కాదు.

తే. గీ. ఇది స్వయముగానె వచ్చిన హేతువునను
నీయదృష్టము మాతండ్రిదే యగుఁ జుమి
దీని బలిజేసి శ్రాద్ధంబు దీర్పఁ దగును
వేగ నిటకు సౌమిత్రిని బిలిచి చెప్పు.

సీత—ఆర్యపుత్ర! తీర్థయాత్రనుండి మరలివచ్చినకులపతి కెదురేగి స్వాగతమిచ్చుటకై మీ రతని బంపితిరికదా!

రాము—అట్లైన నేనే పోవుదును.

సీత—ఆర్యపుత్ర! నే నేమి చేయవలెను?

రాము—ఈమహాత్మునకు శుశ్రూష చేయుము.

సీత—ఆర్యపుత్ర! మీరు సెలవిచ్చినట్లు చేసెదను.

రామ—(నిష్క్రమించుచున్నాడు.)

రావణ—అహో! అర్ఘ్యమును దీసికొని రాఘవుఁడు మృగమును సమీపించుచున్నాఁడు. అర్ఘ్యమును లెక్కసేయక పరుగెత్తుచున్న యాజింకనుజూచి యతఁడు విల్లెక్కునెట్టుచున్నాఁడు.

ఆ. వె. ఎంత బాహుశక్తి! యెంతమహావీర్య!
మెంత సత్వసార మెంతజవము!
అహహా! రాముఁడనెడునల్పాతురంబుల
నఖిలజగము వ్యాప్తమయ్యె నిజము.

ఈమృగ మొక్కదాటున బాణపుగుఱిని దప్పించుకొని మహారణ్యమును బ్రవేశించినది.

సీత—(తనలో) ఆర్యపుత్రుఁడు లేకుండుటచే నా కిప్పుడు భయముగలుగుచున్నది.

రావణ—(తనలో)

తే. గీ. రాఘవుఁడు మాయచేత దూరమున కరిగె
నున్న దీతపోవని సీత యొక్కరితయ
యీడ్చుకొనిపోదు నే నది యేడ్చుచుండ
యజ్ఞముల నమంత్రోక్తమౌ నాహుతిఁబలె.

సీత—ఇప్పుడు పర్ణశాలనాకిటి కరిగెదను.

రావణ—(నిజరూపము గ్రహించి)సీతా! ఉండు. ఉండు.

సీత— (భయముతో)అమ్మయ్యో! ఇతఁ డెవఁడు?

రావణ—ఎఱుఁగవా?

మ. అవనిలో నిర్జితులైరి శక్రముఖులౌ నాదిత్యులున్ దైత్యు లె
వ్వనిచే, నాదశకంథరుండ, విని మద్భాగితాదిరక్షోవధం
బును మాశూర్పణఖావిరూప కరణంబున్ దర్పగర్వాంధు రా
ముని వంచించి నినున్ హరించుటకు వంబోజాక్షీ! నేవచ్చితిన్

సీత—అయ్యో! రావణుఁడా?

రావణ—హా! రావణుని కంటఁబడిన తరువాత నీవెందుఁబో గలవు?

సీత—ఆర్యపుత్ర! రక్షింపుము. రక్షింపుము. సౌమిత్రి! రక్షింపుము రక్షింపుము.

రావణ—సీతా! నాపరాక్రమము వినుము:—

కవిరాజవిరాజితము.

అమరవరేణ్యుఁడు భగ్నమునొందె. ధనాధిపుఁడున్ జనెఁగంపితుఁడై
శమనుఁడుఁగూడ విమర్దితుఁడయ్యె, నిశాపతి నీఁగిచి తన్నితి నే
నమితభయంబును బొందినదివ్యుల కాస్పదమాదివి రోఁతయగున్
గమలదళేక్షణ జానకియుండుట త్స్వాతలమంతయు ధన్యసుమీ.

సీత—అర్యపుత్ర! రక్షింపుము. రక్షింపుము. లక్ష్మణా! రక్షింపుము నన్ను రక్షింపుము.

రావణ—

తే. గీ. సుగని రామునో మఱఁది లక్ష్మణునో చచ్చి
స్వర్గమందున్న మామనో శరణు వేఁడు
మీప్రలాపంబువలన నా కేమిభయము
జింకపిల్లలు బెబ్బులిఁ జెనకఁగలవె.

సీత—ఆర్యపుత్ర! రక్షింపుము. రక్షింపుము. సౌమిత్రి! నన్ను రక్షింపుము. రక్షింపుము.

రావణ—

తే. గీ. ఏలయేడ్చెదె యోసువిశాలనేత్ర!
నన్నుఁ జూడుము నీప్రాణనాథునట్లు
బాహుబలమున్న వేల్పులు బానసైన
నీమగఁడు గెల్వజాలఁడు నిజము నన్ను

సీత—(రోషముతో) శపించెదను జాగ్రత్త!

రావణ—ఆహాహా! పతివ్రతా తేజము.

తే. గీ. మిగులజవమున నే పయికెగిరి యున్నఁ
గాల్పఁబడనైతి నినమయూఖములచేతఁ
జెలువ శపియింతునని యన్న చిన్నిమాట
చేత నిజముగా దగ్ధుండనైతి నేను.

సీత—ఆర్యపుత్రా! రక్షింపుము. రక్షింపుము.

రావణ—(సీతను బట్టుకొని) ఓహో! జనస్థానవాసులైన తాపసులారా! వినుఁడు. వినుఁడు.

తే గీ. ఈదశాస్యుఁడు బలిమి మహీతనూజ
నెత్తుకొని పోవుచున్నవాఁ డేపుమీఱి
క్షాత్రధర్మంబునను బ్రజ్ఞ గలుగునేని
రాఘవుఁడు చూపుఁగాక? పరాక్రమంబు.

సీత—ఆర్యపుత్రి! రక్షింపుము. రక్షింపుము.

రావణ—(నడచుచుఁజూచి) అహో! తనఱెక్కలగాలిచే వనసమూహంబుల నుఱ్ఱూఁత లూఁపుచు మహాచండచంచువైన జటాయువు వచ్చుచున్నాఁడు హా! ఉండు. ఉండు.

తే. గీ. నాదువాలున ఱెక్కలు నఱికివైచి
తొరఁగు క్రొన్నెత్తురుల దొప్పదోఁగునిన్నుఁ
గాలునింటికి నంపెద క్షణములోనఁ
బక్షి! నీవెంత చూడునాప్రజ్ఞ నేఁడు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది పంచమాంకము

—:o:—

శ్రీరస్తు.

# ప్రతిమా నాటకము

## షష్ఠాంకము.

(అప్పు డిద్దఱు వృద్ధతాపసులు ప్రవేశించుచున్నారు.

ఇద్దఱు—మీరు రక్షింతురుగాక! రక్షింతురుగాక!

ప్రథమ—

సీ. నల్లనికలువదండలఁబోలి యతిభీతి
జనకమానెమ్మోనిచాయవాఁడు
తమ్మితూఁడులయట్లు దవళంబులైనదం
ష్ట్రిలతోడిమందహాసంబువాఁడు
నిశలఁ దిరిమ్మరువాఁడు నిర్జరనాయకు
రణమున గెల్చినరావణుండు
నాఁడు లేడినిబోలె నవనికన్యను బట్టి
హరియించుకొనిపోయె నక్కటకట!

ద్వితీయ—ఆహా! పూజ్యురాలైన యీ వైదేహి

తే. గీ. చేష్ట లుడిగివచిలువలచేడెవోలెఁ
గదలుచుండెడి పూఁదీవకరణి నకట!
సీత యీతపోవనినుండి సిద్ధివోలెఁ
బాపి రావణుచే హరింపఁగఁ బడియె.

ఇద్దఱు—అయ్యో! మీరు రక్షింపుఁడు. రక్షింపుఁడు.

ప్రథము—(పైకిఁజూచి) అహో! మాటలోనే దశరథుని ఋణముఁ దీర్చికొనుటకు నేనుండఁగా "నెందుఁ బోయెదవురా" యని

రావణుం బిలిచి యార్చి జటాయువు గగనంబున కెగురుచున్నాఁడు.

ద్వితీయ—ఈరావణుఁడు బిట్టలుకతోఁ గన్నులు పైకెత్తి చూచి వెనుకకుఁ దిరుగుచున్నాఁడు.

ప్రథమ—ఇదిగో! రావణుఁడు.

ద్వితీయు—ఇదిగో! జటాయువు.

ఇద్దఱు—అహో! అంతరక్షమందె యుద్ధముజరుగుచున్నది.

ప్రథమ—కాశ్యప! కాశ్యప! చూడు. జటాయువుసామర్థ్యము.

సీ. ఱెక్కలతో దైత్యు ఱివ్వునఁ దోలుచు
ద్వంద్వయుద్ధమునకుఁ దారసిల్లు
ముక్కుతో గట్టిగాఁ బొడిచి దానవనాథుఁ
గాయము ల్సేయును గాయమందు
నినుపముండులువోలె నెంతయు వాఁడియౌ
గోళ్ళను ఱొమ్మునఁ గుచ్చి చీఱు
వజ్రియుధాగ్రిముల్ ప్రియ్యకానట్టులు
పర్వతేంద్రింబును ప్రిచ్చునట్లు.

ద్వితీయ—అయ్యో రావణుఁడు కోపోద్దీపితుఁడై క్రవ్యాదీశ్వరుఁడైన జటాయువును దనఖడ్గముతోఁ గుడిఱెక్కప్రక్కను గొట్టెను.

ఇద్దఱు—అయ్యయ్యోపూజ్యుఁడైనజటాయువు పడిపోయెను.

ప్రథమ—హా! ఎంతకష్టము. పూజ్యుఁడైన యీజటాయువు

మ. తనదుర్వారబలానురూపమగు యత్నంబెల్లఁ గావించి పెన్
గినుకన్ బూని యరింగణింపక యహా! క్రీడామయూరంబటుల్
దనుజాధీశునిచేతఁ గోలుపడి యాత్మప్రాభవం బంతయున్
ఘనదంతావళ భగ్నమైన వనవృక్షంబట్లు గన్పట్టెడున్.

ఇద్దఱు—ఇతఁడు స్వర్గమునకుఁ బోవుఁగాక!

ప్రథమ——కాశ్యప! రమ్ము. ఈవృత్తాంతము బూజ్యుఁడైన రాఘవున కెఱిఁగింతము.

ద్వితీ——మంచిది! ఇదే మొదటిపని.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభకము.

(అప్పుడు కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కాంచు——ఓయీ! ఎవరిక్కడ! కాంచనతోరణద్వారమందున్నవారు!

ప్రతీహారి——(ప్రవేశించి) అయ్యా! నేను విజయను. ఏమి చేయవలెను?

కాంచు——విజయా! "రాముని దర్శించుటకు జనస్థానమునకుఁ బోయిన యాసుమంత్రుఁడు మరలి వచ్చినాఁ"డని భరతకుమారునకు నివేదింపుము.

ప్రతీః——అయ్యా! పూజ్యుఁడైనసుమంత్రుఁడు కృతార్థుఁడై వచ్చెనా?

కాంచు——అమ్మా! నే నెఱుఁగను.

తే. గీ. హృదయసంశ్రితశోకాగ్ని నెంతయేని
వాఁడిపోయిన మోముతో వచ్చినట్టి
యాసుమంత్రునిఁ గన్గొనినంతనుండి
యేమొ గాని వ్యాకులమయ్యె నామనస్సు.

ప్రతీహా——అయ్యా! అదివిని నాహృదయముగూడ బర్యాకులమగుచున్నది.

కాంచు——అమ్మా! ఇంకను నిలిచియుంటివేమి? త్వరగా నివేదింపుము.

ప్రతీహా—అయ్యా! ఇదిగో నివేదించుచున్నాను.

కాంచు—(చూచి) అహో! ఇదిగోఁ బూజ్యుఁడైనభరత కుమారుఁడు సుమంత్రునిరాకచేత నతికుతూహలము, వొడమ నార చీరఁ గట్టి తనశిరంబునకు నానావర్ణశోభనోసఁగుజటాపుంజముతో నిటే వచ్చుచున్నాఁడు.

తే. గీ. ప్రథితసద్గుణనిధి ప్రతిపక్షకాలుఁ,
దినకులనృపాలతిలకంబు నింద్రతుల్యుఁ
డఖిలభూరక్షణ మొనర్ప నన్నయాన
భద్రికలభేభయానుండు భరతుఁ డహహ!

(అప్పుడు భరతుఁడుఁ బ్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు.)

భరత—విజయా! ఆలాగా? పూజ్యుఁడైనసుమంత్రుఁడు వచ్చెనా?

మ. మును మాయన్నను జూడఁగోరి గహనంబుం జేరి యచ్చోటఁ గ
న్గొని యాపై నతఁడొట్టువెట్టుకొని నన్నుంబంపఁగా వచ్చితిన్
వనమందు న్గని వచ్చెనే మరల నీనాఁ డీసుమంత్రుం డహో!
జననేత్రాబ్జమనోభిరాముఁ డగునిక్ష్వాకుప్రభున్ రామునిన్.

కాంచు—(సమీపించి) కుమారా! జయము.

భరత—పూజ్యుఁడైన సుమంత్రుఁ డెక్కడ నున్నాఁడు?

కాంచు—ఆయన కాంచనతోరణద్వారమం దున్నాఁడు.

భరత—అట్లయిన శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

కాంచు—కుమారా! చిత్తము.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

(అప్పుడు సుమంత్రుఁడు, ప్రతీహారియుఁ బ్రవేశించు చున్నారు.)

సుమం—(శోకముతో) ఆహా! కష్టము. కష్టము.

తే. గీ. అనుభవించితి నృపునిచావునకు దుఃఖ
మతనికొడుకుకష్టములఁ జూచితిని నేనె,
మైథిలియు నాశనంబైనమాట వింటిఁ
జేటునకె యయ్యె నాచిరజీవనంబు.

ప్రతీహా—(సుమంత్రునుద్దేశించి) అయ్యా! రండు. రండు ఇదిగో! ప్రభువుగారు సమీపింపుఁడు.

సుమం—(సమీపించి) కుమారా! జయము.

భరత—తండ్రీ! పితృస్నేహమును లోకమునకుఁ బ్రకటించిన మహాత్ముఁడు నీకుఁ గనఁబడెనా? ద్వివిధమైనయరుంధతీచారిత్రము గనఁబడినదా? సౌభ్రాత్రముచేత నిర్హేతుకముగా వనవాసక్లేశము ననుభవించినలక్ష్మణుఁడు నీకుఁ గనఁబడినాఁడా?

సుమం—(విచారించుచుండును.)

ప్రతీహా—అయ్యా! మిమ్మే కుమారుఁ డడుగుచున్నాఁడు.

సుమం—ఏమీ! నన్నా?

భరత—(తనలో) మార్గాయాసము మిక్కుటమైయుండునా! సంతాపముచేత మనస్సు చెడియుండునా? (ప్రకాశముగా) అయ్యా! మీరు మధ్యమార్గమునుండియే మరలివచ్చిరా?

సుమం—కుమారా! నీనియోగమువలన రామునిఁ జూచుటకు జనస్థానమునకు వెళ్ళినవాఁడను మధ్యమార్గమునుండి యెట్లు మరలి వత్తును?

భరత—అయ్యా! క్రోధముచేతఁగాని లజ్జచేతఁగాని వారు నీకుఁ గనఁబడక పోయిరా యేమి?

సుమం—కుమారా!

తే. గీ. కలుగునొక్కొ! క్రోధము వినీతులకు నెందు
లజ్జపడుదురే కృతమతుల్ ప్రకృతులట్లు

నాతపోవన మంతయు నరసి చూచి
వచ్చినాఁడ నెచ్చటను గన్పడరు వారు.

భరత—అట్లయిన వా రెక్కడికి వెళ్ళినారని వింటివి?

సుమం—వానరులకు నివాసమైనకిష్కింధ యనుప్రదేశము గలదు. అక్కడకు వెళ్ళిరని వింటిని.

భరత—వానరులు మన మెన్నఁడెఱుఁగనిపురుషవిశేషులు గదా! దుఃఖభాజనులై యుందురు.

సుమం—తిర్యగ్జంతువు లైనను నొకరుచేసినమేలు గుర్తెఱుఁగుదురు.

భరత—తండ్రీ! ఎటువలె?

సుమం—

తే. గీ. వాలియనునగ్రసోదరువలన రాజ్య
హీనుఁడగుచు సుగ్రీవుఁడన్ వానరపతి
తారకును బాసి యొకకొండఁజేరి పడసె
ముక్తి సమదుఃఖితుండగురామునివలనను.

భరత—తండ్రీ! సమదుఃఖితుఁ డనగా నేమి?

సుమం—(తనలో) అంతయు నేనే జెప్పవలసివచ్చినది. (పైకి) కుమారా! మఱేమియు లేదు. ఐశ్వర్యభ్రంశముచేత సమదుఃఖమని నాయభిప్రాయము.

భరత—తండ్రీ! దాఁచుచున్నావా? నీవు సత్యముఁ బలుకవేని స్వర్గస్థుడైన మాతండ్రిగారిపాదములతోడే సరి.

సుమంత్రి—ఏమిగతి!

క. మునులనిమిత్తము పోడమెను
దనుజులతో వైర మచట దానివలన దు

ర్జనుఁడైన రావణుఁడు వం
చనచే నెత్తుకొనిపోయె జనకతనూజన్.

భరత—ఏమి! ఎత్తుకొనిపోయెనా? (మూర్ఛిల్లుచున్నాఁడు)

సుమంత్రి—కుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

భరత—(ఊఱడిల్లి) హా! కష్టము పాపము అన్నగారు.

తే. గీ. తండ్రికిని బాసి బంధులందఱను విడచి
యమితదుఃఖంబు నడవిలో ననుభవించి
భార్య నిప్పుడు గోల్పోయి ప్రభ దొరంగి
మబ్బులోపలిచందురుమాడ్కి నుండు.

అయ్యో! ఇప్పు డేమిచేయుదును. ఆఁ! తెలిసినది. తండ్రీ! నన్ను నీ వనుసరించి రమ్మన్న.

సుమంత్రి—కుమారా! నీయిష్టమువచ్చినట్లు చేసెదను.
(ఇద్దఱు నడచుచున్నారు.)

సుమం—కుమారా! వద్దు. వెళ్ళఁగూడదు. ఇది దేవీచతుశ్శాల.

భరత—అక్కడే నాకున్నపని. ఇక్కడిప్రతీహారి యెవరు?

ప్రతీహారి—(ప్రవేశించి) కుమారా! జయము నేను విజయను

భరత—విజయా! నారాక తల్లిగారికి విన్నవింపుము.

ప్రతీహా— ఏతల్లిగారికి నివేదింతును?

భరత—ఏతల్లి నన్ను రాజుఁ జేయఁ దలఁచుకొన్నదో యామెకు.

ప్రతీహా—(తనలో) ఆహా! ఎందుకై యుండును? (ప్రకాశముగ) స్వామీ! అట్లే చేసెదను. (నిష్క్రమించును.)

(అప్పుడు కైకేయియుఁ బ్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు.)

కైకేయి—విజయా? నన్నుఁజూచుటకు భరతుఁడువచ్చినాఁడా?

ప్రతీహారి—అమ్మా ! ఔను! కుమారుఁడైన రామునియొద్ద నుండి పూజ్యుఁడైన సుమంత్రుఁడు వచ్చినాఁడు. ఆయనతోఁగూడ భరతకుమారుఁడు మిమ్ముఁ జూడఁగోరుచున్నాఁడు..

కైక—(తనలో) ఏమాటయెత్తి భరతుఁడునన్ను దెప్పునోగదా?

ప్రతీహారి—అమ్మా ! భరతకుమారుఁడు రావచ్చునా ?

కైక—ఆతనిఁ దోడ్కొనిరమ్ము.

ప్రతి—అమ్మా ! అట్లే. (నడచి సమీపించి)

కుమారా ! జయము ! లోనికి వెళ్ళుఁడు.

భరత—విజయా ! చెప్పితివా ?

ప్రతీహా—చిత్తము.

భరత—అట్లయిన వెళ్ళుదుము.

(ఇద్దఱుఁబ్రవేశించుచున్నారు)

కైక—కుమారా ! రామునిసన్నిధినుండి సుమంత్రుఁడు వచ్చినాఁడని విజయ చెప్పుచున్నది.

భర—అటుతరువాతనే నేను నీకుఁ బ్రియముఁ జెప్పవచ్చితిని.

కైక—కుమారా ! కౌసల్యను సుమిత్రనుగూడఁ బిలువనంపుదునా ?

భరత.—వారు వినఁదగినది గాదు.

కైక—(తనలో) అహో ! ఏమియైయుండును ? (ప్రకాశముగా) కుమారా ! చెప్పు.

భరత—అమ్మా ! విను.

తే. గీ. ఎవ్వఁడు స్వరాజ్యమును బాసి యిల్లు విడచి
కానలకు నేగె నీని యోగంబువలన,
నపహరింపంగఁబడెనఁట యతనిభార్య
యయ్యె నీమనోరథసిద్ధి యమ్మ ! యింక.

కైక—అయ్యో !

భరత— తే. గీ. మానధనులును సత్త్వసంపన్ను లమలు
లైన యిక్ష్వాకువంశపార్థివులకోడ,
లపహరింపంగఁబడియెఁ గోడలుగ వారు
నిన్నుఁ దెచ్చుకొనుటచేత నక్కటకట.

కైక—(తనలో) అది చెప్పుట కిదే సమయము. (పైకి) కుమారా! మహారాజుగారిశాపము నీ వెఱుఁగవుగాఁబోలు!

భరత—మహారాజుగారు శపింపఁబడిరా?

కైక—సుమంత్రా! విస్తరించి చెప్పుము.

సుమం—అమ్మా! మీరుచెప్పినట్లు చేసెదను. కుమారా! వినుము. పూర్వ మొకనాఁడు వేఁటకై మహారాజుగారు వెళ్ళియుండఁగా నంధులైనతల్లిదండ్రులకుఁ గన్నులవలె నుండినయొక మునికుమారుఁ డొకసరస్సులో జలము గ్రహించుటకై కలశమును ముంచుచుండెను. వనగజబృంహితశబ్దము ననుకరించునాబుడబుడశబ్దము విని యది గజమనుకొని శబ్దవేదియగుబాణము సంధించిమహారాజా మునికుమారు నేసి చంపెను.

భరత—చంపెనా? పాప ముపశమించుఁగాక! తరువాత తరువాత?

సుమం—తరువాత నమ్మునియట్లు గతించినకుమారునింగని.

తే. గీ. అమితమైనవిషాదంబునంది యేడ్చి
యెట్టకేలకు బిట్టల్క నిట్టు లనియె
"నినకులేశ్వర! నావలె నీవుఁ గూడఁ
బుత్రశోకంబుతో మృతి నొందఁ గలవు."

అని.

భరత—అయ్యో! ఇది గొప్పకష్టముగదా!

కైక—కుమారా! ఆకారణమునఁ దప్పు నాయందుఁబెట్టి

విధినియోగముచే రాముఁ డరణ్యమునకుఁ బంపఁబడెను. కాని, నా రాజ్యలోభమువలనఁగాదు. మహర్షి శాపము బరిహరించుటకు శక్యముగానిదిగనుకఁ గుమారునివిప్రవాసమునఁగాక మఱియొకదానఁ దీరదు,

భరత—విప్రవాసము నాకైనను రామునకైనను సమానమే కదా ! నన్నేల నరణ్యమునకుఁ బంపలేదు ?

కైక—కుమారా ! నీవు మేనమామలయింటనుంట నీవిప్రవాసము నదివఱకే సహజమైయున్నది.

భరత—పదునాలుగేండ్లకాల మెందుచేత నీవు గడువుఁబెట్టితివి ?

కైక—కుమారా ! పదునాలుగుదినములని నేననఁదలంచితిని కాని, నామనస్సు చెడిపోవుటచేఁ బ్రమాదమునఁ బదునాలుగేండ్లంటి.

భరత—విచారణలో నీకు మంచిపాండిత్యమే యున్నది. పెద్దల కిది తెలియునా ?

సుమం—కుమారా ! ఇది వసిష్ఠవామదేవు లెఱుఁగుదురు. వా రిందులకు సమ్మతించిరి.

భరత—ఆహా ! వారు త్రైలోక్యసాక్షులుగదా ! అమ్మా ! ఇందు నీతప్పు లేదు. తల్లీ ! భ్రాతృస్నేహముచేతఁ గలిగినకోపము వలన నే నిన్నుదూషించితిని. అదియంతయు క్షమింపుము. అమ్మా! నమస్కరించుచున్నాను.

కైక—పుత్త్రునియపరాధము క్షమింపనిది తల్లియా ? లెమ్ము. లెమ్ము. ఇందు దోషమేమున్నది ?

భరత—అమ్మా ! నన్ననుగ్రహించితివి. సెలవుపుచ్చుకొనెదను. అన్నగారిసాయమునిమిత్తము నేనీదినమున రాజమండలముఁ గూర్చెదను.

తే. గీ. కడలియొడ్డు మత్తగజాంధకారముగఁ జ
మూనివేశనవ్యాప్తము గా నొనర్చి
కడళికిని దశాస్యునకును గ్లానిఁ గూర్తు,
సమముగా నబ్ధిదాఁటు సైన్యములచేత.

అహో! ఏదో చప్పుడగుచున్నది. అదియేమో సమగ్రముగఁ దెలిసికొనిరండు.

ప్రతీహారి (ప్రవేశించి) కుమారా! జయము! ఈవృత్తాన్తము విని కౌసల్యాదేవి మూర్ఛిల్లినది.

కైక—అయ్యో!

భరత—ఏమి! అమ్మ మూర్ఛ నొందినదా?

కైక—కుమారా! రమ్ము. మన మామె నూఱడింతము.

భరత—అమ్మా! అట్లే చేయుదము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.

శ్రీరస్తు.

# ప్రతిమానాటకము

## సప్తమాంకము.

(అప్పుడు తాపసుఁడు ప్రవేశించును.)

తాప.—నందిలకా! నందిలకా!

నందిలకు.—(ప్రవేశించి) అయ్యా! ఇదిగో వచ్చితిని.

తాప.—నందిలకా! "స్వదారాపహారకుఁడును లోకత్రయవిద్రావణుఁను నగురావణుడుని సంహరించి రాక్షసగణవిరుద్ధచరిత్రుఁడును, గుణగణవిభూషణుఁడును నగువిభీషణుని రాజ్యమం దభిషిక్తునిఁజేసి దేవదేవర్షి సిద్ధవిమలచరిత్రియగు జనకరాజపుత్రినిఁ దోడ్కొనిఋక్షరాక్షసవానరప్రభృతిపరివృతుఁడై శరద్విమలచంద్రాభిరాముఁడైన రాముఁడు వచ్చియున్నాఁడు. అందుచేత నీయాశ్రమపథమందు మనమైశ్వర్యముచేత నేది సంపాదింపఁబడునో యది యెల్ల సిద్ధము సేయఁబడుఁగాక" యని కులపతి యాజ్ఞాపించెను.

నందిల.—అయ్యా! సర్వము సిద్ధమైనది. కాని—

తాప.—అదేమి?

నందిల.—వారితో విభీషణబాంధవులగు రాక్షసులుగలరు. వారియాహారవిషయమై కులపతులే ప్రమాణము.

తాప.—ఎందుకు?

నందిల.—వారు తిందురుగదా—

తాప.—ఆ! తొందరపడకు. రాక్షసులు విభీషణునకు విధేయులుగదా!

నందిల—రాక్షసులలో సజ్జనుఁడైనవిభీషణునకు నమస్కారము
(అని నిష్క్రమించుచున్నాఁడు)

తాప.—(చూచి) అహా! ఇదిగో మహానుభావుఁడైన రా ఘువుఁడు.

చ. జయము నృపాల! గెల్వఁదగుశత్రుఁడు లేఁడు ద్వితీయుఁ డింక, న
క్షయముగ ధాత్రియెల్ల నొకఛత్రముక్రిందికి వచ్చెఁజుమీ విధే
య యగునటంచు మానిజనులందఱుఁ దన్గొనియాడుచుండ శ్రీ
మయుఁడగు రామచంద్రుఁడు విమానమునుండి ధరిత్రికిన్ డిగెన్.
అయ్యా! నీకు జయము! జయము!

ఇది విష్కంభకము.

---

(అప్పుడు రాముఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రాముఁడు—

చ. సముదితబాహువిక్రము నిశాచరు రావణు సంహరించి యు
త్తమగుణపూర్ణ శుద్ధచరితన్ జనకాత్మజ నే గ్రహించి శాం
తమతినిఁ దండ్రిమాటఁ దుదిదాఁకను నిర్వహణంబుసేసి యే
నుమరలఁ జేరినాఁడను మునుల్ వసియించెడునాశ్రమంబులన్.

తాపసస్త్రీలకు నభివందనముజేయుటకు లోనికరిగి జానకి యా లస్యము జేయుచున్నదిగదా! (చూచి అహా! ఇదిగో! జానకి.

తే. గీ. ఎలమి జానకీ! యంచుఁ గోడల! యటంచు
సీతరో! యంచుఁ జెలి! యంచుఁ జేరి చుట్టుఁ
దాపసాంగన లీడుకుఁ దగినయట్లుఁ
బిలిచి మాటాడ నిటు మెల్లమెలగ వచ్చె.

(అప్పుడు సీతయుఁ దాపసస్త్రీయుఁ బ్రవేశింతురు.)

తాపస—సఖీ! ఇదిగో నీప్రాణేశ్వరుఁడు. ఆయనసమీపము

నకుఁ బొమ్మ. నీ వొంటిగా నుండఁగా నిన్ను మేము జూడఁజాలము.

సీత—అమ్మయ్యా! ఇప్పటికిని నాకు సరియైననమ్మకము లేదు. (సమీపించి) ఆర్యపుత్రా! జయము!

రాము—మైథిలీ! మనము పూర్వము నివసించినజనస్థాన మిక్కడనే యున్నది. యెఱుఁగుదువా! నీవు బిడ్డలవలెఁ బెంచినచెట్లు నీకు జ్ఞాపకమున్నవా?

సీత—ఎఱుఁగు దెఱుఁగుదు. అవి దట్టముగ నాకులుబట్టి దలపైకెత్తి చూడఁదగినంతయె త్తైనవి.

రాము—అది యట్లే. కాలము పల్లము మెఱకగను, మెఱకను బల్లముగను జేయునదిగదా! ఈయేడాకులయరఁటిచెట్టుక్రిందఁ దెల్లనిబట్టలఁ గట్టుకొని కూర్చుండినభరతునిఁ జూచి లేడులగుంపు బెదరినది. అది నీకు జ్ఞప్తికి వచ్చినదా?

సీత—ఆర్యపుత్రా! లెస్సగా జ్ఞాపకమున్నది.

రాముఁడు—ఇదిగో! మనతపస్సునకు సాక్షిభూతమైనపచ్చికబయలు. అక్కడ మనము గూర్చుండి నాయనగారిశ్రాద్ధక్రియను గూర్చి యాలోచించుచుండఁగాఁ గాంచనపార్శ్వమనులేడిగనఁబడినది.

సీత—అయ్యో! ఆర్యపుత్ర! వద్దు. ఆమాట చెప్పవద్దు. (అనిజడిసి వడఁకుచున్నది.)

రాము—భయపడకు. భయపడకు. ఆకాల మతిక్రమించినది (దిక్కులుచూచి) ఏమిది? ఎక్కడనుండియో

తే. గీ. తెల్లనై లొద్దుగయుఁబోలెఁ దెసలఁ గ్రమ్మి
వాయువులచేత దుమ్మదె వచ్చుచుండె
నమితదుంధుభిధ్వనులలో నడగిశంఖ
రవము వనమును హా! నగరంబుఁ జేసె.

లక్ష్మణుఁడు—(ప్రవేశించి) అన్నయ్యా! జయము.

తే. గీ. ఈమహాసేన దనవెంట నేగుదేర
భ్రాతృవత్సలుఁడైనట్టి భరతుఁ డిపుడు
తల్లులను వెంటఁబెట్టుకఁ దరలివచ్చె
నిన్నుఁ జూచెడు వేడుక నిర్మలాత్మ.

రామ.—వత్సా! లక్ష్మణా! అలాగా? భరతుఁడు వచ్చినాఁడా?

లక్ష్మణు.—అన్నయ్యా! ఔను.

రాము.—జానకీ! అత్తలను వెంటఁబెట్టుకొనివచ్చుచున్న భరతునిఁజూచుటకు నీకన్నులు పెద్దవి చేసికొనుము.

సీత.—భరతుఁడు మంచిసమయమునకే వచ్చెను.

(అప్పుడు భరతుఁడు తల్లులతోఁ బ్రవేశించును.)

భరతు.—

తే. గీ. బహువిషమపరిస్థితులను బాసి యెట్లొ
జలదమోక్షితుఁడగుశరచ్చంద్రుఁడట్లు
బయలుబడి సతీయుతుఁడై నభ్రాతృవరునిఁ
జూడవచ్చితిఁ జుట్టాలతోడ వేడ్కఁ.

రాము.— తల్లులారా! నమస్కరించుచున్నాను.

అందఱు.—కుమారా! చిరంజీవివి గమ్ము. ప్రతిజ్ఞాపరిపూర్తిఁ జేసి భార్యాసమేతుఁడవై, కుశలివై వచ్చిననిన్ను మాయదృష్టవశమునఁ జూచుభాగ్యము గలిగినది.

రాము.—అమ్మా! మీయనుగ్రహము.

లక్ష్మ.—తల్లులారా! నమస్కారము.

అందఱు.—కుమారా! చిరంజీవివి గమ్ము.

లక్ష్మ.—అనుగ్రహింపఁ బడితిని.

సీత.—అత్తలారా! వందనము.

అందఱు.—వత్సా! దీర్ఘసుమంగళివి గమ్ము!

సీత—అనుగ్రహింపఁబడితిని.

భరత—అన్నయ్యా! భరతుఁడను. నమస్కరించుచున్నాను.

రామ—ఇక్ష్వాకుకుమారా! రమ్ము రమ్ము. నీకు శుభమగుఁగాక! దీర్ఘాయుష్మంతుఁడవుగమ్ము.

తే. గీ. ఘనకవాటప్రమాణవక్షమును జాఁపి
నీగురుభుజద్వయమున న న్గౌఁగిలింపు,
మిందుసుందరవదనంబు నెత్తు మన్న!
వ్యసనదగ్ధమౌ మేను నాహ్లాదపఱుపు.

భరత—అనుగ్రహింపఁబడితిని. అమ్మా! భరతుఁడను నమస్కరించుచున్నాను.

సీత—ఆర్యపుత్రునితోఁ గలిసి చిరకాలము సుఖింపుము.

భరత—అనుగ్రహింపఁబడితిని. (లక్ష్మణునిఁ జూచి) అన్నయ్యా! నమస్కారము.

లక్ష్మ—కుమారా! రమ్ము. ఆయుష్మంతుఁడవుగమ్ము. నన్ను గాఢాలింగనముఁ జేసికొనుము. (కౌగలించుచున్నాఁడు.)

భరత—అనుగ్రహింపఁబడితిని. అన్నయ్యా! రాజ్యభారమునుస్వీకరింపుఁడు.

రాము—ఎటువలె?

కైక—కుమారా! ఈమనోరథము చిరకాలమునుండి యభిలషింపఁబడుచున్నదిగదా!

శత్రుఘ్నుఁడు—(ప్రవేశించి)

తే. గీ. ఖిన్నుఁడయ్యు నానావిధక్లేశతతుల
ననయ మక్లిష్టగుణతేజుఁ డైనయట్టి
రావణాంతకు మాయన్న రామచంద్రుఁ
జూడఁ దగ్గరపడు నాబుద్ధి వేడుకమెయి.

(సమీపించి) అన్నయ్యా! శత్రుఘ్నుఁడను నమస్కరించుచున్నాను.

రాము—కుమారా! రమ్మ రమ్మ. చిరాయుష్మంతుఁడవు గమ్మ.

శత్రు—అమ్మా! నమస్కారము.

సీత—వత్సా! చిరంజీవివి గమ్మ.

శ—అనుగ్రహింపఁబడితిని. అన్నయ్యా! నమస్కారము.

లక్ష్మ—శుభమగుఁగాక! ఆయుష్మంతుఁడవు గమ్మ.

శ—అనుగ్రహింపఁబడితిని. అనయ్యా! ఈవసిష్ఠవామదేవులు ప్రకృతిజనులతోఁగూడి నభిషేకముఁ బురస్కరించుకొని నీదర్శనముఁ జేయఁగోచుచున్నారు.

తే. గీ. మునులు స్వయముగాఁ దెచ్చు పావననదీన
దాంబువుల నభిషిక్తమై యలరుచుండు
నీమొగము నీటఁ దడసిననీరజమును
బోలెఁ జూడంగఁ గలఁచెను మునిగణంబు.

కైక—కుమారా! వెళ్ళుము. అభిషేకము గ్రహింపుము.

రాము—తల్లీ! నీయిష్టము.

(రాముఁడు నిష్క్రమించుచున్నాఁడు)

(తెరలో)

జయము స్వామీ! జయము మహారాజా! జయము భద్రముఖా! జయమయ్యా! జయము రావణాంతకా!

కైక—కుమారుని మేలుగోరునట్టి యీ కాంచుకేయులు మత్కుమారుని విజయఘోషమును వర్ధిల్లఁజేయుచు నాశీర్వచనములచే నర్చించుచున్నారు.

సుమిత్ర—ప్రకృతిజనులు, పరిచారికులు, సజ్జనులును, నాకుమారుని విజయమును వర్ధిల్లఁజేయుచున్నారు.

(తెరలో)

ఓహో! జనస్థానవాసులైన తాపసులారా! మీరు వినుఁడు. వినుఁడు.

చ. అరిజనసంభవంబగుచు నప్రతిమంబగు నాతమోఘమున్
సరగ నఖండశౌర్యకిరణంబులఁ జీకటిసంతయున్ దివా
కరుఁడటు దవ్వుఁదోలి గతకల్మష జానకినిం గ్రహించి భూ
భరణముఁ జేసె రాముఁడు శుభస్థితితోడ జనాభిరాముఁడై.

కైక—అమ్మయ్యా! నాపుత్రునివిజయఘోషము వర్ధిల్లుచున్నది.

(అప్పు డభిషేకము జేసికొన్న రాముఁడు సపరివారముగా వచ్చును.)

రాము—(ఆకాశమునుజూచి) ఓ తండ్రీ!

మ. అనఘా! దైన్యముఁ బాసి నీవు త్రిదివంబందైన సంతుష్టినిం
గనుమీ యేశుభకర్మఁ జేయ మునుసంకల్పించితో యద్ది యు
య్యేనుగా సత్కృతభారవాహినయి నే నీధాత్రికిన్ రాజనై
తిని ధర్మంబున లోకరక్షణము భక్తిన్ నేను గావించెదన్.

భరత—

సీ. రాజశబ్దమువాని రాజలోచనమైన
ధవళాతపత్రంబుఁ దాల్చువాని
నమలుతోయంబుల నభిషిక్తుఁ డగువాని
మాల్యశోభితమైన మౌళివానిఁ
జూపర మెచ్చించుశుభవిలాసమువాని
జనవంద్యమానమౌ చరితవాని
నవచంద్రుఁడటులుండు నాయన్నఁ జూచియు
సంతుష్టిఁ గనదు నాస్వాంతమౌర!

శత్రు—

తే. గీ. మాకులం బార్యపట్టాభిషేకమునను
గల్మషము బాసి స్వచ్ఛమై గానఁబడెడు
వెండియుఁ బ్రకాశవంతమై వెలయఁగలదు
చంద్రునుదయంబుచే వెల్గుజగము వోలె.

రాము—వత్సా! లక్ష్మణా! నేను రాజ్యమును స్వీకరించితిని గదా?

లక్ష్మ—అదృష్టవశమున మీరు వర్ధిల్లుచున్నారు.

కాంచుకీయుఁడు—(ప్రవేశించి) మహారాజా! జయము! జయము! పూజ్యుఁడైనవిభీషణుఁ డిట్లు మనవి జేసికొనుచున్నాఁడు—"సుగ్రీవుఁడు, నీలుఁడు, మైందుఁడు, జాంబవంతుఁడు, హనుమంతుఁడు మొదలగువారును మి మ్మనుసరించి వత్తురు. అదృష్టవశమున మీరు వర్ధిల్లుచున్నా"రని.

రాము—సాయము జేసినవారి యనుగ్రహమున వర్ధిల్లుచున్నాఁడనని చెప్పుము.

కాంచు—మహారాజా! చిత్తము.

కైక—నేను ధన్యురాలనుగదా! ఈయుత్సవ మయోధ్యాపురమునఁ జూడ నభిలషించుచున్నాను.

రాము—అమ్మా! చూడఁగలవు. (చూచి) అహో ఈవన మంతయు మహాప్రభలచే సూర్యునియట్లు బ్రకాశించుచున్నది. (ఆలోచించి) ఆహా!, తెలిసినది రావణుని విమానమైనపుష్పక మాకాశము మీఁదికి వచ్చినది. చేసినయేర్పాటునుబట్టి యిది తలంచినంత మాత్రమునసనే వచ్చినది. కాఁబట్టి యంద మెక్కుఁడు (అంద ఱెక్కుచున్నారు)

రాము.—

తే. గీ. ఆప్తమిత్రులు, బంధులు ననుసరింప
నే నయోధ్యాపురంబున కేగువాఁడ.

లక్ష్మ—

పురజనులు జూచెదరుగాక పొటేఁబాటి నిను
నుదితచంద్రుని నక్షత్రియుతునిఁ బోలె

భరతవాక్యము.

తే. గీ. ధరణికన్యకతోడ బాంధవులతోడ
గూడి శ్రీరాముఁ డేరీతి క్షోణి నేలె
నట్లె లక్ష్మీసమేతుఁడై యవనినెల్ల
మామహారాజు శాసించి యొప్పుఁగాత!

(అందఱు నిష్క్రమింతురు.)

సప్తమాంకము.

సంపూర్ణము.

## పాత్రలు

### పురుషులు.

సూత్రధారుఁడు.

1 చారుదత్తుఁడు—కథానాయకుఁడు.

2 మైత్రేయుఁడు—విదూషకుఁడు.

3 శకారుఁడు—ఉజ్జయని రాజుమఱది.

4 విటుఁడు—శకారుని మిత్రుఁడు.

5 సంవాహకుఁడు—జూదరి. కాళ్ళుపిసుకువాఁడు

6 సజ్జలకుఁడు—బ్రాహ్మణుఁడు, దొంగ, మదనికను మోహించినవాడు

7 చేటుఁడు—ఒక పరిచారకుఁడు.

### స్త్రీలు.

1 వసంతసేన—కథానాయకురాలు. ఉజ్జయనిలో నొకవేశ్య.

2 బ్రాహ్మణి—చారుదత్తునిభార్య

3 రదనిక— చారుదత్తుని పరిచారిక, చేటి.

4 మదనిక—వసంతసేనపరిచారిక.

శ్రీ

# చారుదత్త నాటకము

## ప్రథమాంకము.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్ర—ఏమోగాని నేఁడు ప్రాతఃకాలమున సిల్లుబయలు దేఱఁగానే మిక్కిలియాఁకలిచేతఁ దామరాకుమీఁదఁ బడిననీటిచుక్క లవలె నాకనులు తిరుగుచున్నవి. ఇప్పు డింటికిఁ బోయి చద్దికూఁ డున్నదో లేదో కనుఁగొనియెద. ఇదే ! మాయిల్లు, లోని కరిగెదను. ఇనుపగుండు దొర్లించుటచే నేల నల్లగ నున్నది. పరిజను లిట్టటుఁ దిరుగుచున్నారు. చద్దియన్నముండునా, లేదా? పేరాఁకలిచే జీవలోక మంతయు నన్నమయమైనట్లు నా కగపడుచున్నది. ఇప్పుడు నాభార్య ను బిలచెదను. ఓసీ ! ఇటురా.

నటి—(ప్రవేశించి) అయ్యా ! ఇదిగో వచ్చితిని. అదృష్టవశ మున మీరు సమయమునకే వచ్చితిరి.

సూత్ర—ఓసీ ! మనయింట నేమైన నించుక చద్దియన్న మున్నదా ?

నటి—ఉన్నది.

సూత్ర—దీర్ఘాయుష్యమస్తు! ఇటువంటి శుభములైనయన్న ప్రదానములను నిరంతరముఁ జేయుచుందువుగాక !

నటి—అయ్యా! నేను మీకొఱకే యెదురుచూచుచున్నాను.

సూత్ర—ఓసీ ! నేను కోరినది యున్నదా ?

నటి—ఆఁ, ఉన్నది.

సూత్రి—ఆలాగా! దేవతలు నిను దీవింతురుగాక! ఏమేమి యున్నది.

నటి—నెయ్యి, బెల్లము, పెరుఁగు, బియ్యము నున్నవి.

సూత్రి—ఇవి యన్నియు మనయింట నున్నవిగదా!

నటి—కాదు కాదు. అంగడిలో

సూత్ర—(రోషముతో) తుంటరిదానా! ఈలాగే నీయాసలడుగంటిపోవలెను. నీవు చచ్చిపోను! నన్నెత్తైనకొండ నెక్కించి గొప్ప గాలి కెగిరిపడుగడ్డిమోపువలెఁ గ్రిందఁబడఁ ద్రోసితివి.

నటి—భయపడవద్దు! భయపడవద్దు! మీ రొక్కనిముసము వేచియుండుఁడు. అంతయు సిద్ధముజేసెద. అది దొరకినట్లే. నేఁడు నేనుపవాసముఁ జేసెద. మీరు నాకు సహాయులు కావలయు.

సూత్ర—నీయుపవాసము పేరేమి ?

నటి—ఇది యభిరూపపతివ్రతము.

సూత్ర—ఇంకొకజన్మమందా ?

నటి—అవును !

సూత్రి—అదియంతయు నట్లుండనీ ! ఈయుపవాసవ్రతము నీకుపదేశించినవా రెవరు ?

నటి—పరిజనుఁడైన యీచూర్ణగోష్ఠుఁడు.

సూత్రి—బాగు ! చూర్ణగోష్ఠా ! బాగు.

నటి—మీయనుగ్రహ మున్నపక్షమున మనవంటివారికిఁ దగిన బ్రాహ్మణు నొకనిఁ బిలచుకొనవలెనని యున్నది.

సూత్రి—ఈనియోగము ధర్మసమ్మతమయినదే ! అట్లైన నాకుఁ జద్దియన్నముగూడ దొరకును. కనుక నీవు లోపలికి వెళ్ళుము. నేనునుమనస్థితికనుకూలుఁడైన యొకబ్రాహ్మణునివెదకితోడ్తెచ్చెదను.

నటి—మీచిత్తము. (నిష్క్రమించుచున్నది.)

సూత్రి—నాకు దరిద్రబ్రాహ్మణుఁ డెక్కడ దొరకును ? (చూచి) ఇదిగో! పూజ్యుఁడైన చారుదత్తుని చెలికాఁడైన మైత్రేయుఁడను బ్రాహ్మణుఁ డిటే వచ్చుచున్నాఁడు. అతనిని నిమంత్రించెదను. (నడచి) అయ్యా! నీవు మాయింటికి భోక్తగా రమ్ము. నేను దరిద్రుఁడననితలంచి నిమంత్రణము నిరాకరించి నన్నవమానింపవద్దు. భోజనము సుష్ఠుగా నుండును. ఘృతము, గుడము, దధి, తండులము, సర్వమునున్నది. అదిగాక కుడుములుండును. దక్షిణగూడ నిచ్చెదను.

(తెరలో)

అయ్యా! మఱియెవ్వరినైనఁ బిలచుకొనుము. నాకుఁదీరికలేదు.

సూత్రి—

తే. గీ. దధియు, నెయ్యి, బెల్లము, సమృద్ధముగఁ గలవు
చక్కఁ బొగిచినపప్పుపచ్చడియు నున్న
దాదరంబున నిడుదు మృష్టాన్న మేను
వచ్చి కడుపారఁ దినుమయ్య బ్రాహ్మణుండ!

(నిష్క్రమించుచున్నాఁడు.)

ఇది స్థాపన.

---

(అంతట విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విదూ—మఱి యెవ్వరినైనఁ బిలచుకొనుము. నాకుఁ దీరిక లేదు. తీరికలేదని చెప్పుచున్నాను. ఏమనుచున్నావు? భోజనము సుష్ఠుగా నుండుననియా? అతిమధురమైన పదార్థ మయోగ్యమగుటచే నది తినఁగూడదని నే నెఱుఁగుదును. ఊరించి యూరించి నన్నెందుకుఁ బిలచెదవు? నా కవతలఁ బనియున్నదని చెప్పుచున్నాను. ఏమను చున్నావు! కుడుములు, దక్షిణయుఁగూడ దొరకఁగలవనియా? నేను మాటచే వద్దనుచున్నాను గాని మనసుచే దానిని గోరుచున్నాను.

హా! ఎంతకష్టము. నేనుఁగూడ నితరులపిలుపులనుగుఱించి వితర్కించుకొనవలసివచ్చినది. పూర్వము మహానుభావుఁడైన చారుదత్తునిగృహమునందు రేయింబవళ్ళు విధివిరామములేక నానావిధములుగా సిద్ధముచేయఁబడి యింగువపోగుపులచేతఁ గమ్మనివాసనలు వెదఁజల్లుచుఁ గనుసన్న చేసినమాత్రమున వచ్చిపడెడు వింతవింతవంటకములను గుత్తుకబంటిగఁ దిని నడుమనడుమ రుచ్యములగు పానీయములం దాగుచు రంగుచిప్పలు జుట్టుఁబెట్టుకొనియున్న చిత్రకారుఁడువలె నుండి కూడవిలోనియాఁబోతువలె నదివఱకుఁ దిన్న మోదకముల నెమరువేసికొనుచు హాయిగా దినములుఁ గడపుచుండిన నేనే, యిప్పుడు పూజ్యుఁడైన చారుదత్తుని పేదతనముచేతఁ బావురములట్లు సాధారణవృత్తి నాశ్రయించి బ్రతుకుచు వేఱొకచోటఁ దిరిగితిరిగి యతనియింటికే పోవలసినవాఁడ నైతిని. ఇంకొకవిచిత్రమేమనఁగా నాకడుపు నాపరిస్తుతావస్థ నెఱిఁగి యల్పాహారముతోఁగూడ దృప్తినొందుచున్నది. పెట్టినట్లయినఁ జాలయన్నముగూడ భరింపఁగలను. పెట్టనిపక్షమునఁ గావలెనని యడుగదు. పెట్టినచో వద్దనదు. ఈయవస్థతో నేను సంతోషింపకపోవుటలేదు. దేవకార్యము నిర్వర్తించిన చారుదత్తుని కారణమున నే నీపూవులయుత్తరీయమును గ్రహించితిని. ఆయనయొద్దకుఁ బోయెదను. (నడచిచూచి) అదిగో! పూజ్యుఁడైన చారుదత్తుఁడు. ప్రభాతచంద్రుఁడువలె సకరుణప్రియదర్శనుఁడై తనవిభవమున కనుగుణముగా గృహదేవతల నర్చించి యిటే వచ్చుచున్నాఁడు. ఆయనదగ్గఱకుఁ బోయెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

(అప్పుడు బలినిదీసికొని నాయకుఁడైన చారుదత్తుఁడును, విదూషకుఁడును, అంగేరికాహస్తయైన చేటియుఁ బ్రవేశించుచున్నారు.)

నాయకుఁడు—(నిట్టూర్పు విడిచి) అహహా! దారిద్ర్యమనునది

మానవంతుఁడైనపురుషునకు జీవన్మరణము. ఏలయన—

మ. బలి నాగుమ్మములందు భక్తి నిడఁగా భక్షించెఁగా సారసం
బులు, రాయంచలు బుష్పముల్విడిచి, గుంపుల్గుంపులై వచ్చి మున్
బలి నర్పించినచోట్ల గడ్డిమొలువన్ దట్టంబుగాఁ గీటకం
బులు బీజాంజలి నారగించును దినంబున్ నాదునిర్భాగ్యతన్.

విదూ—నీ విప్పు డెక్కువగా విచారింపవద్దు. పురుషయౌవ
నములువలెనే గృహయౌవనములుగూడ దశావిశేషములఁ బొందు
చుండును. సముద్రియౌవనమున సంపదఁ గోలుపోయిన నీదారిద్ర్యము
బహుళపక్షచంద్రుని చంద్రికాక్షయమువలెనే మిక్కిలి రమణీయము
గానున్నది.

నాయ—పోయినసిరికొఱకు నేను విచారించుటలేదోయి! గుణ
రసజ్ఞుఁడైన పురుషునకు వ్యసనము మిక్కిలిదారుణముగా నుండునని
నాకుఁ దోఁచుచున్నది. ఏలయన?

తే. గీ. దుఃఖపడి వెన్క సౌఖ్యమొందుట యెసంగుఁ
గాఱుచీఁకటిలో దివ్వెఁ గాంచినట్లు
సౌఖ్యపడి ముందు, పిదపఁ గష్టపడువాఁడు
బ్రతుకుచుండును జీవచ్ఛవంబె యగుచు.

విదూ—ఓమిత్రుఁడా! దేవుపట్టణములసారమే యని చెప్పఁ
దగినయాధనసంచయ మెక్కడికేగెనయ్యా?

చారుదత్తుఁడు—(నిట్టూర్పువిడిచి) మిత్రుఁడా! నాయదృష్ట
ము లెక్కడకుఁ బోయినవోనదియు నక్కడికే పోయినది.

చ. అనయము మిత్రకార్యములయందు క్షయంబయి పోయెఁగాదె నా
ధనములు, లేదు నావలనఁ దప్పు మఱొక్కటి దీనికన్న, భూ
జనులకు నాయెడంగలదు శ్లాఘ్యతరంబగుపవిత్ర్యయంబు, దా
ననె క్షయమొందలేదుసుమి! నాకడ సత్వగుణంబు లేశమున్.

(అని చింతించుచున్నాఁడు.)

విదూష--ఏమి! నీవు ధనవిభవముఁగూర్చి చింతించుచున్నావా?

చారు—

తే. గీ. ధనము పోయినదని విషాదంబు లేదు
భాగ్యవశమున ద్రవ్యముల్ వచ్చు మరల
ధనములేకుంట నాకు సజ్జనులమైత్రి
శిథిల మగుననుచింత గాల్చెడును నన్ను.

మఱియు,

మ. చెవినింబెట్టరు పేదవానినుడిఁ గొంచెంబేనిఁ జుట్టాలు, స
త్వవిశేషంబపహాస్యమౌ, క్షయమగున్ దత్కాంతి తన్మిత్రులున్
బవ యొక్కింతయు లేకయే విముఖులై వర్తింతురి నిర్వేదపై
న విచారంబుగ మోపుచుండ్రు పరదోషానీకమున్ సైతమున్.

విదూ—ధనవ్యాపారముఁజేయుచున్న యీతోత్తుకొడుకులు దోమలకు జడిసినగొల్లపిల్లలవలె నిండ్లువెడలి యావలకు వచ్చుచున్నారు. మాటిమాటికిఁ దలఁపునకుఁ దెచ్చుకొన్నపక్షమున ధనవినాశదుఃఖమునకు వసంతకాలమున నేపుగాఁ బెరిఁగినతెల్లుకాఁడకువలెనే మొలకలుపిలకలు బయలుదేఱును. కావున నీవుసంతాపము నొందకు.

చారు—నే నెందుకువిచారింతును? నేనుదరిద్రుఁడ నెట్లగుదును! ఎందుకన,

తే. గీ. నాయవస్థకుఁ దగినట్లు నడచుభార్య
నీవు సుఖదుఃఖసముఁ డైననెయ్యుఁ డైతి,
పేదవారికి దుర్లభం బేది? యట్టి
సత్త్వగుణము నన్విడనాడి చనదుసుమ్మి.

(అప్పుడు గణిక వసంతసేన తొట్రుపడుచు విటుఁడును, శకారుఁడును, దన్ను వెంబడింప వచ్చుచున్నది.)

శకారుఁడు—ఆఁగు. వసంతసేనా? ఆఁగు.

చ. నిలుము వసంతసేన! నిలు! నిప్పులుద్రొక్కినకోఁతికై వడిన్
దొలఁగెదు, పాఱిపోయెదవు, తొట్రిలుచుందువు, నిన్నుఁజంప భీ
తిల కటునిల్వుమీ, మదనదేవుఁడు కాల్పఁదొడంగె మేను, ని
ప్పులఁ బడుతోలుతునక్కవలెఁ బొక్కుచునుంటి, ననుగ్రహింపవే!

విటుఁడు—వసంతసేనా !

మ. ననబోఁడీ! వరసౌకుమార్యము జెడన్ నాట్యోపదేశంబులం
దుఃవిన్నాణముఁగన్నపాదములఁ జిందుల్ద్రొక్కి పోనేటికిన్,
వెనుకన్ బెబ్బులి గాండ్రుమంచుఁ దఱుమన్ లేళాఱుసారంగమో
యన భీతింజననేల? చంచలకటాక్షాలోకము ల్జిమ్ముచున్.

శకారు—బావా! ఇదిగో వసంతసేన పాఱిపోవుచున్నది.

తే. గీ. కుక్కలు దఱుమఁ బరుగెత్తునక్కవోలెఁ
దరుణి మనమిర్వురము వెంటఁదఱుముచుంటఁ
జనెడు నూపురమేఖలాస్వనము లెసఁగ
నకట! నాహృదయంబును నపహరించి.

విటుఁడు—వసంతసేనా!

తే. గీ. అడుగునకు నూఱడుగుల నీ విడుచు, గరుడ
భీతిఁ బాఱుపన్నగియట్లు, వెళ్ళ దేల?
గాలిచాడ్పున వేవేగఁ గదలి వచ్చి
సరగ నినుఁ బట్ట నామేన శక్తి లేదె?

వసంత—(అంతటనుజూచి) పల్లవకుఁడా! పరభృతికా! పర
భృతికా! మధుకరకా! మధుకరకా! శారికా! శారికా! అయ్యో!
నాపరిజనమంతయు నష్టమైనది. ఇప్పుడు నన్ను నేనే సంరక్షించు
కొనవలెను.

శకార—ఏడ్వు! మేడ్వుము! పల్లవునికొఱకో పరభృతికకొఱ
కో, శారికకొఱకో, వసంతమాసముకొఱకో, మొఱపెట్టి యేడ్వుము.
ఎవఁడెవఁడు నిన్ను రక్షించువాఁడు.

చ. వనజదళాక్షి! చెప్పు శివపట్టణనాథుఁడు వాసుదేవుఁడో?
ఘనుఁడు పృథాతనూభవుఁడో? కానిమెడం జనమేజయుండొ ని
న్గని విడిపించువా రెవరొ? గట్టిగఁ గొప్పునుబట్టి యీడ్చి నీ
తను మునుదున్సనేనుఁడటు తప్పక నిన్ను హరింతు నే నిటన్.

విటు—వసంతసేనా! అన్నివిధముల నాహృదయమును భయ విరహితముగాఁ జేయవే చూడు!

చ. చిరతరశీలదోషమునఁ జీఁకటిరాత్రులు నాకు నెంతయున్
బరిచితముల్ సుమీ! తిమిరబంధురరాత్రుల సందుగొందులం
దరిగితి మున్ను నీవిపణియందు గటాహతశేషులైన రా
ట్పురుషులు సాక్షు, లిట్టికథ బోటులముందఱఁ జెప్పరాదుగా.

వసంత—అయ్యో! తనదుర్గుణములఁ దానే చెప్పుకొనుచున్న యీపురుషుఁ డీదుష్కార్యమును జేయఁడాయని నాకు సందేహము గలుగుచున్నది.

విటు—ఓసీ! నావేఁడుకోలు మన్నింపుము.

మ. తరుణీ! నమ్మికయంతయుం జెడియెఁ గ్రోధం బెంతయు న్నైచ్చెదు
ష్కరమేముండును జెప్పు? మాదృశుల కల్కంబూనియున్నష్ఠు ని
ష్ఠురఖడ్గోన్నతహస్తమే యనునయించుంగాక నిన్ స్త్రీవధా
పరమాఘంబుననుండి కాఁచినను నీప్రాణంబులం గాచుకో.

వసంత—వీనియనునయముగూడ భయముఁగలిగించుచున్నదే!

శకారు—వసంతసేనా! మాబావచక్కఁగాఁ జెప్పినాఁడె. బలవజ్జనదుర్లభమైన యీయనునయము మిక్కిలి బాగున్నది. ఓపదు చుపిల్లా! చూడు

తే. గీ. నెమలిమెడవోలె నల్లనై నిశితమైన
కత్తిచేనేసి నీకంఠముత్తరింతు

నలుకఁ బుట్టింపఁబోకు మాయట్టివారి
కతివ! చచ్చినవాఁ డెందు బ్రతికిరాఁడు.

వసంత—అయ్యా! నేను కులపుత్రజనముయొక్క వేశ్యను. శీల మునకు సంతసించి జీవించుదానను.

విటు—అందుచేతనే నిన్ను మేము వేఁడుకొనుట.

వసంత—అయ్యా! నావంటిదానివలన మీా రేమపేక్షించు చున్నారు? నాశరీరమునా? నాయలంకారములనా?

విటు—తీఁగనుండి పూవులు గోయఁగూడదు. వట్టియలంకార మెందుకు?

వసంత—ఇప్పుడు నామనస్సునకు నేను సంతాపముఁగలిగించు కొనను.

శకార—వసంతసేనా! నేను రాజపుత్రుఁడను. కామింపఁదగి నవాఁడను.

వసంత—ఛీ! శాంతుఁడ వగుదువుగాక!

శకార—విను. బావా! విను. ఈవసంతసేన నన్ను శాంతుఁ డవనుచున్నది.

విటు—(తనలో) ఈమూర్ఖుఁడు తన్నామె తిట్టినట్టుగూడ నె ఱుఁగఁడు. చచ్చెదవుగాక యనుటకు శాంతుఁడవగుదువుగాక యని యామె తిట్టఁగా వీఁడు శాంతుఁడ వగుదువుగాకయని యామెయన్న ట్లు భావించు చున్నాఁడు మఱియు.

తే. గీ. అభినయించుఁ బల్కుతఱి సర్వాంగములను
బలుకు నేమేమొ యర్థంబు దెలియకుండ
నప్రగల్భవాక్యములాడు ననుచితముగఁ
దలఁపఁ బురుషపశునవావతార మితఁడు.

(ప్రకాశముగ) వసంతసేనా! ఏమిది? నాయెదుట వేశ్యాజన విరుద్ధమైనమాటలాడుచున్నావు. చూడు-

చ. యువజనమైత్రితో మెలఁగుచుండవలెన్ వెలపూవుబోండ్లు వే
  శ్యవగుట దారిలో మొలిచి యందఱ కందెడుతీఁగవంటిదా
  నవుసుమి! నీ కనిష్టుఁ డయినంబ్రియుఁడైన విటుండు వానిఁగూ
  డవలయు నీదుమేనికి వెలగ్గల వర్ధమె నిన్నుఁ దార్చెదున్.

వసంత—ఇతఁడు నాయనురాగమును నావంశమును, బుట్టు కను, నెత్తి తూలనాడుచున్నాఁడు.

శకార—బావ! ఇదిగో! కాఱుచీకఁటులతో నిండిన రాచబాట కనఁబడుచున్నది. దాని నిక్కడ జాఱిపోనీకు. ఈమె యప్పుడుజరిగిన యాకామదేవోత్సవమునాటనుండియుఁ గనులకుమాత్రి మింపుగా నున్నసార్థవాహపుత్రుని, దరిద్రిచారుదత్తవటుకునిపైన వలపు నిలి పియున్నది. ఇదిగో! నాతనియింటిపెరటిగుమ్మము.

వసంత—(సంతోషముతోఁ దనలో) ఇదే! యాయనగారి యిల్లు. అదృష్టవశమున నిప్పుడు శత్రువులనిరోధముచేతఁ బ్రియజన సమీపమును జేరుకొంటిని. సరె! ఈలాగు జేసెదను. (తప్పుకొను చున్నది)

శకార—(చూచి) బావా! దాఁటిపోయినది. దాఁటిపోయినది.

విటుడు—ఎట్లెట్లు! దాఁటిపోయినదా? వెదకుదము వెదకుదము.

శకార—బావా! కనఁబడుటలేదు.

విటు—అయ్యో! మనలను వంచించిపోయినది. ఆఁ! వసంత సేనా! నీవుదొరకితివే.

తే. కానఁబడవైతి సందెచీఁకటుల వడఁగి
  మేఘములచాఁటున నడంగుమెఱుపువోలె
  వాయువశమున వచ్చుసువాసనయును,
  నగలరవళియు సూచించు మగువ నిన్ను.

వసంత—(మెడలోనిదండయు నగలును దీయుచున్నది.)

విటు—అహా! ఈకాఱుచీఁకటి మిక్కిలి దట్టముగా నున్నది.

తే. గీ. అంధకారంబు మెయిఁ బూసినట్లయమ్యె
నింగి కాటుకవర్షించుభంగిఁ దోఁచెఁ
జెనఁటివానికిఁ జేసిన సేవవోలెఁ
జూపు నిష్ఫలం బైనది చూడరాక.

మఱియు,

తే. గీ. సులభశరణాశ్రియము భయంబుళకునెల్ల
నడవియును, నంధకారంబు నరయ సరిగ
భయపడినవాని భయపెట్టువానిఁగూడ
నంధకారంబు సమముగా నాదరించు.

అట్లే గదా!

క. అలోకవిశాలం బగు
నాలోచనయుగము తిమిరనర్ధంబై యు
న్మీలిత మయ్యును నార! ని
మీలితమటులుండె.

వసంత—గోడయంచుచేత దొడ్డిగుమ్మము తెలియుచున్నది. వెల్ల వేయకపోవుటచే గోడలు మలినమయినందునఁ జీఁకటి మఱింత దట్టముగా నున్నది. అందుచే నిక్కడనే యుండెదను. (ఉండును)

చారుదత్తుఁడు—మైత్రేయ! వెళ్లు. నాలుగువీథులమొగలో మాతృదేవతలకొఱకు బలిపెట్టిరమ్ము.

విదూష—నా కిష్టము లేదయ్యా! మఱియొకరిని బంపు.

చారు—ఎందుకు?

విదూష—నాబుద్ధి యద్దములోనినీడవలెఁ గుడియెడమగాను నెడమ కుడిగాను జేయును.

చారుద—మూర్ఖుఁడా! ఐశ్వర్యమునుబట్టి యర్పన జనపవ

లెను. దేవతలు భక్తిచేతనే సంతోషింతురు. కనుక వెళ్ళు.

విదూ—నేనొక్కఁడ నెట్లు వెళ్ళఁగలను?

చారు—రదనికా! ఆయన వెంట వెళ్ళుము.

రదనిక—చిత్తమయ్యా!

విదూ—ఓసీ! నేను దీపము దీసికొనివత్తును.

చారుద—నీకేది యిష్టమో యట్లే జరుగుఁగాక!

విదూష—(దీపముఁబుచ్చుకొని) ఓసీ! రదనికా! దొడ్డితలుపుఁ దీయుము.

రదని—ఆలాగె! (తలుపుదీయుచున్నది.)

వసంత—చీరచెంగుతో (దీపమార్పును.)

విదూష—అయ్యో! అయ్యో!

చారుద—మిత్రుఁడా! ఏమిటది?

విదూ—దొడ్డితలుపు దీయఁగానె రాజమార్గమునుండి గిఱ్ఱుమని సుడిగాలి లోపలికివచ్చివిసవిసఁ బోవుచున్న నాచేతిలోనిదీప మార్పివేసినది.

చారు—మూర్ఖుఁడా! నీ తెలివి! తెల్లవారినట్టేయున్నది.

విదూ—నాతప్పా చిన్నదె. రదనికా! నీవు వెళ్ళి చతుష్పథములో నానిమిత్తము కనిపెట్టుకొనియుండు. నేనింతలో వెళ్ళి యభ్యంతరచతుశ్శాలనుండి దీపము దీసికొనివచ్చెదను. (అని వెళ్ళును.)

రద—అయ్యా! సరె. (నడచుచున్నది.)

వసంత—అదృష్టవశమున నాపరివేశముకొరకే దొడ్డితలుపు తెఱువఁ బడినది. ఇఁక చారిత్రిభయముండదు. ఇఁక ప్రవేశించెదను.

(లోపలికి వెళ్ళియుండును.)

విటుఁడు—(చూచి తనలో) ఇల్లువెడలి యెవ్వతెయో యిటు వచ్చుచున్నది. కానీ? దీనితో నీనిర్భాగ్యుని వంచించెదను. (ప్రికా

శముగా) సురభిస్నానమైనవెనుక వేయఁబడిన ధూపపుగంధమువలె సువాసనవచ్చుచున్నది.

శకారు—అవును బావ! వాసన చెవులతో వినుచున్నాను. చీఁకటికప్పిమ్మినముక్కులతో సరిగాఁజూడఁజాలకున్నాను.

విటు—ఉండు. ఉండు. ఎందుఁ బోయెదవు? (రదనికను బట్టుచున్నాఁడు)

రదని—(భయముచే నేలఁబడుచున్నది.)

శకారు—బావ! పట్టుకో. పట్టుకో.

విటు—

తే. గీ. పడుచుఁదనపుగర్వమున సద్వంశ్యుఁడైన
పూరుషుఁ బరాభవించు నీపడఁతిమిన్న
గుసుమమాలికల్ జక్కఁగఁ గూర్పఁదగిన
వెండ్రుకలఁ బట్టి యీడ్చితి వీధిలోన

శకారు—బావా! దొరకినదా?

విటు—ఆఁ దొరకినది. సువాసనననుసరించి యీమెను బట్టుకొంటిని.

శకారు—ఈతొత్తుకూఁతుగుతల నఱికి తర్వాతఁ జంపివేయుదును.

విటుఁడు—పట్టుకో!

శకారు—(రదనికను బట్టుకొని)

తే. గీ. తలను దోఁకను దలవెండ్రుకలను దొరకఁ
బుచ్చుకొని పట్టుకొంటి నీబొట్టి నిపుఁడు
మొఱ్ఱవెట్టవె! యేడ్వవె? మొత్తుకొనవె!
హరునో, రుద్రనో యీశునో, శరణజొచ్చి.

(అని దానిని బలవంతముగా లాగుచున్నాఁడు.)

రదని—ఏమిది! ఆయన యాలస్యము చేయుచున్నాఁడు.

శకారు—బావ! కంఠస్వరమును బట్టి యిది వసంతసేన కాద నినాకుఁ దెలిసినది.

విటు—కాదు. ఇది వసంతసేనయే విడిచిపెట్టఁగూడదు.

క. ఇది రంగస్థలమందున
మొదటను బహుకళల శిక్షఁబొందుట నాయా
యదనులఁ గొంతుకు మాఱిచి
పదిలంబుగఁ బలుకఁగలదు వదలకు దీనిన్.

విదూష—(దీపముఁదీసికొని పరివేశించి) రాజవీథినుండివచ్చు చల్లనిసన్నగాలిచేత మాటిమాటికి దీపపుపరిమిదలో నున్నచమురు కెరటములుగలిగి కదలుచుండుటచే దీప మాఱిపోకుండ నెట్టటో కాపాడి పట్టుకొనివచ్చితిని.

రదనిక—(శకారునిఁ గాలితోఁదన్ని యేడ్చి) అయ్యో! మైత్రేయ! ఇది గర్వమా! పొగరుబోతుతనమా? లేక పరాభవింపవలెనను సంకల్పమా?

విదూష—వద్దు. వద్దు. (కత్తిబట్టుకొన్నవిటుని శకారునిఁజూచి శంకించుచుండును.)

విటుఁడు—అహో! ఇతఁడార్యచారుదత్తుని మిత్రుఁడగు మైత్రేయుఁడు సుమీ! ఇది వసంత సేనయుఁగాదు. ఓమహాబ్రాహ్మణుఁడా! ఈమె మఱియొకతె యనుకొని మేము పట్టుకొంటిమి. పొగరు చేతఁగాదు. చూడు—

తే. గీ. ఆర్య, స్వాధీనయౌవన మైనదానిఁ
దలఁపు మాపయి నిలుపనిదాని నోర్తుఁ
బట్టఁదఱుముచుంటిమి యది దాఁటె నదియె
యనెడుశంక నీశీలవంచనము జరిగె.

శకారు—అయ్యో! సార్థవాహపుత్రుఁడైన దరిద్రచారుదత్త నిర్భాగ్యునిచేటియాయిది? వసంతసేన కాదు. బాగు! వసంతసేనా! బాగు! చీఁకటిమాటున మాబావకంట దుమ్ముఁగొట్టితివి. ఈమాయల మారి నన్నును మోసగించినది. అన్నివిధముల మోసము జరిగినది.

విదూష.—అట్లనకు! అది కూడదు.

విటు—ఓబ్రాహ్మణోత్తమా! ఇదిగో! నాప్రార్థనమంతయు. అంజలిబట్టి మ్రొక్కుచున్నాను.

విదూష—ఔనౌను! నీవలన నపరాధములేదు. నన్ను నీవు బతిమాలుచుంటివిగనుక తప్పునాదె.

శకారు—బావ! నిర్భాగ్యుఁడైన సార్థవాహపుత్రునకు దరిద్రి చారుదత్తునకు నీవు గట్టిగా భయపడుచున్నావు.

విటు—ఔను! నిజముగా నేను భయపడుచున్నాను.

శకారు—బావ! ఎందువలన?

విటు.—ఆతనిగుణములవలన నీవుచూడు.

తే. గీ. అతఁడు నావంటివారిస్నేహములఁ జెడిమె,
లేఁ డతనిసొమ్ముఁ దినకున్నవాఁ డొకండు,
మండువేసఁగి జనుల నోరెండునపుడు
దప్పఁ దీర్చి శుష్కించుహ్రదంబు వోలె.

ఓబ్రాహ్మణోత్తమా! ఈసంగతి నాసార్థవాహపుత్రునితోఁ జెప్పకుము. (అని నిష్క్రమించును.)

శకారు—ఓబ్రహ్మచారీ! మారిష! నిర్భాగ్యుఁడును సార్థ వాహపుత్రుఁడునైన యాచారుదత్తునితో నాపలుకులుగా నిట్లు చెప్పుము—"రాజమఱఁదియైన సంస్థానకుఁడు పట్టముగల శిరముతోన మస్కరించి చెప్పుచున్నాఁడు. నాటకస్త్రీ, వసంతసేనయను బోగము పిల్ల, బంగారుచాయగలది. మేమిద్దఱము బలవంతముగాఁ దీసికొనిపో

వుచుండఁగా గొప్పవెలగలబంగారపునగతో నీయిల్లుఁజొచ్చినది. తేపు దానిని మాకప్పగింపుము. కానియెడల నీకును నాకును దారుణక్షోభము జరుగును." ఓబ్రహ్మచారి! ఈమాట గూడఁజెప్పుము. "అట్లు చేయవేనితోత్తుకొడుకా పావురముగొంతునఁజిక్కినదుంపనువలె నీగొంతుపిసికివైచెదను. కాదేని తలుపుసందునఁబడిన వెలగపండువలె నీతల పటపటఁ బగులఁగొట్టి చూర్ణముచేసెదను."

విదూష—అయ్యా? అట్లెచెప్పెద. (అని శకారుని దీపముతో భయబెట్టుచున్నాఁడు.)

శకారు—(అంతటఁజూచి) ఏడీ! మాబావ. వెళ్ళిపోయినాఁడు గాఁబోలు! అయ్యో! బావా! (అని నిష్క్రమించుచున్నాడు.)

విదూష—దేవకార్యము నిర్వర్తించితిమని యాయనతోఁ జెప్పుదము. ఓసీ! నీమనసులోనికోపము నడఁచుకొనుము. ఈవృత్తాంతమింటిలోఁ దెలియఁగూడదు.

రదని—అయ్యా! నేను రదనికనుగాదా?

విదూ—రా! వెళ్ళుదము.

ఇద్దఱు—(నడచుచున్నారు.)

చారుద—కల్యాణీ! దేవకార్యము నెఱవేర్చితివా?

వసంత—(తనలో) తనపరిచారిక యనుకొని యాయననన్నుఁ బలుకరించుచున్నాడు. కానీ, నే నిప్పుడు రక్షింపఁబడితిని.

చారు—ఈవేళ గాలి విసరుగా వీచుచున్నది. ఇదిగో! ఉత్తరీయము. పుచ్చుకో!

వసంత—(ఉత్తరీయముఁబుచ్చుకొని సంతోషముతో) ఈయనయౌవనము సమాప్తముకాలేదని యీయుత్తరీయపునెత్తావులు సూచించుచున్నవి.

చారు—రదనిక! అభ్యంతరచతుశ్శాలకుఁ బొమ్ము.

వసంత—(తనలో) అభ్యంతరమందిరముఁ బ్రవేశించునంతటి యదృష్టము నాకు లేదు.

చారు—ఏమి! లోపలికి వెళ్లవేమి?

వసంతి—(తనలో) ఇప్పుడు నేనేమి బదులుచెప్పుదును?

చారు—రదనికా! ఆలస్యము చేయుచున్నావేమి?

(రదనికయు విదూషకుఁడు సమీపించుచున్నారు)

రదనిక—అయ్యా! ఇదిగో వచ్చితిని.

చారు—ఆమె యెవరు?

తే. గీ. ఎఱుఁగకుండంగ నిప్పు డేనిచ్చినట్టి
యుత్తరీయంబు దాలిచి యువిదమిన్న
శారదాభ్రసంఛన్న యౌచంద్రరేఖ
చందమున నెంతో శోభిల్లు నందముగను.

వసంత—(తనలో) దీపము వెలుఁగునఁ గనఁబడుచున్న యీరూపమదె? ఈయనకొఱకేగదా కృశించి నిట్టూర్పులమాత్రముచేతనే కనఁబడుచున్న యీ దేహము నేను ధరించుచున్నాను.

విదూష—ఓచారుదత్తా! రాజస్యాలకుఁడు, సంస్థానకుఁడు పట్టముగలశిరముతో నమస్కరించి యిట్లు మనవిసేయుచున్నాఁడు— "నాటకస్త్రీ-వసంతసేనయనుభోగముపిల్ల-మేము బలవంతగాఁ దీసికొనిపోవుచుండ గొప్పవెలగలబంగారునగతో నీయిల్లుఁజొచ్చినది. ఆమెను దేపప్పగింపవలెను" అని

వసంత—(తనలో) ఏమి! బలవంతముగాఁ దీసికొనిపోవుచుండఁగా' అనుచున్నాఁడు. కాని యిదేసమయము. (ప్రకాశముగ) అయ్యా శరణుజొచ్చుచున్నాను.

చారుద—భయపడకు! భయపడకు! ఈమె వసంతసేనయా?

విదూష—అయ్యో! వసంతసేన! (అపవారించి) ఓచారుదత్త

ఈమె వసంతసేన. ఈమె కామదేవోత్సవదినమున ఓకనులకుఁ బరిచితు రాలై నాఁడుమొదలుకొని యలరువిల్తునకుఁ జేరువమైననీడెందమున మెలఁగుచున్నది. కావున నీమెను జూడుము.

చారుద—మిత్రుఁడా! చూచుచున్నాను.

ఆ. వె. సకలసంపదలను క్షయమునొందినవెన్క
నాతిమీఁద నిలిచె నాదువలపు
అప్రయోజకునిమహాగ్రహంబటు లది
జీర్ణమందవలయుఁ జిత్తమందె.

వసంత—మీసెలవులేకుండ మీగృహముఁజొచ్చి తిరస్కార భావముఁజూపి నేనపరాధము సేసితినిగాన శిరసు వంచి నమస్కరించి క్షమార్పణ వేఁడుచున్నాను.

చారుద—నేనును దెలియకుండ నీకుత్తరీయమిచ్చి నిన్నవ మానించి యపరాధము జేసితినిగావున క్షమార్పణ వేఁడుచున్నాను.

విదూష—బండినిలాగుబండయెద్దులవలె వీరొండొరులను ఓ డించుకొనుచున్నాను. నే నెవరిక్షమార్పణ గోరుదును? రదనికా! అను గ్రహింపు మనుగ్రహింపుము.

చారుద—కల్యాణి! నేను పరాధీనుఁడను. నీవునాయందు స్నే హము నిల్పుదువా?

వసంత—(తనలో) చక్కనికోరిక. కాని, యాకస్మికముగా వచ్చి ప్రథమదర్శనమందె యిక్కడుండుట సరసముగాదు. కనుక ని ట్లుచేసెదను. (ప్రకాశముగ) మీకు నామీఁద ననుగ్రహమున్నయెడ ల నీనాయలంకారమును మీయొద్ద నుంచుకొనుఁడు. ఈయలంకార మునిమిత్తము పాపాత్ములు నన్ననుసరించుచున్నారు. నేను మీరక్ష ను బడసి యింటికిఁ బోవఁదలఁచుచున్నాను.

చారుద—ఈమెమాటలర్థవంతములు మైత్రేయ! పుచ్చుకొ నుము.

విదూష—నా కిష్టము లేదయ్యా!

చారు—మూర్ఖుఁడా! పుచ్చుకో.

విదూష—నీచిత్తము. ఇయ్యవమ్మా!

వసంత—(అలంకారమును దీసియిచ్చుచున్నది)

విదూష—(పుచ్చుకొని) రదనికా! ఈసువర్ణాలంకారమును నీవు పుచ్చుకొనుము. షష్ఠినాఁడు, సప్తమినాఁడు, నీవు దాఁచు అష్టమినాఁడనాధ్యాయముగనుక నేను దాఁచెదను.

రదని—(నవ్వి) మనయజమానునకు నీవు శాస్త్రములు చెప్పుచుందువుగనుక నప్పుడు నీకుఁ దీరుబడికాఁగలదు. ఇయ్యఁడి! (అనినగపుచ్చుకొని వెళ్ళుచున్నది.)

చారు—ఎవరక్కడ! దీపము దీసికొనిరండు.

విదూ—దీపము బోగముదానివలెనే స్నేహశూన్యమైనది.

చారు—అక్కరలేదు. దీపము, (చూచి) సర్వజనసామాన్యమునకు దీపమైనచంద్రభగవానుఁ డుదయించుచున్నాఁడు.

మ. తరుణీసంఘసహాయుఁడై నభముమీఁదన్ గ్లిన్నఖర్జూరపాం
డుగవర్ణంబున రాజమార్గములయందుం దీపమై తోఁచె చం
దురుఁ డాచీకటిపైఁబడున్ గిరణపంక్తుల్ మెల్లగా, నల్లనా
బురదన్ దెల్లనిక్షీరధారలటు వింపు ల్గొల్పుచున్ దృష్టికిన్.

కళ్యాణి! రాజవీధిని వెళ్ళుటమంచిది. మిత్రుఁడా! ఆమె వెంట వెళ్ళుము.

విదూష—మంచిది కళ్యాణీ! రమ్మా. రమ్మా.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.

శ్రీ రస్తు.

# చారుదత్తనాటకము

## ద్వితీయాంకము.

(అప్పుడు వసంతసేనయుఁ జేటికయుఁ బ్రవేశించుచున్నారు)

వసంత—తరువాత, తరువాత?

చేటి—నే నేమియుఁజెప్పలేదే! తరువాత, దరువాతననియెద వెందుకు?

వసంత—ఓసీ! నే నేమంటిని?

చేటి—అజ్జుకా! స్నేహముచేతనే యడుగుచున్నాను. తప్పు పట్టవలె ననిగాదు. నీవేమిటి యాలోచించుచున్నావు?

వసంత—ఓసీ! ఏమని నీవనుకొనుచున్నావు?

చేటి—గణికాభాషము నిష్ప్రయోజనమగుటచే నీ వెవరినో కామించుచున్నట్లు దలంచుచున్నాను?

వసంత—నీవు చక్కఁగాఁ గనిపెట్టితివి. నీయూహాసరియైనది. నేనట్టిదాననే.

చేటి—నీవు నగలు పెట్టుకొనకపోయినను దొడవులన్నియుఁ బెట్టుకొన్నట్లే నా కగపడుచున్నావు. భగవానుఁడైన కామదేవుఁడు పడుచువాండ్రకుఁ జెప్పఁబడనిపండుగగదా.

వసంత—దిక్కుమాలినదానా! మన మింకను గోరవలసియే యుండఁగా నీకోరిక మితిమీఱి కేళ్ళుదాఁటుచున్నది.

చేటి—అజ్జుకా! నిన్నడుగఁదలఁచుచున్నాను. చెప్పు నీమన

సులో నున్నయతఁడు మెచ్చఁదగినరామణీయకముగల యొక రాజకుమారుఁడా?

వసంత—నేను రమింపఁదలఁచుకొన్నాను. గాని సేవింపఁదలఁచుకొనలేదు.

చేటి—అట్లైన విద్యావిశేషరమణీయుఁడైన బ్రాహ్మణకుమారుఁడా?

వసంత—వారు మిక్కిలి పూజనీయులు. వారియందు నాకు మిక్కిలి విశ్వాసము గలదు.

చేటి—అట్లైన నాగంతుకుఁడైన వణిక్పుత్రుఁడా?

వసంత—ఓసీ! పిచ్చిదానా! వేడుకగల యేకాంత యాశాచ్ఛేదమును సహించును?

చేటి—నీమనసులోనున్న మాబావగా రెవరో నేను వినుటకు వీలులేదా?

వసంత—ఆకామదేవోత్సమునాఁడు నీవు నావెంట రాలేదా?

చేటి—వచ్చితినమ్మా!

వసంత—అట్లైన నెఱుఁగనట్లే మాటాడెద వేమి!

చేటి—చెప్పు. చెప్పు.

వసం—ఓసీ! వినవె. సార్థవాహపుత్రుఁడు చారుదత్తుఁ డనునతఁ డొకఁడున్నాఁడు.

చేటి—అతఁడే గాదా శరణాగతవైననిన్ను రక్షించినది.

వసం—అతఁడె.

చేటి—అయ్యో! అతఁడు పరమదరిద్రుఁడమ్మా!

వసం—అందుచేతనే నే నాయనను గామించినది. మిక్కిలిదరిద్రుఁ డగుపురుషునియం దాసక్తిగలవేశ్య నిందపాలుగాదు.

చేటి—అజ్జుకా! పూవురాలిపోయిన తియ్యమామిడిచెట్టును దుమ్మెద లాశ్రయించునా?

వసంత—అవి మధుకరము లైనయెడల సేవించును.

చేటి—ఐశ్వర్యము తగ్గిపోవుటచే వేశ్యాసహవాసమునకు జడిసి యొకవేళ రాఁడేమో?

వసంతి—నే నతనిని గోరుచున్నానుగదా!

చేటి—ఇంతమక్కువ యున్నయెడల నతనికొఱకు కేల పోవు?

వసం—వెళ్ళకపోను. చటుక్కున నతనికొఱకుఁ బోయినయెడలఁ దనవలన నా కేమియుఁ బ్రత్యుపకారము లేదనుకొని యాయ ననాకు దొరకఁడేమో యనుభయమునఁ బోవుట లేదు.

చేటి—అందుచేతనే నానీనగ నచ్చటఁ బెట్టివచ్చితివి?

వసంత—అటువంటిదె.

(అప్పుడు తొందరతో సంవాహకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సంవాహ—అమ్మా! శరణు. శరణు.

వసం—అయ్యా! తొట్రుపడకుఁడు.

చేటి—అయ్యో! ఇప్పు డీయన యెవరు?

వసంత—పిచ్చిదానా! శరణాగతుని నట్లనుగవచ్చునా?

చేటి—ఈయన యెవఁడో సాహసుఁడై యుండవచ్చును.

వసం—పిచ్చిదానా! గుణవంతుఁడేనా రక్షింపఁబడవలసినది?

సంవా—అమ్మా! నేను భయముచేత సముదాచారము మఱచితినిగాని తిరస్కారభావమునఁ గాదు. అమ్మా! చూడు—భయపడినవాడు, పరాభవము బొందినవారుఁ నాపన్నులైనవారుఁ దమచరిత్రలకువంచనలు గలిగినవారుఁ దప్పులు చేయఁజాలుదురు.

వసంత—సరె. సరె! నీవు మమ్మునమ్మియుండవచ్చును. నేను వెలయాలను.

సంవా—పుట్టుకచేతనే గుణముచేతఁ గావు.

వసం—ఓసీ! ఈలా గడుగు.

చేటి—మాయమ్మగా రడుగుచున్నది. మీకు భయమెవరివల్ల?

సంవా—అమ్మా! ధనవంతునివల్ల.

వసంత—అట్లయిన నతని కాసనము వేయవే.

చేటి—ఆలాగే! (ఆసన మిచ్చుచున్నది.)

వసంత—అయ్యా!కూర్చుండుఁడు.

సంవా—మీరు చేయుపూజావిశేషముచేతనే నాకార్యమైన ట్లు దలఁచెదను. (కూర్చుండును.)

వసం—ఓసీ! ఈలా గడుగు.

చేటి—అమ్మా! ఆలాగె. రాజమార్గమున మీరు స్వేచ్ఛగా వెళ్ళుటకుఁ దగునేర్పాటుల నీమె చేయఁదలఁచుచున్నది. ఎవని కేమి య్యవలెను?

సంవా—అమ్మా! విను.

వసం—సావధానముగ నున్నాను.

సంవా—నాజన్మభూమి పాటలీపుత్రము. స్వభావముచేత నే ను వర్తకుఁడను. తరువాత నాయదృష్టము తొలఁగిపోయినందునఁ గా ళ్లుపిసికి జీవించుచుంటిని.

వసం—మీరు సంవాహకులా? సుకుమారమైనవిద్య నభ్య సించినారు.

సంవా—అది మొదట నే నొకకళగా నేర్చుకొన్నాను. ఇ ప్పుడది నాకు జీవనాధారమైనది.

వసంత—అయ్యా! మీమాట విచారసూచకముగా నున్న ది. తర్వాతదర్వాత?

సంవా—అజ్జుకా! ఇచ్చట మహాపురుషు లుందురని యాగం తుకులవలన విని యెవఁడైన గొప్పవాఁడు యజమానుఁడు నాకు దొ రకవచ్చునని యాశపడి యిప్పు డుజ్జయనికి వచ్చితిని.

వసం—తరువాత! తరువాత!

సంవా—తరువాత! నిక్కడికి రాఁగానే సార్థవాహపుత్రుఁ డొకఁడు దొరకెను.

వసం—ఎట్టివాఁడు?

సంవా—చక్కనివాఁడు. తొందరపడనివాఁడు. గర్వములేనివాఁడు. సుకుమారుఁడు. సౌందర్యగర్వములేనివాఁడు. మంచినేర్పరి. దర్శనీయుఁడు. సమర్థుఁడు. దాక్షిణ్యముగలవాఁడు. ఎల్లవారి కిష్టుఁడు. సంతుష్టిగలవాఁడు. ఇచ్చి గర్వపడఁడు. చేసినమేలు కొంచెమైనను మఱువఁడు. మహోపకారమునైన మఱచును. అజ్జుకా! పలుపలుకులేల ఆకులపుత్రునిగుణములలో నాల్గవవంతైన నతిదీర్ఘమైనగ్రీష్మదినమున సైతము వర్ణింప నలవిగాదు. వేయేల! దాక్షిణ్యముచేతఁ దనశరీరము పరులదేయని భావించును.

వసం—ఓసీ! చారుదత్తునిగుణములనుబోలిన యాపురుషుఁడెవఁడే?

చేటి—వినవలెనను వేడుక నాకును గలదు. తనగుణములచేత నుజ్జయని నలంకరించుచున్న యామహాత్ముఁ డెవఁడో వినవలెనను వేడుక నాకును గలదు.

వసం—తరువాత! తరువాత?

సంవా—తరువాత నతనిగుణములకు నాశరీరము నమ్ముకొని నాభార్యనుసయితము మఱచి యతనియొద్ద జీవించుచుంటిని.

వసంత—ఆయన దరిద్రుఁడా?

సంవా—చెప్పకుండనే నీ వెట్లు తెలిసికొంటివమ్మా?

వసంత—అట్టిగుణవిభవ మొక్కనియందుసమకూడదుగనుక. తరువాత. తరువాత!

చేటి—ఆయనపే రేమి?

సంవా.—ఆర్యచారుదత్తుఁడు.

వసంత.—తగును! తర్వాత! తరువాత?

సంవా.—తరువాత నతఁడైశ్వర్యము తగ్గుటచే విధేయులైన పరిజనులు గలిగి కుటుంబభరణమును విడిచిపెట్టి చరిత్రమాత్రావశేషుఁడై సార్థవాహగృహమందె వసించుచున్నాఁడు. మఱియొకని సేవింపుమని యాయన సెలవిచ్చి నన్ను విడిచిపెట్టెను. ఇటువంటి మఱియొకపురుషరత్న మెట్లుదొరుకుననియు, నతనికోమలలలితశరీరస్పర్శనముచే ధన్యమైననాహస్తమును సాధారణమైనమఱియొకనిశరీరమును బిసికి యెట్లుపవిత్రముసేయుట యనియు. నట్టె విచారపడి యీపాడు శరీరమును రక్షించుకొనుటకై జూదమాడి జీవింప మొదలుపెట్టితిని.

వసం.—(బాష్పములు విడిచి చేటిని జూచుచున్నది.)

చేటి.—తరువాత తరువాత?

సంవా.—తరువాత నినెన్నెన్నో దినములు నాచేత నోడింపఁబడినపురుషునిచేత నేనొకనాఁ డోడింపఁబడి పదివరహాలియ్యఁదేలితిని.

వసం.—తరువాత తరువాత?

సంవా.—తరువాత నేఁడు వేశ్యావీథిని వచ్చుచుండఁగా వానికంటఁబడితిని. వానికి జడిసి నీయిల్లుఁజొచ్చితినని నీవు తెలిసికో.

వసం.—(తనలో) అయ్యో! గొప్పచిక్కుగదా. తమకు నెలవైనచెట్టు కూలిపోవునేని పక్షులు నిలువ నీడలేక చెదరిపోవుచున్నవని నేను దలంచుచున్నాను. (ప్రకాశముగా) అట్లయిన మీరు మా స్వజనమె. ఓసీ! ఇటువచ్చి యీవచ్చినవారిని బంపివేయుము.

చేటి.—ఆలాగే! (అనినిష్క్రమించును.)

వసంత.—అయ్యో! ధనమునిమిత్తమై మీరు చింతిల్లవద్దు. ఇది పూజ్యులైనచారుదత్తు లిచ్చినట్లే మీ రనుకొనుఁడు.

చేటి.—(ప్రవేశించి) అజ్జుకా! వారిని బంపివేసితిని. సంతోషించి వెళ్ళిరి.

సంవా—అమ్మా ! నన్ననుగ్రహించితివి.

వసంత—అయ్యా ! మీరు వెళ్లి మిత్రులఁజూచి సంతోషింతురుగాక !

సంవా—నేఁడో యెప్పుడో యొకప్పుడీవిచారముతో సన్యసింతును. నావిద్య మీపరిజనులలో నెవరికైన నేర్పించినయెడల నామీఁద మీరనుగ్రహముంచినవారగుదురు.

వసం—ఎవనినిమిత్త మీవిద్య మీరు నేర్చికొనిరో వారినే సేవించుట మంచిది.

సంవా—(తనలో) మిక్కిలినేర్పుతో నన్నీమె నిరాకరించినది. తనచేసినమేలునకు మంచివారెవరు ప్రత్యుపకారము నపేక్షింతురు? (ప్రకాశముగ) అమ్మా ! నే సెలవుపుచ్చుకొని వెళ్లెద.

వసంత—అయ్యా ! చిత్తము. వెళ్ళుఁడు. వెండియు దర్శనమగుఁగాక !

సంవా—అమ్మా ! అల్లె. (నిష్క్రమించుచున్నాఁడు)

వసం—అయ్యో ! ఏదో చప్పుడు.

(చేటుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

చేటుఁడు—విచ్ఛిత్తికా! విచ్ఛిత్తికా! అజ్జుక యెక్కడనున్నది?

వసం—ఓసీ ! ఏమిటిది ?

చేటుఁడు—అయ్యో ! వంచింపఁబడితిని. తనపయోధరయుగళంబు వంగునట్లు గవాక్షమునుండి తొంగిచూచుచు నజ్జుక తనకర్ణాభరణము జాఱిపోవుట యెఱుఁగకున్నది.

వసంత—తేలికమనుష్యులు మాటిమాటి కాశ్చర్యపడుదురు. నీతొట్రుపాటున కేమికారణము ?

చేటుఁ—విను ! స్నానమాడించి మావటీఁడు తీసికొనివచ్చుచుండ నుగ్రవేగముతోఁ. దనమదగంధము రాజవీధియందు వ్యాపింప

భద్రికపోతకం బనుమదపుటేనుఁగు బహుజనసంకులములైన రాజమార్గములందుఁ జరించుచు, నుత్తరీయమందున్నైతము విరాగియగుటచేత సర్వజనులదృష్టి నాకర్షించినయొకసన్న్యాసిని బట్టుకొనెను.

వసంత—అయ్యో ! తరువాత. తరువాత ?

చేటుఁడు—అప్పు డామదదంతావళము వానిని దొండము తోఁ గొట్టుచు దంతములనడుమఁ బట్టి త్రిప్పుచుఁ బాదములఁ దొండముతోఁ బట్టుకొనెను. "అయ్యో ! చచ్చెఁ జచ్చె. ఏనుఁగు వానిని జీల్చివైచె" నని జనులలో హాహాకార ముద్భవించెను. అప్పుడు నేను జేతులతో నేనుఁగును నాలుగుచఱపులు చఱచి మరల్చి పరివ్రాజకుని రక్షించితిని.

వసంత—ఇది నాకు మిక్కిలి ప్రియము. తర్వాత తరువాత ?

చేటు—అప్పుడు సకలజనులు "ఆహా! ఈచేటుఁ డెంతపని జేసెనయ్యా!" యని నన్ను మెచ్చిరి. కాని నా కెవ్వరు నేమియునీయఁ దలఁపరైరి. తరువాత నోవసంతసేనా! యేమి చెప్పుదును? ఒకానొక కులపుత్రుఁడు తనయాభరణస్థానములను జూచుకొని లేవని తెలిసికొని దైవమును దూరి నిట్టూర్పు విడచి నాయైశ్వర్య మింతే యనుకొని యీయుత్తరీయమును దనపరిజనునిచేత నాకంపెను.

వసంత—ఆర్యచారుదత్తునిగుణముల ననుకరించునీపురుషుఁ డెవఁడు ?

చేటి—అజ్జుకా ! వినుటకు నాకును వేడుక గలదు. ఆయన యెవరో ?

వసంత—ఎవరో సజ్జనుఁ డై యుండవచ్చును.

చేటి—ఉండవమ్మా ! వాని నడుగుదము.

వసంత—ఒక్కపురుషునియందే పక్షపాతముండుటవలన మనకుఁ దక్కినవారిగుణములు తక్కువగఁ దోఁచును.

చేటి__అయ్యో ! ఆయనపేరు నీ వెఱుఁగుదువా ?

చేటుఁడు__ఎఱుఁగను.

వసంత__నీవు మిక్కిలి పొరబాటు చేసితివి.

చేటి__అట్లయిన నీ విప్పు డేమంటివి ?

చేటుఁడు.__నే నంతవఱకే యెఱుఁగుదును. ఆమహాపురుషుఁ డునిగర్వి.

వసంత__రా. ఆయనను జూతము.

చేటుఁడు__చూడు. చూడు. ఆయన వెళ్ళుచున్నాఁడు.

వసంత__(మేడమీఁదినుండి) ఓసీ ! ఆయన యార్యచారుదత్తుఁడే. యజ్ఞోపవీతమాత్రి ముత్తరీయముగా వెళ్ళుచున్నాఁడు. అతఁడు దూరము వెళ్లువఱకుఁ జూతము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము.

శ్రీరస్తు.

# చారుదత్త నాటకము

## తృతీయాంకము.

(అప్పుడు చారుదత్తుఁడును విదూషకుఁడును బ్రవేశింతురు.)

చారుద—మిత్రుఁడా! వీణయనఁగా సముద్రమునఁ బుట్టని రత్నము.

సీ. గానంపువేడుక గల్గినవానికిఁ
 జిత్తంబునకునెక్కు చెలిమికత్తె
సర్వవిషయంబుల సంకీర్ణదోషముల్
 లేశమాత్రంబును లేనిగోష్ఠి
చక్కనిక్రీడారసంబులౌ మన్మథ
 వ్యసనంబులం బ్రియమైనకాంత
యంగనామణులకు శృంగారరసముఁలఁ
 బతితోడికూటముల్ బాపుసమతి

విదూష—ఓమిత్రుఁడా! ఇప్పు డెంతప్రొద్దుపోయినది? గస్తీ వాండ్రచప్పుడువల్ల రాజమార్గములు నిశ్శబ్దములైనవి. కుక్కలుగూడ నిద్రవోయినవి. మన మింకను నిద్రపోలేదు. మఱియొకచిత్రము! ఈ పాడువీణ నాకుఁ గిట్టదయ్యా. మంచియాయువుపట్టున దీసితీఁగలు తెగి పోయిన బాగుండును.

చారు—మిత్రుఁడా! భావస్థైర్యముచేత నేఁటిగానము మిక్కిలి మధురముగా నున్నది. నీవుమాత్రము సంతోషింపలేదు.

విదూ—అందుచేతనే నాకిష్టము లేదు. తియ్యనివస్తు వైనను మిక్కుటముగాఁ దిన్న యెడల నజీర్ణము సేయును.

చారు—అన్నివిధములచేత గానము స్ఫుటముగా నున్నది. ఏలయన.

మ. సమమై విస్ఫుటమై మనోజ్ఞమయి యుచ్చస్థాయియై చాల శ్రా
వ్యమునై సాభినయంబు గాక ఘనభావస్ఫూర్తిఁ జెన్నారఁగా
నమహా! మిక్కిలి రక్తిగట్టెఁ బాగడంగానేల వేనోళ్ళ గే
యము స్త్రీపాడినయట్లు లెంచఁదగుఁ గుడ్యం బడ్డమైయుండినన్.

విదూ—నీ వెంతైన మెచ్చుకో! నామట్టుకు సంగీతముఁ బాడునప్పుడును జదువుకొన్నయాఁడుది నాదరణపాత్రులు గారు. పాట బాడునప్పుడు గనాఁ జెల్లిపూలదండ మెడలో వేసికొన్నపురోహితుఁడునలె నెంతమాత్రము మెప్పువడయఁడు. చదువుకొన్నయాఁడుది ముక్కుగోసినయావువలె వికృతరూపముఁగలది యగును.

చారు—అర్ధరాత్రమైనదోయి! రాజమార్గములందుఁ జీఁకటి దట్టముగా నున్నది. మనుష్యసంచారము మునుగుటచే నుజ్జయిని నిదరిబోవునట్లున్నది. ఏలయన?

తే. గీ. కాఱుచీఁకటులకు నవకాశ మిచ్చి
పొరిభవంబేది యష్టమపక్షచంద్రుఁ
డదిగో! నీటిలో మునిఁగెడుమదపుటేన్గు
కొమ్ముకొనవోలెఁ గ్రిమముగాఁ గ్రుంకుచుండె.

విదూ—నీవు చక్కఁగాఁ జెప్పినావు. అస్తమించుచున్నచంద్రుఁ డవకాశ మీయఁబట్టి మేడలమీఁదనుండి యంధకారము క్రిందికి దిగుచున్నది.

చారు—(నడచి) ఇదిగో! మనయిల్లు. వర్ధమానవకా! వర్ధమానవకా!

విదూ—వర్ధమానకా ! తలుపుఁ దెఱువుము.

చేటుఁడు—(ప్రవేశించి) ఓహో! ఆర్యమైత్రేయుఁడా?

చారు—వర్ధమాణవకా !

చేటుఁడు—అయ్యో! ప్రభువుగారా? స్వామీ! వందనములు.

చారు—కాళ్లు గడుగుకొనుటకు నీళ్ళు దీసికొనిరా !

చేటుఁడు—(నడచి) ఇదిగో! నీళ్ళు. (అని చారుదత్తునికాళ్లు గడుగుచున్నాఁడు.)

విదూ—వర్ధమానవకా! నాకాళ్ళుగూడఁ గడుగుము.

చేటు—చక్కఁగాఁ గడిగినను నీకాళ్ళు నేలఁబెట్టి పాముకొనవలసినదేగదా ? నీరు వ్యర్థమగుటేగాని కడిగినఫలము లేదు. పోనీ ! ఏవీ నీకాళ్ళు? కడిగెదను. (కాళ్ళుఁ గడుగుచున్నాఁడు.)

విదూ—ఊతోత్తుకొడుకు కాళ్ళుమాత్రమే కడుగలేదు. మొగముగూడ గడిగినాఁడు.

చారు—వయస్యా !

తే. గీ. నెన్నసటినుండి నిద్దురనేత్రయుగము
పైకి దిగజాఱునట్లు గన్పడెడు సహహా !
కానఁబడకుండనే వార్ధకంబు వచ్చి
నరునిబలమెల్ల హరియించి పెరుగునట్లు.

మైత్రేయా నిదురపో.

(చేటుఁడు నిష్క్రమించు చున్నాఁడు.)

(అప్పుడు నగలబరిణె చేతఁబట్టుకొని చేటి ప్రవేశించును.)

చేటి—మైత్రేయా? లేవయ్యా లేవయ్యా.

విదూ—ఓసీ! ఏమిటిది ?

చేటి—ఇది నగలబరిణె. షష్ఠినాఁడు సప్తమినాఁడు నేఁడాఁచితిని. నేఁ డష్టమిగదా ?

చారు__ఇది వసంతసేనసొమ్ము.

చేటి__ఔను అయ్యా! పుచ్చుకొమ్మని యీయనతోఁ జెప్పాఁడు.

చారు__మైత్రేయా! పుచ్చుకో.

విదూ__ఎందుచేత నీ వీనగను లోపలియుంటదాఁచఁగూడదు?

చారు__మూర్ఖుఁడా! పైవారినగ నింటివారు చూడ నిచ్ఛగింపరు.

విదూ__ఏమిగతి? తీసుకురా. దొంగలపాలుగావలసినసొమ్మయది. నేనే పట్టుకొందును.

చేటి__(నగ యిచ్చి పోవుచున్నది.)

విదూ__ఆయుత్తరీయము నాభోగముదానిపరిచారకుని కెందుకిచ్చితివయ్యా?

చారు__జాలిచేత.

విదూ__ఈవిషయములోఁగూడ జాలియా?

చారు__అట్లనఁగూడదు.

విదూ__నేను కడుపునిండ మేసినగాడిదవలె వట్టినేల దొర్లుచున్నాను.

చారు__నాకు నిదురవచ్చుచున్నది. మాటాడక పండుకో.

విదూ__నీవు నిదురపో! సుఖముగా లేతువుగాని. నేనును నిదురపోవుదును.

(ఇద్దఱు నిదురపోవుచున్నారు)

(అప్పుడు సజ్జలకుఁడు ప్రవేశించును.)

సజ్జల__నేను-

సీ. సరిగాను నా దేహపరిణామమునుబట్టి
సరఁగ సుఖప్రవేశమగునట్లు

నాబలంబునను శిక్షాబలంబునను గృ
హంబున కిప్పుడు కన్నంబుదరివ్వి
రాయిడిచేతఁ బార్శ్వములు రెండును గొట్టు
కొనిపోవఁ జొచ్చెదఁ గొంకులేక
క్షోణిపైఁ బ్రాఁకుచుఁ గుబుసంబు వీడిన
జరఠసర్పమువోలె సత్వరంబు

వృక్షవాటికదగ్గఱనున్న దొడ్డిగుమ్మమునకుఁ గన్నముఁదరివ్వి ప్రవే శించినాఁడఁ గదా ! ఇదిగో! ఇప్పుడే చతుశ్శాలను సమీపించెదను. (నిర్వేదముతో నాలోచించి)

సీ. నిదురించువారిపై నిది ప్రియుక్తంబౌట
నిందింతు రిది బుధుల్ నీచమనుచు,
నమ్మినవారల న్వంచించుకతమున
శౌర్యంబు గాక దుష్కార్యమందురి
చేతులు జోడించి సేవజేయుటకన్న
నిదె మంచిపని నిందకేమి గాని
సదిరించురాజుల నిర్దయఁ జంపిన
ద్రోణపుత్త్రుఁడు మాకుఁ ద్రోవ జూపె

(ఆలోచించి)

తే. గీ. అర్థవంతుఁడు సాధుజనావమాని
నిర్దయుండు లుబ్ధుండు వణిగ్వరుండు
నైనవానిల్లుఁ జొచ్చితినేని నేను
చిత్తమందించుకేనియుఁ జింతనొంద.

ఏది యెట్లైననుసరే ! మన్మథుఁ డేమిచేయునుఁడు ? నాపని నేనా రంభించెద. ఓహో !

సీ. నీటఁ దడపిన నెచ్చోటు మెత్తంబడి
ధ్వనిగాకయుండును దరివ్విసపుడు ?
కత్తిమోపినయంతఁ గష్టంబులేక యె
క్కడ గోడ తెగి పెద్దకన్న మగునో ?
యెచ్చోటఁ జవుడుచే నిటుక లూడినదయి
భవనంబు మిక్కిలి పాఁతదయ్యెఁ ?
బడఁతు లెచ్చోటఁ గన్పడకుందు రెచ్చోట
జతనంబు సల్పిన సఫలమగునో ?

(నడచి) ఇది వాస్తుశాస్త్రప్రకారము నిర్మింపఁబడినయిల్లు. స్వోపస్నేహముచేత నీయింటికిట్టులకానొకగృహవిశేషమునలెఁ గన్పడుచున్నది. ఇక్కడఁ బరివేశమున కవకాశము గల్గించుకొనెద. ఓహో! ఎటువంటికన్న మిక్కడ వేయుదును ?

తే. గీ. మత్స్యముఖమ? సింహాకారింతమా? గజాస్య
మా ? త్రికోణమా ? వ్యాఘ్రిమా? యర్ధచంద్ర
మా ? యరయఁ బూర్ణచందరిమా ? యేయది తగుఁ
గాంచి మావాండ్రు విస్మితుల్ గాఁగఁ జేతు.

కానీ ! సింహాక్రాంతమే తరివ్వెదను.

విదూ.—నీవు మేలుకొన్నావా ? లేదు.

చారు.—ఎందుకు ?

విదూ.—కర్తవ్యసంకేతమును జేయలేని బౌద్ధశరిమణునకుఁ బలె నాకు నిదరిపట్టుటలేదు. నాయెడమకన్నదరుచున్నది. దొంగ కన్నము దరివ్వుచున్నట్లే నాకుఁ గనఁబడుచున్నది. ధనమున కీవిధమైనయవస్థ యుండుటచేత నేబుట్టుకచేతనే దరిదురిఁడనైనాను.

చారు.—మూర్ఖుఁడా! నీబరితుకుకాల దారిదర్యమునుగోరుచున్నావు ?

సజ్జల—ఇప్పుడు దేనిచేతఁ గన్నమును గొలుచుకొందును ? నామెడలో నిజందెను పగలు బ్రహ్మసూత్రము, రాత్రి కర్మసూత్రము నగుచున్నది.

తే. గీ. కన్నపుంగత్తి కోడ నొక్కమలు పరిగ
గోడలను ద్రివ్వి కన్నంబుఁ గూర్తునేనిఁ
బొరుగువారు విషాదంబుఁ బొందకుండ
నన్నుఁ దిట్టిన మెత్తురు నానిపుణత.

ఖరపటునకు నమస్కారము. నిశాగోచరులగు దేవతలకు నమస్కారము. (కన్నముఁ ద్రవ్వుచున్నాఁడు.)

అహో ! పనిముగిసినది లోపల దూరెదను. (ప్రవేశించి) అహో ! దీపము వెలుఁగుచున్నదే. చాటునకుఁ బోయెద. ఛీ! సజ్జలకుఁడనుగదా ? నాప్రజ్ఞ నేను బొగడుకొనఁగూడదు కాని, నేను-

సీ. ప్లవనమందునఁ బిల్లి, నంచనఁ దోఁడేలు
నన్యగృహాలోకమందు డేగ
నరుల దేహబలంబు హరియించునెడ నిద్ర
ప్రాఁకెడుపట్టులఁ బ్రాఁచుబాము
మైవన్నె నవలీల మార్చుపట్లను మాయ
భాషమార్చెడువేళఁ బల్కువెలఁది
నిలుకు చోటులయందు నిరులు మాపులు దివ్వె
నేలపై నాయువు నీట నోడ.

(అంతటఁజూచి) క్రొత్తవాఁడ నగుటచే నింటిగొప్పతనమొక్కటేచూచి లోపల వస్తుసమృద్ధికలదో లేదో యెఱుఁగకఁ బ్రవేశించితిని. ఇక్కడ నొకగుడ్డయైన నాకగపడుటలేదే. ఇతఁడు దరిద్రుఁడాయేమి? కాదేమో సంయమన నిరర్థకమైన భూష్యము లితఁడు ధరించుచున్నాఁడు. ఈ గృహము పెద్దలుసంపాదించినదై యుండవచ్చును. ఇతఁడు సంపద లనుభవించి సిరి కోల్పోయినవాఁడు గావచ్చును.

తే. గీ. సిరులు తగ్గినవాఁడయుఁ జితృముగను
జన్మభూమిపైఁ గలుగునాసక్తిచేత
నమ్ముకొనఁదగుకాలమంత్రన నితఁడు
దృఢతరప్రేమచేత నీగృహముఁ గాచు.

కానీ, చూతము. ఈకులపుత్రునియవస్థ నాయవస్థవలెనే యున్నది. కావున నితనిఁ బీడింపఁగూడదు. వెళ్ళిపోయెదను.

విదూ—ఓయీ! ఈబంగారునగ దీసుకో.

సజ్జల—ఎట్లెటు! బంగారునగయనుచున్నాఁడే నన్నుఁజూచి పలుకరించుచున్నాఁడా? కానీ! చూచెదఁగాక! (చూచి) నిజముగా నీతఁడు నిద్రిపోయినాఁడు. ఔను!

సీ. వీని నిశ్వాసముల్ విషమముల్ గాక తు
ల్యాంతరంబులగుచు నగపడియెడు
దేహమంతయుఁ జాఁపి దృఢనిద్రిగనెడుమై
పొడవుచే శయ్యనుగడచియుండె
నరమోడ్పు గన్బడ దక్షులఁ జపలత్వ
మావంత లేదు పక్ష్మాంతరముల
నెదుట దీపముఁజూడ నిచ్చగింపఁడుగదా
నిక్కంబుగా దొంగనిద్రిమైన.

అది యెక్కడనున్నదో? అదిగో! చిరుఁగులదుప్పటిలో నొక మూల దీపప్రిభలచే నది గన్పడుచున్నది. అతఁడు దానినిగట్టిగా బట్టుకొన్నాఁడు. ఇదే తగినసమయము. ఇదిగో నేతెచ్చినమిడుతలు దీపమార్పివేయుట కొఱకు దానిని విడిచెదను. (తుమ్మెదబరిణలోనుండి యొకదాని విడుచుచున్నాఁడు)

అహో! అది దీపమునార్పి క్రిందఁబడినది

విదూ—అయ్యో! దీపమారిపోయినదే మోసపోయితినే

ఓచారుదత్తుఁడా! ఈసువర్ణాలంకారముఁ బుచ్చుకోవయ్యా! నేను భయముచే నపాయకరమార్గముల నడచువర్తకుఁడట్లు నిద్రపోఁజాల కుంటిని. నీవు దీనిని పుచ్చుకొననియెడల నాబ్రాహ్మణ్యముమీఁద నొట్టుబెట్టుచున్నాజుమీ!

సజ్జల—ఒట్టుపెట్టుటయెందుకు? ఇదిగో! పుచ్చుకొనుచున్నాను.

(పుచ్చుకొనుచున్నాఁడు)

విదూ—(ఇచ్చి) సరకులమ్ముకొన్న వర్తకుఁడువలె నేనిఁక నిద్రపోయెదను.

సజ్జ—సుఖముగా నిద్రపోవయ్యా బ్రాహ్మణుఁడా! (ఆలోచించి) అహో! బ్రాహ్మణుఁ డెంతయో నమ్మకముతో నిచ్చినదానిని నే నపహరించుచున్నానుగదా!

తే. గీ. పేదతనము నింద్యమయి నిర్వేదమైన
యౌవనం బంతకన్న నింద్యంబుసుమ్ము
కనుక నేగద! యీఘోరకర్మ మేను
చేయుచుండును మరల దూషించుచుండు.

(తెరలోఁ గలకలము.)

సజ్జల—(చెవియొగ్గివిని) అదుగో! తెల్లవాఱుచున్నదే పాఱి పోయెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

చేటి—(ప్రవేశించి) అయ్యా! మైత్రేయా! మైత్రేయా! మన వృక్షవాటికదగ్గఱనున్న దొడ్డిగుమ్మమున కెవఁడో దొంగ కన్నముత్రవ్వి దూరినాఁడయ్యా.

విదూ—(తొందరతో లేచి) ఓసీ! ఏమనుచున్నావు?

చేటి—(వెనుకటిమాటలే యనుచున్నది)

విదూ—దొంగనుత్రవ్వి కన్నము దూఱెనా?

చేటి—చచ్చినాఁడా కన్నముద్రవ్వి దొంగదూఱినాడయ్యా!

సిదూ—రా! చూపింపుము.

చేటి—(సమీపించి) ఇదుగో!

విదూ—అయ్యో! ఏదోపాడుకుక్క గోడత్రవ్వి లోపలఁ దూఱినది. ఓసీ! రా పోయి చారుదత్తున కీప్రియము నివేదింతము. (ఇద్దఱు సమీపించి) ఓచారుదత్తుఁడా! నీకుఁ బ్రియము విన్నవించు చున్నాము.

చారు—(మేలుకొని) నాకుఁ బ్రియమేమిటి? వసంతసేన వచ్చినదా?

విదూ—వసంతసేన రాలేదు. వసంతసేనుఁడు వచ్చినాఁడు.

చారు—రదనికా! అదేమిటే?

చేటి—అయ్యో! మనవృక్షవాటికదగ్గఱనున్న దొడ్డిగుమ్మమున కెవఁడోఁ దొంగ కన్నముత్రవ్వి లోపలఁ దూఱినాఁడు.

చారు—ఏమి! దొంగదూఱినాఁడా?

విదూ—ఓమిత్రుఁడా! "మైత్రేయుఁడు మూర్ఖుఁడు మైత్రేయుఁడు చదువురానివాఁడు" నని నీవెల్లప్పుడుఁ బలుకుచుందువుగదా సువర్ణభాండకము నీచేతిలోఁబెట్టి నే నెంతమంచిపని జేసితినో చూచితివా?

చారు—నీవు నాకిచ్చినావా?

విదూ—ఔను! ఇచ్చితిని.

చారు—ఏవేళప్పుడు?

విదూ—సరిగా రెండుజాముల రాత్రివేళ.

చారు—రెండుజాములవేళప్పుడా? నిజముగా నిచ్చితివా?

విదూ—ఓచారుదత్తుఁడా! నీ కెప్పుడు మెలఁకువ వచ్చినదో యప్పు డిచ్చినాను.

చారు—అయ్యో! సువర్ణభాండము దొంగలపాలైనది.

విదూ—అదప్పుడు నాచేతి కియ్యనయ్యా!

చారు—(తనలో)

తే. గీ. సత్య మెవఁడు గ్రహించును శ్రద్ధగలిగి
మెల్లవారు నన్ జులకఁగా నెంచుచుందుర్
లేమి నిష్ప్రభావమగుట భూమిలోన
శంకనీయుండొ పేదదోషములయందు.

(బ్రాహ్మణి పరివేశించుచున్నది.)

బ్రాహ్మణి—రదనికా! రదనికా! రా. పాపము దానికి వినఁబడలేదు. తలుపు చప్పుడు చేసెద. (అట్లు చేయుచున్నది)

చేటి—అహో! తలుపుచప్పుడులాగున్నది. అమ్మగారు నన్నుఁబిలచుచున్నారు. అమ్మా! ఇదిగో వచ్చుచున్నాను.

బ్రాహ్మణి—ఆర్యపుత్రునకుఁగాని మైత్రేయునకుఁగాని దెబ్బలు తగులలేదు గదా? అపాయ మేమియుఁ గలుగ లేదుగదా?

చేటి—అయ్యగారును, మైత్రేయులును సురక్షితులై యున్నారు. నాఁడామె మనయింట దాఁచిననగ దొంగ యెత్తుకొనిపోయినాఁడు.

బ్రాహ్మణి—ఏమనుచున్నావు? దొంగ యెత్తుకొనిపోయినాఁడనియా?

చేటి—ఔను.

బ్రాహ్మ—ఆమె కిచ్చుటకు మనయొద్ద నేమున్నది? కానీ! ఇది యిచ్చెద. (చెవులు తడవుకొని) అయ్యో! ఈతాటియాకుమక్కయేగదా! అలవాటుచేతఁ జెవుల నేమోయున్నదనుకొని తడవినాను. ఇప్పు డేమిచేయుదును? (ఆలోచించి) ఉపాయము పొడకట్టినది. మాపుట్టినయింటినుండి తెచ్చుకొన్ననూఱువేలు వెలగలముత్యాలహార మున్నదిగదా! ఆర్యపుత్రుఁడు దానిని దమసహజోదార

శీలతతో నిచ్చివేయుదురుగాక! అలాగే చేసెదను.

(నిష్క్రమించుచున్నది.)

విదూష—చీఁకటిలో నెఱుఁగక చేసినయాతప్పునకుఁ దల వంచి నీకు నమస్కరించెదను. దయచేసి యానగ నాచేతికిమ్ము.

చారు—సీ విప్పుడు న న్నేల బాధించెదవు ?

తే. గీ. ఎల్లయప్పుడు నాశీల మెఱిఁగినట్టి
యీవె నన్ను నమ్మకపోదువేని నింకఁ
బరులవంచించువిద్యలోఁ బండిత యగు
నావెలవెలంది నమ్మునే ? యకట ! నన్ను.

విదూ—మందభాగ్యుఁడ నగునేను నగ దొంగచేతిలోఁ బెట్టి. తిసని యిప్పుడు తోఁచుచున్నది. (విచారముగాఁగూర్చుండును.)

బ్రాహ్మణి—(ప్రవేశించి) రదనికా ! ఆర్యమైత్రేయు నిటు బిలువుము.

చేటి—అయ్యా! మైత్రేయ ! అమ్మగారు నిన్నుఁ బిలుచుచు న్నారు.

విదూ—ఓసీ ! నన్నా ?

చేటి—ఔను.

విదూ—ఇదిగో ! వచ్చుచున్నాను. (సమీపించును.)

బ్రాహ్మణి—అయ్యా! ఈప్రతిగ్రహమును బరిగ్రహింపుము.

విదూ—ఈదానవిభవము మీపరిస్థితావస్థకు విరుద్ధముగా నున్నది. ఇది యెట్లువచ్చెనో ?

బ్రాహ్మణి—ఓయీ! నేను షష్ఠినాఁ డుపవాసము చేసితిని. సర్వసారవిభవముగలబ్రాహ్మణునిచేత స్వస్తివాచనము గావలెను. ఇది యీవిధముగా వచ్చెను.

విదూ—అష్టమిగదా నేఁడు ?

బ్రాహ్మ—పొరబాటున నాదినము మించఁబెట్టితిని. పుంజ యీదినమున జరుగుచున్నది.

విదూ—ఈదానము విచారముతోఁ జేయఁబడినట్లు కనఁబడు చున్నది. (జనాంతికముగా) రదనికా ! ఏమిచేయుదురు ?

చేటి—(అపవారించి) వసంతసేన కిచ్చుట కేమియున్నదని యజమానుఁడు సంతాపించునని యమ్మగారు నీచేతికిచ్చి తనభర్తను ఋణవిముక్తునిఁ జేయఁదలఁచి యిది యిచ్చుచున్నది. కాఁబట్టి పుచ్చుకొనుము.

బ్రాహ్మణి—ముత్యాలహారము జలములోఁ బుట్టినదగుటచేతను, నీవు దుర్లభుఁడవగుటచేతను యథావిధిగా నియ్యకపోతిని. పుచ్చుకో! (ఇచ్చుచున్నది.)

విదూష—(తీసికొని) అదియంతయు నటుండనిమ్ము- నీ వేడ్చుచున్నట్లు కనఁబడుచున్నావే.

బ్రాహ్మణి—దేవగృహమందలి పొగచేతఁ గన్నులనీరువచ్చుచున్నది.

విదూ—అమ్మా ! నీవబద్ధముచెప్పినపక్షమునఁ బూజ్యుఁడైన చారుదత్తునితోఁ డేసరి!

బ్రాహ్మణి—అయ్యో ! (అనినిష్క్రమించుచున్నది.)

విదూ—ఈమె నోటితో దుఃఖములేదని కప్పిపుచ్చి కన్నీటితో సూచించుచుఁ బోవుచున్నది. (సమీపించి) ఓయీ ! ఇదిగో !

చారు—ఏమిటిది ?

విదూ—తుల్యగుణసంపన్నురాలైనభార్యనుస్వీకరించినఫలము

చారు—ఏమి ! నాయిల్లాలు నాయెడ జాలి బూనినదా ?

విదూ—అటువంటిదె.

చారు—ఛీ! నాజన్మమెందుకు? నేనీదినమున మృతినొందినట్లె.

తే. గీ. నేను ధనసంక్షయంబున దీనుఁడ నయి
స్త్రీ ధనముచేత నకట ! రక్షితుఁడ నైతి;
నర్థముండెనా పూరుషుం డగును బడఁతి;
ధనము లేకున్న మగవాఁడు తరుణియగును.

విదూష.—అమ్మగారు దీనిని గ్రహింపుమని మనసార నిన్ను వేడుకొనుచున్నారు. నేనును దలవంచి నతిచేసి వేఁడుచున్నాను. దీనిని బుచ్చుకొనుము.

చారుద.—అలాగె ! (పుచ్చుకొని) మిత్రుఁడా ! ఈముక్తావళిఁ బట్టుకొని వసంతసేనకడకుఁ బొమ్ము.

మ. ధనమున్నప్పుడు సౌఖ్యముల్ బడసి చిత్తంబైనటుల్ నేఁడు స్త్రీ
ధన మాసించెడు నామనోరథము విత్తంబెల్లఁ గోల్పోయియుం
టను, గార్హ్యాచరణంబునందు నభిమానంబందు నే మందవ
ర్తనుఁడ న్గావున మాటలేల? కులము న్దారిద్ర్యముఁ నింద్యముల్.

విదూ.—అహా! తక్కువవెలగలసువర్ణభాండకమునకు బదులుగా నూఱువేలువెలగల ముత్యాలహార మియ్యవలసివచ్చెను.

చారు.—మిత్రుఁడా ! అలాగనవద్దు.

క. ఏవిశ్వాసము మనయెడ
నావెలపూఁబోడి నిలిపి యానగ నిడెనో,
యావిశ్వాసమునకు ము
క్తావళి మూల్యంబు నమ్మికకె యీవచ్చుఁ.

(అందఱునిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

# చారుదత్త నాటకము.

## చతుర్థాంకము.

(అప్పుడుత్కంఠగల వసంతసేనయు, కుంచెయుఁ గరుండముఁ జిత్రఫలకముఁ బట్టుకొని చేటియుఁ బ్రవేశించుచున్నారు.)

వసంత—ఓసీ! ఇది యచ్చముగ నతనినే బోలియున్నది.

చేటి—ఆహా స్త్రివిముద్దకోలాహలమున నేనెంతో యాదరము గలదృష్టితో దూరముననుండి యీయనను జూచితిని. అచ్చముగా నిట్లేయున్నాఁడు.

వసం—భోగమువాండ్రు మంచిదిట్టరులని లోకమునం బరివాదముగలదు. నీవిప్పు డబద్ధమాడి యాపరివాదమును నిజముచేయుచున్నావు.

చేటి—అదేమిటి? భోగమువాండ్రందఱు దిట్టరులన్నమాటేమిటి? చూడు! సంపంగితోఁటలో వేఁపచెట్లు బుట్టుచున్నవి. అది యచ్చముగ నతనియట్లే యున్నదని నాహృదయము మిక్కిలిసంతసించుచున్నది. కామదేవుఁడు నిజముగాఁ గొనియాడఁబడుచున్నాఁడు.

వసం—సఖీ! సఖీజనము నన్నుఁ బరిహసింపకుండఁ జేసికొనియెదను.

చేటి—అదిమంచిదే. భోగమువాండ్రకుఁ జెలికత్తెవల్లనే సవతిపోరు.

(అప్పుడు నగలఁ బట్టుకొని మఱియొకచేటిప్రవేశించును)

ద్వితీయచేటి—వసంతసేనా! నీకు శుభమగుఁగాక.



వసంత—ఓసీ! నీకు స్వాగతము.

ద్వితీచే_ అజ్జుకా! అమ్మగారు నిన్నిటు లాజ్ఞాపించుచున్నారు "పౌష్కరపరివహణము మరలింపఁబడి. ద్వారముకడనున్నది. నీవు త్వరగా నగలఁబెట్టుకొని మేలిముసుఁగుదాల్చి రావలసిన" దని ఇవిగో ఈనగలు నీవలంకరించుకొనుము.

వసంత.__ఈనగలు చారుదత్తుఁడు పంపినవా?

ద్వి-చేటి__ఈయలంకారములఁ బంపినయతఁడు రాజస్యాలకుఁడైన సంస్థానకుఁడు.

వసంత__ఓసీ! నీతిమాలినదానా! ఆవలకుఁ బోవే.

ద్వి-చేటి__అనుగ్రహింపుమమ్మా! అనుగ్రహింపుము. మీయమ్మసందేశము నెఱిఁగించినాను గాని వేఱొకటి గాదు. (అనికాళ్ల మీఁదఁబడుచున్నది.)

వసం__లెమ్మా. లెమ్మా. నాకు నీపైఁగోపములేదు. ఆచెడురాయభారముమీఁదఁగోపము.

ద్వి-చేటి---నే నమ్మగారితో నేమనిచెప్పుదును?

వసం__ఆర్యచారుదత్తునితో నెప్పుడు గలసికొందునో యప్పుడు నేనలంకారములు ధరింతునని యమ్మతోఁజెప్పు.

ద్వి-చే__ఆలాగే! (నిష్క్రమించుచున్నది)

(అప్పుడు సజ్జలకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సజ్జ---

తే. గీ. నిద్దురను జీఁకటిభయంబు నేను విడిచి
నింద్యకర్మంబు సలిపితి నిన్న రేయి
బద్ధకముచేత వరువాత బడలి యుండి
పగటిచంద్రుఁడటు కాంతిబాసి యుంటి.

అదృష్టవశమున నాపనిముగియునప్పటికి బల్లునదెల్లవాఱినది. వసంతసేనపరిచారికయగుమదనికను నేను వెలకుఁగొనుటకుఁగా నీపనిచేసితిని.

(నడచి) ఇదే! వసంతసేనయిల్లు లోపలికిఁబోయెదను. (ప్రవేశించి) మదనిక లోపలియింటనున్నదికాఁబోలు! కాకపోయినను బోగము వాండ్రు పూర్వాహ్ణమందు లోపల నేయుందురు. అందువల్ల నామె యక్కడనే యుండవచ్చును. పిలచెదను. మదనికా! మదనికా!

చేటి—(విని) ఈస్వరము సజ్జలకునిదివలెనే యున్నది. అజ్జుక పనిమీఁద నున్నది. అందుచేత దగ్గఱకుఁబోయెదను. (సమీపించి) ఇదిగో వచ్చితిని.

సజ్జ—ఇటు రా.

చేటి—ఏమిది? నీవేల వెలవెల బోవుచున్నావు?

సజ్జ—లేదు. ఒకసంగతి నీకుఁ జెప్పఁదలఁచుకొన్నాను

వసం—ఓసీ! ఈచిత్రఫలకమును మంచముమీఁదఁ బెట్టు. (చూచి) దిక్కుమాలినదానా! ఎక్కడకువెళ్లినావే? బహుశఃదగ్గఱనే యుండవచ్చును. అయినను నే నామెఁజూచెదను (నడచిచూచి) అమ్మో ఎవఁడోమనుష్యుని మిక్కిలిప్రేమగలచూపులతో నీమె త్రాగివేయు నట్టు చూచుచున్నది. అతనితో మాటలాడుచున్నది. దీనిని దనకు విక్రయింపుమని యాచించుచున్నపురుషుఁ డితఁడేయని యూహించు చున్నాను

సజ్జల—ఇది రహస్యము విను.

వసం—ఇతరుల రహస్యములు వినుట తగ్గయుక్తముగాదు. నేను వెళ్ళెదను.

సజ్జ—వసంతసేన

వసంత—ఆకథ నన్నుఁగూర్చియే ఏమైయుండునో వినియెదను (మరలవచ్చును)

సజ్జ—ఆమె నిన్ను నాకు విక్రయించునా?

వసం—అతఁడే యితఁడు కాఁబోలు! వినియెదను.

చేటి—సజ్జలకా! నన్నిచ్చెదనని యామె మొదటనే జెప్పినది.

సజ్జ—అట్లయిన దీనిని దీసికొనిపోయి యామెకిచ్చి యీలాగునఁ జెప్పుము.

తే. గీ. చెలువ! నీశరీరము కొల్చి చేసినట్లె
యున్న దీయలంకారంబు చెన్నుమీఱ
మిగుల వెల్లడిసేయంగఁ దగదు గాని,
తాల్పవలయు నాపైఁబ్రేమ దప్పకుండ.

చేటి—ఏదీ? చూచెదను.

సజ్జల—పుచ్చుకో! చూడు. (చూపుచున్నాఁడు.)

చేటి—ఈనగ మునుపెక్కడో చూచినట్లున్నది.

వసం—ఈనగ నాదిలాగున్నది.

చేటి—చెప్పుచెప్పు. ఇది యెట్లువచ్చినది?

సజ్జ—నీమీఁద ప్రేమచేత సాహసము జేసినాను.

ఇద్దఱు—అమ్మ! ఎంతసాహసుఁడు

చేటి—(తనలో) వీనివైఖరి దారుణకర్మచేత వసంతసేనకు భయంకరముగాఁ దోఁచవచ్చు. (ప్రకాశము) అయ్యో! నానిమిత్తము నీశరీరము నీచరిత్రము రెండునుగూడ సంశయింపఁ దగినవైనవి.

సజ్జ—పిచ్చిదానా! లక్ష్మి సాహసమునందే యున్నది.

చేటి—నీవు మూర్ఖుఁడవు ఎవఁడు ప్రాణములచేత శరీరమును క్రియ మునకుకొనును? ఈవిశ్వాసవంచన మెవ్వనియింటఁ జేసితివి?

సజ్జ—ఉదయమందు నేనిట్లు విన్నాను. బేహారులు వసించు చత్వరమున సార్థవాహపుత్రుఁడైనచారుదత్తుఁడు కాపురమున్నాఁడు

ఇద్దఱు—ఊఁ

సజ్జ—ఓసీ!

తే. గీ. జాతె నంగపాటవము విషాదమునను
గన్నుఁగవ వికాసమునొందెఁ గలఁతచేత
నమ్ముదెబ్బ మైనాటినహరిణివోలె
మేను వడకంగ నిటు జాలిబూనె దేల?

చేటి—నిజముచెప్పు. సార్థవాహగృహమందు సాహసము జేసి నాననుచుంటివి. కులపుత్రు నెవ్వనినైన నచ్చట శస్త్రముతో గొట్టుటగాని చంపుటగాని జరిగించితివా?

వసం—బాగు! నేనడుగవలసిన మాట నీమె యడిగినది.

సజ్జ—మదనికా? ఇది చాలదా! ఇంక రెండవదుష్కార్యము గూడఁ జేయవలెనా! అక్కడ నెవ్వరు శస్త్రముతోఁ గొట్టఁబడలేదు. చంపఁబడలేదు.

చేటి—సజ్జలకా! నిజమేనా?

సజ్జల—సత్యమే.

చేటి—బాగు సజ్జలకా! ఇది నాకుఁ బ్రియము.

సజ్జ—ఏమి ఏమిటి! ప్రియమనుచున్నావు! మదనికా ఇటువంటి పనితగునా!

మ. జననంబందితి నుత్తమంబయినవంశంబందు నీమీఁద బె
ల్లనురాగంబునఁజేసి చేసితిని దుర్వ్యాపారముం గాఁచుకొం
టిని బుష్పాస్త్రగృహీతమాతనువు తన్వీ! యేమి మోకాని య
న్యునితోఁ బోవఁదలంతు వీవు సఖు నన్ను జాల నిందించుచున్

చేటి—సజ్జలకా! విను. ఈనగ వసంతసేనది (చెవిలో)-ఈలాగు

సజ్జల—ఆలాగా?

ఆ. వె. ఎఱుక లేక తొల్లి యేకొమ్మయాకుల
నొలిచివైచినాఁడఁ దలఁకు లేక

నా[శ్రయించినాఁడ నాచెట్టునీడనే
మేను గీష్మతప్త మైనకతన.

వసం—తప్తమనుచున్నాఁడు ఈమాటచేత నితఁడు దుష్కార్యము జేసినాఁడని తలంచెదను.

సజ్జ—అట్లయిన నేమి కర్తవ్యము.

చేటి—అక్కడికేఁబోయి మరల నిచ్చిరా వసంతసేన దీనిఁదాఁచదు.

సజ్జల—ఇప్పుడతఁడు దొంగయని కోపమున నన్నుఁబట్టుకొని రాజపురుషుల కప్పగించునేమో? అప్పు డేమిచేయుదును?

చేటి—భయపడకుము! భయపడకుము! అతఁడు కులపుత్రుఁడుగదా? సద్గుణములకు సంతోషించును.

వసం—బాగు! కళ్యాణీ! బాగు. ప్రత్యుత్తరమిచ్చుటకు వీలు లేనట్లు బలికితివి. ఈమాట నీనోటికలంకారముగా నున్నది.

సజ్జ—ఏమైననుసరే! నే నిక్కడకు వెళ్ళఁజాలను.

చేటి—ఇదిగో మఱియొకయుపాయము జెప్పెదను.

వసు—ఇవే బోగమువాండ్రిగుణములు.

సజ్జ—మరియొకయుపాయ మేది?

చేటి—మావసంతసేనయు సార్థవాహపుత్రుఁడును నిన్నెఱుఁగుదురా?

సజ్జ—ఎఱుఁగను.

చేటి—అట్లయిన నీయలంకారమును సార్థవాహపుత్రుఁ డిమ్మనినాఁడని వసంతసేనునకు మరల నిచ్చివేయుము. ఇట్లు చేసినయెడల నీవు సంరక్షింపఁబడుదువు. ఆయనగారును నిర్విచారుఁడగును. నాకును మనస్సులో బాధయుండదు కాన నీవజ్జుకను వంచించితివేని మరల దాస్యభావమే వచ్చును.

సజ్జ—మదనికా! సంతోషించితిని.

వసం.—కానీ! లోపనికిఁబోయి కూర్చుండెదను.

(అట్లు చేయుచున్నది.)

చేటి—సజ్జలకా రమ్ము. కామదేవగృహమునందు నాకొఱకె దురుచూచుచుండుము. నేను సమయముగనిపెట్టి యామెకు నివేదించెదను.

సజ్జ—మంచిది (నిష్క్రమించుచున్నాఁడు)

(అప్పుడు మఱియొకచేటి ప్రవేశించుచున్నది.)

ద్వితీయచేటి—వసంతసేనా! నీకు సుఖమగుఁగాక! సార్థవాహపుత్రునిదగ్గఱనుండి నిన్నుజూచుట కెవ్వరో బ్రాహ్మణుఁడు వచ్చినాఁడమ్మా!

వసం—(ఆదరముతో) వెళ్ళి యాయనను ద్వరగాతీసికొనిరా

ద్వితీ—ఆలాగే! (సమీపించి) అయ్యా! రండి. రండి.

(విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విదూ—(అంతటఁజూచి) ఓహో! ఏమి, వేశ్యవాటికయొక్క శోభ? నానాపట్టణములనుండి వచ్చినపండితులు పుస్తకములఁ జదువుచున్నారు. పలుతెఱఁగులైన వంటకములు సిద్ధముజేయఁబడుచున్నవి. వీణలు మ్రోఁగుచున్నవి. కంసాలులు నానావిధములైనయాభరణములను నిర్మించుచున్నారు.

ద్వితీయ—ఇదిగో! వసంతసేన! దగ్గఱకురండు.

విదూ—(సమీపించి) నీకు శుభము.

వసం—అయ్యా! మీకు స్వాగతము. సఖీ! ఆయన కాసనమువైచి పాదోదకమిమ్ము.

విదూ—భోజనముదప్ప దక్కినవన్నియు దీసుకరావచ్చును.

ద్వితీయ—అమ్మా! అట్లె చేసెద. (నీళ్లు, ఆసనమునిచ్చుచున్నది.)

వసం—అయ్యా! కూర్చుండుఁడు.

విదూ—(కూర్చుండి) వసంతసేనా! నీవుగూడఁ గూర్చుండుము. నేనొకసంగతిఁ జెప్పఁదలఁచుకొన్నాను.

వసం—(కూర్చుండి) సావధానముగ నున్నాను.

విదూ—నీవు మాకడ దాఁచిననగ వెలయెంత?

వసం—మీర లెందుకడుగుచున్నారు?

విదూ—విను. పూజ్యుఁడైనచారుదత్తుని గుణములయందు నీకుఁగలనమ్మకముఁ దెలియఁజేయుటకు నీ వానగ నాయనయొద్దదాచితివి. అతఁడు జూదమాడి దానినోడిపోయెను.

వసం—జూదమందా! బాగున్నది. తరువాత. తరువాత?

విదూ—తరువాత నానగయొక్క వెల యింతయుండునుగనుక నీముక్తావళి నీవు గ్రహింపుము.

వసం—(తనలో) ఛీ! దిక్కుమాలినవేశ్యాభావము. నేను పిసినిగొట్టునని యాయన తేలికజేయుచున్నాఁడు. నేను దీనిని నిరాకరించుట తప్పు. (ప్రకాశముగా) ఇయ్యనయ్యా!

విదూ—ఇదిగో! పుచ్చుకో.

వసం—(పుచ్చుకొని) 'అంగీకరించిన'దనియాయనతో జెప్పండి.

విదూ—(తనలో) ఈమె యొక్కయుపచారవాక్యమైనఁ బలుకకుండఁబుచ్చుకొనినదే. (పైకి) ఆలాగే. (ఇచ్చివెళ్లిపోవుచున్నాఁడు.)

వసం—బాగు చారుదత్తుఁడా! బాగు. అదృష్టముపోయినదశయందవమానములేకుండ మానముఁగాపాడుకొంటివి.

(మదనిక ప్రవేశించును.)

మద—వసంతసేనా! సార్థవాహపుత్రునిదగ్గఱనుండి యొకమనుష్యుఁడు వచ్చినాఁడు. నిన్ను జూడఁగోరుచున్నాఁడు.

వసం—ఇదివఱకుఁజూచినవాఁడా? క్రొత్తవాఁడా?

మద—కాదు. అతనివాఁడె యని తోఁచుచున్నది.

వసం—వెళ్లి యాతనిని దీసికొనిరమ్ము.

మద—ఆలాగే. (అని వెళ్లుచున్నది.)

వసం—అహో! ఏమి యీదినమెంతరమణీయముగానున్నది.

(అప్పుడుసజ్జలకునితోఁగూడ మదనికప్రవేశించును.)

సజ్జ—(తనలో) ఆత్మశంక మిక్కిలి కష్టముగదా!

మ. ఎవఁడేనిం జకితాత్ముఁడై నడచిన న్వీక్షించిన న్వేగ న
న్నెవఁ డే సంభ్రమవృత్తిడగ్గరిన నందే నిల్చినన్ నామనం
బని యెల్ల న్ననుఁగూర్చియే యనుచు నూహల్ సేయు నౌ రౌరమా
నవుఁడెందున్ దనచేయుతప్పువలనన్ దాశంకితుండౌఁ జుమీ.

మద—అదుగో! వసంతసేన; దగ్గఱకుఁ బొండు.

సజ్జ—(సమీపించి) నీకు సుఖమగుఁగాక!

వసం—అయ్యా! మీకు స్వాగతము. చేటీ! ఆయన కాసనము వేయుము.

సజ్జ—సరే! సరే! ఆసనము వేసినట్టే. తొందరతోఁ జేయవలసినకార్య మొకటియున్నది.

వసం—ఆలాగా! చెప్పవలసినదేమో చెప్పుఁడు.

సజ్జ—ఆర్యచారుదత్తుఁడు నన్నుఁబంపినారు. “నీవు మాచేతి కిచ్చిన నగ మరమ్మతులు మొదలగునవి లేకపోవుటంజేసి మలినమై మాయిల్లు కట్టుదిట్టముగా నుండనందున సంసారులు రక్షింపఁజాలరు. అందుచేత నీసొమ్ము తీసికొనవలసినదని యాయనచెప్పుమన్నారు.

వసం—దీనిని మీరుమరల చారుదత్తునకే యిచ్చిరండు.

సజ్జ—నే నక్కడకుఁబోను.

వసం—నే నెఱుఁగుదును. ఆయనయింట్ల సాహసము జేసి మీ

రీనగఁ దెచ్చితిరి. మీరాయనగుణములనుగుఱించి జాలిపడుదురుగాక!

సజ్జ—(తనలో) ఈనాసంగతి నెట్లు గ్రహించినదో!

వసంత—ఎవరక్కడ? ఈయన కొకబండిఁ దీసికొనిరా.

మదని—బండిచప్పుడువలె నున్నది. బండివచ్చియుండును.

వసంత—(తననగ మదనికకుఁబెట్ట) అయ్యా! ఈపూజ్యురాలితోఁగలసి బండి నెక్కుఁడు.

మద—అమ్మా! యిదేమిటి?

వసం—వద్దు. అలాగనవద్దు. ఓసీ! నీవీయనచెట్టఁబట్ట పూజ్యురాలవైతివి. ఈమెను మీరు గ్రహింపుఁడు.

(అని మదనికచేయిపట్టుకొని యాతని కప్పగించుచున్నది.)

సజ్జ—(తనలో) అహో! ఈమె కెప్పుడు నేను ప్రత్యుపకారము సేయఁగలుగుదును? పాపము శమించుఁగాక! శమించుఁగాక!

తే. గీ. అవనిఁ బ్రత్యుపకారార్థియైననరుఁడు
తత్ఫలము నొందెడును విపత్సమయమందు,
నతనికైన నీమెకునైన నరులవలన
హాని గలిగెనా యుపకార మాచరింతు.

(సజ్జలకుఁడు మదనికతోఁగూడ నిష్క్రమించును.)

వసం—చతురికా!

చేటి—ఇదిగో వచ్చితిని.

వసం—మేలుకొనియే కలగంటిని. ఈలాగు.

చేటి—ఇది నాకు మిక్కిలిప్రియము. అమృతాంకనాటకమయినది.

వసం—రా! ఈయలంకారములఁ దీసికొని మనము చారుదత్తునొద్దకుఁ బోవుదము.

చేటి — ఆలాగేనమ్మా! ఈదిన మభిసారికాసహాయభూతమైన దుర్దినమైనది.

వసం — దిక్కుమాలినదానా! నీవక్కడకురావే.

చేటి — రావమ్మా! రా!

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది చతుర్థాంకము.

చారుదత్తనాటకము-సమాప్తము.

శ్రీరస్తు.

# ప్రతిజ్ఞాయౌగంధరాయణము

## ప్రథమాంకము.

(నాంద్యంతమందు సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూత్ర.—

తే. గీ. ప్రోచు వాసవదత్తాపరిభావుఁ డమర
సేవ్యుఁ డతిబలాఢ్యుఁడు మహాసేనుఁ డెపుడు
వత్సరాజునామమునకుఁ బ్రబలశక్తి
ధరుఁడు యౌగంధరాయణుఁ డరసి మిమ్ము.

(నడచి తెరవంకఁ జూచి) ఓసీ! యిటురా.

నటి—(ప్రవేశించి) అయ్యా! యిదిగో వచ్చితిని.

సూత్ర—ఓసీ! దేనినిగురించియైనఁ బాడుము. రంగస్థలము సంగీతముచేతఁ బ్రసన్నమైనవెనుక మేమును బ్రయోగ మారంభింతుము. ఓసీ! ఏమి టాలోచించుచున్నావు? పాడుదువా?

నటి—అయ్యా! చుట్టాలయింటిలో నెవరికో జబ్బుగా నున్నట్లు నే కలగంటిని. కుశలము నెఱిఁగివచ్చుట కెవరినైనఁ బంపవలయునని కోరుచున్నాను.

సూత్ర—మంచిది.

తే. గీ. మనకు హిత మాచరింప సమర్థుఁడైన
పురుషు నొక్కనిఁ బంపెదఁ బూవుఁబోఁడి!

(తెరలో)

సాలకా! నీవు సిద్ధముగ నుంటివా ?

సూత్ర —

రాజసచివుండు యౌగంధరాయణుండు
పురుషు నొక్కనిఁ బంపినపోల్కి నిపుడు.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది స్థాపన

(అప్పుడు సాలకునితోఁగూడ యౌగంధరాయణుఁడు
ప్రవేశించుచున్నాఁడు.)

యౌగం — సాలకా ! నీవు సిద్ధముగ నుంటివా ?

సాల — చిత్తము.

యౌగం — చాలదూరము పోవలయునే !

సాల — మహత్తరమైనస్నేహముచేత దేవరవారిని సేవించెదను.

యౌగం — అట్టి మనశ్శక్తి గలబలాఢ్యుఁడే వెళ్లఁగలఁడు.
ఎందుచేత ననఁగా-

తే. గీ. స్నేహితుల నమ్మి కార్యంబు జేయఁ బనుప
వారిసామర్థ్యమునుబట్టి భక్తి బుట్టి
కార్యములు వెంటనే సిద్ధిఁ గాంచవచ్చు
దైవవశమునఁ జెడవచ్చు దాని కేమి !

తరువాత వేణువనాశ్రితము లైనగహనములయందలి నాగవనమునకు
రేపు స్వామియైనవత్సరాజు పోఁదలఁచుకొనియె. ముందుగానే యా
యనను సంభావింపవలెను.

సాల — అయ్యా! దేనియందుఁ గార్యశరీర మంతయు నాయ
త్తమైయున్నదో నట్టిమీలేఖయే నన్నక్కడకుఁ దీసికొనిపోఁగలదు.

యౌగం — విజయా !

విజయ—(ప్రవేశించి) అయ్యా ! ఇదిగో వచ్చితిని.

యౌగం---విజయా! కంకణమును జాబును వేగముగాఁ దీసి కొనిరమ్ము.

విజయ---అయ్యా ! చిత్తము. (నిష్క్రమించును.)

యౌగం---ఆమార్గమును నీవు మున్నెప్పుడైనఁ జూచితివా ?

సాల---లేదు వినియుంటిని.

యౌగం---అదియును బుద్ధిమంతులలక్షణమే. ఓరీ వనగజము లనడుమ మాటుపడినశరీరముగల యొకనల్ల యేనుఁగు గలదనిచెప్పి ప్రద్యోతమహారాజు మనప్రభువును మోసపుచ్చఁ దలఁచుకొన్నాఁడని యొకప్రవాదము మాచెవిసోఁకినది. రాజుగారీపాటికే బుద్ధిపొరపాటుపడియుండరుగద ! ఆహా ! ప్రద్యోతమహారాజునకు వత్సరాజనిన నెంతభయమో ? అతని యక్షౌహిణుల దౌర్బల్యముఁగూడ నిందువలనఁ దేటవడుచున్నది. ఏలయన,

చ. అతనిబలంబు పెద్దదియెయైనను గాదది యేకకార్యదీ
క్షిత మనురక్తియుం గన మొకించుక లెక్కకువచ్చుశౌర్యసం
గతులును లేరు యుద్ధమగుకాలమున న్నిమిష మేదొ బెట్టి భూ
పతి కనురాగశూన్యమగువాహిని మక్కువలేనిభార్యసూ.

విజయ---(ప్రవేశించి) ఇదిగో జాబు. కంకణము సర్వవధూజనములహస్తములనుండి త్వరలో వచ్చునని మహారాజుగారితల్లి సెలవిచ్చినది.

యౌగం--సర్వవధూజనహస్తములనుండియైనను సరే యొక స్త్రీ సిద్ధముజేసినను సరే ఏదోయొకతోరము పంపవలయునని మహారాజుగారితల్లితో మనవిజేయుము.

విజ—చిత్తము. (నిష్క్రమించును.)

(అప్పుడు నిర్ముండకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నిర్ముండ—అయ్యా ! సుఖమగుఁగాక !

యౌగం—ఏమిా! నిర్ముండకుఁడా ?

నిర్ముంఐ—య్యా! మహారాజుగారి సన్నిధానవర్తి యగు హంసకుఁడు వారిసన్నిధినుండి వచ్చినాఁడు.

యౌగం—ఎట్టెట్టు! హంసకుఁ డొక్కఁడే వచ్చినాఁడా? సాలకా! ఒక్కముహూర్తము విశ్రమింపుము. నీవు వెంటనేయైన వెళ్లవచ్చును. విశ్రమించియైన వెళ్లవచ్చును.

సాల—అయ్యా! అట్లే చేసెద. (నిష్క్రమించుచున్నాఁడు)

యౌగం—నిర్ముండకా! హంసకునిఁ దోడుకొనిరా.

నిర్ముండ—అయ్యా! చిత్తము. (నిష్క్రమించును.)

యౌగం—మహారాజుగారు లేకుండ హంసకుఁ డొక్కఁడే వచ్చినాడనుటచేత నామనస్సు కలఁతజెందుచున్నది. ఏలయన-

తే. గీ. ఆప్తజనము జబ్బువడ దేశాంతరంబు
నుండి యింటికేగుచు విందునో ప్రియంబు
నప్రియము విందునో యంచు నలమటపడు
నరునిమనసట్లు శంకించు నామనస్సు.

(అప్పుడు హంసకుఁడు, నిర్ముండకుఁడుఁ బ్రవేశించుచున్నారు.)

నిర్ముం—అయ్యా ! రమ్ము, రమ్ము.

హంస—ఆయన యెక్కడ నున్నారు ?

నిర్ముం—ఇదిగో! ఆయన యిక్కడ కూర్చున్నారు. దగ్గఱకుఁ బొమ్ము.

హంస—(సమీపించి) అయ్యా! మీకు సుఖమగుఁగాక !

యౌగం—హంసకా ! ప్రభువువారు నాగవనమునకుఁ బో లేదుగద ?

హంస—అయ్యా! ప్రభువుగారు నిన్ననే వెళ్ళినారు.

యౌగం—అయ్యో! వెనుక సాయము పంపుట నిష్ప్రయోజనముగదా. మనము వంచింపఁబడినారము. అయిన నించుకయాసయుండవచ్చును. ప్రాణము లిప్పుడే విడువఁదగినవి.

హంస—ప్రభువుగారు జీవించియున్నారు.

యౌగం—ప్రభువుగారు జీవించియున్నారనుటచేతఁ గొంత విపత్తు గలిగినట్లర్థమగుచున్నది. ప్రభువుగారు పట్టువడిరా యేమి ?

హంస—మీరు లెస్సగాఁ దెలిసికొంటిరి. ప్రభువుగారు పట్టువడిరి.

యౌగం—ఎట్టెట్టు! ప్రభువుగారు పట్టుబడిరా? అయ్యో! ప్రద్యోతునియదృష్టమున వానికి గొప్పబరువు దిగిపోయినది. నేఁడు మొదలుకొని వత్సరాజుమంత్రుల యసామర్థ్యము నపకీర్తియు వెల్లడియగును. అనుత్పన్నకార్యపండితుఁ డగురుమణ్వంతుఁ డిప్పు డేమైపోయెనో? ఇప్పు డాశ్వికబల మేమైపోయినదో? ఏలయన-

తే. గీ. మాబలము స్నిగ్ధము, కులక్రమాగతము, గు
ణార్జితంబు, వ్యాయామయోగ్యపురుష, మది
వని నశించెనో? లంచము దినెనో ? లేక
చేవ చెడి వైరిచేత నిర్జింపఁబడెనో ?

హంస—ప్రభువుగారు సమగ్రయోధబలపరివారసమన్వితులైనయెడల నిట్టిదోషము సంభవించియుండదు.

యౌగం—ఏమి ! ప్రభువుగా రసమగ్రయోధబలపరివారులైయుండిరా ?

హంస—అయ్యా! చిత్తగింపుఁడు.

యౌగం—నీవు నడచివచ్చుటచేత నలసినావు కూర్చుండుము.

హంస—అయ్యా! చిత్తము (కూర్చుండి) దేవా! చిత్తగింపుఁడు. కొంచెమురాత్రి యుండఁగానే గుఱ్ఱమెక్కి. వెళ్ళఁదగినవేళ నినుక

రేవున నర్మదానదిని దాఁటి వేణువనమునందుఁ గళత్రము నుంచి గొడుగుమాత్రమే పట్టుకొని గజయూథమును మర్దించుటకుఁదగిన బలముతో మదయంతికావృక్షములతో నిండినదారింబట్టి ప్రభువుగారు నాగవనమునకుఁ బోయిరి.

యౌగం--తరువాత తరువాత?

హంస---అప్పుడు సూర్యుఁ డమ్మవేటుదూరమునకుఁ బోయి యుండఁగాఁ గొన్నియోజనములు గడచిపోయి మదయంతీపర్వత మొక క్రోసుదూరమున నున్నదనఁగా సరస్సుబురదలోనుంచి లేచి సగమునిర్మింపఁబడిన శిలాకర్మవలె విషమదర్శన మగుగజయూథము మా కగపడెను.

యౌగం—తరువాత తరువాత?

హంస—అప్పుడు సేనలు నిశ్చేష్టులై చూచుచుండ గజయూథము సముత్పన్నశంకాపండితముకాఁగా నీయనర్థమునకుఁ గారణమైన యొకపదాతి ప్రభువుగారిని సమీపించెను.

యౌగం—ఉండు. ఇక్కడకు క్రోసుదూరమున మల్లికాలతల చేత శరీర మగపడకుండఁ గప్పఁబడి గోళ్ళు దంతములు లేక యొడలంతయు నొక్కమచ్చునే నల్లగానున్న యొకయేనుఁగు మాకుఁ గనఁబడినదని చెప్పరాదా?

హంస—మీరు చక్కఁగాఁ దెలిసికొన్నారే! ఈదోషము జాగ్రదవస్థయందే పుట్టినది.

యౌగం——హంసకా! ఎంతజాగ్రత్తగా నున్నను విధి మహాబలవంతుండు గదా? తరువాత తరువాత?

హంస——తరువాత నూఱుబంగారునాణెములు దానముచేసి యాదురాత్ముని బ్రభువుగారు సన్మానించి యిట్లనిరి. "హస్తిశిక్షా శాస్త్రమునందు నీలవనవలయుత్తమమునవేసుగల గజవర్తివర్తికలవని

చదివితిమి. కావున మీ రీయూథము విషయమున నప్రమత్తులై యుం డునది. నేను వీణాద్వితీయుఁడనై యాగజమును బట్టి తెచ్చెదను.

యౌగం.—అప్పుడు రుమణ్వంతుఁడు స్వామివిషయమున ను పేక్షచేసెనా యేమి?

హంస.—లేదులేదు. ప్రభువుగారిని బ్రసన్నులంజేసి యా యమాత్యుఁ డిట్లు మనవిచేసెను. "స్వామీ! ఐరావణాదిదిగ్గజముల గ్రహణముగూడ మీకు సముచితమైనదే. అయినప్పటికి దేశాంతర ములు దురాదక్షతచేత దోషభూయిష్టము లైయుండును. అక్కడ సరిహద్దులలోనున్నజనులు సిగ్గులేనివారు సత్కులీనులుగారు. అందు చేత నీయూథమును పదాతిమాత్రాధిష్ఠితముఁ జేసి మనమందఱము వెళ్లుదము. మీరొక్కరు మాత్రము వెళ్ళవద్దు."

యౌగం.—రుమణ్వంతుఁ డట్లు మహాజనసమక్షమునందే ప్రభువుగారితో మనవిచేసెనా? ఎంతస్వామిభక్తి యున్నను నందఱి యొద్ద నట్లనఁగూడ దని నేఁదలఁచుచున్నాను. తరువాత దరువాత?

హంస.—తరువాతఁ బ్రభువువారు తమప్రాణము మీఁదనొట్టు బెట్టుకొని మంత్రిని వారించి నీలవలాహకమనునేనుఁగు మీఁదినుండి దిగి సుందరపాటల మనుగుఱ్ఱమునెక్కి ప్రొద్దు రెండుజాములు గాక మును పిరువదిమందిపదాతులను వెంటఁబెట్టుకొని వెళ్ళిరి.

యౌగం.—విజయముకొఱకు. అయ్యో! యెంతకష్టము దాని మీఁదినుక్కువచేత వెనుకటివృత్తాంతముఁ దలంపలేకపోయిరి. తరు వాత తరువాత?

హంస.—తరువాత రెండురెట్లుదూరము నడచి సాలవృక్ష చ్ఛాయయందు సమానవర్ణము గలుగుటచేత నల్లదనము గనఁబడక శరీరము లేకుండ నంతరాళమందే యమర్పఁబడినవా యనునట్లు మె ఱయుచున్న దంతములచే సూచింపఁబడుచు, నూఱువిండ్లదూరమున నై రావతసమానమగునాగజము కనఁబడెను.

యౌగం.—హంసకా! గజముకాదు పోకుఁ గనఁబడినది. మనపరితాపమని చెప్పు. తరువాత తరువాత?

హంస.—తరువాత ప్రభువుగారు గుఱ్ఱము దిగివచ్చి దేవతలకునమస్కరించి వీణ బట్టుకొనిరి. అప్పు డేదోయొకసంకేతమువలె నొకగొప్పధ్వని వినఁబడినది.

యౌగం.—ధ్వనియా? తరువాత తరువాత?

హంస.—తరువాత మే మాధ్వనిఁ దెలిసికొనుటకై చుట్టు మూఁగితిమి. అప్పుడు మావటీఁడు మొదలగుమహాయుధపాణులచే నధిష్ఠింపఁబడి యామాయాగజ మెదురుగా వచ్చెను.

యౌగం.—తరువాత తరువాత?

హంస.—అంతట మనప్రభువుగారు. కులపుత్రజనమును నామగోత్రగ్రహణములచేతనూఱడించి "యిది యెల్లవిధములఁ బ్రద్యోతునిమాయాప్రయోగమే. నావెంట రండు. శత్రువులమోసపుపన్నుగడను నేను పరాక్రమముచేతఁ జక్కఁబఱచెద"నని గంభీరముగఁ బలికి పరబలముఁ బ్రవేశించెను.

యౌగం.—ప్రవేశించెనా? ఔను! అదే మంచిది.

తే. గీ. చెనటిదాయలచేత వంచింపఁబడిన
మానధని సిగ్గుపడి సత్వ మూనుటొప్పు
నన్యగతిఁ గన్బడనిసమయంబునందు
నిట్టిపని గాక శూరుఁ డింకేమి సేయు?

తరువాత తరువాత?

హంస.—తరువాత దనమనోగత మెఱిఁగి వర్తించుచున్న సుందరపాటలమునెక్కి యాడుచున్నవాఁడు వోలెఁ దా ననుకొన్న జనముకంటె నెక్కువమందిం జంపి పరబలము మిక్కిలి మెండగుటచే విశేషవ్యూహమ ప్రయోగముఁ జేయుచుఁ దనపరిజనము నట్టను

కాఁగా నేనొక్కఁడనే సంరక్షించుచుండ—కాదు కాదు—తన్నుఁ దానే రక్షించుకొనుచు దినమంతయు నెడ తెగక యుద్ధముచేయుటచేత పరిశ్రాంతుఁడై యనేకప్రహారములచేత గుఱ్ఱము నేలఁగూల, ప్రచండసూర్యాతపసమయమున స్వామి మూర్ఛిల్లెను.

యౌగం—ఎట్టెట్టు! ప్రభువుగారు మూర్ఛనొందిరా? తరువాతఁ దరువాత?

హంస—తరువాత దగ్గఱయడవులలోనుండి యథాశక్తిగా నతికర్కశమైన నానాజాతులలతలఁ బెల్లగించి తెచ్చి సామాన్యపురుషునిబలె శత్రువులు ప్రభువుగారిని బంధించిరి.

యౌగం—ఏమి! ప్రభువుగారిని బంధించిరా?

సీ. పీనాంసములు గల్గి పృథుపర్వములు గల్గి
యిభరాజహస్తసన్నిభము లగుచు,
చాప మాస్ఫాలించునైపుణియును బాణ
సంధానమోక్షణశక్తి గలిగి
బ్రాహ్మణపూజఁ బావనములై మిత్రుల
యాలింగనముల ధన్యతను గాంచి
వలయధారణమున వన్నెకెక్కిన తేని
బాహువు ల్బంధింపఁబడె నె యకట.

తరువాత నెంత సేపటికి మహారాజుగారికిఁ దెలివి వచ్చినది?

హంస—ఆపాపాత్ములదురాచరణము ముగియునప్పటికి.

యౌగం—అదృష్టవశమున శరీరమే యవమానింపఁబడినది. తేజము కాదు. తరువాత తరువాత ?

హంస—అప్పుడు వెండియు స్మృతిగలిగి సప్రభువుగారింజూచి "యీయన మాయన్నం జంపెను. ఈయన మాతండ్రిం గూల్చెను. ఈయన మాకొడుకుం దెగటార్చెను, ఇతఁడు మామిత్రుఁ బొరిగొని

మో" నని ప్రభువుగారిపరాక్రమమును వేఱుభంగిం గొనియాడుచు నాదురాత్ము లాయనకడకుఁ దొందరతో వచ్చిరి.

యౌగం.—తరువాత. తరువాత ?

హంస.—ఆశ్చర్యకరమైనసంగతిమఱియొకటి. ఎవఁడో యొకఁడు దుష్కార్యముఁ జేయఁబూనెను. ఆదురాచారుఁడు ప్రభువుగారిని దక్షిణముఖముగాఁ ద్రిప్పి సమరవ్యాపారముచేతఁ జెదరినతలవెండ్రుకలను నిరుపచారముగాఁ బోగుసేసి చేతఁబట్టుకొని కత్తి నొఱలోనుండియూడఁబెఱికి మిక్కిలి విసురుగా దెబ్బకొట్టవలె నని కొంతదూరము పరుగెత్తికొని పోయెను.

యౌగం.—హంసకా! ఈవృత్తాంతము కొంత నిలుపుము. ఇంతలో నొకసారి యూపిరి బుచ్చుకొనియెదను.

హంస.—తరువాత నప్పు డానృశంసకుఁడు కొన్నెత్తురుచేత జిడ్డుకలిగియున్నయానేలఁ బరుగెత్తునప్పుడు జాఱిపడి ప్రాణములు విడిచెను.

యౌగం.—పాపాత్ముఁడు పడినాఁడా? ఆహా!

తే. గీ. పరబలాక్రాంతమై సుంత భంగపడక
ధర్మసంకరపరివర్జితంబ యగుచు
నతనిచే మున్ను రక్షిత మైనభూమి
నామహారాజు గాపాడె నౌర! యిపుడు.

హంస.—తరువాత మహారాజుగారి మొదటిబల్లెపుఁబోటున మూర్ఛనొంది లేచినప్రద్యోతునిమంత్రి శాలంకాయనుఁడు "వద్దుసాహసముచేయవ"ద్దని యఱచుచు నచ్చోటికి వచ్చెను.

యౌగం.—తరువాత. తరువాత!

హంస.—తరువాత నయ్యమాత్యుఁడు తత్కాలదుర్లభమైన ప్రణామముఁగావించి ప్రభువుగారిశరీరమున నున్నకట్లు విప్పెను.

యౌగం.—ప్రభువుగారికట్లు విడిపోయెనా? బాగు! శాలంకాయనా! బాగు. అవస్థ శత్రువునైనను మిత్రునిఁ జేయునుగదా. హంసకా! నామనస్సు వ్యసనమునుండి కొంచెము మాఱడిల్లిన ట్లున్నది. పిమ్మట నాసజ్జనుఁ డేమిచేసెను?

హంస.—తరువాత నాసజ్జనుఁ డనేకశాంతి వచనముల నుపచారపూర్వకముగాఁ బలికి దెబ్బలు గాటముగఁ దగిలియుండుటచే మహారాజుగారు వాహనముమీఁదఁ గూర్చుండలేరని తాళ్ళతో డోలికగట్టి యందుఁగూర్చుండఁ బెట్టి యాయన నుజ్జయనికిం దోడ్కొనిపోయెను.

యౌగం.—ప్రభువుగారిందోడ్కొనిపోయెనా? ఇదేయనర్థము.

తే. గీ. ఇదె మనకుఁ దిరస్కారమౌటెల్ల నిజము,
దాఁటెఁ బ్రద్యోతునిమనోరథంబు దీన
దురభిమాని మహాసేనధరణివిభుఁడు
కాన మనమహారాజు దుఃఖములఁ గుడుచు.

మఱియు,

సీ. మనమహారా జెట్లు గనునొకో మున్నెప్డు
గణియింపనట్టియాత్మాత లేంద్రు
సిద్ధవాక్యుఁ డితండు చెవి నెట్లు బెట్టెనో
వానియమానుష వాక్యములను
నవిషయవంధ్య మైనట్టియమర్షంబు
నాత్మలో నేరీతి నడఁచుకొనునొ
యాదరంబును గన్న నవమానమును గన్న
బద్ధుండు మొక్కఁగవలయుఁ గాదె.

ప్రతీహారి.—(ప్రవేశించి) అయ్యా! యిదే కంకణము.

యౌగం.—

తే. గీ. అదను దప్పె భాగ్యంబు క్షయంబునొందె
మనప్రయత్నముల్ నిష్ప్రయోజనము లింక
రణము ముగిసినపిదపఁ దురంగమునకు
లలితనీరాజనాది మంగళము లేల?

ప్రతీహారి.—అయ్యా! ఇదిగో ప్రతిసరము.

యౌగం.—విజయా! దీని నుంచుము.

ప్రతీ.—మహారాజుగారితల్లితో నేమని మనవిసేయుదును?

యౌగం.—విజయా! ఈలాగని-

ప్రతీ.—ఏలాగని!

యౌగం.—ఇది- (అని సందేహించుచున్నాఁడు)

ప్రతీహారి.— అయ్యా! చెప్పుఁడు చెప్పుఁడు.

యౌగం.—(తనలో)అయినను నిది పరిహరించుటకు శక్యము గాదు. ఇది యామె కెఱింగించెదను. (ప్రకాశము) విజయా! మనస్సు స్థిరము జేసికొనుము (చెవిలో నేదోచెప్పుచున్నాఁడు.)

ప్రతీ.—అమ్మో!

యౌగం.—ఓసీ ! నీవు విజయవుగద?

ప్రతీ.—మందభాగ్యురాలను ఇంక నేను లోపలికిఁబోయెదను.

యౌగం.—విజయా! ప్రభువుగారు పట్టువడిరని రాజమాతతో నీవు తొందరగాఁ జెప్పవద్దు తల్లిమనసు ప్రేమచే దుర్బలమై యుండును. కావున రక్షణీయ మగును.

ప్రతీ.—అయ్యో! ఇది యెట్లు చెప్పుదును?

యౌగం.—విను-

చ. తొలుతను యుద్ధసంజనిత దోషము లన్నియు నుగ్గడించి శం
క్షల కవకాశ మెంతయినఁ గల్గఁగఁజేయుచు, సంశయార్థముల్

దలకొనుచుండ నాశనము దప్పదటంచు, మనస్సు శోకవి
హ్వాల మగువేళఁ జెప్పఁదగు నంతయు నల్లనఁ గార్యతత్త్వమున్.

ప్రతీహారి—గ్రహించినాను.

(అని నిష్క్రమించును.)

యౌగం—హంసక! నీవిప్పుడు ప్రభువుగారితోఁగూడ నేల వెళ్లవైతివి?

హంసక—అయ్యా! ఆయనతోనుండున ట్లనుగ్రహింపుమని నేను కోరితిని కాని యీవృత్తాంతము కౌశాంబీనగరమునఁ జెప్పవలసినదని శాలంకాయనుఁ డాజ్ఞాపించి నన్నుఁ బంపివైచెను.

యౌగం—అతఁడనుచరునకు నిరాశగలిగింపఁ దలఁచెనా? లేక మిత్రుఁడు ప్రభువుగారికడ నుండఁగూడ దని నిన్నుఁబరిహరించెనా?

హంస—ఔను! మిత్రుఁడగుటచేతనే పరిహరించెను.

యౌగం—అతఁడు విస్మయమువలనఁ దనమనస్సును వెల్లడిసేయుచున్నాఁడు. కాని, సర్వప్రయత్నము సిద్ధియందు రమణీయ మగును. ప్రభువుగారు నాకుఁ జెప్పుమన్న దేమైనఁగలదా?

హంస—అయ్యా! కలదు. నేను ప్రభువుగారికిఁ బ్రదక్షిణము చేసి కన్నులనుండి బొటబొట బాష్పములు రాల వారిసందేశము వినఁగోరి సన్నిధి నిలిచితిని. అప్పుడు ప్రభువుగా రిట్లుచెప్పిరి. "వెళ్ళు యౌగంధ--" (అనిసగముచెప్పి యూరకుండును.)

యౌగం—ఓయీ! అది ప్రభువుగారిమాట గనుక భయము లేదు చెప్పు.

హంస—"యౌగంధరాయునిఁ జూడుము" అని చెప్పిరి.

యౌగం—కాదుకాదు. సమస్తమంత్రిమండలమునువదలిపెట్టి యొక్కయౌగంధరాయణునే చూడుమని. ప్రభువుగారు చెప్పియుందురా?

హంస—చిత్తము.

యౌగం—అందుచేతఁ బ్రతికిప్రియ కన్నర్హునిఁగా-ఏలినవానిసొమ్ముఁ దిననివానినిఁగా-రాజసత్కారము పొందనివానినిఁగా ప్రభువుగారు నన్నుఁదలంచి నన్నుఁజూడుమని చెప్పియుందురుగాఁబోలు!

హంస—దేవరవారే ప్రమాణము.

యౌగం—ప్రభువుగారు నన్నిఁక మాఱువేసమున నుండఁగాఁ జూతురు.

తే. గీ. అరినగరమందొ కారాగృహంబునందొ
కాక వనమందొ శత్రుసంక్షయముఁ జేసి
తిరిగి భూపాలు రాజ్యనిష్ఠితునిఁ జేసి
యతనిప్రక్కను నిల్తు నాప్రతినఁ జూడు.

(తెరలో)

హా! హా! మహారాజ!

యౌగం—(విని)

తే. గీ. ఇదిగో! శోకప్రతీకార మీవిధమున
జరుపఁబడుచున్నది యథాశక్తిగాఁగ
మనుజవిభునిమంత్రిలయసామర్థ్య మెల్ల
స్త్రీలు వర్ణించుచున్నారు చిత్రముగను.

ప్రతీహారి—(ప్రవేశించి) అయ్యా! రాజమాత

యౌగం—ఏమి శేమిటి?

ప్రతీ—ఇట్లు మనవి సేయుమన్నది.

యౌగం—ఏమని?

ప్రతీహా—"సుహృజ్జనసమేతుఁడై పగవారిచేతఁ బట్టువడిన వత్సరాజువృత్తాన్త మిట్లున్నదిగదా! ప్రతివిధానము సేయుటకన్న శక్య మేమున్నది? కావున సుహృజ్జనమును సమ్మానించి కార్యసాధనముచే

యును. ఎవ్వఁడు సంకటములయం దలసిపోవఁడో, విషమగతుఁడయ్యు వెనుకదీయఁడో వంచితుఁడయ్యు నిర్వేదమునొందఁడో, ప్రతీఘాతము లయందున్నైతము ప్రాణములను విడువఁడో యట్టిబుద్ధిమంతుని నేనిప్పు డడుగుచున్నాను. ఎవ్వఁడు నాకుమారునకు మొదట మిత్రుఁడై పిమ్మటనమాత్యుఁడై యుండెనో యట్టి నాపుత్రకుఁడు యట్టినాపుత్రకునిఁ దెచ్చి యప్పగింపవలయు" నని.

యౌగం.—అహో! పూజ్యురాలైనరాజమాత రాజవంశోచితమైనధీరవాక్యమును బలికినది. ఆమెయొక్కబహుమానవాక్యమును నే శిరసావహించుచున్నాను. విజయా! జలముఁదీసికొనిరమ్ము.

ప్రతీహా.—అయ్యా! చిత్తము (అనినిష్క్రమించి మరలఁబ్రవేశించి) ఇదిగో జలము

యౌగం.—తీసికొనిరా! (ఆచమించి) విజయా! ఆపూజ్యురాలేమన్నది?

ప్రతీహా.—నాపుత్రకుఁడు నాపుత్రకునిఁ దెచ్చి యప్పగింపవలయునని.

యౌగం.—హంసక! ప్రభువుగారేమిచెప్పిరి?

హంస.—యౌగంధరాయణునిఁ జూడుమని.

యౌగం.—విజయా!

తే. గీ. చండరాహుగ్రహంబుచేఁ జంద్రుఁడట్లు
పగఱచే నృపాలుఁడు పట్టుబడెడుఁగాక!
సరగఁ జెఱనుండి విడిపింపఁ జాలనేని
నాలకింపు యౌగంధరాయణుఁడఁ గాను.

ప్రతీ.—అయ్యా! అట్లె (నిష్క్రమించుచున్నది.)

నిర్గుండకుఁడు.—(ప్రవేశించి) అయ్యా! ఆశ్చర్యము జరిగినది. ప్రభువుగారికి శాంతినిమిత్తము జరిగినసంతర్పణములో భోజన

ము సేయుచున్న బ్రాహ్మణజనమునుజూచి, పిచ్చివానివేషముతో నున్న యొకానొక బ్రాహ్మణుఁడు గట్టిగా నవ్వి "మీ యిష్టమువచ్చినట్లు దినుండు. ఈ రాజకులమున కభ్యుదయము కలుగును." అనిపలికెను.

యౌగం—నిజమా?

(అప్పుడు బ్రాహ్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

బ్రాహ్మణు—ఈవస్త్రవిశేషములు స్వప్రయోజనముకొఱకుఁ గాక కార్యాంతరముమీఁద నీతనిచే గ్రహింపఁబడినవి. వీనిచేత శరీరమాచ్ఛాదించుకొని భగవానుఁడైన ద్వైపాయనుఁడువచ్చినాఁడు.

యౌగం—ఆలాగా! ద్వైపాయనుఁడు వచ్చినాఁడా!

బ్రాహ్మ—ఔను.

యౌగం—అట్లయిన మేమాయనను జూచెదము.

బ్రాహ్మ—నీవు చూడవలసినదె.

యౌగం—ఏమిది! నాకు మఱియొకరూపములాగుకనఁబడుచున్నది. అయ్యో! నేను స్వామిసన్నిధినే పొందినవాఁడ నగుచున్నాను. ఇవి నాయుపదేశము నిమిత్తమే విడువఁబడినట్లున్నవి.

తే. గీ. పరమసాధువువైనట్టి యీబ్రాహ్మణుండు
వెఱ్ఱివాఁడట్లు వేసంబు, వేసినాఁడు
కొమ్మతలేందుని విడిపింపఁగలఁ డితండు
నన్ను నైతమాచ్ఛాదించు నయ మెఱింగి.

ప్రతీహా—(ప్రవేశించి) అయ్యా! రాజమాత-"నాకుమారుని జూడఁగోరుచున్నాను" అనిపలికెను.

యౌగం—ఇదిగో! ఇదిగో! వచ్చుచున్నాను. అయ్యా! నాకొఱకు శాంతిగృహమునఁ గనిపెట్టుకొనియుండుఁడు.

బ్రాహ్మ—మంచిది. (నిష్క్రమించుచున్నాఁడు.)

యౌగం—హంసకా! నీవిప్పుడు విశ్రమింపుము.

హంసక.__అయ్యా ! చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు).

యౌగం.__విజయా! నీవు ముందునడువుము.

ప్రతీహా.__అయ్యా! చిత్తము.

యౌగం.__అహో!

గీ. కాష్ఠమథనంబుచే నగ్నికణము బుట్టె
భూమిఁ ద్రవ్విన నిర్మలాంబువుల నిచ్చు
జగతి నుత్సాహయుతుల కసాధ్యమేది ?
సర్వయత్నము ల్ఫలియించు సరిగ నడుప.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.

శ్రీ ర స్తు.

# ప్రతిజ్ఞా యౌగంధరాయణము.

## ద్వితీయాంకము.

(అప్పుడు కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కాంచు—ఆభీరక ! ఆభీరక! మహాసేనుని యాజ్ఞ ప్రకారము నీవుపోయి ప్రతీహారరక్షకునితో "కాశీరాజోపాధ్యాయుఁడైన పూజ్యుఁడు జైవంతి నేఁడు దూతగా వచ్చినాఁడు. సామాన్యదూతసత్కారము వెనుకబెట్టి వారికి సుఖమగున ట్లేర్పాటుచేయవలసినది. అతిథి సత్కార మిట్టిదిగదా యని యతఁడు తెలిసికొనునట్లు చేయునది." యని చెప్పుము. అహా ! ఈలాగే ప్రతిదినము గోత్రానుకూలము లగు రాజకులములనుండి కన్యాప్రదానవిషయమున దూతప్రేషణము జరుగుచున్నది. మహాసేనుఁ డెవరిని నిరాకరింపలేదు; ఎవ్వరి నను గ్రహింపనులేదు. ఇది యేమిటో యీకన్యాప్రదానవిషయము దైవాధీనమైయున్నది. ఏలయన ?

ఆ. వె. అవహితుండు దూత యానవధూవిషయమం,
దైన ననుమతింపఁ డవనివిభుఁడు,
నృపకుమారగుణము లెఱిఁగియు నెవరినో
యెదను నిలిపి యుండు నెఱుఁగనట్లు.

అంతఃపురజనము తిరుగుచుండుటచే నీప్రదేశము సనాథమైయున్నది. ఇదిగో మహాసేనుఁడు. ఈతఁడు-

సీ. స్నిగ్ధదూర్వాంకురస్తిమితంబు లగు శీల
మణికందళంబులు మలయుచుండు,

కనకాంగదంబులఁ గరము రాజిల్లెడు
నతిదీర్ఘ బాహువు లలరుచుండ
శరవణవనమును షాణ్మాతురుఁడు బాసి
వెలుపలి కేతెంచువిధము దోఁపఁ
గనకతాళవనంబుఁ గడచి యీపక్కకే
ప్రద్యోతనరపతి వచ్చుచుండె.

(అనినిష్క్రమించుచున్నాఁడు.)

ఇది విష్కంభము.

(అప్పుడు రాజు సపరివారముగాఁ బ్రవేశించును.)

రాజు—

చ. జయజయ! యంచు భృత్యులయి క్ష్మాపతులందఱుసన్నుతించిరు
ద్ధయఖురభిన్న రేణువులఁ దన్మకుటాగ్రములం ధరింతు ర
ట్లయినను లేదు మోదము రవంతయుఁ గుంజరశాస్త్రవేత్త గ
ర్వియు, గుణశాలి, వత్సపృథివీపతి, నాకు నమస్కరింపమిన్.

బాదరాయణా!

(అప్పుడు కాంచుకీయుఁడు ప్రవేశించును.)

బాదరాయ—మహాసేనునకు జయము!

రాజు—జైవంతిని బసలోఁ బ్రవేశపెట్టినారా?

బాద—ఆఁ ప్రవేశపెట్టినాము. తగినట్లు సత్కరించినాము.

రాజు—ఈ రాజవంశముయొక్క మేలుగోరువాఁడవుగనుక నీవు చక్కఁగాఁ జేసితివి. వచ్చినవారు పూజలనందుకొనుట యుక్తముగదా! అందఱును గన్యాప్రదానవిషయమున నితరులయభిప్రా

యమును దెలియఁ గోరుచుందురు. (కంచుకునిజూచి) బాదరాయణా ! నీ వేదో చెప్పఁదలఁచుకొన్నట్లు గనఁబడుచున్నావు.

బాదరా—మతేమియులేదు. కన్యాప్రదానమునుగుఱించి యభిమర్శము బయలుదేఱినది.

రాజు—పరిహరింపవద్దు. ఈవిధి సర్వసాధారణముగదా ? చెప్పు. అది యేదో చెప్పు ?

బాద—స్వామీ ? నావివక్ష యిది. "కన్యాప్రదానమును గుఱించి దినదినము గోత్రానుకూలము లగురాజకులములనుండి దూత ప్రేషణము జరుగుచున్నది. మహాసేనుఁ డెవ్వరి సంగీకరింపనులేదు. అనుగ్రహింపనులేదు." అని నాసంశయము.

రాజు—బాదరాయణా ! అదియల్లే. వరునిగుణములయందతిలోభముచేతను వాసవదత్తయందలిప్రేమచేతను, నేను నిశ్చయముఁ జేసికొనఁజాలకున్నాను.

తే. గీ. మంచికులమును గోరును మనసు మొదట
పదపడి గుణంబుఁగోరు స్త్రీభయముచేత
వెనుకఁ జక్కఁదనము గోరు పిదప సతులు
మెచ్చఁదగు శౌర్యధైర్యము లిచ్ఛగించు.

బాదరా—ఈగుణములు దేవరవారియొద్దఁ గాక మఱియెక్కడ నొక్కచోట గుమిగూడి కనఁబడవు.

రాజు—అందుచేతనే యింత విచారింపవలసివచ్చినది.

తే. కన్య కనుకూలవరసమాగమము జగతిఁ
దండ్రియత్నంబుచేఁ గల్గుఁ దఱచుగాను
కరమది యదృష్టవశమునఁ గలుచుండు
నింతకన్న నన్యము మన మెందుఁ గనము.

కన్యాప్రదానకాలమందుఁ దల్లులు దుఃఖశీల రగుదురు. కనుక దేవిని బిలుచుకొనిరమ్ము.

బాద—చిత్తము (అని నిష్క్రమించును.)

రాజు—అహో! కాశీరాజు దూతనుబంపినాఁడని వినఁగానే వత్సరాజును బట్టుకొనుటకై నాచేతఁబంపఁబడిన శాలంకాయనునిమీఁదికి నాబుద్ధి పోయినది. ఆబ్రాహ్మణుఁ డిప్పటికి నచ్చటివృత్తాంతము నాకుఁ దెలియఁజేయఁ డెందుచేతనో?

తే. గీ. ఎందు నాయమాత్యునిలీల లిపుడు జరుగు
నందెయున్నది నామనం బనుసరించి
జాగరూకులై వత్సభూజానిమంత్రు
లతనిఁ గావకపోన రహర్నిశంబు-

(అప్పుడు సపరివారముగా దేవి ప్రవేశించుచున్నది.)

దేవి—దేవరవారికి జయము.

రాజు—కూర్చుండుము.

దేవి—చిత్తము. (అని కూర్చుండును)

రాజు—వాసవదత్త యెక్కడ?

దేవి—ఉత్తర యనునైతాళియొద్ద వీణనేర్చికొనుటకు నారదీయమునకుఁ బోయెను.

రాజు—ఆమెకు గాంధర్వమునం దభిలాష గలిగినదా యేమి!

దేవి—కాంచనమాల యెవరియొద్దనో వీణ నేర్చికొనుటఁజూచి యీమెకూడ నేర్చుకొనవలయునని యభిలాషకలదయ్యెను.

రాజు—ఇది బాల్యమునకుఁ దగిన లక్షణమె.

దేవి—దేవరవారితో నేనొకసంగతి విన్నవింపఁదలఁచుకొన్నాను.

రాజు—ఏమని?

దేవి—బిడ్డకు గురువుకావలె నని కోరుచున్నాను.

రాజు—ఆమెకు వివాహకాలము సమీపించుచున్నదికదా! ఇప్పుడు గురువెందుకు? ఆమెకు భర్తయే గురువై శిక్షించును.

దేవి—అమ్మో! నాబిడ్డ కప్పుడే వివాహకాలము సమీపించినదా?

రాజు—బిడ్డ నెవరికైన నిమ్మని ప్రతిదినము నన్ను బలవంతపెట్టుచు నిప్పుడేల విచారించెదవు?

దేవి—ఆమెకు వివాహముచేయుట నాకిష్టమే. కాని పుత్రికా విరహము సంతాపకరము. అట్లయిన నామె నెవ్వరి కీయనిశ్చయించికొన్నారు?

రాజు—ఇంతవఱకు నిశ్చయించుకొనలేదు.

దేవి—ఇంతవఱకును లేదా?

రాజు—

ఆ. వె. ఇంతకాల మొరుల కీయమి సిగ్గగు
నిచ్చివేయఁ దలఁప హెచ్చు వగపు
తల్లిదండ్రి స్నేహధర్మాంతరంబుల
నడుమఁ జిక్కి గాసిపడుచు నుందుఁ,

అన్నివిధముల మనవాసవదత్త యుత్తమామలశిశ్రూష సేయఁదగిన వయస్సులో నున్నది. నేఁడు మఱియొకరు వచ్చినారు. కాశీరాజోపాధ్యాయుఁడైన పూజ్యుఁడు జైవంతి వచ్చి పెండ్లికుమారునిచరిత్ర ను గ్గడించి నన్నులోభపెట్టుచున్నాఁడు (తనలో) ఈమె యేమియు బదులుచెప్పకున్నది. కన్నీరు విడుచుచు విచారించుచున్న యీామె యేమి నిశ్చయము చేయఁగలదు? కాని, యీామెకు నామనోగత మెఱిఁగించెదను. (ప్రకాశముగా) మనసంబంధము కావలెనని రాజులు వచ్చుచున్నారని వినుచున్నాను.

దేవి—ఇప్పుడు విస్తరించి చెప్పనేల? ఎక్కడిచ్చినచో మనకు సంతాపము గలుగదో యచ్చట నీయఁదగును.

రాజు—ఇప్పుడు దుఃఖవిస్తరముచేత నెవరికో యొకరి కీయవలసినదని చెప్పి, తరువాత నిందింపనారంభింతురు. అది వినుటమిక్కిలి కష్టము కావున దేవీ! యీవిషయమున నీవే నిశ్చయింపుము విను!

ఆ. వె. శూరసేనవంగసౌరాష్ట్రమైథులుల్
కాశరాజమగధదేశవిభులు
గుణవితతుల నాసగొల్పుచు నున్నవా
రెవరు నచ్చె నీకు నిందుఁ జెపుమ.

కాంచుకీయుఁడు—(ప్రవేశించి) వత్సరాజు—

రాజు—వత్సరాజేమిటి ?

కాంచు—దేవా! అనుగ్రహింపు మనుగ్రహింపుము. ప్రియవచనము నివేదింపవలెనని తొట్రుపడుచుఁ గ్రమవిశేషమును గుర్తెఱుఁగఁజాలనైతి.

రాజు—ప్రియవచనమా ?

దేవి—(లేచి) అయ్యా ! జయము.

రాజు—(సంతోషముతో) దేవీ! ప్రియవచనము నీవు వినఁదగినదే. కూర్చుండుము.

దేవి—దేవరవారిసెలవుప్రకారము జేయుదును. (అని కూర్చుండును.)

రాజు—ఓరీ! భయములేదు. నీయిష్టమువచ్చినట్లు చెప్పుము.

కాంచు—వత్సరాజు పూజ్యుఁడైన మీమంత్రిశాలంకాయనునిచేతఁ బట్టువడెను.

రాజు—(సంతోషముతో) ఏమని చెప్పినావు ?

కాంచు—వత్సరాజు పూజ్యుఁడైన మీమంత్రిశాలంకాయనుని చేఁబట్టువడినాఁడని.

రాజు—ఉదయనుఁడే !

కాంచు—మరేమి ?

రాజు—శతానీకపుత్రుఁడే ?

కాంచు—చిత్తము.

రాజు—సహస్రానీకుని మునిమనుమఁడే ?

కాంచు—ఆతఁడే.

రాజు—కౌశాంబీపురాధీశ్వరుఁడే ?

కాంచు—స్పష్టముగా నతఁడే.

రాజు—గాంధర్వధనుఁడే ?

కాంచు—ఆలాగే యనుకొనుచున్నారు.

రాజు—ఓయీ ! వత్సరాజా ?

కాంచు—ఔను ! వత్సరాజే.

రాజు—అట్లైన యౌగంధరాయణుఁడు చచ్చెనా యేమి ?

కాంచు—లేదు. కౌశాంబిలో నున్నాఁడు.

రాజు—అట్లయిన వత్సరాజు పట్టుబడలేదన్నమాటే.

కాంచు—దేవా ! నామాట నమ్ముఁడు.

రాజు—

తే. గీ. నమ్మఁజాల నీమాట మందరనగంబు
చేతఁ ద్రిప్పుటవంటి దీచిత్రకథలు
అరినృపాలురు నుతియింతు రతనిలావు
వానిమంత్రిపన్నుగడలు నే నెఱుఁగుదు.

కాంచు—దేవా ! అనుగ్రహింపుము. నేను పెద్దవాఁడను. బ్రాహ్మణుఁడనుగదా! ఇదివఱ కెప్పుడైన దేవరవారియెదుట నేననృతముఁ జెప్పితినా ?

రాజు—అవును, నిజమే. శాలంకాయనుఁడు మనయొద్దకు నే ప్రియదూతను బంపెను?

కాంచు—ఎవరిని బంపలేదు. అతిజవముగలగాడిదలు లాగెడు రథముమీఁద వత్సరాజుం గూర్చుండఁబెట్టుకొని యమాత్యశాలంకాయనుఁడు స్వయముగానే వచ్చెను.

రాజు—ఆలాగా? వచ్చినాఁడా? అట్లయిన నేఁడు మనయక్షౌహిణి సమరసన్నాహముఁజాలించి సుఖముగా విశ్రమింపవచ్చును. రాజులు నేఁడు మొదలుకొని శంకలేనివారై ప్రచ్ఛన్నవేషములుగల దూతలను బంపుకొనవచ్చును. ఇదే దీనిసంగ్రహము నేనిప్పుడు నిజముగా మహాసేనుఁడనైతిని.

దేవి—ఏమి! మంత్రియే తీసికొనివచ్చెనా?

రాజు—ఔను.

దేవి—ఇందుచేతనే వాసవదత్త నెవ్వరికి నీయఁదలఁచుకొనలేదు.

రాజు—అతఁడు నాకు యుద్ధావజితశత్రుఁడు కదా? బాదరాయణా! శాలంకాయనుఁ డెక్కడ నున్నాఁడు?

కాంచు—భద్రద్వారము నొద్దనున్నాఁడు.

రాజు—ఓయీ! నీవు వెళ్లి "రాజకుమారవిధివిశిష్టమైన సత్కారముచేత రాజును సన్మానించి యతనిని ముందుంచుకొని మంత్రి వచ్చుఁగాక!" యని భరతరోహకునితోఁ జెప్పుము.

కాంచు—చిత్తము దేవా!

రాజు—ఇటురా?

కాంచు—ఇదిగో వచ్చితిని.

రాజు—వత్సరాజుదర్శన మిందుఁ జేయవచ్చును. ఎవ్వరి నడ్డగింపవద్దు.

తే. గీ. వినుట కాని యాతనిలావు కని యెఱుఁగమిఁ
బ్రజలు వేడ్కఁ జూతురుగాక ప్రీతపగతు
యజ్ఞమునకై తేఁబడి యాగ్రహంబు
నాత్మలో నడంచుకొనుసింహంబునట్లు.

కాంచు—దేవరవారిచిత్తము.

(నిష్క్రమించును.)

దేవి—ఈరాజకులమం దనేకాభ్యుదయములిదివఱకుజరుగుట నెఱుఁగుదును కాని మహాసేనులయిన దేవరవారి కీర్తిప్రీతి యోగ్యమైన కార్యముజరిగినట్లు నాకుజ్ఞాపకము లేదు.

రాజు—వత్సరాజగ్రహణమువంటిగొప్పశుభము విన్నట్లు నాకును జ్ఞాపకము లేదు.

దేవి—వత్సరాజా!

రాజు—ఔను.

దేవి—మనతో సంబంధముచేయవలెనని యెన్నో రాజకుటుంబములు వచ్చినవని వినియుంటిని. కాని యాతఁ డెవ్వరిని మన యొద్దకుఁ బంపలేదు.

రాజు—అతఁడు మహాసేనుఁడైన నన్నే లెక్కసేయఁడు. ఇఁక మనసంబంధ మభిలషించునా?

దేవి—లెక్కసేయఁడా! అతఁడు చిన్నవాఁడా? మూర్ఖుఁడా?

రాజు—చిన్నవాఁడు కాఁడు! మూర్ఖుఁడుఁ గాఁడు.

దేవి—అతని కంతగర్వకారణ మేది?

రాజు—ప్రసిద్ధరాజర్షి నామధేయము గలదియు వేదాక్షర సమవాయప్రవేశముగలదియు నగుభరతవంశమే యతనిగర్వకారణము. అదిగాక వంశక్రమాగతమైనగాంధర్వవేదముఁగూడ నతనిగర్వకారణము. వెండియువయస్సహజమైనరూపముగూడ వానికి గర్వ

హేతువు. మఱియు నెట్టెటో కలిగినపురజనానురాగమువలనఁగూడనతని కనులు నెత్తికివచ్చినవి.

దేవి—ఈగుణములు వరునియం దభిలషింపఁదగినవేకదా! అతనివక్రభావముచేత గుణము దోషమైనది.

రాజు—ఇది విస్మయస్థానము గాకున్నను నీవేల విస్మయపడి యెడవు? చూడు.

తే. గీ. చెలఁగి యెండుచెట్లను బుట్టుచిచ్చువోలెఁ
జండతరమైన మామకశాసనంబు
ధారుణీమండలంబు దగ్ధంబుఁ జేసి
యాఁగిపోయెను విషయాంతమగుటఁ జేసి.

కాం—(ప్రవేశించి) మహాసేనా! జయము జయము! దేవరవారు సెలవిచ్చినట్లు వత్సరాజును సత్కరించి శాలంకాయనుఁడు ప్రవేశించినాఁడు. ఆయన మీతో నిట్లు మనవి సేయుచున్నాఁడు "భరతకులోపభుక్తమై వత్సరాజగృహమందు దర్శనీయమైయుండిన "ఘోషవతి" యనువీణారత్న మిది. దీనిని దేవరవారు స్వీకరింతురుగాక" యని.

(వీణను జూపుచున్నాఁడు.)

రాజు—జయమంగళమును గ్రహించుచున్నాను. (వీణను బుచ్చుకొని) ఆఘోషవతి యిదేకాఁబోలు!

తే. గీ. ప్రకృతిచే రక్తిగలిగి శ్రావ్యమయి మధుర
మయి నఖంబుల నంటినయంత మ్రోఁగు
తంత్రి లొప్ప బుషిపోత్రక్తమంత్రిమట్లు
వశపఱచుకొనుఁ బలిమిచే వారణముల.

అహో! సమరసముపార్జితములైనరత్నముల యనుభవము

మిక్కిలి ప్రీతికరముగదా! ఇది యెక్కడనుంచిన మిక్కిలి శోభించును? దేవీ! వాసవదత్త వీణ నుపక్రమించినదా?

దేవి—ఉపక్రమించినది.

రాజు—అట్లయిన నిది యామెకిమ్మ.

దేవి—ఈవీణ మనమిచ్చితిమా యది మఱియుఁ బిచ్చిదానివలె నుండును.

రాజు—ఆడుకోని మ్మాడుకోనిమ్మ. అత్తవారియింట నిది దుర్లభము. బాదరాయణా! అతఁ డెక్కడ?

కాం—అమాత్యునితోఁగలసి కూర్చున్నాఁడు.

రాజు—వత్సరాజేనా?

కాం—ఔను! పాదములయందు శరీరమందు దిట్టముగా దెబ్బలు తగులుటచేత సేవకులు మోసితెచ్చినడోలీలోఁ బండుకొని మధ్యమ గృహమం దున్నాఁడు.

రాజు—అయ్యో! కష్టము. దిట్టముగ దెబ్బలు తగిలినవా?ఇది యపరిమితమైన తేజస్సుయొక్కదోషము. ఇట్టిసమయమం దరివిషయమై యుపేక్ష జేసినవాఁడు నృశంసుఁడుగదా? బాదరాయణా! నీవుపోయి యతని వ్రణములకుఁ దగుచికిత్సఁ జేయింపుమని భరతరోహకునితోఁ జెప్పుము.

కాంచు—చిత్తము దేవా!

రాజు—ఉండు. ఉండు వెళ్లకు. ఇటురా.

కా—ఇదిగో వచ్చితిని.

రాజు—సత్కారమును విడువకుండ నతనికోరికయేమో తెలిసికొనఁదగును. ఆకారమునుబట్టి యతని కేవి ప్రీతికరములో దెలిసికొనవచ్చును. కడచిపోయిన యుద్ధవృత్తాంతము లతనియెదుట మరల స్మరింపవద్దు. అతనికి, తుమ్ములు మొదలైనవి వచ్చినప్పుడు తప్పక

యాశీర్వదింపుఁడు. కాలోచితమైన స్తోత్రముచేత నతని చిత్తము రంజింపుఁడు.

కాం.—చిత్తము దేవా! (అని నిష్క్రమించి ప్రవేశించి) మహాసేనా! జయము! వత్సరాజునకు మార్గమునందే వ్రణచికిత్స చేయఁబడినదఁట! వెంటనే రెండవసారి చికిత్సచేయుట సమయోచితముగాదు. పొద్దు నెత్తిమీఁదకు వచ్చినది. రెండుజాము లైనది.

రాజు.—ఆమహావీరుఁ డేస్థలమం దున్నాఁడు?

కాం.—మయూరయష్టిముఖమం దున్నాఁడు.

రాజు.—అయ్యో! కష్టము. ఆస్థలము నివాసయోగ్యముకాదే! ఎండ తగులకుండమణిభూమిక యందుఁ బ్రవేశపెట్టుమని యాజ్ఞాపింపుము.

కాం.—చిత్తము మహాసేనా?

(నిష్క్రమించి మరలఁ బ్రవేశించి)

దేవరవారు సెలవిచ్చినదంతయు జరిగినది. అమాత్యుఁడైనభరతరోహకుఁడు దేవరవారిదర్శనము సేయఁగోరుచున్నాఁడు.

రా.—వత్సరాజును సత్కరించుట వీనికిఁగిట్టదన్నమాట స్పష్టము. ఇది యతని నీతి పరిశ్రమమే. ఇతని నెట్లో నేనే బ్రతిమాలెదను.

దేవి.—సంబంధము నిశ్చయమైనదా యేమి?

రా.—ఇంతవఱకు నిశ్చయింపఁబడలేదు.

దేవి.—తొందరపడకండి. నాకూఁతురు మిక్కిలిచిన్నది.

రాజు.—నీయిష్ట మేలాగో యాలాగే. నీవు లోపలిమందిరమునకుఁ బొమ్ము.

దేవి.—చిత్తము దేవా!

(పరివారముతో నిష్క్రమించుచున్నది.)

రాజు.—(ఆలోచించి)

ఉ. వానియమేయగర్వమున వైరముగల్గెను మున్ను మాకునున్
వానికి నేఁడు చేఁబడుట వత్సనృపాలుఁడు మాకు వధ్యుఁడౌ
కాని రణంబునందుఁ బలుగాయములంబడి సంశయస్థితిన్
దీనత నుంటచే నిపుడు తెంపొనరింపఁగ సంశయించెదన్.

ఇది ద్వితీయాంకము.

శ్రీరస్తు

# ప్రతిజ్ఞా యౌగంధరాయణము

## తృతీయాంకము.

(అప్పుడు డిండికవేషుఁడైన విదూషకుఁడు ప్రవేశించుచున్నాడు.)

విదూ.—(నిరూపించి) అయ్యో! దేవాలయపీఠముమీఁద నా యుండ్రముల పళ్లెముఁ బెట్టుకొని దక్షిణామాషకములను లెక్కబెట్టుకొని మూటగట్టుకొని తిరిగివచ్చునప్పటికి నాయుండ్రముల పళ్ళెము కనఁబడుటలేదు. ఏకమోదకపరితోషితమైన యవాగ్నము నన్ననుసరించుటలేదు. పాకము మెత్తగానుండుటచేతఁ గుక్కలు వచ్చుటకు వీలులేదు. అక్షతభక్తమగుటచేత బాటసారులు దీని కాసపడరు. ఇప్పుడు దీనిని భక్షించెదను. సరె! ఇప్పుడు తేనుపు వచ్చుచున్నది. హిహి! ముసలిపంది కడుపులోనుండివలె నానోట వట్టిగాలిమాత్రమె వెడలుచున్నది. కాకపోయినయెడల లోహితకాత్యాయని కిష్టుఁడు నాకునిష్టుఁడే యని శివుఁడు నాపళ్ళెముఁ జేకొనియుండునేమో? అయినను నీబ్రహ్మచారి బహురూపములతో దుర్వినయము సేయుచున్నాఁడు. కానీ, వెదకిచూచెదను. అహో! ఇదిగో నాయుండ్రములపళ్ళెము. శివునియడుగులదగ్గఱ నున్నది. దీనినిదీసికొనియెదను. స్వామీ! యిమ్ము. నా మోదకమల్లక మిమ్ము! సంతాపతిమిరముచేత నాకుఁజక్కఁగాఁగనఁబడుటలేదు. కానీ!తోమెదను.హిహి! బాగు బరే! బావా! చిత్రకర! బాగు బాగు. అక్షరములు దిట్టముగాఁ వ్రాయఁబడుటచేతఁ దోమినకొలఁదినవిమఱింత మెఱయుచున్నవి. కానీ, నీళ్ళతోఁ

గడిగెదను. నీ రెక్కడనున్నదో? ఇదిగో పరిశుభ్రమైన చెఱువు. నావలెనే యీశివుఁడుగూడ మోదకమల్లకవిషయమున నిరాశుఁడగుఁగాక!

(తెరలో)

ఆహాహా! మోదకములు మోదకములు.

విదూష.—అయ్యో! ఆపిచ్చివాఁడు నా మోదకమల్లకమును దీసికొని వీధులలో నురుగుతోఁ బ్రవహించువానవీరువలె నిటే వేగముగాఁ బరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు. పిచ్చివాఁడా! ఉండు. ఉండు. ఈదుడ్డుకఱ్ఱతో నీతలఁ బగులఁగొట్టెదను.

(అప్పు డున్మత్తుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ఉన్మత్తుఁడు.—అహాహా! మోదకములు. మోదకములు.

విదూ.—ఓయీ! ఉన్మత్తుఁడా! నా మోదకమల్లకమును దీసికొనిరా?

ఉన్మత్త.—మోదకములేమిటి? మోదకములెక్కడ? ఎవరి మోదకములు! నాకు మోదకము లెవరైన నిచ్చుచున్నారా? చేయుచున్నారా? లేక యెవరైనఁ దినుచున్నారా?

విదూష.—తినుటలేదు. తినుటలేదు. ఎవరు నిచ్చుటలేదు.

ఉన్మత్త.—నానాలుక వాటిని దినుట కూటలూరుచున్నది.

విదూష.—ఓపిచ్చివాఁడా! నా మోదకమల్లకమును దీసికొనిరా! పరులతో స్నేహముచేసి బాధపడకు. వెళ్ళఁగొట్టఁబడకు.

ఉన్మత్త.—నన్ను బాధించువా రెవరు? వెళ్ళఁగొట్టువా రెవరు? మోదకములు రక్షించునుగదా?

తే. గీ. అతిశయాలంకృతులతోడ నలరుచుండి
కరముఁ బ్రీతి నుత్పాదింపఁ గలిగియుండి
యవనిపతిగృహదత్తమాల్యంబులైన
మోదకములు దుర్బలములై పోయె నకట!

విదూ—ఓయీ, పిచ్చివాఁడా! నా మోదకమల్లకమును దీసికొని రా? ఈయానవాలుతో నుపాధ్యాయగృహమునకు వెళ్ళవచ్చును.

ఉన్మత్త—ఈయానవాలుతో నేను నూఱు యోజనములు వెళ్ళఁగలను.

విదూష—నీవైరావతమువా?

ఉన్మత్త—ఔను! ఐరావతమునే. కాని, దేవేంద్రుఁడుమాత్రము నామీఁద నెక్కఁగూడదుసుమా! ఇంద్రుఁడు దానిని విద్యున్మయములయినధారానిగళములను బాదములకుఁ దగిలించి బంధించినాడని వింటిని. కాని సుడిగాలిచేత మేఘబంధనములను నది తెంచుకొన్నది.

విదూష—ఓయీ, పిచ్చివాఁడా! నీవు నా కది యీయవా? అట్లయిన నేనేడ్చెదను.

ఉన్మ—ఏడువుము. మొత్తుకో. నీయిష్టమువచ్చిన ట్లేడువుము.

విదూ—అయ్యో! చంపకు. చంపకు.

ఉన్మత్త—నేనుగూడ నేడ్చెదను. "అయ్యో! ఇంద్రుఁడుబద్ధుఁడైనాఁడు. ఇంద్రుఁడు బద్ధుఁడైనాఁడు."

విదూష—ఆయ్యో! చంపకు. చంపకు.

(తెరలో)

ఓ బ్రాహ్మణోపాసకుఁడా! భయపడకు. భయపడకు.

విదూష—(సంతోషముతో) చంద్రుఁడు రాఁగానే సకలనక్షత్రములు వచ్చును. ఛీ! పాడు బ్రాహ్మణభావము. నాకోరికచేతనే శ్రమణకుఁడు నా కభయమిచ్చుచున్నాఁడు.

(అప్పుడు శ్రమణకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

శ్రమణ—బ్రాహ్మణోపాసకుఁడా! భయపడకు. భయపడకు. ఇక్కడెవరెవరున్నారు? ఏమిపని? ఏడ్చుచున్నాఁ డెందుచేత?

విదూష—అయ్యో! ఈశ్రమణకుఁడు ప్రతీహారరక్షకవృత్తిన నుభవించుచున్నాఁడు. ఓభగవానుఁడా! శ్రమణకుఁడా! ఈపిచ్చివాఁడు నా మోదకమల్లకమును దీసికొని యియ్యకుండనున్నాఁడు.

శ్రమణ—మోదకమును జూచెదను.

ఉన్మత్త—శ్రమణకా! చూడు. చూడు.

శ్రమణ—తూ తూ.

విదూష—అయ్యో! పిచ్చివానిచేతిలోనున్న మోదకముల నిదివఱకే శ్రమణకుఁడు చూచియుండును. అందుచేతనే మందభాగ్యుఁడనగునాయొక్క మోదకములను 'తూతూ' యన్నాఁడు.

శ్రమణ—ఓయీ! ఉన్మత్తోపాసకా! వాటిని దిరిగి యిచ్చివేయుము. కస్తూరి ఫేనమువలెఁ దెల్లనై, వధూచ్ఛిష్టమువలె మిక్కిలి కోమలములై, కల్లువలె మిక్కిలి తియ్యనివైన యామోదకములు నీవు తింటివా నీ కవి నాశనముఁ గలిగింపకమానవు.

విదూ—అవి మోదకములుగదా యని నా కాస.

శ్రమణ—ఓయీ! ఉన్మత్తకోపాసకా! ఇచ్చివేయు మిచ్చివేయుము. ఈయ వేని నిన్నుశపించెదను.

ఉన్మత్త—శ్రమణకా! అనుగ్రహింపు మనుగ్రహింపుము. భగవానుఁడా! శపింపకు, శపింపకు. గ్రహింపుము, గ్రహింపుము.

శ్రమణ—ఓయీ! బ్రాహ్మణోపాసకా! చూడు నాప్రభావము చూడు.

విదూష—ఈపిచ్చివాఁడు శ్రమణకుఁడు శపించునేమోయని జడిసి వేలు చాఁచి దానిమీఁద మోదకమల్లకమును బెట్టుకొని యున్నాఁడు.

శ్రమణ—నీవు వెళ్ళు. వెళ్ళు. ఈమోదకములతో నాకు స్వస్తివాచకముఁ జెప్పఁగలవు?

విదూష.—హా! హా! నా మోదకములతో స్వస్తి జెప్పెదను. నేను వాటిని కౌటుంబికహస్తములనుండి ప్రతిగ్రహరూపమున గ్రహించినాఁడను. అవి నీకు కానుక యౌఁగాక! అదినీకు సమృద్ధమగుఁగాక! ఈపిచ్చివాఁ డగ్నిముఖమున కెదురుగాఁ బోవును. ఇప్పుడు మధ్యాహ్నమైనది. ఈప్రదేశము పూర్వాహ్ణమందే శూన్యము కాఁగలదు. ఇంతలో నేనీదక్షిణామాషకముల మార్గగేహమునందుఁ బెట్టి పోయెదను. ఒకనికి శాటికతో పనిజరుగును. మఱియొకనికి ధనముతో జరుగును.

(అందఱు నగ్నిగృహమునఁ బ్రవేశించుచున్నారు.)

యౌగంధరాయణుఁడు.—వసంతకా! ఈయగ్నిగృహము నిర్జనముగా నున్నది.

విదూష.—ఔను! ఇది శూన్యముగానే యున్నది.

యౌగం.—అట్లయిన మీరిద్దఱు నన్నుఁ గౌఁగలించుకొనుఁడు.

ఇద్దఱు.—మంచిది. (కౌఁగలించుకొనుచున్నారు)

యౌగం.—ఔఁగాక ! మీరిద్దఱు సమానముగా శ్రమపడియున్నారు. కూర్చుండుఁడు.

ఇద్దఱు.—మంచిది. (అందఱుఁ గూర్చుందురు)

యౌగంధ.—వసంతకా ! నీవు ప్రభువువారిని జూచితివా ?

విదూష.—ఆహా! వారిని జూచితిని.

యౌగంధ.—అయ్యో! రాత్రి కడచిపోయినది. ఇప్పుడు పగలు నడచుచున్నది.

తే. గీ. దినము గడువఁగ రాత్రి యేతెంచుచుండుఁ
దెల్లవాఱినఁ గ్రమముగా దినము జరుగు,
భావికష్టముల్ జూచెడివారి కకట !
కడచిపోయినకాలంబె కడుసుఖంబు.

రుమణ్వంతుఁడు—నీవు చక్కఁగాఁ జెప్పితివి. కాలము సమానమయినప్పటికి రాత్రి బంధనములయందు బహుదోషములతోఁ గూడినది. ఎందుచేత నన?

గీ. ఒనర వ్యవహారముల నసాధ్యులయి యుండి
పృథివి నప్రతిరంజ్యులన్ బేరు వడసి
పగటివేళ దోషములందుఁ దగిలియుండు
వైరులకు రాత్రి కడుభయాస్పదము సుమ్ము.

యౌగంధ—వసంతకా! ప్రభువుగారితోఁ జెప్పినావా?

విదూ—ఆఁ! ఆయనతోఁ గలసి నేను చాలసేపుంటిని. ఈచతుర్దశినాఁడు స్నానము జేసి మనకొఱకు నెదురుచూచుచున్నారు.

యౌగంధ—స్వామి! స్నానము జేసెనా?

విదూష—ఆహా! స్నానముఁ జేసినారు.

యౌగంధ—దేవకార్యము నిర్వర్తించినారా?

విదూష—ఔను! ప్రణామముచేతనే దేవతలు పూజింపఁబడిరి.

యౌగంధ—ప్రభువువారి కిదిగూడ బహుమతమయినయవస్థయే యని చెప్పవచ్చును. ఏలయన?

సీ. ఏనరపాలుండు స్నానంబు గావించి
దేవతార్చనవిధిఁ దీర్చి సరగఁ
బుణ్యాహఘోషంబుఁ బూర్తిసేసెడువేళఁ
బటహస్వనంబులు ప్రబలుచుండు
నాజనపతి తిథిపూజనంబులయందె
కాలంబు మాటినకారణమున
ముంజేతిసంకెళ్ళు మొఱయు, దేవతలకు
వందనంబొనరించుపట్లఁ గదలి.

రుమణ్వ—ఇప్పుడు నీప్రయత్నము ప్రభువువారికి తిథిసత్కారమును దీసికొనిరాఁగలదు,

యౌగంధ—వసంతకా! వెళ్లు. తిరిగి ప్రభువువారిదర్శనము చేసి యిట్లు విన్నవింపుము- "ఏప్రయాణమునుగుఱించి మనము ప్రస్తుతము మాటలాడుచున్నామో దానికిఁ బ్రయోగకాలము రేపే. నలగిరి యనుమదపుటేనుఁగు స్థానాసన శయ్యా భోగాదులగు నాశ్రియములయందు నౌషధ వ్యాజములచే నుపన్యసింపఁబడినదై కొన్నిమంత్రప్రభావములచే వ్యామోహింపఁబడినది. అనుకూలవాయువులచేత విడువఁబడఁదగినధూపములుఁ గూడఁ గొన్ని సిద్ధముచేసితిమి. దానికి రోషముఁగలిగించుప్రతిగజమదముఁగూడఁ దెచ్చియుంచితిమి. ఏనుఁగు లగ్నికి భయపడునుగనుక దానిఁగట్టుశాలకు సమీపమున, నగ్నిదగ్ధము సేయుటకు నల్పసాధనములతో నొకయిల్లు సిద్ధముచేసితిమి. ఆగజరాజుయొక్క చిత్తచాంచల్యమునిమిత్తము దేవాలయమున ధ్వనిసేయుటకు శంఖదుందుభులమర్పఁబడియున్నవి. సర్వసాధనపరిగతశరీరయగు నాధ్వనిచేతఁ బ్రద్యోతమహారాజు తప్పక రేపు దేవరవారిశరణు జొచ్చును. అప్పుడు దేవరవారు శత్రువునియనుమతిచేతనే బంధవిముక్తులై ఘోషవతియనువీణను జేతఁబట్టుకొని పిచ్చిమెత్తినసలగిరిని స్వాధీనము జేసికొనవచ్చును. అప్పుడు దేవరవారు స్వాధీనయగునలగిరిమీఁద నారోహణము సేసి,

సీ. గజము మనోవేగకలితమౌనటు జేసి
దానివెంటను సేనఁ దరలఁజేసి
మృగరాజగర్జనల్ ముగిసిపోవకముందె
వింధ్యకాంతారంబు వేగ దాఁటి
వ్యసనమందును వనమందు స్వపురమందు
మూఁడుదశల నొక్కనాఁడె పొంది

యేగజచ్ఛలముచే నిటకుఁ వచ్చితో దాని
చేతనె వెండియుఁ జేరు పురము."

రుమణ్వ—వసంతకా! ఇప్పు డేమిటాలోచించుచున్నావు ?

విదూష—ఇట్లాలోచించుచున్నాను. మీప్రయత్నము గొప్పదే కాని, భగ్నమగునేమో యని సందేహము.

ఇద్దఱు—మే మంత్రమాత్రము తెలివిగలవాండ్రము కామా!

విదూ— తెలివిగలవాండ్రలో మొదటివాఁడను నేను. తరువాతివారు మీరు.

యౌగంధ—కార్యభంగ మెట్లగును ?

విదూష—ఇది వత్సరాజు స్వయముగాఁ జేయవలసిన కార్యము గనుక.

యౌగంధ—ఎటువలె ?

విదూష—వినుఁడు !

ఇద్దఱు—సావధానులమై యున్నాము.

విదూష—కడచినబహుళాష్టమినాఁడు రాజపుత్రికయగు వాసవదత్త దాదితోఁగూడి కన్యకాదర్శనము దోషరహిత మని గవిసెన లేకుండ నాందోళిక యెక్కి ధారాయంత్రములనుండి పడుచున్ననీటిచేఁ దడిసి విషమంబయినరాజమార్గమును బరిత్యజించి బంధనద్వారమున కెదుటనున్నభగవతి యగు యక్షిణియొక్కస్థానమునకు దేవకార్యము నిర్వర్తించుటకై పోయెను.

యౌగంధ—తరువాత తరువాత?

విదూష—తరువాత మనప్రభువుగా రభ్యంతరబంధరక్షకుఁడగు శివకుఁడనుబానిసవాని నెట్లో యొడంబఱచి బంధనమునుండి వెడలివచ్చెను.

ఇద్దఱు—తరువాత దరువాత ?

విదూష.—బోయలు భుజములు మార్చుకొనునప్పుడు పల్లకిలో నున్న రాజపుత్రికను మనప్రభువుగారు లెస్సగాఁజూచిరి.

యౌగంధ.—తరువాతఁ దరువాత ?

విదూష.—ఇఁకఁ దరువాత నేమిటి ? అప్పుడు ప్రభువువారు తనకారాగృహ ముద్యానవన మనుకొని రాగలీలలు బెంపనారంభించిరి.

యౌగంధ.—ఆమెయందు మనప్రభువా రభిలాషగలవారు కాలేదుగద ?

విదూష.—సంఘచారులకుఁ గలుగుననర్థ మిట్టిదే.

యౌగంధ- మిత్రుఁడా ! రుమణ్వంతుఁడా ! నీయాత్మ స్థిరముఁ జేసికొనుము. ఈ వేషముతోనే మనకు మునలితనము వెళ్లవలెను.

విదూష—అయ్యో ! నాతో రాజుగా రిట్లనిరి. "యౌగంధరాయణునితో నిట్లు చెప్పుము. మీరు సమర్థించినసమర్థనమునాకు రుచించుటలేదు. సమానగమనమునందుఁ బ్రద్యోతున కవమానము కలుగునా లేదా యని చింతించుచున్నాను. దీనింబట్టి కామప్రధానుఁడనని నన్నవమానింప వద్దు. అనుమానమునకుఁ బ్రతిక్రియను వెదకుచున్నాను."

యౌగంధ_ అహో! ఈమాట శత్రువులు విని నవ్వుదు రేమో కదా. ఆహా ! ఏమి బుద్ధికి సిగ్గులేకపోవుట అహో! ఇది సుహృజ్జనులకు మిక్కిలి సంతాపకరముగదా ? మంచిసమయమందు ప్రభువు శృంగారముఁ గోరుచున్నాఁడు. ఏలయన ?

సీ. తనచేతితోఁ జాప ధరణిపైఁ బఱచుక
        పవళించుదారకు దర్పంబుగాదె !
    చరణశృంఖలముల స్వనములు మదిలోనఁ
        గలిగింపకుండునే కామవికృతి ?

రక్షకభటులెల్ల రాజేంద్రి యనుచు బైకె
వారముల్ సేయంగ వాని వించు
బందెలో నున్నట్టిప్రభువు. మన్మథవికా
రము నొందు టేమియబ్రింబు చెపుమ ?

విదూ—అయ్యా ! స్నేహము జూపఁబడినది. పురుషకారము చేయఁబడినది. ఇంక మనము రాజును విడిచి పోదము. రండు !

యౌగంధ—నీవు వసంతకుఁడవుగావా? వసంతకా! అట్లుకాదు.

తే. గీ. ఆప్తమిత్రుల సందఱ నాశ్రయించి
యెవఁడు తనయవస్థను గాల మెఱుఁగకుండె ;
నట్టి దుఃఖసందగ్ధుఁ గామాగ్నితప్తుఁ
బుడమి తేని మన మిప్డు విడువఁ దగునె ?

విదూష—సరే ! యీప్రయత్నములోనే ముసలివాండ్ర మగుదము.

యౌగంధ—అది శ్లాఘ్యమయినపని.

విదూష—ఈసంగతి లోకము మెచ్చఁగినపక్షమున నది శ్లాఘనీయమే యగును.

యౌగం—మనయీపని లోకమెప్పుకొఱకుఁగాదు. స్వామిప్రియముకొఱకు.

విదూష—ఇది స్వామియు నెఱుఁగఁడు.

యౌగం—దానిసమయము వచ్చినప్పు డెఱుఁగఁ గలఁడు.

విదూ—ఆకాల మెప్పుడు ?

యౌగం—మనప్రయత్నసిద్ధి యెప్పుడో యప్పుడు.

విదూ—నీ వంతప్రజ్ఞ గలవాఁడవయితే చెఱనుండి మన రాజును నంతఃపురమునుండి రాజపుత్రికను నిద్దఱను దీసికొనిరా ?

రుమణ్వాం—ఇక్కడ నీవే చూచెదవు గాక !

విదూష.—బోయలు భుజములు మార్చుకొనునప్పుడు పల్లకిలో నున్న రాజపుత్రికను మనప్రభువుగారు లెస్సగాఁజూచిరి.

యౌగంధ.—తరువాతఁ దరువాత ?

విదూష.—ఇఁకఁ దరువాత నేమిటి ? అప్పుడు ప్రభువువారు తనకారాగృహ ముద్యానవన మనుకొని రాగలీలలు బెంపనారంభించిరి.

యౌగంధ.—ఆమెయందు మనప్రభువా రభిలాషగలవారు కాలేదుగద ?

విదూష.—సంఘచారులకుఁ గలుగుననర్థ మిట్టిదే.

యౌగంధ- మిత్రుఁడా ! రుమణ్వంతుఁడా ! నీయాత్మ స్థిరముఁ జేసికొనుము. ఈవేషములోనే మనకు ముసలితనము వెళ్లవలెను.

విదూష—అయ్యో ! నాతో రాజుగా రిట్లనిరి. "యౌగంధరాయణునితో నిట్లు చెప్పుము. మీరు సమర్థించినసమర్థనమునాకు రుచించుటలేదు. సమానగమనమునందుఁ బ్రద్యోతున కవమానము కలుగునా లేదా యని చింతించుచున్నాను. దీనింబట్టి కామప్రధానుఁడనని నన్నవమానింప వద్దు. అనుమానమునకుఁ బ్రతిక్రియను వెదకుచున్నాను."

యౌగంధ_అహో! ఈమాట శత్రువులు విని నవ్వుదు రేమో కదా. ఆహా ! ఏమి బుద్ధికి సిగ్గులేకపోవుట అహో! ఇది సుహృజ్జనులకు మిక్కిలి సంతాపకరముగదా ? మంచిసమయమందు ప్రభువు శృంగారముఁ గోరుచున్నాఁడు. ఏలయన ?

సీ. తనచేతితోఁ జాప ధరణిపైఁ బఱచుక
పవళించుదొరకు దర్పంబుగాదె !
చరణశృంఖలముల స్వనములు మదిలోనఁ
గలిగింపకుండునే కామవికృతి ?

రక్షకభటులెల్ల రాజేంద్రి యనుచు పైకె
వారముల్ సేయంగ వాని వించు
బందెలో నున్నట్టిప్రభువు.మన్మథవికా
రము నొందు టేమియబ్రింబు చెపుమ ?

విదూ—అయ్యా ! స్నేహము జూపఁబడినది. పురుషకారము చేయఁబడినది. ఇంక మనము రాజును విడిచి పోదము. రండు !

యౌగంధ—నీవు వసంతకుఁడవుగావా? వసంతకా! అట్లుకాదు.

తే. గీ. ఆ ప్తమిత్రుల నందఱ నాశ్రయించి
యెవఁడు తనయవస్థను గాల మెఱుఁగకుండె ;
నట్టి దుఃఖసందగ్ధుఁ గామాగ్నితప్తుఁ
బుడమిఱేని పున మిప్డు విడువఁ దగునె ?

విదూష—సరే ! యీప్రియత్నములోనే ముసలివాండ్ర మగుదము.

యౌగంధ—అది శ్లాఘ్యమయినపని.

విదూష—ఈసంగతి లోకము మెఱఁగినపక్షమున నది శ్లాఘనీయమే యగును.

యౌగం—మనయీపని లోకమెప్పుకొఱకుఁగాదు. స్వామిప్రియముకొఱకు.

విదూష—ఇది స్వామియు నెఱుఁగఁడు.

యౌగం—దానిసమయము వచ్చినప్పు డెఱుఁగఁ గలఁడు.

విదూ—ఆకాల మెప్పుడు ?

యౌగం—మనప్రియత్నసిద్ధి యెప్పుడో యప్పుడు.

విదూ—నీ వంతప్రజ్ఞ గలవాఁడవయితే చెఱనుండి మనరాజును నంతఃపురమునుండి రాజపుత్రికను నిద్దఱను దీసికొనిరా ?

రుమణ్వాం—ఇక్కడ నీవే చూచెదవు గాక !

యౌగం.—ఇద్దఱినిఁ దీసికొనిరమ్మనుచున్నావా ? మంచిది. ఇది రెండవ ప్రతిజ్ఞ.

తే. గీ. అలసుభద్రను గాండీవియట్లు, తమ్మి
తీఁగ మదగజంబట్లు, లాతీఁగఁబోఁడి
రా జపహరించి తోడ్కొని రాకయున్న
నన్నలార ! యౌగంధరాయణుఁడఁ గాను.

మఱియు,

తే. గీ. ఆమనోజ్ఞ, విపంచి, నాయాముతోన్గఁ
బద్మపత్రాక్షి, నాసరపాలసుతను,
రాజు నుదయనుఁ, దోడ్కొని రాకయున్న
నన్నలార ! యౌగంధరాయణుఁడఁ గాను.

(చెవియొగ్గి) అహో ! చప్పుడువలె వినఁబడుచున్నది. ఆచప్పుడేమో తెలిసికొనుఁడు !

విదూష.—ఔను! అలాగే. (నిష్క్రమించి మరలఁబ్రవేశించి) అయ్యో !దినము సమాప్తమగుటచే జనసమ్మర్ద మెక్కువగా నున్నది. ఇప్పు డేమిచేయుదము ?

రుమణ్వ.—అట్లయిన మనము విడిపోయి యొక్కొక్క రొక్కొక్కద్వారమువెంబడిఁ బోవుదము.

యౌగంధ.—కాదు. కాదు. మనము విడిపోవుట కాదు. శత్రుసంఘముల విడిపోఁగొట్టుదము. (నిష్క్రమించును.)

ఉన్మత్తకుఁడు.—హీహీ ! రాహువు చంద్రునిఁ బట్టుకొనుచున్నాఁడు. చంద్రుని విడిచిపెట్టు. విడిచిపెట్టు. విడిచిపెట్టకపోతివా నీమొగముఁ బ్రద్దలుగొట్టి విడిచిపెట్టెదను. ఇదిగో నిదిగో దుష్టాశ్వము తిరిగి తిరిగి వచ్చుచున్నది. ఇదిగో నిదిగో నాలుగువీధులమొగలో నున్నది. దానిమీఁద నెక్కి బళిని భుజించెదను. ఇదిగో ! వీరే

కుమారనాయకులు. నన్నుగొట్టండి. వద్దు బాబూ! కొట్టకుఁడు. కొట్టకుఁడు. ఏమనుచున్నావు ? మీనిమిత్తము కొంచె మాడుమనియా ? కుమారనాయకులారా ! చూడుఁడు. చూడుఁడు. వీరే కుమారనాయకులు. కఱ్ఱలతో నన్నుమరలఁ గొట్టుఁడు. వద్దు, కొట్టవద్దు. అట్లయిన నేనుఁగూడఁ గొట్టెదను.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

శ్రీ ర స్తు.

# ప్రతిజ్ఞా యౌగంధరాయణము.

## చతుర్థాంకము.

(అప్పుడు భటుఁడు ప్రవేశించుచున్నాఁడు)

భటుఁడు—జలక్రీడ సేయఁదలఁచుకొన్న రాజపుత్రిక వాసవదత్తయొక్క భద్రవతీపరిచారకుని గాత్రసేవకుని నేను జూచి యెంతోసేపైనది. బావా! పుష్పదంతకా! గాత్రసేవకుఁడు నీకగుపడలేదా? ఏమనుచున్నావు? ఆగాత్రసేవకుఁడు శుండికినీగృహముఁ బ్రవేశించి కల్లుదాగుచున్నాఁడనియా? బావా! నీవు వెళ్ళు (కొంతనడచి) ఇదే! శుండికినీగృహము. వానినిఁ బిలచెదను. గాత్రసేవకా! గాత్రసేవకా

(తెరలో)

ఈరాజమార్గమం దిప్పుడు గాత్రసేవకా! గాత్రసేవకా! యని యెవఁడుచెపుమా పిలుచుచున్నాఁడు?

భటుఁడు—ఇదిగో! గాత్రసేవకుఁడు కల్లు తాగితాగి నవ్వి నవ్వి మత్తిల్లిమత్తిల్లి జపాకుసుమమువలె నెఱ్ఱఁబడినకన్నులతో నిటే వచ్చుచున్నాఁడు. వానియెదుట నిలువను.

(అని తొలఁగి పోవును.)

(అప్పుడు గాత్రసేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

గాత్రసే—ఈరాజమార్గమం దిప్పుడు గాత్రసేవకా! గాత్రసేవకా! యని యెవఁడుచెపుమా పిలుచుచున్నాఁడు? కల్లుపాక విడిచి వచ్చుటవల్ల నేఁ గనఁబడితిని. మిక్కిలి కోపగించిననామామ—యమా

తృకమల్లకుఁ డుప్పు కారము రాచి నేతిలో వేయించినమాంసపు ముక్క నానోటఁ గుక్కినాఁడు.

తే. గీ. కల్లు ద్రాగి మత్తిలువాఁడు కరము ధన్యు
లమితధన్యులు కల్లు మైనలఁడువారు
కల్లుతో స్నానమాడెడుఘనులు ధన్యు
లాసురాజ్ఞానియే ధన్యుఁ డఖిలజగతి.

త్రాగుబోతులయాలుబిడ్డలకష్టములను వినియు నేపురుషులు భాగ్యము గలిగియుఁ బెద్దకల్లుచెఱువులు ద్రవ్వింపకుందురో యామ్మూ ఢులధనము కాల్పనా? వారు ధనముఁ గల్గియు దరిద్రులే.

భటుఁడు——(సమీపించి) ఓయీ! గాత్రసేవకా! ఎంతసేపటి నుంచి నిన్ను వెదకుచున్నానోయి. జలక్రీడ సేయ నభిలషించుచున్న రాజపుత్రిక వాసవదత్తయొక్కయేనుఁగు భద్రవతి కనఁబడుట లేదు. నీవైతే త్రాగి మత్తెక్కి యిక్కడఁ దిరుగుచున్నావు.

గాత్రసే——సరే! అది మత్తురాలు కాదా? ఆపురుషుఁడుమత్తుఁ డే. నేనును మత్తుఁడనే నీవును మత్తుఁడవే. ప్రపంచ మంతయు మత్తిల్లినది.

భటుఁడు——ప్రపంచమంతటిమాట యటుండనిమ్ము. రాజ గృహమునకు భద్రపీఠికను దీసికొనిరాకుండ నెక్కడదిరుగుచున్నావు?

గాత్రసే——ఇక్కడే దిరుగుచున్నాను. ఇక్కడే ద్రాగుచు న్నాను. దీనితోఁ ద్రాగుచున్నాను. తొందరెందుకు? ఏమిచేయవలె?

భటుఁడు——నీయసందర్భప్రలాపముఁ గట్టిపెట్టు. త్వరగా భద్ర వతినిఁ దీసికొనిరా!

గాత్రసే——భద్రవతీ! రావే రావే. అహో! నేను భద్రవతి యొక్కయంకుశముఁ దెచ్చితిని.

భటుఁడు—భద్రవతి స్వభావముచేతనే సాధువైనది. దాని కంకుశమెందుకు? వెళ్ళి భద్రవతిని వేగముగాఁ దీసికొనిరా.

గాత్ర—రావే రావే భద్రవతీ! నేను భద్రవతియొక్క క్షురప్రమాలికఁ దెచ్చితిని.

భటు—పుష్పమాలికలతో నలంకరింపఁదగినభద్రవతికి క్షురప్రమాలిక లెందుకు? శీఘ్రముగా భద్రవతినిఁ బ్రవేశపెట్టు.

గాత్ర—రావే రావే భద్రవతీ! అహో! నేను భద్రవతియొక్క ఘంట దెచ్చితిని.

భటు—నీట స్నానముఁ జేయవలసినభద్రవతికి ఘంటయెందుకు? శీఘ్రముగా భద్రవతినిఁ దీసికొనిరా?

గాత్రసే—రావే రావే భద్రవతీ! నేను భద్రవతియొక్క కొరడా కూడ దెచ్చితిని.

భటు—కొరడాతో నేమిపని? శీఘ్రముగా భద్రవతినిఁ దీసికొనిరా.

గాత్ర—రావే రావే భద్రవతీ! అహో!

భటు—అహో యేమిటి?

గాత్ర—అహో నేను-

భటు—నీవేమిటి?

గాత్ర—అహో! భద్ర

భటు—భద్ర యేమిటి?

గాత్ర—అహో! భద్రవతి

భటు—భద్రవతియేమిటి?

గాత్ర—భద్రవతిని గూడ దెచ్చితిని.

భటు—ఈతప్పు నీదిగాదురా. తప్పంతయు శుండికినిది. మహారాజుగారివాహనముఁ బుచ్చుకొని నీకుఁ గల్లు పోసినదిగదా!

గాత్రి—మూలవృద్ధిని నాశనము జేయకుమని నేను చెప్పు చున్నాను.

భటు—'హా!' యని శబ్దము వినఁబడుచున్నదే?

గాత్ర—అయ్యా! తెలిసినది తెలిసినది. శుండికినియిల్లు బ్రద్దలుసేసికొని భద్రవతి పాఱిపోవుచున్నది.

భటు—ఏమనుచున్నావు? (ఆకాశమునఁ జెవియొగ్గి) "వత్స మహారాజు వాసవదత్తను దీసికొనిపోవుచున్నాఁ"డనియా?

గాత్ర—(సంతోషముతో) మహారాజుగారు నిర్విఘ్నముగా వెళ్ళుదురుగాక!

భటుఁడు—త్రాగు త్రాగు. నీవు మిక్కలి మత్తెక్కునట్లు త్రాగి తిరుగుము.

గాత్ర—ఆహా! ఎవఁడు మత్తుఁడు? ఎవరికి మదము? మేము మహాత్ముఁ డయినయౌగంధరాయణునిచేత నచ్చటచ్చట మామా స్థానములయందు నిలుపఁబడినవేగులవాండ్రము. నేనుఁగూడ నామిత్రులకు సాజ్ఞఁజేసెదను. ఇదిగో! వీరే నామిత్రులు. బంధనమునుండి విడువఁబడిన నల్లత్రాచులవలె నిటునటుఁ బరుగెత్తుచున్నారు. ఓహో! మిత్రులారా! వినుండు! వినుండు!

తే. గీ. నృపధనముఁ దిని వానికై యెవఁడు పోరి
నొల్లఁ డతనికి దర్భకృతోత్తరీయ
మును సుసంస్కృతంబును జలపూర్ణము నగు
నవశరావ ముండదు వాఁడు నరకి మొందు.

ఆర్యయౌగంధరాయణుఁ డేడి చెపుమా? అదుగో! ఆర్యయౌగంధరాయణుఁడు—

సీ. నిశితఖడ్గముఁ బూని నిజహస్తమందున
మన్మత వేషంబు సజ్జగించి

బంగారునగిపీలపని గల్గుచర్మకో
    శమును వామాగ్రహస్తమునఁ దాల్చి
వెలలేనిపసిఁడిపువ్వులువలు ధరియించి
    ధవళసత్పట్టబంధంబుఁ గల్గి
చంద్రు నించుక జూపుసతటిత్పయోదంబు
    నోజను భాసిల్లుచున్నవాఁడు.

అహో! గొప్పయుద్ధము జరుగుచున్నది.

సీ. యోధులతోఁ గూడఁనున్నతగజములఁ
    దత్సహాయుల రణస్థలినిఁ గూల్చి
నిముసమం దక్షౌహిణీబలంబుల నెల్ల
    నవలీల దునుమాడి యశ్రమమున
నాగేంద్రకఠినదంతం బనుముసలంబు
    దాఁకుట హతభుజాదండుఁడగుచు
భ్రష్టాయుధుం డయ్యుఁ బగఱచేఁ జుట్టఁగఁ
    బడియు వెన్కకుఁ దనయడుగు నిడఁడు.

హా! యెంతకష్టము. ఆర్యయౌగంధరాయణుఁడు పట్టువడియె గదా! ఇప్పుడు నేనును బూజ్యుఁడగు యౌగంధరాయణు ననుసరించి యుండెదను. (అని నిష్క్రమించును.)

భటుఁడు—ఏమిది? ప్రాకారతోరణములు దప్పఁ దక్కినవిషయముల నిది కౌశాంబియే! ఈవృత్తాంత మమాత్యునకు విన్నవించెదను.

(నిష్క్రమించును.)

ఇది ప్రవేశకము.

(అప్పు డిద్దఱుసాధారణులు ప్రవేశించుచున్నారు.)

ఇద్దఱు—అయ్యలారా! తొలఁగుఁడు తొలఁగుఁడు.

ప్రథముఁడు—ఎంతగా గొంతు బ్రద్దలగున ట్లఱచుచున్నను దనపని మానువాఁ డెవఁడును లేఁడు.

ద్వితీయుఁడు—వాసవదత్త యపహరింపఁబడుచుండుటచేత నీతొట్రుపాటులో నే నెంత యఱచినను నామాట వినువారు లేరు. అహో! ఏమనుచున్నారు? ఈతొలఁగుమనుట యెందుకనియా? ఆర్య యౌగంధరాయణుఁడు పట్టుపడియెను. ఏమనుచున్నావు? ఎట్లు పట్టు వడె ననియా? అయ్యా! వినుండు. ఖడ్గద్వితీయుఁడైన యౌగంధరా యణుఁడు ప్రతిపక్షులయుత్సాహవేగమును నిముసములో నే పాపినాఁడు. విజయసుందర మనుమదపుటేనుఁగుయొక్క దంతము తగిలి యాయన చేతికత్తి నేలఁబడియెను. ఖడ్గలోపముచేఁ బట్టువడియెఁ గాని పురుష దోషముచేఁ గాదు.

ప్రథమ—అహో! మీ రప్రమత్తులై యుండుఁడు. ప్రాకార తోరణములుదప్పఁ దక్కినవిషయముల నిది కౌశాంబియే.

ఇద్దఱు—అయ్యా! దిగిరమ్ము. దిగిరమ్ము.

(అప్పుడు చేతులుకట్టఁబడి బల్లమీఁదఁ బండుకొని
యౌగంధరాయణుఁడు ప్రవేశించును.)

యౌగం—ఇదిగో! నేను దిగుచున్నాను.

తే. గీ. వత్సరాజును విడిపించి పగఱసుండి
శస్త్రదోషంబుచేఁ జిక్కి శత్రు[illegible]
నుదయనునికష్ట మడఁచి ప్రద్యోతునింట
నోడితి నటంచు సుఖముగా నుందు నింక.

ఓయీ! కళత్రములు లేనివారికి [illegible]ప్రవేశము సుఖముగదా? సంప్రాప్తమనోరథులకు విపత్తియు [illegible]ముగదా! ధర్మము సంపాదించినవారికి మృత్యువు పశ్చాత్తాపము గలిగింపదుగదా? నేను-

చ. భయమును వైరమున్ బరిభవంబు సమానముగాఁ ద్యజించి నే
నయవినయంబులన్ శరగణంబుల దుష్కరకర్మఁ జేసి, ని
ర్భయముగ మిత్రిదుర్యశము వైరులసంపదఁ ద్రోసిపుచ్చి హా!
జయమును గొంటి చూచితిని ఙ్మాపతిమోక్షముఁ జేరుగాంచితిన్.

ఇద్దఱు.—అయ్యా! తొలఁగుఁడు. తొలఁగుఁడు.

యౌగంధ—నన్నుఁ జూడనభిలషించుచున్నజనమును దొలఁగింపరాదు.

తే. గీ. ఉర్విపతికయి యాపదనొందునన్నుఁ
జూచెదరు గాక! రాజపురుషులు యథేచ్ఛ
సచివపదవి నపేక్షించుజనులకోర్కె
చెడుటో స్థిరమౌటొ యగునింకఁ జెప్పనేల?

ఇద్దఱు.—తొలఁగుఁడు తొలఁగుఁడు. ఆర్యయౌగంధరాయణునిమీఁ దిదివఱ కెన్నఁడుఁ జూడలేదా?

యౌగంధ—పూర్వము జూచిరి. ఈవిధముగాఁ గాదు.

తే. గీ. స్వామిపనికి నున్మత్తవేషంబు గల్గి
యీనగరవీథులం బరుగెత్తునట్టి
రూపమును మున్నుఁ జూచిరి రూఢివీరు
చూడఁగల్గిరి నాకర్మ నేఁడు మరల.

(అప్పుడు భటుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భటుఁడు.—అయ్యా! నీకుఁ బ్రియము నివేదించెదను. వత్సరాజు పట్టుబడెనఁట!

యౌగంధ—అది నిజముకాదు.

చ. అరిపురిఁ జాలకాల మసహాయతనుండి విముక్తుఁడై యెటో
సరథసవృత్తి భద్రవతిసాయమునన్ వను లెల్ల దాఁటి తా

నురువడి మూర్తమందె శతయోజనదూరము వోవునట్టి యా
నరపతి వెండి బట్టువడినాఁ డనుమాట విచిత్రమయ్యెడిన్.
భద్రా ! యెట్లు పట్టుబడెనని చెప్పుకొనుచున్నారు ?

భటుఁడు.—నలగిరి యనుయేనుఁగు వానివెంటఁ దగిలి పట్టుకొనెనఁట !

యౌగంధ.—సహజముగ దానికి సామర్థ్యము గలదు. కాని యది సమాయుక్తము గాదు.

ఆ. వె. మావటీనిశిక్ష మాతంగములు జవా
న్వితము లగుచు సరగ వెళ్లవచ్చు
వత్సరాజు విడుచు భద్రగజంబును
నెక్కి నడుపువార లెవరు జగతి ?

భటుఁడు.—అయ్యా ! "పురుషగుప్తమైయుండును గనుక మీ రాయుధాగారమున నుండునది." యని యమాత్యులు సెల విచ్చినారు.

యౌగంధ.—ఈమాట హాస్యాస్పదముగా నున్నది.

తే. గీ. వత్సరాజాగ్ని నింటిలోపలను దాఁచి
కాచియుండఁగఁ దగినట్టి కాలమందు
మైమఱచి నిద్రబోయిరి మంత్రులెల్ల
పేటిఁ గావనేటికి మణి దాఁటిపోవ.

భటుఁడు.—(నడచి) ఇదే యాయుధాగారము. మీ రిందుఁ బ్రవేశింపుఁడు.

(మఱియొకభటుఁడు ప్రవేశించును.)

రెండవభటుఁడు.—మీచేతికట్లు విప్పవలసిన దని మంత్రిగా రాజ్ఞాపించుచున్నారు.

యౌగంధ.—అట్లయిన నా కుత్సాహముఁ గలిగింపుము. భర

తరోహకుఁడు నన్నుఁ జూడఁ దలఁచుచున్నాఁ డని దీనివలన వ్యక్త మయినది. అతనిని జూడవలె. నని నాకును నున్నది.

సీ. కరినాథశరంబులు గల్గునానఁడులచే
నుల్లంబు భేదిల్లి యున్నవాని
నీతిచ్ఛలంబుల నెఱపెడు ప్రజ్ఞలో
మత్సమానుండయి మనెడువాని
శాస్త్రనిశ్చితసూక్తిసమితిఁ గల్గనివాని
బుద్ధిచే వంచన బొరయువాని
నధికతరాపకీర్తియాహతుం డగువాని
నురులజ్జఁ దల వంచి యున్నవాని

తే. గీ. నమ్మహాసేనభూపాలునగ్రిమంత్రి
భరతరోహకు వీక్షింపఁ ద్వరపడియెడు
నేమిరో గాని యిత్తఱి నామనస్సు
మున్నతనిప్రజ్ఞ జెవులార విన్నకతన.

(అప్పుడు భరతరోహకుఁడు ప్రవేశించుచు.)

భరతరో—ఆయౌగంధరాయణుఁ డేఁడీ? ఏఁడీ?

సీ. తనపని ముగియించి ధన్యాత్ముఁ డగువాని
వంచనచే భంగపడనివాని
స్వామికార్యమునకై బన్నము ల్వడువాని
ఘనతరంబగుప్రజ్ఞ గలుగువానిఁ
జటులమంత్రపటిమ సడలిపోవుటచేత
ధర్షితం బై యుచ్ఛ్రితంబు నగుచు
నెసఁగుపామునువోలె నితని నేగతిఁ గాంతుఁ
బనిబూని యేరీతిఁ బలుకరింతు.

భటుఁడు—ఆర్యయౌగంధరాయణుఁడు మీరాకకెదురుచూచుచు నాయుధాగారమున నున్నాఁడు.

భరతరో—సరే. సరే.

తే. గీ. నీలగజమునెపమున మంత్రిత్వమందుఁ
గరము వంచింపఁబడితిమె నీఘనుఁడు తొల్లి
యిప్పు డాప్రాఁతివైరంబు నెత్తిపోడువ
నితఁడు నానిమిత్తం బిట్టు లెదురుచూచు.

భటుఁడు—అయ్యా! ఇదిగో మంత్రిగారు.

భరత—(సమీపించి) ఓయీ! యౌగంధరాయణా!

యౌగంధ—అయ్యా-

భటుఁడు—అహో! ఏమియీస్వరగాంభీర్యము. ఈయననోట వెడలినయొక్కయక్షరముతోనే యీప్రదేశమంతయు నిండిపోయినది.

భరతరో—(కూర్చుండి) అయ్యా! యౌగంధరాయణుఁ డను నశరీరాక్షరములు పూర్వము వినుచు వచ్చితిని. ఇప్పు డదృష్టవశమున నీవు కనఁబడితివి.

యౌగంధ—"అదృష్టవశమున నీవు కనఁబడితి" వనుచున్నావు.

తే. గీ. గురునిఁ జంపిన దుష్టులఁ గూల్చి వైచి
శాంతుఁ డైనయశ్వత్థామసరణి నున్న
స్థిమితవైరుని శోణితదిగ్ధదేహు
ననుఁ గనుంగొనుమయ్య! నీమనసుదీర.

భరత—ఏదో మిషచేత మేము చేసిన గజప్రయత్నమున నీవు ప్రతిక్రియగా నాత్మశ్లాఘ జేసికొనుచుంటివా?

యౌగంధ—ఏమి! మిషచేత ననియా? ఔను! దాని కిప్పు డిది యే తగినప్రతిక్రియ.

సీ. మును నాగవనమందు ఘనసాలవృక్షంబు

భుజము తల్గడ జేసి పుడమిపై శయనించె
మా రాజు కడు సుకుమారుఁ డయ్యు
వీణచే మేమును వెండి వంచించితి
మేన్నుఁ బట్టెదునేర్పు నృపుని కుంటఁ
దలఁచిచూచితిమేని దప్పు మీయది గాని
లేదు మాకడ లవలేశ మైన.

భరత—అయ్యా! మొట్టమొదట మహాసేనుని పుత్రిక నగ్ని సాక్షిగా శిష్యురాలిఁగా గ్రహించి తండ్రిసెలవులేకయే యాకన్యను మీరా జపహరించెె. ఈతస్కరపవృత్తి మీకు యుక్తమైనదేగదా!

యౌగంధ—నీ వట్లననద్దు. ఇది మాప్రభువుగారికి వివాహము గాని దొంగపెండ్లి గాదు.

తే. గీ. భరతవంశసంజాతుండు ప్రథితయశుఁడు
వత్సదేశాధినాథుండు భవ్యగుణుఁడు
దారనిర్దేశ మెదలేక దరుణి కట్లు
జేయునే యుపదేశంబుఁ జెలిమి మీఱ.

భరతరో—ఇంతవఱకును వత్సరాజు మహాసేనుని సత్కారమును బొందుచున్నవాఁడే. ఏల యిట్లు తొందరపడవలెను?

యౌగంధ—నీ వట్లనఁగూడదు.

చ. నలగిరి యానృపాలువచనంబులనే గమనించునంచు, న
య్యలఘుఁడె శిక్షకుం డనుచు నారసి పంపిరి కాదె మీరు, ని
ర్మలతరకీర్తిఁ బొందఁ దనప్రాణము గాచికొనంగ, నెల్లమి
త్రుల కుపకారమున్ సలుప యూథిగ, నేగె నతండు ముక్తుఁడై.

భరత—నలగిరినిఁ బట్టుకొనుటకై మీప్రభువును విడిచితి మందువా! ఆవనిమైనపిదప మే మాతనిబంధింపలేదే?

యౌగంధ—"బంధింపలేదనియా" మీ రనుట? లోకనింద కోడి మీ రా జేమిచేయుటకుం దోఁచక విచారించుచుండెను.

భరత—నీవు సకలరాజ్యవ్యవహారము తెలిసినట్లు బలుకుచున్నావు. యుద్ధములో జయింపఁబడిన శత్రువులవిషయమై శాస్త్ర మేమి చెప్పుచున్నది?

యౌగంధ—వధింపవలసినదని.

భరత—వత్సరాజును జంపవలసియుండఁగా మే మతని నేల సత్కరించితిమి!

యౌగంధ—అదిచూచియేగదా మేము మీరాజుప్రాణ మపహరింపకుండుట.

భరతరో—అదికూడ మంచిపనియని మీప్రభువు తలఁచుచున్నాఁడా?

యౌగంధ—సంశయ మేమి?

తే. గీ. మానృపాలునిచేఁ జిక్కె మీనృపుండు
కాని చంపక మారాజు కాఁచె నతని
నేపుమీఱినభద్రేభ మెక్కకున్న
క్షోణిమీఁదను ధ్వజమును గూల్చుటెట్లు?

భరత—ఆఁ కానీ, కానీ. మహాసేనున కపకారము జేసినచో మీకౌశాంబి యేమగునో మీ రెఱుఁగుదురా?

యౌగంధ—ఆహా! నీమాట హాస్యాస్పదముగా నున్నది.

తే. గీ. నీవు చూచుచుండఁగనె మానృపతి చనియె
శేషకార్యంబులనుగూర్చి చెప్పనేల?
చెట్టు వేళ్ళతోఁ బెల్లగించినవెనుకను
కొమ్మలను బట్టి [illegible]

(కాంచుకీయుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కాంచుకీ—(చెవిలో) ఇటువలె.

భరత—ఓయీ! గట్టిగాఁ జెప్పు.

కాంచు—

తే. గీ. "నా కరసిచూడ బహుకారణములచేత
నపకృతిని సేయనైతి వహంకరించి
సద్గుణములందు లేదు ద్వేషంబు మాకు
నిపుడె భృంగారమును గ్రహియింపుమయ్య"

అని మహారాజుగారు సెలవిచ్చినారు.

యౌగంధ—అయ్యో! కష్టము.

తే. ఆజిఁ బోలేదు నేఁ గాల్చినట్టియిండ్లు
మంత్రిహృదయంబులట్టులే మండుచుండె
నట్టిశిక్షార్హునకుఁ బూజలమరె నాకు
మహిఁ గృతాపరాధికిఁ బూజ మరణసమమె.

(తెరలో హాహాకారము)

భరత—అహో!

తే. గీ. శ్యేనపక్షద్వయంబునఁ జిక్కినట్టి
యాఁడులకుముకినిస్వనంబట్టు లకట!
శ్రవణగోచరమయ్యె హర్మ్యమునసుండి
యార్తరవ మొక్క టది యేమి యగునొ చెపుమ?

ఓహో! ఆశబ్ద మేమో తెలిసికొనిరండు.

కాంచుకీ—చిత్తము దేవా! (అనిలోపలికి వెళ్ళి మరలివచ్చి)

పూజ్యురాలైనయంగారవతీదేవి దుఃఖాతిశయముచేత మనసు చెడి మేడమీఁదినుండిపడి ప్రాణములు పోఁగొట్టుకొనవలెనని తలం చుచుండ భరత యొసమహాసేనుఁ డామెను వారించి "నీకుమారికవివా

హము క్షత్రధర్మముచేతఁ జేయఁదలఁచితిని. సంతోషింపవలసినకాల మున సంతాపించెదవేల? కావున నిప్పుడు చిత్రఫలకములందు లిఖింపఁబడినవత్సరాజవాసవదత్తలకు వివాహము సేయుదము" అనిచెప్పెను. అందుచేత—

తే. గీ. అంతిపురమందు నున్నస్త్రీ లంద ఱిపుడు
హర్షమును వ్యాకులము మిశ్ర మగు తెఱఁగునఁ
గరము మంగళాకీర్ణసత్కౌతుకక్రి
యలను జేయుచున్నారు బాష్పౌఘ మడర.

యౌగంధ—మహాసేనుఁ డీవిధముగా సంబంధమును గలుపఁ దలఁచుకొన్నాఁడా? అట్లయిన భృంగారమును దీసికొనిరండు.

కాంచుకీ—గ్రహింపుము. (అని తెచ్చుచున్నాఁడు)

భరత—ఓయౌగంధరాయణా! "యింక నీ కేమిప్రియము దాము గావింపఁగలుగుదు" మని మహారాజుగారడుగుచున్నారు.

యౌగంధ—మహాసేనుఁడు నాయెడఁ బ్రసన్నుఁ డగునేని యంతకన్న నా కేమి కావలయును?

భరతవాక్యము.

తే. గీ. ఆవులు రజోవిహీనంబు లగునుగాత!
ఎల్లశత్రుమండలి శమియించుఁగాత
నీమహీమండలం బెల్ల నేలుఁగాత
క్షేమకరుఁ డౌచు మా రాజసింహనృపతి.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

సమాప్తము.

# పార్వతీపరిణయము

## ఉపోద్ఘాతము

చిన్నతనమునుండియుఁ దెనుఁగుబాసలో నాకుఁ గొండొక యభిరుచి యుండుటచే నీవఱకు నారచించిన వచనకావ్యములకుఁ నాటకములకుఁ దోడుగ నెద్దియేని యొకమహాకవి ప్రణీత మగునాటకమును గీర్వాణభాషనుండి యాంధ్రీకరింపవలయునని నేను దలపోయుచుండ నాస్నేహితులలో నొకరు బాణకవిప్రణీత మగుపార్వతీపరిణయము రసవంతముగ నున్నదనియు దానిఁ దెనిఁగింపుమనియు నాతోఁ జెప్పిరి. అంతట నేనాపుస్తకముఁ దెప్పించి చదివి మఱియొక వ్రాఁతప్రతి యొకమిత్రునియొద్ద నుండిఁ గాఁదెచ్చి రెంటినిఁ బోల్చి చూచి పాఠములయందున్న స్వల్పభేదములను నాబుద్ధికి యుక్తమని తోఁచినట్లు సవరించి గ్రహించియీచిన్ననాటకము నాంధ్రీకరించితిని. రసవంతముగనున్న మూలగ్రంథమునందలి సారస్యమేమియుఁ జెడకుండఁ దెనుఁగునకు గూర్పవలయునని ప్రయత్నించితిని. నాప్రయత్నమును నేనెంతవఱకు నెఱవేర్చితినో చెప్పుటకు నేనసమర్థుఁడను. ఆవిషయమును గుణగ్రహణచణబుద్ధులయిన చదువరులు నిర్ణయింతురని వారికి విడుచుచున్నాఁడను. నాగ్రంథము నాంధ్రీకరించుటలోఁ దోడుపడిన బ్రహ్మశ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులవారికిని బ్రహ్మశ్రీ కోడూరి దక్షిణామూర్తిశాస్త్రులవారికి ననేక నమస్కారములు కృతజ్ఞతాపూర్వకముగా నొసఁగి బాణునిఁ గూర్చి యించుక ప్రసంగించెదను.

## బాణకవి.

ఇతఁడు శ్రీహర్షచక్రవర్తియాస్థానమం దుండినబాణకవి కాఁడు. అతఁడేమోయని నేను భ్రమపడి యీగ్రంథముయొక్క మొదటికూర్పున పీఠికవ్రాసితిని. అది యిప్పుడు సవరించుకొనవలసి వచ్చినది. ఈబాణకవి ఖుద్దంకి రాజధానిగాఁజేసి పాకనాటిసీమలోఁ గొంతకాలము బరిపాలించిన వేమరెడ్డియాస్థానమం దున్నవాఁడు. పదునాలవశతాబ్దములోనివాఁడు. ఈతని యసమానపాండిత్యమును బట్టియు, నిరంకుశకవితాప్రౌఢిమబట్టియు నభినవభట్టబాణుఁ డని బిరుదము గలిగినది. బాణకవి తనయేలిక యైనశ్రీహర్షునిగుణగణము వర్ణించుచు హర్షచరిత్రము రచియించినట్లె యీయభినవబాణకవి గూడ దనపోషకుఁ డగువేమరాజునుగూర్చి వీరనారాయణచరిత్రం బనునామాంతరముగల వేమభూపాలీయమను వచనగ్రంథముసంస్కృతమునరచియించెను. ఇదియు హర్షచరిత్రమువలెనే దీర్ఘసమాసముల తోడను చిత్రవిచిత్రవర్ణనలతోడను, బహుశ్లేషలతోడను ననేకాలంకారములతోడను గూడియున్నను హర్షచరిత్రవలె రసవంతముగాదు. అయినను నితఁడు మహామేధావియనియు బహుశాస్త్రపారంగతుఁడ నియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈనాటకములోమాత్రము రస మంతగాఁ గనఁబడదు. తండ్రియైనహిమవంతుఁడు తనకూఁతురు పార్వతి సంప్రాప్తయౌవనయైనదని నారదునితోఁజెప్పినప్పుడు కవి యాతనినోటబలికించినపలుకులు మిక్కిలి యశ్లీలములుగాను స్వభావవిరుద్ధముగాను తండ్రి కూఁతురునెడ నుపయోగింపఁదగనివిగాను నున్నవి. గ్రంథకర్త యాదిబాణకవియయిన పక్షమున నౌచిత్యమును విడిచి యిట్లు వర్ణింపఁడు. పూర్వబాణకవి యీగ్రంథకర్తయని భ్రమతో నేను దీనినాంధ్రీకరించితిని గాని యభినవభట్టబాణుండే రచయితయని మొదటనే తెలిసినపక్షమున నీప్రయత్నమునుండి మరలియుందును.

4—1—1928
రాజమహేంద్రవరము.

గ్రంథకర్త

## ఈనాటకమునందువచ్చు పాత్రములు.

### పురుషులు.

శంకరుఁడు—కథానాయకుఁడు.
హిమవంతుఁడు—పార్వతితండ్రి.
నారదుఁడు—దేవఋషి.
మహేంద్రుఁడు—దేవతలరాజు.
దేవనంది—ఇంద్రసేవకుఁడు.
బృహస్పతి—దేవగురువు.
దేవలుఁడు—దేవదూత.
కాముఁడు—మన్మథుఁడు.
వసంతుఁడు—మన్మథమిత్రుఁడు.
నంది—శంకరుని సేవకుఁడు.
శిలాధరుఁడు—హిమవంతుని సేవకుఁడు.
విష్ణు—
బ్రహ్మ—
సూత్రధారుఁడు—

### స్త్రీలు.

పార్వతి—హిమవంతునికూఁతురు (కథానాయిక)
మేన—పార్వతితల్లి.
వాసంతిక—వనదేవత.
రంభ—దేవవేశ్య.
రతి—కామునిభార్య.
జయ—
విజయ— } పార్వతి చెలికత్తెలు.
కౌశికి—హిమవంతుని యింటనున్న యొక యోగిని.
నటి—

ఇంకను నింపు విద్యాధరులు, కులపర్వతములు, భూతము, వృద్ధాంగనలు సందర్భానుసారముగా వత్తురు.

శ్రీ

# పార్వతీపరిణయ నాటకము

## నాంది.

"మొదల న్రేమను నెఱ్ఱనై హరుమొగంబుంజూడ నాసక్తమై
పొదువ న్సిగ్గు కలంగి ధూమపు నెపమ్మొంబూని మోడ్పొంది భ
ర్తృదృగైక్యంబయి తిప్పుట న్సరభసోద్వృత్తి స్గడు న్వ్యాకులా
స్పదమై పొల్చెడు పార్వతీపరిణయాంచద్దృష్టి మ మ్మేలుతన్.

మఱియు:—

తే. గీ. అన్యు లగువారలకు నసమాన్య మగుచుఁ
బరిబలుదర్పంపుతావగు పచ్చవిల్తు
నఘటితఘటనాతిసమర్థ మైనపరిభుత
స్థిరమనస్కు లొందెడు మేలుఁదెచ్చుఁగాత.

సూత్రధారుఁడు—(నాంద్యంతమందు సపరిణామముగ నంజలిఁ బట్టి)

క. అమితబ్రహ్మాండకుటుం
బమునకు ల గ్గొదవఁ జేయు పరిపూర్ణానం
దమయులు పురాణదంపతు
లుమామహేశ్వరులు భూతి యొసఁగుత మాకున్.

(అని పుష్పాంజలిఁ జల్లి తెరవంకఁ జూచి) ఓసీ! యిటురా.

నటి—(ప్రవేశించి) అయ్యా! ఇదిగో నేను వచ్చినాను.

సూత్ర—ఓసీ! యీసభ యిప్పుడు పార్వతీపరిణయ మను నొకానొక యభినవరూపకమును జూడఁగోరుచున్నది సుమా!

నటి—అయ్యా! యది యేకవి రచియించిన కృతియై యుండ వచ్చును?

సూత్ర—తే. గీ. అంబురుహగర్భముఖరంగమందు లాస్య
మనిశ మొనరించు వాణి యేఘనుని నాల్క
నాట్యమును జల్పునతఁడు బాణకవిరాజు
కలఁడు వత్సాన్వయాంభోధికౌస్తుభంబు.

ఆయనచేత సంస్కృతమున రచియింపఁబడి చిలకమర్తి లక్ష్మీనరసింహకవిచేఁ దెనిఁగింపఁబడి విచిత్రసంవిధానమగు నీకథచేత సభ్యుల నానందింపఁ జేయుదము.

నటి—అయ్యా! యితరనాటకము లనేకములుండఁగా దేవరకు దానియందే యభిలాష మేల కలుగవలెను?

సూత్ర—క. సందర్భశుద్ధియుం గథ
పొందిక రసపుష్టియిందుఁ బూర్ణతఁగని యా
నందము నిచ్చటిసభ్యుల
కందఱకును గొలుపఁజాలు నంబుజ నేత్రా.

అందలి గుణగ్రాహిత్వముచేతనే దానియం దభిలాషఁగలవాఁడనైతిని.

నటి—అట్లయిన యుక్తమే.

సూత్ర—(నటినిఁజూచి) ఓసీ! పార్వతీపరిణయ ప్రసంగము నందుగూడ నీవు మనసులో విచారించుచున్న దానివలెఁ గనబడు చున్నావేమి?

నటి—అయ్యా, యీపరిణయ ప్రసంగముచేత మనపిల్ల బాలచండిక కనుహూప వరలాభమహోత్సవ మెట్లు కలుగునని నిరంతరము నాహృదయము చింతాకుల మగుచున్నది.

సూత్ర—విచారింపకుము.

తే. గీ. కన్యలనభీష్టవరులతోఁ గలుపవిధియె
జతన మొనరించుచుండుఁ దత్సమయ మెఱిఁగి
మంచుమలకూఁతు పెండ్లిచేయించుకొఱకుఁ
బూని పనిచేయు నారదమౌనివోలె.

(నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.

# పార్వతీపరిణయ నాటకము

## ప్రథమాంకము.

(అంతట నాకాశమార్గమున నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నార — హా! ఈయమరకార్యఘటనమునందలి కుతూహలము జన్మమెత్తినది మొదలు నన్ను నిశ్చయముగా విడువకున్నయది—

ఏమనిన—.

చ. పొడమిన యయ్యుమ దక్షునకు మున్ను నిజభర్తృవిరోధి నాతని
న్విడిచి గిరీంద్రునింటఁ బ్రభవించిన యాసతి గౌరినాఁగ ని
ప్పుడఁతికి మంచుకొండను దపం బొనరించు మహేశుఁ గూర్ప ని
క్కడ నిపుఁడేఁ బ్రవర్తిలెదఁ గాఁగల నిర్జరకార్య మెంచుచున్.

(కొంచె మెడము దిగి చూచి) నే నిప్పుడు పరివహామను పేరుఁగల వాయుపథమునం దున్నాఁడను. అది యుక్తమే.

మ. తనియం జేరఁ జుట్టునై వికచమందారప్రసూనౌఘసం
జనిత వైభవనోపనీత మగు నీ సౌరభ్యముం గ్రోలి జు
న్నాకీ తేటుల్ల్యను వీణతీవలను నత్యార్ద్రింబుఁ గావించు ది
వ్యసదీనాఃకణరాజి నామనసు పూర్ణానందముం బొందెడున్.

(తొందరతో దిగుట నభినయించి క్రిందుచూచి) ఔరా! నే నిప్పుడు భూలోకమునకు దగ్గఱగా వచ్చితిని. ఎట్లనిన:—

చ. పొడముచు నున్న శృంగములఁ బోలిచిచూడ నగంబులంచుఁ దోఁ
చెడు నవి, తోఁచుఁ దేట జిగిచే నివి పాఱెడు నేఱులంచుఁ, దోఁ
చెడు నివి కార్మొగుళ్ళసిరిఁ జేకొని చెట్లని మండలాప్తి ని
వ్వడువున ధాత్రి చూడఁదగు వైఖరి దాల్చెఁ గ్రమక్రమంబునన్.

(ఆశ్చర్యముతో మరలఁ జూచి)

తే. గీ. కరిమతఁ బొడసూపినట్టి శైలములతోడ
నదులతోడను దట్టంపుఁ బొదలతోడ
వసుమతీచక్రి మెల్లనాకసముమీఁది
కెగురునటులోఁచెఁ గ్రిందికే దిగుచునుండ.

ఒక్కముహూర్తమున హిమవత్పర్వతసమీపభూమికి దిగినవాఁడను. (కొంచెము మెడము దిగిచూచి) ఈశైలరాజేగదా!

ఉ. ఉన్నతతావిహార భవనోపమశృంగముల న్నభోంతరం
బెన్నకయొత్తగించుకొని యేగెడునో యన భాసమానుఁడై
యన్నెలవెల్గు లట్లు తెలుపై సువిశాలత మించు సానుల
న్గ్రిన్నన నన్నిదిక్కులను గ్రమ్ముచు నుండెడు దేవ రాజిలున్.

అసాధారణమై భువనదురంధర మగుమహిమచేత మందరగంధమాదనపరిభృతులగు మహీధరములకన్న నిది యతిశయముగ నున్నది కదా, ఎందుచేతననఁగా:—

తే. గీ. భువనగురుఁడైన పద్మసంభవుఁడు సుగుణ
సంపదకు మెచ్చియిచ్చురాజ్యపదమూని
ప్రాభవము మీఱ సర్వపర్వతకులంబు
నేలు నమరస్వరూపుఁ డీశైలరాజు.

అందుచేతఁ గిన్నరాంగనలపాటలంజొక్కి కదలఁజాలని కృష్ణసారములతోడను తెల్లనితోఁకలల్లాటచేఁగపటచంద్రోదయవిలాసమును గల్పించు చమరీమృగ సమూహములతోడను గమ్మకస్తురితావులచే నాకాశగమనమువలననైన యాయాసము నపనయించుచు జాతిపూఁవు వాసనలం గడురమణీయ మగు నీచరియదారిని ప్రస్తుత కార్యసాధనముకొఱకు నేనిపు డీయోషధిప్రస్థ నగరమును బ్రవేశించెదను. (అని యట్లుచేసి ముందుకుఁజూచి) ఇదియే యా యోషధిప్రస్థనగరము.

చ. పొడవగు హేమశృంగములపొంత వసించు మొగుళ్ళఁ గల్గి మె
యెడ సురభూజవాటులను నింపగు ప్రాంతతలంబుఁ గల్గి మిం
చెడు సురరాజచాపము సృజించు మణిగృహకాంతిఁ గల్గి కా
ల్పెడుఁ గద నింపు వేడుకను విస్మయమందిర మీపురంబెదన్.

(పురప్రవేశ మభినయించి ముందుకుఁజూచి) ఆకసమునొరయు గోపుర శిఖరములచేత నక్షత్రపథము నంటుచున్న యిదియే హిమవంతుని మేడ. (ప్రవేశము నభినయించి యాకాశమునకుఁజూచి) ఓయీ కంచుకీ! కులాచలచక్రవర్తి యెక్కడ నున్నవాఁడు? ఏమనుచున్నావు? దేవియైన మేనకతోఁగూడ నేఁడిమో యాలోచింపుచు లోపలిమంటపమున నున్నారనియా. అట్లయినఁ గార్యము విన్నవించుటకిది తగిన సమయమే. (అని నడచుచున్నాఁడు.)

(అంతట హిమవంతుఁడు, మేనక, కొలఁదిపరిజనమును బ్రవేశించుచున్నారు.)

హిమ.—దేవీ! కన్యాపితృత్వము గృహస్థుల కధికతరదుఃఖమును దెచ్చునుగదా మన కులభూషణ మగునీగౌరి పెండ్లియాడునకు వచ్చినది. అది యుక్తమే.

తే. గీ. సుదతి చనుమొగ్గలరిగట్టఁ జూచు నిప్పు
డెడము నొకయింత విడువక వెడఁదయొమ్ము
గలదు లేదనఁ దగఁ లేత కౌనునడుమ
నమరి యున్నది సన్నని యారుబారు.

మేన.—ఆర్యపుత్రా! తమరు సెలవిచ్చినటు గౌరి వివాహమంగళయోగ్యురాలయినది.

హిమ.—దేవీ! యింకొకమాట వినుము.

ఆ. వె. కోమలాంగివలుదగుబ్బ లెక్కెటువృద్ధిఁ
జెందు నట్టులటులె చిక్కుచున్న

దకట నాశరీర మనిశంబు నీమెకు
మగనిఁ గూర్చ మనసు మఱుఁగుచుంట.

మేన—అహోరాత్రములం దీకార్యమునే చింతించుచు దాని యందే మనసునిలుపుచున్న నాశరీరముమాత్రి మట్లు తోఁచుచుండలేదా!

హిమ—(ముందుకుఁజూచి) దేవీ!వీణావిహారి యగునారదముని యిదె వచ్చుచున్నాఁడు. అతని కర్తవ్యమును దీసికొనిరమ్ము.

మేన—ఆర్యపుత్రు లానతిచ్చినట్లు చేసెదను.

హిమ—(లేచి దోసిలియొగ్గి)మహాత్మా!నమస్కరించుచున్నాడను

నార—అభ్యుదయపరంపరావాప్తిరస్తు.

హిమ—(పీఠమునువైచి యర్ఘ్యము సమర్పించుచున్నాఁడు.)

నార—(గ్రహించుచున్నాఁడు.)

హిమ—(సంతోషముతో చేతులు మోడ్చి)—

ఆ. వె. కోర్కులు వశపఱచికొని, సాగునటు సేసి
పరమతత్త్వమందు భావమునుచు
తమ్ముఁబోలువారి దర్శనం బెటు లల్ప
పుణ్యులకు లభించు మునివరేణ్య.

నార—సర్వాశ్రమోపకారులగు మీవంటి గృహస్థులను నిస్పృహులైనను మావంటివారు చూడవలసినదే.

హిమ—తమరు సెలవిచ్చినది యనుగ్రాహ్యవిషయము.

నార—అనుగ్రాహకు ననుగ్రాహ్యతయందు సందేహ మేమున్నది? మఱియును బుణ్యభూమివగు నీవు మాకు దర్శనీయుఁడవే. ఎందుచేత ననఁగా—

ఆ. వె. సర్వలోకమాన్య జాహ్నవి మునుశంభు
శిరము డిగ్గి నీదు శిఖర మవలఁ

జేరె ననెడుమాటచేతనే గద నేఁడు
భువనపావనియయి పొగడనెగడు!

హిమ—తమయాజ్ఞానువర్తియగు సేవకుని మీరీలాగున నతి స్తోత్రము సేయనేల!

నార—ఆ. వె. నిరుపమానరూపనిలయ లిరువురుసుతల్
కలరు నీకు గంగ గౌరియునన

హిమ—ఇదినిజమే.

నార—అందుఁ బ్రథమముమన్నెయనురూపరమణుఁగాఁ
బడసె సుగుణరాశి వారిరాశి.

హిమ—ఇది కలదు.

నార—నీ రెండవకుమారికి నెవరి నుద్దేశించినావు?

హిమ—మహాత్మా! ఈసంగతినే విచారింపుచు నామనసు మిక్కిలి యనుతాపము నొందుచున్నది.

నార—ఆ. వె. నాగలోకమందు నాకలోకమునందు
మర్త్యలోకమందు మావధూటి
కర్హసరుఁడు దొరకఁ డాజగత్త్రియభర్త
భర్తకాఁదలఁచె భవద్దుహితకు.

హిమ—అదియును మీరే సెలవీయ సమర్థులు.

నార—(తనలో) ఇతనికిఁ జంద్రమౌళిమాటఁ జెప్పక సామాన్యవచనములచేత వెళ్ళఁబుచ్చెదను. (ప్రకాశముగా) ఈయర్థమును దివ్యదృష్టితో మేము చూచినారము. ఎట్లనిన:—నీకూతుఁరు విశ్వాధికుఁడైన యొకవరునిఁ బడయఁగలదు. ఇట్టివాని నని విశేషించి కనుగొనము.

హిమ—విశ్వాధికుఁడనుమాటమాత్రముచేతనే ధన్యుఁడనైతిని.

నార—ఆ. వె. నీతనూజ తొంటినీదునోములుపండి
యవని నవతరించునాదిశక్తి
నిరుపమానరూపనిధియైన యీబాల
నితరకన్య లట్లు లెంచవలదు.

అందుచేత నీకొమార్తె యెవనికో యొకనికి నీయఁదగినదికాదు.

హిమ—నేను తమయానతి దాఁటను.

నార—మీయభ్యుదయమునిమిత్తమింకొకహితముఁ గూడ నించుక నే నుపదేశించుచున్నాఁడను. ఏదనిన—

ఉ. ఎవ్వఁడు తాల్చు నీభువనమెల్లను రూపము లెన్మిదింటిచే
నెవ్వనిలోఁ చనత్రితయ మేర్పడె వెల్గులు మూటిచేతనే
యెవ్వఁడు దేవతల్గలుగ నెందఱొ యీశ్వరశబ్దవాచ్యుఁడా
నవ్విభుమౌళి నీచరియలందుఁ దపంబొనరించు నిత్తఱిన్.

హిమ—అదినిజమే.

నార—అందుచేత స్వయముగ నీయొద్దకువచ్చిన యాయిందుశేఖరు నేదోయొక పూజచేత, సేవింపుము.

హిమ—మహాత్మా! ఆపూజ యేమో తమరే సెలవిండు.

నార—అనురూపసఖీజనపరివృత యగునీకూఁతు గౌరినిఁ బిలిచి "సమిధలు, దర్భలు, దూర్వాంకురములుఁ, బూవులు సమర్పించుచుఁ జంద్రశేఖరుని సేవింపు" మని నీవు పనుపుము.

హిమ—ఆలాగుననే చేయుదును.

నార—(తనలో) విత్తనము నాటఁబడినది. చేయఁదగినపనియు, సామాన్యవృత్తిచేత నెఱేఁగించితిని. అందువలన వచ్చినట్లె యరిగెదను. (ప్రకాశముగా) హిమవంతుఁడా! మేము చెప్పినట్లు తప్పక చేయుము. (అని యాకాశమార్గమున నిష్క్రమించుచున్నాఁడు.)

హిమ—(చూచి)

తే. గీ. పట్టపగటియందును దనుప్రభలచేతఁ
బండువెన్నెల దిక్కులఁ బర్వఁజేసి
యరుగుచున్నాఁడు దివమున కనఘమూర్తి
మౌనినిభుఁడు రెండవచందమామవోలె.

దేవీ ! మునివచనమును విన్నావుగదా ?

మేన—విశ్వాధికపురుషుఁడు నాథుఁడగు ననుమాట విన్నాఁడను.

హిమ—(తనలో) విశ్వాధికుఁ డనుమాట జాఱవిడుచుటఁబట్టియుఁ జేయఁదగిన పని నుపదేశించుటఁబట్టియు మాయమ్మాయికిఁ జంద్రశేఖరుఁడే వరుఁడనుట సూచింపఁ బడుచున్నది. (ప్రకాశముగా) నారదోపదిష్టమైన యిందుశేఖరపరిచర్యను చేయుటకు మన యమ్మాయిని నియోగింపఁ బ్రయత్నింతము.

(అని యందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.

# పార్వతీపరిణయము

## ద్వితీయాంకము.

(అంతట వాసంతికయను వనదేవత ప్రవేశించుచున్నది.)

వాసం——"వాసంతికా! తపోనియమమునందున్న చంద్రశేఖరునకు నందనవనమునుండి పూజాపుష్పములఁ దీసికొనిరమ్ము" అని నందీశ్వరునిచేత నే నాజ్ఞాపింపఁబడితిని. అందుచేత నందీశ్వరుఁ డాజ్ఞాపించినట్టు లాకాశమార్గమునఁ జని నిజసౌరభముల దిగంతముల వెదజల్లు కల్పద్రుమకుసుమములు కోయుటకు నందనవనమున కరిగెదను.

(అని యాలాగునఁ జేయుచున్నది.)

(అంతట రంభ ప్రవేశించుచున్నది.)

రంభ——తారకాసురబందీగ్రహణశాఖ్వసశంకితలగు నచ్చరలు మహామేరుగుహాలలో డాఁగియున్నారు. నేనో కుబేరునందనుఁడగు నలకూబరుని విడిచి క్షణమైనఁ బ్రాణములు నిలుపఁజాలను. గనుక వానియొద్దకుఁ జనియెదను. (అని దిగుచున్నది)

వాసం——(రంభను జూచి) ఓహో ! ప్రియసఖి రంభ వచ్చుచున్నది ! ఆమెదగ్గఱకుఁ బోయెదను. (అని యట్లుచేయుచున్నది.)

రంభ——అహో ! హిమవత్కటకవాసినియగు వాసంతిక యిదిగో ! ప్రియసఖికి మంగళము.

వాసం——ప్రియసఖీ ! యిక్కడికేల వచ్చితివి ?

రంభ——తారకాసురుఁడు చెఱపట్టునను భయమున శంకించుచు నచ్చరలు మేరుపర్వతగుహాలలో డాఁగియున్నారు.

వాసం——నిజమే, వాఁడంతటి దుష్టశీలుఁడే.

రంభ—కుబేరునందనునిఁ జూడక నిముసమును జీవమును నేను నిలుపఁజాలనని నీవె చక్కఁగా నెఱుఁగుదువు.

వాసం—అది మునుపే యెఱుఁగుదును. మీయిరువురయన్యోన్యానురాగమును బ్రసిద్ధమేకదా.

రంభ—తీయవిల్తుని వింటినుండి యెడతెగక బయలువెడలు నమ్ములు పీడించుహృదయముఁ గలిగి, నెచ్చెలులతోఁ జెప్పక నలకూబరునిఁ జేరఁ బోవుచు మార్గవశమున నిట వచ్చితిని.

వాసం—అట్టి యనురాగమునకిట్టివ్యాపారము తగును.

రంభ—నీ వెక్కడికరుగుచున్నావు ?

వాసం—నిత్యానందనిజస్వరూపుఁడు, లోచనమాత్రబాడబుఁడు నగు భగవంతుఁడగు నీలలోహితునకుఁ బూజాపుష్పములను నందనవనమునుండి తెమ్మని నందీశ్వరుఁడు నాకానతిచ్చెను.

రంభ—ప్రియసఖీ! అక్కడి క్రొత్తవృత్తాంత మేదైన నున్నదా ?

వాసం—మఱి యేదియును లేదు. కాని తండ్రిపనుపున నెచ్చెలులతోఁ గూడఁ బార్వతి దినదినము వచ్చి మహాదేవు నారాధించుచున్నది.

రంభ—ఆరాధనకు ఫలమేమి ?

వాసం—పరమేశ్వర ప్రసాదమే.

రంభ—బాగున్నది. అయిన నీవు ప్రస్తుతకార్యమును జేయఁ బొమ్ము. నేనును సంకల్పించుకొన్న కార్యమును జేయఁ బోయెదను. (అని నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము.

(అంతట విజనసభామంటపమునఁ గూర్చుండి మహేంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మహేం.—(మంటపద్వారముఁజూచి) ఓరీ ! యెవఁడురా యక్కడ ?

దేవనంది.—(ప్రవేశించి) దేవా ! యిదిగో వచ్చినాఁడను.

మహేం.—నేఁడు మహాకార్యము నాలోచింపవలసియున్నది గనుక బృహస్పతులవారినిఁ దక్కఁ దదితరులను లోపలఁ బ్రవేశ పెట్టకుము.

దేవ.—చిత్తము. (అని విష్క్రమించుచున్నాఁడు.)

(అంతట బృహస్పతి ప్రవేశించుచున్నాఁడు.)

బృహ.—(ముందుకుఁజూచి) ఏమిది! ఈమహేంద్రుఁడు వివిక్తాస్థానమంటపమునం దున్నాఁడు ! ఓహో !

శా. కాంచుం గన్నులఁ గొన్నిటం దళితరత్నశ్రేణియావజ్రముం
గాంచుం గొన్నిట లేఁతనవ్వాలయుస్వర్గస్త్రీముఖాంభోజము
ల్గాంచుం గొన్నిట నమ్రసేవకనమస్కారంబు లిట్లుండి క
న్పించు న్నాకు సహస్రనేత్రుఁ డెదుటన్ జింతించునట్లు ల్మదిన్.

కాఁబట్టియీతని సమీపించెదను. (అని యాలాగునఁ జేయుచున్నాఁడు.)

మహేం.—(బృహస్పతినిఁజూచి) ఇందు దయచేయుఁడు.

బృహ.--మంచిది. (అనిభద్రాసనాంతికమునఁగూర్చున్నాఁడు.)

దేవ.—(ప్రవేశించి) దేవా ! దేవదూతయగు దేవలుఁడు తన ద్రోక మనవి యున్నదని విన్నపముఁ జేసికొనుచున్నాఁడు.

మహేం.—అటులయిన వాని నొక్కని రానిమ్ము.

(అంతట దేవదూత ప్రవేశించుచున్నాఁడు.)

దేవ.—ఈప్రభువు బృహస్పతితో నేదియో యాలోచించుచున్నాఁడు. అయిన నాతనిదగ్గఱకుఁ బోయెదను. (అని సమీపించి) దేవరకు జయమగుఁగాక.

మహేం.—దేవలా! విచారించుచున్నవానివలెఁ గనఁబడుచున్నావేమి?

దేవ.—తారకాసురుని యాక్రమణము గాక మాకు వేఱు విచారకారణ మేమున్నది.

మహేం.—ఇపుడు క్రొత్తయపరాధ మేమున్నది?

దేవ.—హద్దుమీఱిన యసురపీడను దేవరవారితో నెట్లుమనవి చేయుదును?

మహేం.—దేవలా! భయపడక వాండ్రయుద్యమమును జెప్పుము.

దేవ.—చెప్పుచున్నాడను. వినుండు.

చ. అమరనదిం జనించు కనకాంబుజము ల్పెకలించి మాకభీ
ష్టములగు నందనక్షితిజసంతతుల న్మొదలంటఁ ద్రుంచిఁ కా
మ్యముల నొసంగు నేర్పుఁగల మా సురధేనువు దొంగిలించి హా!

(అని సగముచెప్పి యూరకున్నాఁడు.)

మహేం.—అవశిష్టముఁగూడ జెప్పుము.

దేవ.—అమరసతీకచగ్రహణ మాపయిఁ జేయఁ దలంతు
రాఖలుల్.

మహేం.—కులిశసహాయ మగు మద్బాహువు జాగరూకత తోనుండ నీకింత సందేహ మెందులకు? చూడు.—

ఆ. వె. నముచిబలుని వృత్రు నామావశిష్టులుఁ
గా నొనర్చి గిరులగఱుల నఱికి
జగములెల్లఁ బ్రోవఁజాలు నా కిపు డడ్డు
వచ్చెఁ దారకునెడ బ్రహ్మవరము.

అయినను గొన్నిదినములలో దానికిఁ బ్రతిక్రియ కాఁగలదు. సముచిత కార్యములఁ జేయుటకు నీవు పొమ్ము.

దేవ.—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు).

మహేం—ఆచార్య ! ఇటుపిమ్మటఁ గర్తవ్యమేమి ?

బృహ—ఇంతకుఁ బూర్వదినమందే తారకాసురుని యాక్రమణమును సహింపక దేవతాసభతోఁ గూడ మేము భగవంతుఁడగు పద్మసంభవునియొద్ద కరిగి యడుగఁ "దారకాసురుఁడు కుమారస్వామి చేత, గాక తదితరులచేతఁ జావఁడు అతనిజన్మముకొఱ కుపాయమిది-

తే. గీ. మంచుమలసానువునఁ జంద్రమౌళి నేఁడు
చేయుచున్నాఁడు తపము నిశ్చింతతోడ
నేయుపాయంబుచేనైన నీమ్మృడునకుఁ
గలుగఁగాత మక్కవ యద్రికన్యమీఁద.

అనంతరము తదుభయులకు జనియించు కుమారుఁడగు సేనానిచేత మీ మనోరథసిద్ధి కాఁగలదు" అని యవ్విరించి యానతిచ్చెను.

మహేం—గిరీశుఁడు గిరిజ నేలాగునఁ బరిగ్రహించును. పిమ్మట వారికుదయించు కుమారుఁ డెన్నఁడు మన మనోరథము సిద్ధింపఁ జేయును.

బృహ—మహాత్ములపలుకులు నిరర్థకములు కావు.

మహేం—(జ్ఞప్తికిఁ దెచ్చికొని సంతోషముతో) విరించి యాజ్ఞాపించిన మనకార్యము నంగీకరించినదియుఁబోలె తండ్రిపనుపున నెచ్చెలులం గలసి పార్వతి పరిత్యక్తవనమును వచ్చి భగవంతు నిందుశేఖరుని సేవించుచున్నదని రంభముఖమునుండి వింటిని.

బృహ—అట్లయిన మనకోరిక సిద్ధించినదే.

మహేం—ఇంతమాత్రముచేతనేనా ?

సీ. అతిమంజులమ్ములై యానందకరములౌ
నప్సరోంగనల వాక్యములచేత
వీనులకొనలందు విశ్రమించుచు నున్న
చారు కటాక్షవీక్షణలచేతఁ

జెలువారు వలరాజుచెలుకుసింగుణులట్లు
  మొదలంట వంగినబొమలచేత
జాఱినపయ్యెద సవరించుచో బాహు
  కమనీయకంకణక్వణముచేత
మాటిమాటికి నప్సరోమండలంబు
సలుపు తాదృశవిభ్రమసమితిచేతఁ
గలఁకనొకయింత మనమునఁ గాంచనట్టి
మౌనిరత్నంబు సుమి చంద్రమౌళియనఁగ.

అచింతనీయుఁడు, నధికానంద సుందరుఁడు, ననాదినిధనుఁడు, ననంజనుఁడు, నగుణక్రియుండునగు తన్నుదాఁ నిజాంతర్నేత్రమున సాక్షాత్కరించుకొని సముపసంహృతాఖిల ద్వైతకల్పనావికల్పుఁడును, స్వతంత్రకర్తయు, చరాచరగురుఁడు నగు నా చంద్రమౌళి వశీకరణమునందు గౌరీపరిచరణ మేపాటిది ?

బృహ.—మహాత్మా ! తక్కిన యువతులవలెనే యీమెను దలఁపకుము. ఎందుచేతననఁగా:-

తే. గీ. హాయలు దళుకొత్తు నెమ్మేనిమెఱపుఁ గల్గి
  మనసు హరియించు నొకవింతమహిమఁ గల్గి
  యలరుచున్నది చుమ్మి యాయద్రికన్య
  యలరువిల్తుని సమ్మోహనాస్త్ర మనఁగ.

మహేం.—(సంతోషముతో) అలరువిలుతుఁ డను నుపోద్ఘాతముచేత నాతఁడే యీయుమామహేశ్వరులనుగూర్ప సమర్థుఁడని నాకు జ్ఞప్తికివచ్చినది.

బృహ.—(సంతోషముతో)

తే. గీ. జగములను మూఁటి శాసింపఁ జాలునట్టి
  మీమనీష యూర్జితమౌచు మెఱయుచుండుఁ

గరము శాంతికపౌష్టికకర్మములనె
యేమరక నిల్చు మాబుద్ధి యెల్లయెడల.

ఎందుచేత నన, నాబుద్ధియు నీయాలోచనవైపరుగదయ్యె. కావున సత్వరమ కాముని బిలువనంపుము.

మహేం.—(మంటపద్వారమునఁ జూచి) ఓరీ! యెవఁడురా యక్కడ ?

దేవనంది.—(ప్రవేశించి) దేవా, యిదిగో వచ్చినాఁడను.

మహేం.— దేవనందీ ! శీఘ్రముగాఁ గామునిఁ బిలువుము.

దేవ.—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

(అంతట రతివసంతులతోఁ గాముఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కాము.—మిత్రుఁడా, వసంతుఁడా ? ఏమి యిది యకాలమునందు స్వామియగు మహేంద్రుఁడు పిలువ నంపినాఁడు ?

వసం.—నే నిట్లని తలంచుచున్నాఁడను.

చ. మఱవఁగ రానినేరమున మానిని యెవ్వతెయో ఘనమ్మునం
జిఱచిఱలాడి తన్ను నిరసించుట రోసముఁ జెంది తానె క్రి
మ్మఱఁ బతిమాల నోడి యభిమానవశమ్మున నేఁ డితండు నీ
కఱకగుమోహనాస్త్రమునఁ గాంతమదిం గరఁగింపఁ జూచెడున్.

కాము.—అందఱమును దగ్గఱకుఁ బోవుదము. (అని సమీపించుచున్నాఁడు.)

మహేం.—(చూచి సంతోషముతో)

ఉ. హుమ్మని ముజ్జగంబులను నోరువఁగాఁ దగి మ్రోయుచంచరీ
కమ్ములబారు నారి యయి క్రాలెడువిల్లుభుజమ్ముందు మోపి మో
హమ్మున ముద్దులొల్కెడుప్రియాస్యముఁజూచుచు మెల్లమెల్ల మి
త్రమ్మగు నవ్వసంతుఁడును దా నిటె వచ్చెడుఁ బచ్చవిల్తుఁడున్.

(కాముఁడు రతివసంతులతో సమీపించి చాపగర్భ మగునంజ లితో విలాసముగాఁ బ్రణమిల్లుచున్నాఁడు.)

మహేం.—(పీఠాంతికమును జేతితోఁ జూపుచు) మిత్రుఁడా! కాముఁడా! ఇక్కడఁ గూరుచుండుము.

(కాముఁడు రతి వసంతులతోఁ గూరుచున్నాఁడు.)

బృహ.—ఓయీ, పూజనీయుఁడవగు నిన్ను మహేంద్రుఁడు మన్నించుట మిగులఁ బొసఁగియున్నది.

కామ.—(దోసిలియొగ్గి)

చ. దొరవయి ముజ్జగంబులకు దోర్బలధుర్యుఁడ వైననీకు ని
ర్జరకులనాథ నావలనఁ జక్కఁబడంగలకార్య మేది సు
స్థిరమగు నైజతేజమున దిగ్వలయంబులు వెల్గఁజేయు భా
స్కరుఁడొక చిన్నదివ్వెఁ జనకాంతులు చాలక కోరఁబోవునే.

బృహ.—అలాగనవద్దు.

తే. గీ. మాన్యచరిత యలోకసామాన్యచాప
పాండితి ధరియించినట్టి నీబాహు నొకఁడె
వెతలనన్నిఁటిఁదీర్చి యీవిబుధవితతి
కార్య మఖిలమ్ము సాధింపఁగలదునుమ్ము.

మహేం.—మిత్రుఁడా! కాముఁడా!

తే. గీ. అచ్యుతునిచక్రమున కసాధ్యమగు నెద్ది
పదను మెఱయునాపనికి దుర్వార మెద్ది
యాపనిమెచ్చి తీరు నీపువ్వుటమ్ముచేత
నోహరా నీవెంత భుజబలాఢ్యుఁడవొ కాని..

కాము.—(గర్వముతో) ఎవ్వఁడు నీకు సాపత్న్యము నాచరించు చున్నవాఁడో యాతఁడు.

క. మునియైన దనుజుఁడైనను
మనుజుఁడయిన ముగ్ధచంద్రిమౌళియె యైనన్
విను మనురాంగనలకటా
క్షుబరీక్షణశృంఖలములఁ గట్టంబడెడున్.

మహేం—(బృహస్పతిమొగముఁ జూచుచున్నాఁడు.)

బృహ—ఓయీ, కాముఁడా! ముగ్ధచంద్రిమౌళియని చరమార్థముగ నీచేత నెవ్వఁడు పరిగణింపఁబడియె నాశంకరుఁ డిప్పుడు మంచుకొండచరియలమీఁద నిరతిశయశీతలాంతఃకరణుఁడై తపముఁ జేయుచున్నాఁడు.

కాము—తరువాత. తరువాత.

బృహ—సౌభాగ్యమయమగు సాలభంజికయుఁ బోలె, విగ్రహమును దాల్చిన సౌందర్యదేవతయో యన సఖీజనపరివృతయై తండ్రియానతిం బార్వతి యిపు డాశివుని సేవించుచున్నది.

కాము—తరువాత. తరువాత.

బృహ—వారికలయికయందు దేవతలకు మహాకార్యసిద్ధి కలదు. అదియును నీసహాయమునే కోరుచున్నది.

కాము—(తనలో) తనశక్తి నెఱుఁగని నరుల కాత్మనాశముఁ దెచ్చునుగదా. ఎందుచేతనన, నాత్మశ్లాఘాపరాయణతఁ బరమేశ్వరుని సామాన్యునిగాఁ బరిగణించితిని.

వన—(తనలో) అనుకొన్న దొకటి జరగిన దొకటి.

తే. గీ. తీవియల్ కమ్మనమ్ముఁ జేదోయిఁ బూని
యేచి యబలలలోఁ జెడునీతఁడెచట
విపులలాలాటనయనాగ్ని విస్ఫులింగ
భస్మితపురత్రియుఁడు శూలపాణి యెచట.

రతి—అయ్యో! ఖండపరశుఁడు జయింపఁ దగినవాఁ డనుటచే మాకుఁ గడు ననిష్టము మూఁడినది.

కాము—ఐనను బరిజనులలోఁ గడు నల్పుఁడ నగు నావలనఁ గూడ దేవతలు కార్యము నపేక్షించుచున్నారు గావున నే నాత్మనాశనముకైన నొడంబడి యీకార్యము నెరవేర్పఁ బ్రయత్నించెదను.

మహేం—

తే. గీ. ఈవు సమ్మోహనాస్త్రంబు నెక్కువెట్టి
నిలుతువేని నిబ్బరమెల్ల నేలఁ గలిపి
మురువు జఘుక్రొత్తగిరిజనెమ్మొగమువంకఁ
జూడకుండఁగ నాచంద్రజూటు తరమె?

అందువలన నీచిన్నకార్యమునుగూర్చి నీవు సందేహ మొందవలదు.

కాము—

తే. గీ. ప్రియము లైనను బ్రాణము ల్విడుచువాఁడ
నీ యమరకార్యమునిమిత్త మిప్పుడేను
జగతి నుపకారు లమలయశశ్శరీర
మంది మృతజీవు లగుచుందు రనఘచరిత.

కావున దేవర యెట్లు సెలవొసఁగిన నట్లు జేయువాఁడ.

మహేంద్రుఁడు, బృహస్పతియు—(చేయెత్తి)

మ. కలుగుం గావుత నీకు మంగళ మమోఘశ్రేయము ల్గూర్చు ది
వ్యలయాశీస్సులు బ్రోచు నిన్ను శరముల్ బుంఖానుపుంఖోదయం
బులుగా నీ భుజశక్తి మించుత యశంబు ల్వెల్గు లోకత్రయిన్
ఫల మొందించు స్వతంత్రకర్త విధి మావాంఛ గృపాపూర్ణుఁడై.

(కాముఁడు రతివసంతులతో శంకించుచు నిష్క్రమించుచున్నాఁడు)

మహే—ఆచార్య! బ్రహ్మ యాదేశమున కనురూపముగ గార్యము మనచేతనే చేయఁబడినది. కార్యసిద్ధినిగూర్చి యదృష్టము కలసివచ్చునని తోఁచుచున్నది.

బృహ—ఔనది యట్లె.

మహే.—స్థాణ్వాశ్రమసమీపమును గూర్చి చనుచున్న కాముని యనంతరవృత్తాంతమును దెలిసికొనుట కెవ్వనినైన నంపఁ బ్రయత్నించెదను.

బృహ.—నేనును బ్రస్తుతకార్యసిద్ధికిఁ గులదేవతలఁ బ్రార్థింప నరిగెదను.

(అన నందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము.

# పార్వతీపరిణయ నాటకము

## తృతీయాంకము.

(అంతట మహేంద్రుఁడును బృహస్పతియుఁ బ్రవేశించుచున్నారు.)

మహేం——ఆచార్యా! కాముఁ డెట్టిబాణసాధనముననైన నఖండ పశుపతిం లోఁబఱుచుకొనునా, లేక సంవర్తనసమయదినకరదుర్నిరీక్షుం డైనయమ్మౌనిం దేజమైనం జూడఁజాలక పాఱివచ్చునా? అట్లు గాకున్న గోపాంధకారిచేతస్కుండైన యతనిఫాలనయనానలంబునకుఁ బురోడాశ మగునా, ఎట్లు కాఁగలదో తెలియదు. (ఎడమకన్నదరుటను సూచించి శంకతో)

తే. గీ. అదరుచున్న దీయెడమకన్నక్కటకట
యమరకార్యంబు నేభంగినైనఁ జెఱుప
సిద్ధముగనున్న విధిపాడుచెయిదములను
విదితముగనాకు నెఱిఁగించునదియుఁబోలె.

బృహ——అమంగళము ప్రతిహతమగుఁగాక. దేవా! ఈశకునముచేతఁ దద్వృత్తాంత మెఱిఁగినయొకఁ డిటు వచ్చునని తోఁచుచున్నది.

(అంతట నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నార——మహేంద్రుని యూసతిసి స్థాణ్వాశ్రమమున కరిగి యచ్చటివృత్తాంత మఖిలమును దెలిసికొని వచ్చితినిగదా. అందుచేత నీతనిసమీపించి యచట నెలకొన్న యుదంతమంతయు నివేదించెదను.

(అని నడచుచున్నాఁడు.)

మహేం——(చూచి) ఇదిగో మహతీవల్లభుఁ డగునారదముని

యే యిటు వచ్చుచున్నాఁడు. అతనికిఁ బీఠము వేయఁబడుఁగాక.

(బృహస్పతి పీఠమును వేయ నారదుఁడు గూర్చున్నాఁడు.)

మహేం.—(దోసిలిమొగ్గి) వేలుపులకోరిక మంగళమో యమంగళమో సెలవిండు.

నార.—మొదటినుండి యంతయుఁ దెలుపుదును వినుండు.

మహేం.—సావధానుఁడనై యున్నాఁడను.

నార.—అట్లు దేవకార్యమునిమిత్త మరుగుచున్న మన్మథుని, వృత్తాంతమును దెలిసికొనుతలఁపున మీయాజ్ఞానుసారముగఁ దిరస్కరణీవిద్యచే వెంబడించితిని.

మహేం.—తరువాత తరువాత.

నార.—అట్లు స్థాణ్వాశ్రమముఁ జేరి కాముఁడు వసంతునితో నిట్లనెను.

మహేం.—ఏమని?

నార.—"మిత్రుఁడా! ఈహిమవన్నగర ప్రాంతకాంతారముల యందు నీవు విజృంభింపుము" అని.

మహేం.—తరువాత నాతఁ డేమిచేసెను?

నార.—

చ. పెలుచన గండుఁగోయిలలపిండులఁ గూయఁగఁ జేసి నల్దెస
లమ్మలయ సమీరకందళములం దల లెత్తగఁ జేసి తోన పు
వ్విలుతునిబాహుగర్వమును వేయిమడుంగులు పెంచి యాహిమా
చలవనభూములం దటు వసంతుఁడు కోయని యార్చి రేఁగినన్.

మహేం.—తరువాత తరువాత?

నార.—

తే. గీ. మక్కువను గండుఁగోయిల లమ్మగువ లోసఁగు
తియ్యమామిడిచిగురుల తేనెఁ గ్రోలి

మనసుఁ గరఁగించుపంచమధ్వనులచేత
నించువిలుకానిగరువంబు మించఁ జేసె.

మహేం.—తరువాత తరువాత!

నార.—

తే. గీ. ఊఁపి చందనభూజంబు లొక్కకొంత
మంచియేటియలలఁ గాఁగిలించి కొంత
తమ్మిపూఁదావిఁ గొని కొంత తారసిల్లె
నల్లనల్లన మలయంపుఁ జల్లగాలి.

మహేం.—తరువాత తరువాత.

నార.—

మ. తలిరుల్దాల్చె రసాలము స్సఖులహస్తస్పర్శము ల్వాసియు
న్గలకంఠీపదతాడనం బెడలియుం గంకేళి పుష్పించెఁ బ్రద
త్కలగానమ్ముఁదొఱంగియుం దొడిగె మొగ్గల్మొరటుల్కెసరా
ల్వాలపెచ్చం జవరాండ్రు కల్లుమియకుండం బల్లవించెన్వెసన్.

మహేం.—తరువాత తరువాత?

నార.—

ఉ. తుమ్మెదనారి యెక్కిడినతుంటవిలుం గ్రహియించి కేలఁగ
ర్వమ్మున మంచుకొండపయిఁ బంచశరుండటు లెక్కియార్వఁబా
రమ్మును మీఱియిట్టి దనరానివికారమొకండుఁజెందె మో
హమ్మునఁజిక్కి సుర్కి పరిణయాధికత న్మఘునమ్మలన్నియున్.

మహేం.—తరువాత తరువాత?

నార.—వేయేల?

ఉ. ఆదినమందుఁ దద్వనమునందు వసించెడువారిలో మహా
త్మ్యాదుల గెల్చుసన్మునులకైనను గొంతలయందుధైర్యమ
ర్యాద చలించునట్టులు మహత్తరమోహపయోనిధాన మెం
దే దరిలేక ముంచె జగమెల్లక్షణక్షణ మేమిచెప్పుదున్.

మహే.—ఈవిధమున సకలజనవికారకారిణియై యావలపువెల్లి చెలఁగుచుండఁ గాముఁ డేమిచేసెను?

నార—ఆకాముఁడు రతివసంతులుతనవెంటరా నున్నతదేవదారుఖండమండపమునందు తరక్షుచర్మము పఱచిన చలువఱాలయరుఁగుపైఁ గూరుచుండి యంతర్ముఖనిహితచిత్తవృత్తియు, నభ్యంతరపవననిరోధనిశ్చలాననుండు, నాసాగ్రనిహితపక్ష్మాక్షిధారుఁడునయి నిస్తరంగ మగు రెండవసముద్రముం బోలు నాయిందుశేఖరుం గనుంగొనియె.

మహే.—తరువాత? తరువాత?

నార—అనంతరము భగవంతుండగు నీలలోహితుండును జ్ఞాననేత్రముచేత జ్ఞానస్వరూపుఁడగు తన్ను సాక్షాత్కరించుకొని పర్యంకబంధమును వదలి సమాధిని జాలించెను.

మహేం.—తరువాత? తరువాత?

నార—కాముఁడును వాని సందర్శనముచేఁ గరతలమునుండి విల్లు జాఱిపడుటయు నటమీఁదఁ జేయఁదగినపనిఁ జేయఁజాలక చిత్తరుబొమ్మవలె నొక్కక్షణ మూరకుండెను.

మహే.—తరువాత? తరువాత?

నార—

మ. కృతవాసంతలతాంతభూషయగుచున్ శ్రీకంఠు నర్చింప నా
క్షితిభృత్కన్యక యంతలోన నరుదెంచెం గన్యకామండలాం
చితయై యాతనియున్న చోటికిఁ దపశ్శృంగారవీరాధిదే
వత యొయ్యారము సౌరు సచ్చుపడఁగాఁ బ్రత్యక్షమైనట్లుగన్.

మహే.—తరువాత? తరువాత?

నార—పిమ్మట నాపంచబాణుఁడు పట్టుదొరకినవానివలె

నిట్టూర్పు నిగిడ్చి దృష్టి కెదురుగాకుండ నాతని వెనుకకుఁజని యదను కొఱ కెదురుచూచుచుఁ బొంచికూర్చుండెను.

మహే.—తరువాత? తరువాత?

నార—పార్వతియు సుఖోపవిష్టుఁడగు నాయష్టమూర్తికిఁ దన యష్టాంగములు నేలఁ దాఁకునట్లు నమస్కరించెను.

మహే.—తరువాత? తరువాత?

నార—అనురూపవరునిఁ జేపట్టుమని యామె నాచంద్రమౌళి దీవించెను.

మహే.—తరువాత ? తరువాత ?

నార—తరువాత నాక్షణమునందే యిదియే సమయమని యామదనుఁడు సమ్మోహనాస్త్రమును వింటఁ దొడిగెను.

మహే.—తరువాత? తరువాత?

నార—

చ. చెలువగు మందహాసరుచిచే వికసించిన చెక్కుటద్దము
ల్గల యుమమోముదమ్మి శితికంధరుఁ డోక్కటఁ జూచెఁ జూచిన
న్వ్రాలఁదియు మైగగుర్పొడువ వెల్లడిసేయుచు భావమెల్ల సి
గ్గలము ముఖేందుబింబము బయల్పడ నించుకనిల్చెఁ జెంగటన్.

అంతట భగవంతుండగు ముక్కంటి మనోవికారమును దపో బలముచే నిరోధించి తత్కారణము నరయఁగోరి నలుదెసలం బరికించి చూచెను.

మహే.—తరువాత? తరువాత?

నార—

చ. కనియెన్ రుద్రుఁడు చంచరీకగుణ మాకర్ణాంతము న్లాగి మో
హన మస్త్రంబు ధనుస్సునందొడిగి ప్రత్యాలీఢపాదంబునన్
ఘనపూర్వాంగము వంచిముందుకు భుజాగర్వంబు దీపింపఁగన్
దనమేనుం గుఱిచేసి యేయుటకుఁ బొంత న్నిల్చుపూవిల్తునిన్.

మహే.—(భయముచే) అవశిష్టమునుగూడఁ జెప్పుఁడు.

నార.—అనంతరమున మహాకుపితుఁడైన శూలపాణి ఫాలలోచనమునుండి జ్వాలావళి యనెడు జటలుగలయగ్ని బ్రహ్మాండము నంతను మ్రింగఁదలఁచిన ప్రళయకాలానలమువలె విజృంభించి బయలు వెడలెను.

మహే.—(దుఃఖముతో) ఇంకమీఁద నేమి చెప్పుదురో కదా.

నార.—ఆపురారాతినయనానలమునకు నామదనుఁడు మిడుత యయ్యెను.

(మహేంద్రుఁడు మూర్ఛిల్ల నారదుఁ డూఱడించుచున్నాఁడు.)

మ.—(ఊఱడిల్లి) హా! భువనరమణీయ! పుష్పబాణా! హా సకలజనానందనా! పురందరునిమిత్తము ప్రాణములు విడిచితివిగదా.

బృహ.—దేవా! విషాదము నొందకుము. కాఁదలఁచినది కాక మానదు. కానిమ్ము.

మ.—రతి యేమిచేసినది ?

నార.—రతియును మోహవశయైనది.

మ.—వసంతుఁ డేమిచేసెను ?

నార.—చెలికాఁడగు వసంతుఁడును మోహవశుఁడయ్యెను.

మ.—అట్లు మూర్ఛితులగు రతి వసంతు లేమిచేసిరి ?

నార.—రతియుఁ దనకన్న ముస్నాఁ(?)ఊఱడిల్లిన వసంతుఁడు దన్నాశ్వాసింప నతికష్టముమీఁద నెట్టెట్టో చైతన్యము నొంది మెదుటఁ బరుషపవనవికీర్యబాణపాంసుపటలమై భసితము నై పురుషాకారముతో నున్నమగని మేను బిగ్గఁగౌఁగిలించుకొని—

తే. గీ. కడచి చనరాని తీవ్రశోకమునఁ గుఱిఁగి
ప్రియవిరహిణి[illegible]

నా ర్తనాదమై విలపించె నంబుజాక్షి
వెడఁదచన్దోయి కన్నీటఁ దడియుచుండ.

మ—తరువాత తరువాత?

నార—తదనంతరము హా నాథ! హా నాథ! యని విలపించు చున్న రతి నశరీరవాణి యిట్లని యూఱడించెను.

"తే. గీ. విడువు నెవ్వగ నిపుడు పూవిలుతురాణి
కడచు నెవ్వఁడు విధినియోగము? ధరిత్రిఁ
గ్రమ్మఱ జనింపఁగలఁడు నీప్రాణవిభుఁడు
హరుఁడు పార్వతిఁ బెండ్లాడునవసరమున" అని

మ—(ఊఱడిల్లి సంతోషించినట్లు)

తే. గీ. భగ్నమయ్యెను నాకోర్కి పరిథనమందు
మొలకలెత్తెడుఁ గ్రమ్మఱనుమ్మరముగ
కాఱుచిచ్చున మోడయ్యెఁ గారుమబ్బు
తనుపవెండియుఁ జిగురెత్తుతరువువోలె.

బృహ—దేవా! యశరీరవాణి సత్యమయినదియే. సర్వవిధములచేతఁ గాముఁడు పునర్జన్మము నొందఁగలఁడు.

మ—తరువాత నేమిజరిగినది?

నార—అతికష్టముమీఁద నూఱడించి రతిని సమానదుఃఖుఁడైన వసంతుఁడు తనయిలుఁ జేర్చెను.

మ—అట్లు కాముని గథావశేషునిఁగానొనర్చి కాలకంఠుఁడేమిచేసెను?

నార—స్త్రీసమీపమును విడుచునిచ్ఛతో నాభూతేశ్వరుఁడు భూతగణసమేతముగా నంతర్ధానము నొందెను.

మ—పార్వతి యేమిచేసినది ?

నార— తే. గీ. వచ్చి గిరిరాజు సందిటఁ గ్రుచ్చియెత్తి
మూర్ఛపడి కన్నుదమ్ములు మూసికొనిన
కన్నకూఁతును గౌరిని, గనికరించి
యల్లనల్లన నూరార్చి యిల్లుసేర్చె.

మ—మహాత్మా! నారద ! వినఁదగినది వింటిని. ఇటుమీఁద మీ రెందరిగెదరు ?

నార—ఈవృత్తాంతముఁ గ్రిమ్మఱ సత్యలోకనివాసియగు చతుర్ముఖునకు నివేదింపఁబోయెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు)

(అంతట రంభ ప్రవేశించుచున్నది.)

రంభ—(తనలో) కుబేరభవనమునుండి వచ్చుచు నే నోషధిప్రస్థనగరమునందు విన్న వృత్తాంతమును స్వామియగు మహేంద్రునకు విన్నవించెదను. (అని నడుచుచున్నది.)

మహేం—(చూచి)

ఆ. వె. చంచలతను బాయుచంచలాలత వోలెఁ
దిరుగ నేర్చుపూవుఁదీవ వోలె
మూర్తిమంతమైన మోహవిద్యయుఁ బోలె
నరుగుదెంచు నీమృగాక్షి యెవతొ.

(నిరూపించి) ఇది రంభగదా.

రంభ-(సమీపించి) స్వామికి జయమగుఁగాక! జయమగుఁగాక!

మహే—రంభా ! ఎందుండి వచ్చుచున్నావు ?

రంభ—కుబేరభవనమునుండి.

మహేం—అచ్చట నపూర్వవృత్తాంత మేమయినఁ గలదా?

రంభ—నీలలోహితుని నిటలానలజ్వాలలచేతఁ గాముఁడు కథావశేషుఁ డయ్యెనని యందఱు జెప్పుకొనుచున్నారు. ఇంతియగాక యీయోషధిప్రస్థనగరంబున నింకొకవిశేషముఁ గూడఁ గలదు.

మ హే.—ఆ యింకొక టేమి?

రంభ—కామదహనముచేత,భగ్నమనోరథయగు పార్వతి పరమేశ్వరునే పతిగా నభిలషించి కఠినతపశ్చరణముచేఁ దనమనోరథము నెఱవేర్చుకొనఁ దలఁచుచున్నదని.

మ—ఆవిషయమునఁ దల్లిదండ్రు లేమన్నారు?

రంభ—మేనకాదేవి యిట్లు చెప్పినది.

మ—ఏమని ?

రంభ— తే. గీ. తపము చూడంగ నెంతయు దారుణంబు
మేను దిరిసెనపువ్వుఁబోలె మృదుతరంబు
బిడ్డ! కూడనిపనిఁ దలపెట్టితీవు
దుష్కరం బిది యంచును దోఁచు నాకు.

మ—హిమవంతుఁ డేమనియెను ?

రంభ—ఆకార్యము నతఁ డనుమతించెను.

మ—రంభా!మంచివార్తఁ దెచ్చితివే నీవు నీపనిమీఁదఁబొమ్ము.

రంభ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నది.)

(తెరలో)

వైతాళికుఁడు—

మ. తనపైఁ గూరిమి నుజ్జగించి యినుఁ డంతంబోవ దేశాంతరం
బనయం బావిరహాగ్ని కోరువక సంధ్యావల్కవైఁ తేంట్లబా
రను రుద్రాక్షులపేరు మేననిడి మ్లానయత్పంకజాతాస్యయై
తనరుం బద్మిని తన్నిమిత్తము తపోధర్మంబు గైకొన్నటుల్.

మ—(విని) మేమును సంధ్యావందన మాచరింపఁబోవుదుము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

# పార్వతీపరిణయము

## చతుర్థాంకము.

(అంతట మునివేషముధరించి నంది ప్రవేశించుచున్నాఁడు.)

నంది.—"నందీ! మన్మథదాహముచేత భగ్నమనోరథయగు పార్వతి నాయందే మనసునిలిపి మహానియమము నాచరించుచున్నదై గౌరీశిఖరమనుపేరుగల తండ్రి శిఖరమునఁ దపముఁజేయుచున్నది తపము మొదలువెట్టి చిరకాలమైనది. కాఁబట్టి యచ్చటికి మునివేషముఁ గైకొని నీవరిగి, యామెనియమ మెట్టిదో, యభిలాషబంధ మెట్టిదో యామె నెచ్చెలులగు జయావిజయలమొగమున నెఱింగి మఱల రమ్ము" అని భగవంతుండగు నీలకంఠునిచే నాజ్ఞాపింపఁబడితిని గదా! అందుచేత స్వామి నియోగమును జేయుదును (అని నడచి విమర్శించి) స్త్రీలమనసులు పరికృతికఠినములుగదా! సందేహమేమి?

చ. దిరిసెనపూవుఁబోలె మృదుదేహమునం జెలువారుచున్న యీ
సరసిజనేత్రి చంద్రికళచాయను గన్నుల కింపుఁ బెంపుచుం
స్థిరమతులై శిలాకఠినదేహముల న్మునులాచరించు దు
స్తరతపముం బొనర్చుటకు సందియ మొందక సాహసించెడున్.

మఱియు—

తే. గీ. హంసతూలికాతల్పంబునందు మున్ను
పండుకొనునీమె పవళించు వట్టినేల
జిలుఁగుదువ్వల్వఁ దొడుగునీచిగురుఁబోఁడి
కట్టుచున్నది కఠినవల్కలము నేడు.

తే. గీ. చారుచందనచర్చలఁ జల్లనైన
విమలధారాగృహంబుల వెలయునీమె
చేయుచున్నది తపము విశేషనియతి
మంటలెగసెడు పంచాగ్ని మధ్యమందు.

(అంతటఁ గుసుమాపచయము నభినయింపుచు జయావిజయలు
ప్రవేశించుచున్నారు.)

జయ—సఖీ! విజయా! తపశ్చరణమునందుఁ గృతనిశ్చయురాలగు ప్రియసఖిగౌరిమనోరథకల్పవృక్ష మెప్పుడు ఫలించునే?

విజయ—సఖీ! జయా! కాముని గాల్చినపరుషహృదయుండును, నిష్కరుణతకు మొదటియుదాహరణము నగుపరమేశ్వరునిహృదయ మెప్పుడు తగులఁబడునో యప్పుడుఫలించును.

(అని పూవులు కోయుచున్నారు)

నంది—ఆమె ప్రియసఖు లగుజయావిజయ లిరువురును వీరలై యుండవచ్చును. కావున సమీపించెదను.

(ఆలాగునఁ జేయుచున్నాఁడు.)

జయ—చెలీ! నాపూవులసజ్జనిండినది. నీదెంతవఱకు నిండినది?

విజయ—(పువ్వులబుట్టనుచూచి) నాపూవులగరిడియ సగము నిండినది. కొంతఁతగూడఁ బూరింపఁగలను.

(అని పుష్పకరండమును బూవులతో నిండించుచున్నది.)

నంది—(సమీపించి) మీకు మంగళమగుఁగాక.

ఇద్దఱు—మహాత్మా! నమస్కరించుచున్నాము.

నంది—మీ రెవ్వరు? ఎందుచేతఁ బుష్పాపచయముఁ జేయుచున్నారు?

ఇద్దఱు—మేము హిమవంతునికూఁతు రగుగౌరికిఁ జెలికత్తె

లము. తపోనియమమునందున్న యామెకు దేవపూజా పుష్పములను గోయుచున్నాము.

నంది—ఆమెకుఁ దప మెందునిమిత్తము?

జయ—అనురూపవరునిఁ బొందవలయునని.

నంది—ఈయనురూపవరుఁ డెవ్వఁడు?

జయ—

తే. గీ. ఆదిపూరుషుఁ డంచు నిత్యయువ యంచు
నెవనిఁ బ్రాజ్ఞు లెన్నుచు నిరతము నెలుఁగఁ జేయు
నెవఁడు ధరించియుండునో యెల్లయపుడు
నీశ్వరాభిఖ్యయును మఱి యిందులేఖ.

ఆపరమేశ్వరునే యీమాపిరియసఖి పతిగాఁ నభిలషించి మహేంద్రిప్రముఖులగులోకపాలుర నవమానించి తపముఁ జేయుచున్నది. అదియుగాక మన్మథుఁ గాల్చిన యీశ్వరునందలి వైరము వలనఁ బుట్టినింటికిఁ జని మిగుల నుత్కంఠిత యైనది.

నంది—అదియెట్లో చెప్పుము.

జయ—.

తే. గీ. మిగులఁ గృశియించి పాలినమేను గల్గి
వంగియుండిన యావనాబ్జంబుఁ గల్గి
చెలువ మఱియుండెఁ బార్వతీనళిని నేఁడు
భవుని విరహంపు గ్రీష్మతాపమునఁ జేసి.

నంది—తరువాత మీసఖి యెట్లున్నది?

జయ—అన్వాలికథ వినుము.

మ. తలిసుంబాన్పుల మెచ్చబోఁదు ముదమంద న్వేచునాచందనా.
చలపుందమ్మెర సోఁకనీ దలుక హెచ్చం దూఱెడుం బండువె
న్నెలలం దామరపాకుపచ్చడము నేనిం గప్పనీ దార మై
చలిగొండ [illegible] కలన్.

నంది—ఇట్లు ప్రబలమదనజ్వర యగునామె పిమ్మట నేమి చేసినది?

ఇరువురు—అనంతరమున నేవెరవుఁ గానక తపశ్చరణముచేత బరమేశ్వరు నభిముఖముగాఁ జేసికొనఁ దలఁచి తదనుగుణ మగుతపో నియమమును నెఱపుచున్నయది.

నంది—దుర్లభవస్తు ప్రార్థనానిబంధనముఁ గలదియు సందిగ్ధ ఫలము గలదియు నగునీతప మెందుకు? దేవతలలో నెవనినోయొకని ననురూపవరుని గ్రహింపవచ్చును. అఖండపరశుఁ డన్ననో, కోర్కుల జయించినవారిలో నగ్రేసరుఁడు. అందుచేతఁ బ్రియసఖులగు మీరా మెకు హితోపదేశముఁ జేయుఁడు.

జయ—మహాత్మా! మాప్రియసఖి నేను బరమేశ్వరునే పతిఁ గాఁ బడయుదును. అట్లు కానినాఁ డీశిఖరమునందే కఠినతపశ్చరణము జేయుచు విలీనురాల నగుదు నని నిశ్చయించుకొన్నది.

నంది—(తనలో) వినఁదగినది విన్నాఁడను. ఈవృత్తాంతము ను నీలలోహితులకు విన్నవించెద. (ప్రకాశముగా) కాంతలారా! వచ్చినట్లే నేనరిగెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

జయ—మేమును బ్రియసఖికి బూజాపుష్పములను దీసికొని పోవుచున్నాము. (అని నిష్క్రమించిరి.)

ఇది మిశ్రవిష్కంభము.

(అంతట వైష్టికునివేషమునుధరించి శంకరుఁడు ప్రవేశించుచున్నాఁడు)

శంక—(తన్నుఁ జూచుకొని) ఈవేషము, పార్వతిని వంచించు టకుఁ దగినదే. అదియట్లే.

మ. మొలముప్పేటలనూలు మూఁపున మెగంపుందోలు హస్తంబున
స్వలమా మోదుగు(గల్ల నెన్నొ) సటిపై భసోర్ధ్వపుండ్రింబునా

దలపైఁ బచ్చనిపెంజడల్ స్ఫటికసూత్రింబొండు ముంజేత ద
ర్భలతోఁగూర్చు పవిత్రమొక్కటియుఁ గర్ణంబందు శోభిల్లెడున్.

(ఆలోచించి)

మ. ననవిల్తుండటు మోహనాస్త్రమును వింటంగూర్ప సాపత్రపా
ననమై చెక్కులు మందహాసరుచుల న్భాసిల్లఁగాఁ జూపు ల
జ్జను నిట్టట్టదర న్గగుర్పొడువఁగా సర్వాంగ మేక్రొత్త రూ
పునఁ గొన్నట్లును నిల్చెనయ్యదియె యిప్డుం దోఁచునా నెమ్మదిన్.

కాఁబట్టి గాఢతరతరణికిరణ సంతప్తమైన మేదినిని, జాతకిని, మేఘు డనుగ్రహించులాగునఁ గఠినతరతపోవిశేషతప్తరాలగు నీమెను నే ని ప్పుడే యనుగ్రహించెదను. జయావిజయలవలన నామె భావబంధము నెఱిఁగి నంది నాకుఁ దెలియఁజేయుటచే, నెగ్గొనరించికొనుటకువలె నేను మాఱువేషమును ధరించుచున్నాను.

(అని వినయముతో నడుచుచున్నాఁడు.)

(అంతట జయావిజయలు సేవింపుచుండఁ దపస్సు
చేయుచున్న పార్వతి పరివేశించుచున్నది.)

పార్వ—(ఎడమకన్నదరుటను సూచించి) ప్రియసఖులారా!

తే. గీ. సమధికానందబాష్పాళిఁ జల్లనైన
యెడమక న్నిప్పుడదరు నిర్హేతుకముగ
మందభాగ్యరాలగు నాకు నిందువలనఁ
గలుగఁదలఁచిన శుభమేమొ తెలియరాదు.

జయ—ఓసఖీ! పార్వతీ! స్త్రీల కెడమక న్నదరుటయుఁ బురు షులకుఁ గుడి కన్నదరుటయుఁ సుశకునము లని పౌరాణికులు చెప్పు దురు. అట్లు మన్మథదాహమున నిష్కరుణుఁడయ్యుఁ బరమేశ్వరుఁ డేమునిముఖముననో నిన్ననుగ్రహింపఁగలఁడు.



పార్వ—ప్రియసఖివచనము సత్యమగుగాక.

విజయ—చెలియగు జయ నిజముచెప్పినది.

శంక—(పార్వతింజూచి)

క. ఇక్కలికి కోమలాంగం
బెక్కడ దారుణము నియమమెక్కడ; సెగలం
గ్రిక్కడు గ్రీష్మంబెక్కడ
నెక్కడవనజమ్మృదులమగుహిమకరకళయున్.

అహో ! యీమంజుభాషిణి నన్నుద్దేశించి యెంతయుఁ దపఃక్లేశ మనుభవించుచున్నది.

జయ—(చూచి) సఖీ పార్వతీ! మూర్తీభవించిన బ్రహ్మచర్య మువలె నొకలేఁబ్రాయంపు మహాపురుషుఁడిటు మొగమై వచ్చుచున్నాఁడు.

పార్వ—అతిథులై వచ్చిన మహార్షులకు మీరు పూజసేయఁ దగును. నేనెప్పటివలె నియమమును నెఱపెదను. (అని మౌనము నవలంబించుచున్నది.)

శంక—(చూచి)

తే. గీ. పడఁతి మద్విరహవ్యథఁ బాలిపోయి
చెన్నువహించు నిదె నారచీరఁ గట్టి
లేఁతసంజకెంజాయలో లీన మగుచుఁ
దనరుపాడ్యమినాటిచంద్రకళవోలె.

(అని సమీపమునకుఁ బోవుచున్నాఁడు.)

(జయావిజయలు పీఠమును దెచ్చుచున్నారు. శంకరుఁడుగూరుచుండి మార్గాయాసము నభినయించుచున్నాఁడు.)

(పార్వతి చాలికత్తెలఁ జూచుచున్నది. సఖులు బహ్మచారికి వీవనల విసరుచున్నారు.)

శంక—(చేయియెత్తి) అనన్యసామాన్యమగు మీసౌజన్యము చేతనే మాయాయాసము పోయినది.

ఇరువురు—(విస్మయముతో) మహాపురుషు లెందుండి వచ్చు చున్నారు. ?

శంక—ఇపుడు కైలాసమునుండి వచ్చుచున్నాము.

జయ—అట్లయిన నమ్మహాపురుషుఁ డర్ఘ్యమును గ్రహించుగాక.

శంక—మంచిది. (అని యర్ఘ్యమును గ్రహించుట నభినయించి) కల్యాణులారా! మిమ్మొకమాట యడుగ నభిలషించుచున్నాము.

జయ—మహాత్ములడుగుదురుగాక.

శంక—ఈమె యెవ్వనికూఁతురు ? మీరెవ్వరు ? ఎందునిమిత్తమీమె కఠినతపముఁ జేయుచున్నది ?

జయ—ఈమె మాప్రియసఖి; హిమవంతునికూఁతురు; పార్వతి యనుపేరుగలది; మే మామెకుఁ బ్రియసఖులము; జయావిజయ లను వారము. అనురూపవరలాభము నిమిత్త మీమె యీతపముఁ జేయు చున్నది.

శంక—

చ. జననము వేల్పుపెద్దయగు సారసగర్భుని సత్కులంబునన్
జనకుఁడు పూజనీయుఁడగు సర్వకులాచలభర్త; మూర్తి నె
మ్మనము హరింపఁజాలునది; మాటలు ముద్దులమాట; లిట్టు ల
య్యును విరిబోఁడియున్న వితమొక్కటియేయతిలోకమయ్యెడున్.

అయిన నీముజ్జగములలో నీమెఁ గోరఁదగిన వరుఁ డెవ్వఁడు?

జయ—ఉన్నాఁడొక మహాపురుషుఁడు.

శంక—తనయందముఁ జూచుకొని యంతగర్వించిన యాకఠిన చిత్తుఁ డెవఁడు ?

జయ—మహాత్మా! వినుండు ; (తే. గీ. "ఆదిపూరుషుఁ డంచు నిత్యయువయంచు" అను పద్యమును జదివి) ఆపరమేశ్వరునే యభిలషించి యైదె మాప్రియసఖి తపోనియమమును జరపుచున్నది.

శంక—(పార్వతితో) కల్యాణీ ! ఇది నిజమేనా ?

పార్వ—(మౌనము విడిచి) మహాత్మా! సఖులచేత నెట్లుచెప్పఁబడినదో యట్లె నామనోరథ మున్నది.

శంక—(తనలో) ఇప్పుడు నన్ను నేను నిందించుకొని యీమె మనస్స్థయిర్యమును బరీక్షించెదను. (పరిహాసముగా జప్పటలుగొట్టినవ్వి)

చ. భసితము మేనిపూఁత పెనుపాము విభూషణ మాశ్మశానమే
బస పరిచారికాగణము పాడుపిశాచము లెప్డు భిక్షువై
మసలుట వృత్తి యిట్లెవఁ డమంగళచిహ్నులఁ దాల్చునఁచు స
ర్వసుజను లెంతు రాపురుషుఁపై మది నిల్పితి వేమి చెప్పుదున్.

మఱియును—

చ. వికచపయోజతుల్యముఖి విశ్వజగత్ప్రియనేత్ర బాలచం
ద్రిక హిమవన్మహాధరణిభృత్కులరత్నము వేడ నీవు పా
యక పులితోలుగట్టి యనయంబు వసింపుచు వల్లకాటియం
దకట యమంగళాత్ముఁ డగునాశితికంధరుఁ డేడఁ జెప్పుమా.

పార్వతి—(చెవులుమూసికొని) పాపముశమించునుగాక. పాపము శమించునుగాక.

శంక—ఈవిధమున నీవు మనసునందు నిశ్చయించుకొనిన పక్షమున నింక—

క. విరిబోఁడి యామహేశ్వరు
వరుఁగా నీవు పడయంగవచ్చును జుమ్మీ
యరియగు రాహువునోటం
జొరఁబడ నాచంద్రరేఖ చూచెదు నేర్మిన్.

పార్వతి—(ముఖవైవర్త్యము నిరూపించి)

తే. గీ. ప్రాఁజదువులెల్ల మ్రొక్కుచే వందనంబు
లేమహాత్మున కొసరించు నామహాత్ము

నిందన మొనర్పఁగడఁగిన నీదునాల్క
పగులదదియేమి యొకవేయి వ్రక్కలుగను.

ఓసి సఖి? మహాపురుషనింద వినువారికిఁ జేయువారికన్న నెక్కుడు దోషము గల్గునుజుమా. ఇతఁడు బ్రాహ్మణుఁడు, చేయునది నిరంకుశ మగు నీశ్వరనింద కాఁబట్టి వేఱొకతావునకుఁ బోవుదము.

(అని జాఱుచున్న వల్కలముతో మఱియొకచోటికిఁ బోవుచున్నది.)

శంక—(స్వరూపమునుజూపి)

తే. గీ. గుత్తమగు నీదుచందోయి గొప్పబరువు
ముదితె నిరుపేదకౌనెట్లు మోయనోపు
నీకుఁ జేయూఁతయొసఁగెడు నేర్పుగల్గు
దాసజనుఁడైతిఁజుమి నీదు తపము మెచ్చి.

(అని పార్వతి హస్తముఁ బట్టుకొనుచున్నాఁడు.)

పార్వ—(భయవిస్మయప్రహర్షములఁ దనువు పులకింపఁ జెక్కులు చెమర్ప నేమియుఁ దోచకున్నది.)

జయ—పుణ్యవశమునఁ బరమేశ్వరుఁడు సన్నిహితుఁడయ్యె నిది మాకత్యానంద మత్యానందము.

శంక—

చ. అలసటచేత సంజనితహా చిఱుచెమ్మటఁ గల్గి యంకుర
త్పులకసమూహము ల్గలిగి తోరమునాఁ గయిసేయఁబడ్డయు
జ్జ్వలకుచమండలిం గలిగి భాసిలుచున్న భవల్లతాంగమో
యలికులవేణి మ్మనెనము హాయిగఁ బిగ్గఁ గవుంగిలించెదన్.

అందువలన నీమెనుగాంధర్వవివాహమునఁ బాణిగ్రహణముఁ జేయ నభిలషించుచున్నాను.

జయ—మహాత్మా! సకలకులాచలచక్రవర్తియు నీమె తండ్రి యునగు హిమవంతుని గృహమున జరగు వివాహకార్యమున కరు

దెంచి యీమెను గ్రహింపుమని మేము వేఁడుకొనుచున్నారము. మాముద్దుఁ జెల్లింపవలయును.

శంక—(విసుగుతో తనలో) ఇంక నేనెట్లు తాళఁగలను. (ప్రకాశముగా;) మంచిది లోకాచారమును దాటఁగూడదు గదా.

జయ—అయిదుదినములలో వివాహ మెట్లగునో యట్లు జాగ్రత్త పెట్టుఁడు.

శంక—మూఁడు నాలుగుదినము లనుము. అది యుక్తమే.

గీ. ఉవిద నెడఁబాసియుంటలో నొక్కక్షణమె
యగుచు నున్నది కల్పసహస్రకోటి
కొన్నినాళ్ళలో జరగంగ నున్నదీని
నెట్లు సహియింపనోపునాహృదయమకట.

జయ—వివాహమాంగళ సంపాదనమునకు మేమింకఁ బోవుదుము.

శంక—అలాగే చేయుఁడు. మేమును సప్తర్షులను వివాహమంగళముకొఱకుఁ బంపఁబోవుచున్నాము.

(అన నందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది చతుర్థాంకము.

# పార్వతీపరిణయ నాటకము

## పంచమాంకము.

(అంతటఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు.)

కంచు — "శిలాధరీ! పరమేశ్వరునిచే నంపఁబడి యరుంధతీసమేతులై సప్తర్షులు నిన్నటిదినమందే వచ్చి లబ్ధవర యయినవత్సకీదినము వివాహమంగళయోగ్యమని నిర్ణయించిరి. అందుచేత నోషధిప్రస్థనివాసులగు పౌరులను నగరమంతయు నలంకరించునట్లు నీవు నియోగింపుము" అని సకలకులాచలచక్రవర్తియగు హిమవంతుఁడు నాకానతిచ్చినాఁడుగదా? కావున స్వామి నియోగమును నిర్వర్తించెదను. (అని నడచి యంతటఁ జూచి)

ఓహో పౌరులారా!

చ. ప్రతిగృహతోరణప్రతతి రమ్యగతి న్గయిసేయరే మహో
ద్ధతి మినుముట్టఁ గేతకిపతాకల నెత్తరె; పూలఁ జల్లి యం
చితగతిఁ జందనద్రవము చిల్కరె వీథుల నన్నిట న్జగ
ద్ధితముగఁ బెండ్లియయ్యెడు మహీధరరాజతనూజ కిత్తఱిన్.

(ఆకాశమువంకఁ జూచి) ఏమనుచున్నారు? మీరు చెప్పకమునుపే సర్వము ద్విగుణముగ మాచేత రచియింపఁబడినదనియా? (అంతటఁ గనుఁగొని) అహో మాయాజ్ఞకుఁ బూర్వమే నగరము ప్రవృత్తమహోత్సవమయ్యెను. అదిగో.

చ. పొలుపు దలిర్ప పొన్ననఁటిబోదెలునాటి యమర్చు ద్వారసీ
మల నవచూతపల్లవసమంచితతోరణరాజి యొప్పు మ

ర్దళములు మోఁరియు శారివ్యగతి,రమ్యగతిన్ ధ్వనిచేయు వీణలున్
వెలవెలఁదు ల్నగ లొమ్మెరయ నృత్య మొనర్తురు నిండువేడుకన్.
ఈవైపున.

తే. గీ. మిఁగుల వ్యాపించెడు నగరుపొగలచేతఁ
గలుగుచున్నది కారిమ్మబ్బు కారు నేఁడు
ద్వారములఁ జెక్కఁబడి నవరత్నములచేత
జనన మొందుచున్నది యింద్రిచాపకాంతి.

ఇదిగో నీవైపున.

క. తెలుపై, యెఱుపై, నలుపై
పొలయునపాంగముల వింతమెఱుగుల నిడుచు
న్వాలుదకుచంబుల బంగరు
కలశమ్ముల నినుమడింతురి గద యిందుముఖుల్.

(అంతటఁ జూచి)

తే. గీ. కనకరజము లేవను బిశంగరుచిదాల్చు
కుంకుమపరాగమునుఁ బౌరకోటి చల్ల
నన్నిదిక్కుల వ్యాపించి యది యొసంగు
నుదయకాలపరిభాకరునొఱపు పురికి.

అందుచేత జరగుచున్న యీపురాలంకారమును స్వామికి విన్నవించె
దను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

(అంతటవివాహస్థానమునందున్న హిమవంతుఁడుప్రవేశించుచున్నాడు)

హిమ—

చ. నారదసూచనం దెలిసినాఁడను మున్నె మహేశ్వరుండు నా
కూరిమి యల్లుఁడౌట మదిఁగోరితి నాతనిరాక యింతకున్
గౌరి తపంబుచే నతఁడు నాకు లభించెను నేఁడె పెండ్లి సే
కూడెదు నంతరాయములుకూడ గతించె నదృష్టవంతుడన్.

(అంతట శిలాధరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

శిలా—(దగ్గఱకువచ్చి) స్వామికి జయమగుఁగాక.

హిమ—శిలాధరా! నీవునగరమంతయు నలంకరింపఁజేసితివా?

శిలా—దేవా! ప్రత్యేకముగాఁ బౌరు లందఱు "నీయుత్సవము స్వకీయమని యభిమానించుకొనుచుండ నగరాలంకార మెట్లు తక్కువగును? అంతయు బౌరులచేత నినుమడిగఁ జేయఁబడినది.

హిమ—శిలాధరా! పార్వతీపరిణయమహోత్సవమును దర్శించుటకు సర్వపర్వతకులంబు వచ్చినదా?

శిలా—స్వామీ! అవధరింతురుగాక.

మ. అవనీరంజనకర్ణికాకృతిసురాహార్యంబు కవ్వంపుఁ దాపు
 డవు నాగేంద్రుని మేనిరాపిడిని నుస్పామందరాగంబు మ
 ద్దవిడి స్సృంగములం దినేంద్రపథరోధంబైన వింధ్యాద్రి వ
 చ్చె వెసన్నిన్గన గంధమాదనముఖుల్సేవింప శైలాధిపా.

హిమ—అట్లయినఁ గైలాసగిరి యేమి చేయుచున్నవాఁడు?

శిలా—దేవా! అతఁడు పెండ్లికొడుకువైపుగనుక వారితోఁ గలిసి వచ్చుచున్నవాఁడు.

హిమ—సరే. అయిన విశ్వావసుప్రభృతులగు గంధర్వులు వధూగణముతోఁ గూడ నరుగుదెంచిరా ?

శిలా—క. చనుదెంచిరి గంధర్వులు
 వనితలతోఁగూడి కేల వల్లకు లలర
 న్ఘనమగు నుత్సవసమయ
 మ్మునన గానముఁజేసి నిన్నుముదితునిఁజేయఁగా.

హిమ—అమరులతోఁ గూడ నప్సరలు వచ్చిరా?

శిలా—వినుండు.

చ. నవచంచల్లతికాపరిభ ల్నభమున నైన్మచాయి నిర్మించి క
న్గవలీవిం దెసలందు నత్పలరుచు ల్గల్పించుచు న్మందహా
సవిలాసమ్ముసన వెన్నెల ల్పగట దిగ్గాలమ్ముసన న్నించుచుం
దివిజానీకముతోడ వచ్చి రిదె ప్రీతిన్ స్వర్గ వారాంగనల్.

హిమ—శిలాధరా! అట్లయిన నీవంతిపురమున కరిగి కులవృద్ధయగు కౌశికితో వచ్చిన యచ్చరలచేత వత్సయగు పార్వతిని దగ్గఱనుండి యలంకరింపఁ జేయుమనియు, నాయలంకారపరికారమంతయు వచ్చి నాకుఁ దెలియఁజేయుమనియుఁ జెప్పుము. అదియునుఁగాక వచ్చి నవధూజనంబునకునుఁ బర్వతకులమునకును సత్కారమొనర్చుటకు సకలలోకవస్తుసంభారములను నీవు సిద్ధము సేయుము.

శిలా—దేవరవారిచేత నాజ్ఞాపింపఁబడిన ట్లంతయుఁ జేసెద.

(అని నిష్క్రమించెను.)

(నారదుఁడు ప్రవేశించి)

తే. గీ. వెనుక మనసార నేఁ దలపెట్టినట్టి
ఘనతరంబైన నిర్జరకార్య మిప్పుడు
దృఢతరాంతరాయముల నతిక్రమించి
చిత్రవై ఖరి ఫలియింప సిద్ధమయ్యె.

(అని నడచి చూచి) అదిగో హిమవంతుఁడు వివాహమంటపముపైఁ గూరుచున్నాఁడు. అతని సమీపించెదను.

(అని దగ్గఱకుఁ బోవుచున్నాఁడు.)

హిమ—(చూచి) అడుగో నారదుఁడు.

(అనిదోసిలియొగ్గుచున్నాఁడు).

నార—హిమవంతుఁడా! పూజ్యుఁడవగు నీ కభ్యుదయమే?

హిమ—ఇది మీరు నాటినబీజమునకు ఫలమే.

(అని శిరము వేయుచున్నాఁడు.)

నార—(కూరుచున్నాఁడు.)

(అంతటఁ గాశికి ప్రవేశించి కూరుచుండి పార్వతీపరికర్మ పరికారము చెప్పుచున్నది.)

హిమ—అమ్మా! వత్స యలంకరింపఁబడినదా?

కాశి—దేవా! చెప్పుచున్నాను. అంతయు వినుండు.

హిమ—అవహితుఁడనై యున్నాను.

కాశి—క. అసమగ్రభూషమై తను
వసనము ధరియించుకొన్న పడఁతుక మేన
న్వాస గుమగుమయను తావులు
విసరెడు తైలంబు రాసి వేడుకలోడన్.

హిమ—తరువాత తరువాత?

కాశి—తే. గీ. మేలిరతనాలగద్దియమీఁద నునిచి
వేల్పుటేటినీళులతోడ వెలఁదులెల్ల
మంగళస్నానతఁ జేసిరి మగువ నంతఁ
దుములమై శుభశంఖనాదము చెలంగ.

హిమ—తరువాత తరువాత?

కాశి—

చ. చారునిమజ్జనమ్మునఁనె స్వచ్ఛతగాంచిన యాలతాంగి క
ర్పూరపరాగ పాండురతఁబొల్చెడు దువ్వలువన్ ధరించెమై
నీరదరాజిచేఁ గడువినిర్మలమై తన రారు నింగి యా
శారదశర్వరీరమణచంద్రికలన్ ధరియించుకైనడిన్.

హిమ—తరువాత తరువాత?

కాశి—తే. గీ. లలన చరణరాజీవంబు లక్కయనెడు
లేత నీరెండప్రాఁత దలిర్పుచుండె

న్గులశై లేందరిగుహల్ పరితిధ్వనుల సంక్షోభంబు నొందగ ని
శ్చలనాదంబయి మోరిగు నొక్క సురనిస్సాణంబు సాటోపమై.

(అందఱు తొందరతో నాలకించుచున్నారు.)

(మరలఁ దెరలో)

మ. చను పార్శ్వంబున నిందిరి? తోడఁ జనుమా చక్రి విధీ చెప్పు స్వ
స్తిని, వేపల్కరె రుదరిబుక్కులు మునుల్! శేషాహిభద్రమ్ముగ
మ్మిన శీతాంశులు చామరంబులిడరే హృత్ప్రీతిగా రండిఁకన్
మనుమున్ రుదరిగణంబ మోపవన యింపుల్ పుట్ట వీవంగదే.

హిమ—మహాత్మ! నారద! దేవతల కోలాహలమువలె వినం
బడుచున్న యిది యేమి!

నార—సకలజగదుత్పత్తిస్థితి పరిళయపరికటీకృత మహామహి
ముఁడై సకల చరాచరగురుఁడై యున్న నీయల్లుఁడు శుభవివాహవే
షముతో నిటే వచ్చుచున్నాఁడు. ఈమహాకలకల మాతనిముందు
నడుచుచున్న నందీశ్వరుని పోరిత్సాహరణధ్వని. కావుననీవర్ఘ్యపాణివై
భగవంతుఁ డగునిందుశేఖరు నెదుర్కొనుము.

(వివాహవేషమును ధరించిన శంకరుఁడును దేవసంఘమునుఁ
బరివేశించుచున్నారు.)

శంకరుఁడు—(విష్ణుతో) ఈయోషధిపరిస్థనగర మమరావతి
కన్న మిన్నయై శోభిల్లుచున్నది.

విష్ణు—మహేందురినికన్న మహీధరుఁడుతక్కువవాఁడాయేమి?

హిమ—(అర్ఘ్యపాణియై సమీపించుచున్నాఁడు.)

శంక—(చూచి) శైలరాజు నన్నెదురుకొనుచున్నాఁడు. కా
వున వాహనమునుండి దిగిపోదము. (అని అట్లుచేయుచున్నాఁడు.)

హిమ—

తే. గీ. గోచరుఁడుగాఁడ చర్మచక్షులకు నే న
పౌరుషేయ వాక్కులకేనిఁ బట్టనరిది

యెవ్వఁడాహరునల్లుగా నిపుడుపడయ
నెన్ని పున్నెము ల్సలిపితి మున్న నేను.

(అని సమీపించుచున్నాఁడు.)

శంక__(చూచి)

తే. గీ. అతిభరంబైన చరణవిన్యాసమునను
క్షితిని నిమ్నోన్నతనుబలెఁ జేసి వినయ
సరణిఁ దనవారలకు నేర్పుకరణి నదిగొ
న న్నెదుర్కొనుచున్నాఁడు నగవిభుండు.

(అని యెదురుగా వచ్చుచున్నాఁడు.

హిమ__(అర్ఘ్యమిచ్చుచున్నాఁడు.)

శంక__(సప్రణామముగా గ్రహించుచున్నాఁడు.)

హిమ—(సిగ్గుతో తలవంచుచున్నాఁడు.)

(అల్లుని ముందుంచుకొని హరినిరించి ప్రముఖులు నడచుచున్నారు.)

బృహ__మహాత్మా! వివాహమంటప మెక్కడ?

హిమ__ఆచార్యా! ఇక్కడ నిక్కడ.

(అందఱును బోవుచున్నారు.)

బృహ—హిమవానుఁడా! సుముహూర్తము సమీపించినది. అందుచేతఁ బెండ్లికూఁతును దోడ్కొనిరమ్ము.

హిమ__(తెరవంకఁ దిరిగిచూచి) అమ్మా! ఇట. ఇట.

(అంతట జయావిజయలతోఁ బార్వతి ప్రవేశించుచున్నది.)

పార్వతి__(తనలో) నేఁడెగదా నామనోరథకల్పద్రుమము ఫలియించును.

జయ—(నవ్వుచు) చెలీ! పార్వతీ! ఇంతవఱకే మేము నీచెలి కత్తెలమగుట.

పార్వతి—(అసూయతో) ఓసీ! విజయా! ఇదియేమనుచున్న దే?

విజయ—సఖీ పార్వతీ! ఈమె సరసాలాపకుశలత్వముఁ జూపుచున్నది. (అని సమీపించుచున్నది.)

బ్రహ్మ—(విష్ణుతో) మహాత్మా! దేవతలందఱు భూతగణముతో సముచితాసనములఁ గూరుచుందురుగాక.

(అందఱు నట్లుచేయుచున్నారు.)

హిమ—మాపైపున వచ్చిన కులపర్వతములు! కైలాసముతో నెడమప్రక్కం గూరుచుండుఁడు. (కులపర్వతము లట్లు చేయుచున్నవి)

శంక—(పార్వతిం జూచి తనలో)

తే. గీ. మోహన వివాహవేషంబుఁ బూనుకతన
సొబగుమీఱు నీయెలనాగచూపుచేత
నామనంబనందు నౌర మన్మథసహస్రములను
గల్పించుచున్నదివో లెఁబొలుచుచుండె.

బృహ—శంకరా! పెండ్లికొమార్తెతో నీవీవేదికమీఁదఁ దూరుపు మొగముగాఁ గూరుచుండుము.

(శంకరుఁడు పార్వతిసమేతముగాఁ గూరుచున్నాఁడు.)

శంక—(తనలో)

తే. గీ. అసమలావణ్య కౌముదీవిసర యగుచుఁ
గూర్చెపండువు నేత్రచకోరములకు
యీముదిత మేరదాటించు నామనమును
చంద్రిమఃకళ యాదుగ్ధజలధినట్లు.

బృహ—(అగ్నిని ప్రజ్వాలింపఁజేసి) శంకరా! నీచేతితోఁ బార్వతిహస్తమును బట్టుకొమ్ము.

శంక—(అట్లు చేయుచున్నాఁడు.)

పార్వతి—(పులకోద్భేదము నభినయించుచున్నది.)

శంక—(తనలో)

తే. గీ. కేలుపట్టినమాత్రాన నీలతాంగి
పులకరించినయంగము ల్గలిగి పొలిచె
నభినవవసంత సమయసమాగమమున
మొగ్గదొడిగిన క్రొవ్విమ్మావి మోకవోలె.

బృహ—వధూవరు లగ్నిహోత్రునకుఁ బ్రదక్షిణ మొనర్తు
రుగాక. (ఇద్దఱు నట్లుచేయుచున్నారు.)

పార్వతి—(శంకరునిఁ జూచుచున్నది.)

శంక—(పార్వతినిఁ జూచుచున్నాఁడు.)

పార్వతి—(దృష్టి మరలించుచున్నది.)

శంక—(తనలో)

తే. గీ. చూడఁ దమకించుచున్న యీసుదతిదృష్టి
మాటిమాటికి సిగ్గున మరలుచుండె
మొదల నేటినీటివఱద కెదురువోయి
మరలివచ్చెడు బేడిసమాడ్కిఁ దనరి.

బృహ—(పార్వతిచేతిచేలాజహోమముఁ జేయించుచున్నాఁడు.)

పార్వతి—(పొగగ్రమ్మటచే శ్రమ నభినయించుచున్నది.)

శం—(తనలో)

ఉ. చెమ్మటచేతఁ బత్త్రములు చెక్కులపై దిగజారఁగాఁ బొగ
ల్గ్రమ్మటఁ గాటుకల్గరఁగి కన్గవర క్తిమఁ జూపఁగా విలా
సమ్మునకై ధరించినవసంతలతాంతము వాడ నీమె యా
స్యమ్ముమదీయచిత్తమునసల్పునొ కానొకరాగముద్రిణన్.

బృహ—శంకరా! నీవుపార్వతీపాదపద్మమును జేతులతో సన్ని
కంటిమీఁద నుంచుము.

శంక—(చిఱునగవు మొగముతో నూరకున్నాఁడు.)



కులపర్వతములు—(సంక్షోభముతో)

మహాత్మా! ప్రమాణభూతుఁడగు పురోహితుఁ డాజ్ఞాపించినట్లు చేయవలయును.

భూతగణము.—(సంరంభముతో) కులగిరులారా! త్రిలోకనియంతయగు భగవంతుఁడు నీలలోహితుఁ డెట్లాజ్ఞాపింపఁబడు చున్నాఁడు!

బ్రహ్మ—(నవ్వుచు నుభయులను వారించి) సర్వజననియామకము, స్వతఃప్రమాణభూతమునగు వేద మేయిట్లు విధించుచున్నది. కావునఁ జెప్పినట్లు చేయుము.

శంక—(ముడుచుకొన్న చేతులతోఁ బార్వతీపాదపద్మమును సన్నికంటిపై మోపుచున్నాఁడు.)

బృహ—(విధిశేషమును సమాప్తము చేయుచున్నాఁడు.)

(శంకరుఁడుఁ బార్వతియు బ్రహ్మకు నమస్కరించుచున్నారు.)

బ్రహ్మ—(చేయెత్తి)

తే. గీ. అన్ని జగముల తలితండ్రు లైనమీకు
నెగడుత ననన్యసులభమా నిండుప్రేమ
భువనజాలార్తిహరమూర్తి పొడముఁగాత
తారకధ్వంసియైన కుమారుఁ డొకఁడు.

(అని దీవించుచున్నాఁడు.)

వృద్ధస్త్రీలు—(ప్రవేశించి)

తే. గీ. ఒండొరులకుఁ దుల్యసుదూపయుతుల రగుచు
నతులబద్ధాను రాగులైనట్టి మీకు
వెన్నెలకుఁ జందమామకు వెలయురీతి
యిట్టికనరాని యొకప్రేమ పుట్టుఁగాత.

(అని యార్ద్రాక్షతలు చల్లుచున్నారు.)

నార—(లేచి దోసిలియొగ్గి) దేవా! దేవకార్యమునిమిత్త మపరాధ మొనర్చిన మన్మథుని మరల శరీరధారిగను దమ చరణారవింద సేవకునిగను ...

శంక.—మీ కెట్టు లిష్టమో యటులగుఁగాక !
(అంతట రతీవసంతులతోఁ బూర్వాధిక విగ్రహుఁడై కాముఁడుప్రవేశించుచున్నాఁడు.)

అందఱు—

మ. వలపుం దియ్యఁదనంబు చిప్పిలుమహాభల్లంబువిల్కోలరా
జిల నమ్మాన్మథవుచేయిపట్టుకొని వచ్చెన్వీఁడెయాకార త
త్కులకాంతా సహితంబురుద్రనయనక్రూరాగ్నిదగ్ధాంగుఁడా
తలిరున్విల్తుఁడు లోఁటికన్నఁ గడునందంబైనరూపంబుతోన్.

అందఱు—(విస్మయము నిరూపించుచున్నారు.)

హిమ—

శా. శ్రీకళ్యాణగుణావదాతఁ దనయన్గేపట్టె విశ్వాత్ముఁడా
శ్రీకంఠుండు మదీయపూర్వసుకృతోత్సేకంబున న్పండెడున్
నాకశ్రేణి మనోరథంబులు స్ఫురన్నవ్యాకృతిం దాల్చుచున్
లోకానందకరుండు మన్మథుఁడు సల్పు న్వేండ్రీ గన్పండువున్.

శంక.—ఇంకను నీకేమి కావలయు?

హిమ.—సకలమనోరథములు సిద్ధించినవారి కింకనుఁ గోరిక యేముండును? అయిన నిట్లగుంగాక!

భరతవాక్యము.

మ. తనరన్లోకము లన్నియుం గురియుఁగాత న్వృష్టి నిందు్రిండు పం
డినసస్యముల భూతధాత్రి పులకాన్వీతం బగుంగాత స
జ్జనసంపత్తులు విఘ్నము ల్దొలఁగుచు న్సాగుజ్జగత్ప్రీతిగా
నలయం బీవుత మీకు సౌఖ్యములు నిత్యానందుఁడీశుం డొగిన్.

సమాప్తము.

---